# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

VEEKSHANAM, TELUGU MONTHLY

సంపుటి : 14 సంచిక : 8 హైదరాబాద్ 181 ఆగస్ట్ 2016 పేజీలు : 68 రు. 20

- కశ్మీర్‌లో ఏం జరుగుతున్నది?
- గుజరాత్‌లో దళితులపై దాడులు
- మల్లన్నసాగర్‌లో పాలకుల దుర్మార్గం
- తెలంగాణలో విద్యుత్ చార్జీల పెంపు
- కాలుష్య నగరంగా విశాఖపట్నం
- కామన్ సివిల్ కోడ్ పూర్వాపరాలు
- నల్లజాతి ప్రాణాలకు విలువలేదా?

# వీక్షణం రచయితల సమావేశం-2016 (తెలంగాణ)


డా. నళిని


ఎ. నర్సింహారెడ్డి


బి.ఎస్. రాజు


పిట్టల రవీందర్


గురిజాల రవీందర్ రావు


కె. సజయ


ఎనిశెట్టి శంకర్


ఎ. పున్నయ్య


విద్యాభూషణ్


సిఎచ్. నారాయణరాజు


ఆలూరి కవిని


ఎం. శ్రద్ధానందం


సిఎచ్. సింహాద్రి


జి. వెంకటేశ్వర్లు


జి. సుధాకర్ రెడ్డి


సిఎచ్. శ్రీమన్నారాయణ


పి. ముకేష్


బి. సతీష్


బి. రామకృష్ణ


ఎ. మల్లేష్





181

ISSN 2231-6892

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

ఆగస్టు 2016
సంపుటి : 14
సంచిక : 8







**'వీక్షణం' పేరిట రచనలు, ఎం.ఓలు, చెక్కులు,డి.డి లు పంపాల్సిన చిరునామా**

**వీక్షణం** VEEKSHANAM

మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495

Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

ప్రింటర్స్ : **చరితా ఇంప్రెషన్స్**
ఆజామాబాద్, హైదరాబాద్. ఫోన్ : 040 - 27678411

**వీక్షణం చందా వివరాలు**

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు |
|---|---|---|
| విడి ప్రతి | రు. 20 | రు. 20 |
| సంవత్సరం | రు. 240 | రు. 200 |
| మూడు సంవత్సరాలు | రు. 600 | రు. 540 |
| ఐదు సంవత్సరాలు | రు. 1000 | రు. 900 |
| పది సంవత్సరాలు | రు. 2000 | రు. 1700 |

ఆన్‌లైన్ ద్వారా డబ్బులు పంపేవారు మాత్రమే బ్యాంక్ స్లిప్‌లపై '**VEEKSHANAM**' అని రాసి వీక్షణం అకౌంట్ నెంబర్ – **013911011002175** ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్ పేరు మీద వేయాలి. ఇతర బ్యాంకులలో వేసేవారు **ANDB 000/0139** నెంబర్ రాసి వేయవచ్చు.

**వీక్షణం చేస్తున్న కృషి పదికాలాల పాటు కొనసాగాలనే ఆకాంక్షతో మూలనిధికి 2016 జూలై నెలలో వచ్చిన విరాళాలు - రఘు, హైదరాబాద్ - రు. 1,000; ముత్యం రెడ్డి, హైదరాబాద్ - రు. 1,000; పి. సరళా కుమారి, హైదరాబాద్ - రు. 5,000; శ్రేయోభిలాషి, వరంగల్ - రు. 10,000. మిత్రులకు కృతజ్ఞతలు - సం.**

**ఒ**క ప్రేక్షకుడి మదిలోని కొన్ని ప్రశ్నలు (వీక్షణం, జూలై 2016) అంటూ కె. సురేష్ గారు రాసిన వ్యాసం కొన్ని మంచి ప్రశ్నలు వేసింది. అవి తప్పకుండా ఆలోచించవలసినవే. తెలంగాణ ఉద్యమంలో భాగంగా పైకి వచ్చిన కొన్ని మాటలు, నినాదాలు లోతుగా ఆలోచిస్తే సరైనవి కావని అప్పుడు కూడ అన్నవాళ్లు ఉన్నారు. ఉదాహరణకు ఉస్మానియా యూనివర్సిటీలో హోళీ ఆడుతున్నవాళ్లపై పోలీసులు లాఠీచార్జి చేసినప్పుడు, సభల్లో కోదండరాం గారు "మన పోలీసులుంటే మనను కొడుదురా?" అన్నారు. అప్పుడే పోలీసులు ఎక్కడైనా పోలీసులే, దానికి తెలంగాణ, ఆంధ్ర అని లేదు అని జవాబు చెప్పిన వాళ్లు నాకు తెలుసు. అప్పుడు ఉస్మానియా పిల్లల మీద భయంకరమైన దాడులు చేయించిన అధికారి ఇప్పుడు తెలంగాణ ప్రభుత్వంలో కీలకమైన గ్రేహౌండ్స్ అధిపతిగా ఉన్నాడు. అందువల్ల పాలనా పద్ధతులు, అధికార దర్పం, వర్గ స్వభావం మొదలైన విషయాల్లో తెలంగాణ, ఆంధ్ర పాలకవర్గాలలో తేడా ఏమీ లేదు, ఉండదు. ఉంటుందని ఎవరైనా ఊహిస్తే అమాయకత్వమే. ఆమేరకు సురేష్ గారి ప్రశ్నలు మంచివే. కాని అదే వరుసలో ఆయన తెలంగాణ ఉద్యమం మీద కూడ కొన్ని అనుమానాలు వెలిబుచ్చారు. అది సరికాదనుకుంటాను. తెలంగాణ ఉద్యమం సమసమాజ ఉద్యమం కాదు. ఎన్నో పరిమితులు ఉన్న ఉద్యమం. తమ ప్రాంతానికి, తమకు అన్యాయం జరుగుతున్నదని భావించిన, గుర్తించిన ప్రజలు ఉన్న రాజ్యాంగం కిందనే, ఉన్న దోపిడీ పీడనల కిందనే తమ స్వయం పాలనతో ఆ అన్యాయం ఆగుతుందనో, తగ్గుతుందనో భావించారు. ప్రజాచైతన్యం జాగరూకంగా ఉంటే అది ఆమేరకు సాధ్యమయ్యేది కూడా. కాని ఇటువంటి ఉద్యమాలలో సహజంగానే స్థానిక పాలక వర్గ ముఠాలు, దోపిడీలో తమ వాటా దక్కలేదని భావించే ముఠాలు చేరుతాయి. తమ అర్థబలం వల్ల, అంగబలం వల్ల నాయకత్వ స్థానాలకు కూడ వస్తాయి. ఆ నాయకత్వం ఎంత దగాకోరుతో గుర్తించినవాళ్లు, ఉద్యమ కాలంలోనే చెప్పినవాళ్లు, రాసినవాళ్లు ఎందరో ఉన్నారు. ఆ మాటలు, రాతలు ఇప్పుడైనా చూడవచ్చు. కాకపోతే వాళ్లు, తెలంగాణ ప్రజల చైతన్యం, పోరాట స్ఫూర్తి చాలా గొప్పవని, నాయకత్వపు దగుల్బాజీతనాన్ని తెలంగాణ ప్రజలు అడ్డుకుంటారని అన్నారు, రాశారు. ఇప్పుడు, ఆ అంచనా కాస్త తప్పయినట్టు కనబడుతున్నది. ఏమో, తప్పు కాలేదేమో, మనకు కనబడుతున్న నివురు కింద అసంతృప్తి నిప్పు రగులుతున్నదేమో. తన ప్రశ్నలన్నిటినీ గౌరవిస్తూనే, అవన్నీ ఉంచుకొమ్మని కోరుతూనే, మరోవైపు కూడ చూడాలని సురేష్ గారికి విజ్ఞప్తి చేస్తున్నాను.

**– ఎ. వీరస్వామి**
కరీంనగర్

**జూ**లై వీక్షణం సంచికలో కె. సుభాషిణి రాసిన 'సిద్ధేశ్వరం అలుగు రాయలసీమ రైతుల హక్కు' వ్యాసం ప్రజలు తలుచుకుంటే ఏమి అడ్డంకి కావు అనే విషయాన్ని తెలిపింది. కరవు కోరల్లో చిక్కుకున్న రాయలసీమ రైతాంగాన్ని రాజకీయ పార్టీలు ఎలా మోసం చేశాయో వ్యాసంలో తెలిపారు. రాయలసీమ ప్రజల ప్రయోజనాలను ఫణంగా పెట్టి కోస్తా నాయకులతో రాయలసీమ నాయకులు ఎలా కుమ్మక్కయ్యారో వివరంగా తెలిపారు. అట్లాగే రాయలసీమకు వివిధ రంగాల్లో ముఖ్యంగా సాగునీటి రంగంలో న్యాయంగా దక్కాల్సిన వాటాను దక్కకుండా చేసిన తీరు విశ్లేషణాత్మకంగా ఉంది. పాలకుల మోసాలను ఇక ఎంతమాత్రం నమ్మమని రాయలసీమ సాగునీటి సాధన సమితి అధ్వర్యంలో సిద్ధేశ్వరం అలుగుకు చీమల దండులా సాగిన ప్రజల సమూహ శక్తిని ఎత్తిపట్టారు. ప్రభుత్వం ఎన్ని అడ్డంకులు కల్పించినా వివిధ మార్గాల్లో కదిలి వచ్చిన రాయలసీమ నాలుగు జిల్లాల రైతులు, మేధావులు, రైతు కూలీలు, విద్యార్థులు రాయల సీమ ప్రజలకు ఒక భరోసా ఇచ్చినట్లయింది. ఏంపెల్లి భాస్కర్ రాసిన 'మాలేగావ్ – బలిపశువులుగా ముస్లింలు' వ్యాసం చిన్నదే అయినా మైనారిటీల పట్ల ప్రభుత్వం వ్యవహరిస్తున్న తీరును వివరించింది. తాము అధికారంలో ఉన్నపుడు పాలకులు పరిశోధన సంస్థలను ఎలా తమకు అనుకూలంగా వాడుకుంటున్నారో వివరించారు. హిందూ తీవ్రవాద సంస్థలు చేసిన ఘటలకు ఆధారాలు దొరకలేదని కేసు మూసి, ముస్లింలు చేసిన ఘటనలకు ఆధారాలు తయారుచేసి కేసులను నడిపిస్తూ ముస్లిం ప్రజలను అభద్రతలోకి నెడుతున్న తీరును చాలా కొత్తకోణంలో చూసే రచయిత దృష్టి అభినందించదగ్గది. ఇక సంజయ్ కశ్యప్ రాసిన 'విప్లవోద్యమాన్ని అణచడానికి మిషన్ 2016' వ్యాసం పాలకులు విదేశీ సంస్థల ప్రయోజనాల కోసం ఆదివాసి ప్రజలపై చేస్తున్న దాడులను వివరించింది. ఈ రచనలు దినపత్రికల్లో రాని విషయాలు తెలిజేస్తున్నాయి. ఈ దేశ ప్రజల మీద అందునా ఆదివాసుల మీద, ఆదివాసీ స్త్రీల మీద సైన్యం చేస్తున్న దాడులు, అత్యాచారాలు, హత్యలు చూస్తుంటే సైన్యం ఎవరి సొమ్ము తిని ఎవరికి రక్షణకు ఉపయోగపడుతుందో ప్రజలు గమనించాలి. దేశవ్యాప్తంగా జరుగుతున్న ప్రజాస్వామిక ఉద్యమాలను పాలకులు ఎలా అణచివేస్తున్నారో రచయిత వివరించారు. సామాజిక అంశాలపై వస్తున్న వ్యాసాలు చాలా విశ్లేషణాత్మకంగా ఉంటున్నాయి. ఇలాంటి రచయితలు మరిన్ని రచనలు చేయాలని కోరుకుంటూ, ఈ రచనలు ప్రచురించిన వీక్షణం పత్రికకు కృతజ్ఞతలు.

**– సంతోష్**
శ్రీకాకుళం

**అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు**

**తెలంగాణ :** ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; హైదరాబాద్ – డి. విజయభాస్కర్; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ఎం. రాజేందర్‌రెడ్డి; మహబూబ్‌నగర్ – మహమ్మద్ ఇక్బాల్; నిజామాబాద్ – ఎం. నర్సయ్య; రంగారెడ్డి – వి. శంకరయ్య;

**ఆంధ్రప్రదేశ్ :** అనంతపూర్ – కె. నాగేశ్వరాచారి; చిత్తూరు – పలమనేరు బాలాజి; కడప – కొండ్రాయుడు; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి – కె.ఎస్. ప్రకాష్‌రావు; శ్రీకాకుళం – ఆర్. శ్రీలత; విశాఖపట్నం – పి.వి. రమణ

*(ఈ సంచికలోని హైదరాబాద్, రంగారెడ్డి, నిజామాబాద్, వరంగల్, నల్గొండ, కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు, విజయనగరం, ప. గోదావరి జిల్లాల అసహజ మరణాల వివరాలు అందిస్తున్నవారు ఎస్. వెంకటేశ్)*

*పాఠకులు ఫిర్యాదులు, సమాచారం కోసం కార్యాలయానికి పనిదినాల్లో ఉదయం 10:30 నుండి సాయంత్రం 6.00 గంటలలోగా స్వయంగా లేదా ఫోన్ ద్వారా సంప్రదించవచ్చు. మిగతా సమయాల్లో ఫోన్ చేస్తే అది ఫ్యాక్స్‌లోకి వెళ్లి మీకు జవాబు రాదు. అప్పుడు మీరు ఫోన్ ఎత్తికూడా మాట్లడడంలేదని అనుకునే అవకాశం ఉంది. ఇది గమనించగలరు.*

# దేశమంతటా మోగుతున్న ప్రమాదఘంటికలు



**మొ**దటిసారి కేంద్ర ప్రభుత్వ అధికారాన్ని సంపూర్ణంగా చేజిక్కించుకున్న సంఘ్ పరివార్ తన రెండున్నర సంవత్సరాల పాలనలో ప్రత్యర్థులూ పరిశీలకులూ ఊహించినదానికన్న ఎక్కువ దుర్మార్గంగా తన రహస్య ఎజెండాను బహిరంగంగా అమలు చేస్తున్నది. ఒకవైపు దేశభక్తి, జాతీయత అని నినాదాలు ఇవ్వడం, మరొకవైపు దేశ వనరులను సామ్రాజ్యవాదుల హక్కు భుక్తం చేసే దళారీతనానికి పాల్పడడం, తమ దోపిడీ పీడక విధానాలకు వ్యతిరేకంగా దేశప్రజలు ఏకం కాకుండా చూసేందుకు కుల, మతాల పేరుమీద చీలదీయడం సంఘ్ పరివార్ విధానం. అది ప్రకటించే దేశభక్తికీ, జాతీయతకూ అర్థం ఈ దేశప్రజల ఐక్యత, సంఘీభావం, స్వావలంబన కావు. సంఘ్ పరివార్ సిద్ధాంతరీత్యానే ఈ దేశప్రజలను ఎన్నడూ ఒకటిగా చూడలేదు. హైందవ బ్రాహ్మణ్య భావజాలం అటు మతం రీత్యానూ, ఇటు కులం రీత్యానూ ఈ సమాజాన్ని ముక్కలు ముక్కలుగా మాత్రమే చూస్తుంది. ఈ ముక్కల్లో కూడ కొందరిని శాశ్వత శత్రువులుగా, కొందరిని శాశ్వత అస్పృశ్య సేవకులుగా చూస్తుంది. అధికారం, సంపద అత్యల్ప వర్గాల, వర్ణాల చేతుల్లో గుత్తాధిపత్యంగా ఉండడమే దాని పురుషసూక్తం, మనుధర్మం.

తొమ్మిది దశాబ్దాలుగా ఈ భావజాలాన్ని ఈ దేశ ప్రజల మెదళ్లలో, ప్రత్యేకంగా శిశుమందిరాలతో, శాఖలతో చిన్నారి బాలబాలికల మెదళ్లలో నింపుతూ అది చేస్తున్న ప్రయత్నం 2014 ఎన్నికల్లో సాధికార స్థానానికి చేరింది. ఇప్పుడు ఈ పాలన సగం గడిచి, మరొక సగమే మిగిలి ఉంది. ఈ మిగిలిన సగంలో దాని పని వేగంగా పూర్తి చేసుకోవాలి. తన ఎజెండాను సంపూర్ణంగా అమలు చేయడానికి మరొకసారి అధికారంలోకి రావాలి. అలా రావడానికి తన ప్రత్యర్థులనూ, భిన్నాభిప్రాయాలు గలవాళ్లందరినీ, ఒక్క మాటలో చెప్పాలంటే దేశ ప్రజలందరినీ భయోత్పాతానికి గురిచేసి నోరెత్తని స్థితి కల్పించాలి. రానున్న 2019 సార్వత్రిక ఎన్నికలకు సన్నాహకంగా ఆరునెలల్లో ఉత్తరప్రదేశ్ ఎన్నికలు రానున్నాయి. 403 శాసనసభ స్థానాలతో, 80 లోక సభ స్థానాలతో ఒకరకంగా ఉత్తరప్రదేశ్ భవిష్యత్తుకు సూచిక అవుతుంది. పైగా ఆ ఉత్తరప్రదేశ్ లోనే సంఘ్ పరివారానికి కంటగింపు అయిన మత, కుల సమూహాలు ఎక్కువగా ఉన్నాయి. మొత్తం జనాభాలో, వోటర్లలో ముస్లింలు 20 శాతం, దళితులు 21 శాతం, వెనుకబడిన కులాలు 40 శాతం, అగ్రవర్ణాలు 20 శాతం (అందులోనూ బ్రాహ్మణులు దేశంలో మరెక్కడా లేనంతగా 10 శాతం) ఉన్న ఉత్తరప్రదేశ్ ఒక విచిత్ర సమ్మేళనం. దేశవ్యాప్తంగా సగటున 7 శాతం ఉన్న ఆదివాసులు అక్కడ 0.1 శాతం మాత్రమే. ముస్లింలు, దళితులు దేశ సగటు కన్న గణనీయమైన సంఖ్యలో ఎక్కువగా ఉన్నారు. ఆ ఎన్నికల వ్యూహాలు, గెలుపు ఓటములు సంఘపరివార్ హిందూ బ్రాహ్మణీయ భావజాలానికి ఒక పరీక్ష వంటివి. ఈ పరీక్షలో తన బలం చూపించాలంటే, ఆ రాష్ట్రంలో మాత్రమే కాదు, ఉత్తరాది అంతటా, దేశమంతటా తనకు ఎదురులేదని, హింసా దౌర్జన్యాలతో తన ఆధిపత్యాన్ని నిపుకోగలనని చూపాలి. ఇలా అటు కేంద్ర ప్రభుత్వ అవసరాల వైపు నుంచి, ఇటు ఉత్తరప్రదేశ్ ఎన్నికల అవసరాల వైపు నుంచి సంఘ్ పరివార్ దుర్మార్గాలూ దుష్ప్రయత్నాలూ ఇటీవలి కాలంలో వేగం పుంజుకుంటున్నాయి. గడిచిన రెండున్నరేళ్లలో జరుగుతున్న ఘటనలే గత మూడు నాలుగు వారాలలో మరింత ముమ్మరం కావడానికి ఈ రాజకీయ సమీకరణాలే కారణం.

ఈ మూడు నాలుగు వారాలలో ఉత్తర భారతదేశమంతటా ప్రభుత్వమూ, సంఘ పరివారమూ, హిందుత్వ బ్రాహ్మణీయ భావజాలమూ రగిలించిన, రగిలిస్తున్న చిచ్చులను చూస్తే ఈ అభివృద్ధి నిరోధక శక్తులు ఎట్లా ప్రజలను చీల్చడానికి, మత విద్వేషాలు రెచ్చగొట్టడానికి ప్రయత్నిస్తున్నాయో అర్థమవుతుంది. గోరక్ష, పాకిస్తాన్ ప్రమాదం, ఇస్లామిక్ తీవ్రవాదం, దేశసమగ్రత లాంటి మాటల మాటున అబద్ధాలతో, అర్ధసత్యాలతో, వక్రీకరణలతో సంఘ పరివారం ఈ దుర్మార్గానికి మధ్యతరగతి మద్దతును చూరగొంటున్నది. ప్రచారసాధనాల ద్వారా తప్పుడు భావాలను, విద్వేష సంస్కృతిని ప్రచారం చేస్తున్నది.

కశ్మీర్ ప్రజల న్యాయమైన స్వయం నిర్ణయాధికార ఆకాంక్షలను అత్యంత పాశవికంగా అణచివేస్తున్నది. ఒక బూటకపు ఎన్ కౌంటర్ హత్యకు నిరసన తెలుపుతున్న ప్రజల మీద క్రూరమైన హింసాకాండకు దిగి దాదాపు యాభై మందిని కాల్చి చంపింది, వందలాది మందిని గాయపరచింది. పత్రికాస్వేచ్ఛ మీద ఉక్కుపాదం మోపి వాస్తవాలు బైటికి రాకుండా చూసింది. వాస్తవ సమాచారం బైటపడకుండా చేసి, అబద్ధాలతో దేశంలో కశ్మీరీ ఆకాంక్షల పట్ల, ముస్లింల పట్ల వ్యతిరేకతను రెచ్చగొడుతున్నది. మరొకపక్క గోమాంసం తింటారనే పేరుతో, గోవులను రక్షించడానికనే పేరుతో ముస్లింల మీద ఇతర ప్రాంతాలలో కూడ దాడులకు, హత్యలకు దిగుతున్నది. గోమాంసం నిలువ ఉంచుకున్నాడని ఒక వ్యక్తిని చంపి, చివరికి అది గోమాంసం కాదని స్పష్టమయిన తర్వాత కూడ ఆ కుటుంబం మీద కక్ష సాధింపు చర్యలకు పాల్పడుతున్నది. సరిగ్గా నాజీ జర్మనీలో ఒక వర్గం మీద మొదలైన దమనకాండ త్వరలోనే ఇతర వర్గాల మీదికి వ్యాపించినట్టుగా, ముస్లింలతోపాటు ప్రస్తుతం దళితుల మీద కూడ సంఘపరివార్ దాడులు తీవ్రతరమవుతున్నాయి. దళితులు కూడ గోమాంసం తింటారనే ఆరోపణతో గోవులను రక్షించే క్రమంలో మనుషులను బలి ఇవ్వడానికి హిందుత్వ శక్తులు ప్రయత్నిస్తున్నాయి. గుజరాత్‌లో నలుగురు దళిత యువకుల మీద సంఘ పరివార్ శక్తులు చేసిన దుర్మార్గమైన దాడితో ఈ అమానుషాలు వార్తలకెక్కి, అటువంటి దాడులు మరెన్ని రాష్ట్రాలలో మరెంతగా జరుగుతున్నాయో బైటపడుతున్నాయి. భౌతిక దాడులు మాత్రమే కాదు, మాయావతి మీద దుర్మార్గమైన వ్యాఖ్యల ద్వారా సంఘపరివార్ శక్తులు అణగారిన వర్గాల ఆత్మగౌరవాన్ని దెబ్బతీయడానికి ఎంత నీచానికి ఒడిగడుతాయో చూపించాయి. ఈ నేపథ్యంలో సంఘ పరివార్ భావజాలంలోనూ, ఆచరణలోనూ ఉన్న ఈ అమానుషత్వం గురించి, అసమానతను ఆదర్శీకరించే ఆధిపత్య సంస్కృతి గురించి మరింత ఎక్కువగా ప్రచారం చేయడం, అడ్డుకోవడం, ఆ అసాంఘిక శక్తులను ఓడించడం, ఈ దుర్మార్గాలకు గురి అవుతున్న శక్తులతో సంపూర్ణంగా మమేకమై పోరాడడం నిజమైన ప్రజా ప్రగతిశీల శక్తులందరి కనీస బాధ్యత. వీ

### సంపాదకీయ వ్యాఖ్య - తెలంగాణ

# ఐదు లక్షల ఎకరాల కుంభకోణం

దక్షిణార్థ దేశాల, పేద దేశాల భూమి కొల్లగొట్టడానికి, వేలాది, లక్షలాది ఎకరాలు ఆక్రమించడానికి బహుళ జాతి సంస్థలు, కార్పొరేట్ శక్తులు, దేశదేశాల సంపన్నులు చేస్తున్న ప్రయత్నాల గురించి గత పది, పదిహేను సంవత్సరాలుగా చాల చర్చ జరుగుతున్నది. 2013 నాటికి గడిచిన పది సంవత్సరాలలోనే ప్రపంచవ్యాప్తంగా ఎనిమిది కోట్ల ఎకరాల భూమి ఇలా రైతుల చేతినుంచి కార్పొరేట్ సంస్థల చేతికి చేరిందని ఆక్స్ ఫామ్ నివేదిక వెల్లడించింది. నిజమైన భూమి పుత్రుల నుంచి, తరతరాలుగా భూమిని నమ్ముకుని బతుకుతున్న రైతుల నుంచి ఆ భూమి లాక్కుని వారినీ, వ్యవసాయం మీద ఆధారపడిన భూమిలేని కూలీలనూ, చేతి వృత్తుల వారినీ నిర్వాసితులను చేయడానికి, ఆ భూమిని కార్పొరేట్లకు కట్టబెట్టడానికి పాలకవర్గాలూ ప్రభుత్వాలూ ఉవ్విళ్లూరుతున్నాయి. ఈ విషచక్రం ఇప్పుడు తెలంగాణలో పెద్దఎత్తున అమలు కావడానికి రంగం సిద్ధమవుతున్నది. ఆరు దశాబ్దాలుగా తెలంగాణ అభివృద్ధికీ, నీటిపారుదల సౌకర్యాలకూ, మౌలిక సాధనా సంపత్తికీ దూరంగా ఉండిపోయింది గనుక ఇప్పుడు ఆ పేర్లతోనే భూ ఆక్రమణలకు రంగం సిద్ధమవుతున్నది. అలా కొల్లగొట్టిన భూమి ఆ ప్రకటిత కారణానికే ఉపయోగిస్తారా, ఆ పేరుతో భూమి ఆక్రమించి ఆశ్రితులకు, ఇతర ప్రయోజనాలకు పందారాలు చేస్తారా భవిష్యత్తు మాత్రమే చెప్పగలుగుతుంది. కాని ఈలోగా తెలంగాణ ప్రజలను భావోద్వేగాలతో మాయ చేయడానికి, తెలంగాణకు అత్యవసరమైన నీటిపారుదల ప్రాజెక్టులు, మౌలిక సదుపాయాలు, అభివృద్ధి పథకాలకు భూమి అవసరమనీ, అందుకోసం ప్రజలు త్యాగం చేయాలనీ గంభీరంగా ప్రకటిస్తున్నారు. ఎట్లాగూ ప్రచార సాధనాలన్నిటినీ కొనివేయడమో, బెదిరించడమో జరిగింది గనుక అసలు విషయాలు బైటికి కూడ రావడం లేదు. అప్పటికీ ఎవరన్నా మాట్లాడితే భక్తులచేత అంతకన్న ఎక్కువగా తిట్లూ దుర్భాషలూ వినిపిస్తున్నారు. అలా ప్రజలను మోసగించి భూమి ఆక్రమిస్తున్నారు. కాస్త న్యాయబద్ధమైన 2013 చట్టాన్ని కూడ పక్కనపెట్టి, దుర్మార్గమైన 123 జివో ద్వారా ఆక్రమిస్తున్నారు. కనీసం 2013 చట్టంలో భూమి సేకరిస్తే ఎందుకు సేకరిస్తున్నారో ప్రకటించాలి, ఆ అవసరానికి వినియోగించకపోతే వెనక్కి ఇవ్వాలి. కాని జీవో 123 ప్రకారం ఆ భూమి ఎందుకోసం తీసుకుంటున్నారో చెప్పనక్కరలేదు. భూయజమాని ఇష్టపూర్వకంగా "ప్రజా ప్రయోజనం" అనే అస్పష్టమైన అవసరం కోసం రెవెన్యూ అధికారికి తన భూమి అమ్ముతారు. అలా పోగుపడిన భూమిని ప్రభుత్వం ఎందుకోసమైనా వినియోగించవచ్చు. పాత ప్రభుత్వాల లాగ తమ ఆశ్రితులకు, బహుళ జాతి సంస్థలకు ఎవరికి పడితే వారికి "ప్రజా ప్రయోజనం" అనే పేరు చెప్పి అప్పగించవచ్చు. ఇలా మొత్తం 3,99,537 ఎకరాలు ప్రభుత్వం సమకూర్చుకోబోతున్నదని తెలంగాణ భూనిర్వాసితుల పోరాట కమిటీ అంచనా వేస్తున్నది. కేవలం నీటిపారుదల పథకాలకే 3.94 లక్షల ఎకరాలు పోగు చేస్తున్నామని ఆ శాఖ మంత్రి ప్రకటించారు. పరిశ్రమలు, రహదారులు, విమానాశ్రయాలు వగైరా పేర్లతో మరెంత భూమి స్వాహా చేస్తారో తెలియదు. రానున్న ఒకటి రెండు సంవత్సరాలలో తీవ్రతరం కానున్న ఈ భూపోరాటాలకు, భూనిర్వాసితుల పోరాటాలకు ప్రజలను సిద్ధం చేయడానికీ, నాయకత్వం అందించడానికీ పోరాటశక్తులు పూనుకోవలసి ఉంది. వీ

### సంపాదకీయ వ్యాఖ్య - ఆంధ్రప్రదేశ్

# రాయలసీమ, ఉత్తరాంధ్ర గళాలు వినండి!

ఆంధ్రప్రదేశ్ విభజన సమయంలోనూ, ఆంధ్రప్రదేశ్ పునర్వ్యవస్థీకరణ చట్టం తయారీలోనూ అవశేష ఆంధ్రప్రదేశ్‌లో కూడ అభివృద్ధి ఫలాలు అందని వెనుకబడిన ప్రాంతాలున్నాయని చర్చ జరిగింది. అందుకే చట్టంలో సెక్షన్ 46 (3) ప్రత్యేకంగా పేరుచెప్పి మరీ రాయలసీమ, ఉత్తరాంధ్ర ప్రాంతాలకు ప్రత్యేక అభివృద్ధి ప్రణాళికలను తయారుచేసే బాధ్యతను కేంద్ర ప్రభుత్వం తీసుకుంటుందని రాసింది. రెండు సంవత్సరాలు గడిచిపోయినా అటు కేంద్ర ప్రభుత్వం ఆ బాధ్యత తీసుకున్నదీ లేదు, ఇటు రాష్ట్ర ప్రభుత్వం కేంద్రానికి ఆ బాధ్యత గుర్తు చేయడమో, తనంతట తానే ఆ ప్రాంతాల అభివృద్ధికి చర్యలు తీసుకోవడమో చేసిందీ లేదు. పైగా పుండుకు కారం రాసినట్టు ఆ ప్రాంతాల, ఆ ప్రాంత ప్రజల పేరు చెపుతూనే వారికి దక్కవలసిన న్యాయమైన హక్కులను కూడ కాలరాయడం జరుగుతున్నది. శ్రీబాగ్ ఒడంబడిక లోనే, అంటే డెబ్బై ఏళ్ల కిందనే, ఇతర తెలుగు ప్రాంతాలతో పోల్చినప్పుడు తనకు దక్కవలసినవేమిటో రాయలసీమ ప్రకటించింది. ఆంధ్ర రాష్ట్రంలో గాని, ఆంధ్రప్రదేశ్ లో గాని ఆ కోరికలు ఫలించలేదు. ప్రస్తుత ఆంధ్రప్రదేశ్ లో కూడ వాటి ఉల్లంఘనే జరుగుతున్నది. పైగా పోలవరం, పట్టిసీమ వంటి సుదూర పథకాలను కూడ రాయలసీమ పేరుతో మభ్యపెట్టడం జరుగుతున్నది. ఇక ఉత్తరాంధ్ర అడవి, నదులు, సముద్రతీరం, ఖనిజాలు, కష్టజీవులైన ప్రజలతో అత్యంత సుభిక్షంగా అలరారవలసిన సంపన్నమైన ప్రాంతం. అవిద్యకూ, వనరుల దోపిడీకీ, వలసలకూ ఆలవాలంగా మారిపోయింది. ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ లో హైదరాబాద్ మీద కేంద్రీకరణ వల్ల వచ్చిన దుష్ఫలితాలను చూసి అయినా, రాజధాని విషయంలో ఏర్పాటయిన శివరామకృష్ణన్ కమిటీ సిఫారసుల ప్రకారమైనా పాలనా వ్యవస్థల, మౌలిక సదుపాయాల వికేంద్రీకరణ జరిపి, ఈ ప్రాంతాల పట్ల ప్రత్యేకంగా వ్యవహరించవలసి ఉండింది. కాని, గత రెండు సంవత్సరాల పాలన మళ్లీ ఒకసారి కేంద్రీకరణ వైపే సాగుతున్నది. అది కూడ ఆ కేంద్రీకరణ జరుగుతున్న ప్రాంతపు ప్రజల ప్రయోజనాల కోసమేమీ కాదు, కేవలం రియల్ ఎస్టేట్, కార్పొరేట్ శక్తుల ప్రయోజనాల కోసం మాత్రమే జరుగుతున్నది. ఈ నేపథ్యంలో రాయలసీమ లోనూ, ఉత్తరాంధ్ర లోనూ ప్రజానీకంలో పెరుగుతున్న అసంతృప్తి, అక్కడి బుద్ధిజీవులలో ప్రారంభమైన కదలిక పాలక విధానాల ఫలితంగా అనివార్యమైనవి, ప్రజాస్వామిక, ప్రజానుకూల పాలన లేకపోతే ఏమి జరుగుతుందో అర్థం చేసుకోదగినవి, కిందినుంచి ప్రజల ఆకాంక్షల ప్రతిఫలనంగా ఆహ్వానించవలసినవి. రాయలసీమలో జరుగుతున్న విద్యార్థి, యువజనుల ఆకాంక్షల ప్రకటనలైనా, తీవ్రమైన ప్రభుత్వ నిర్బంధం మధ్య కూడ విజయవంతమైన సిద్దేశ్వరం ప్రదర్శన అయినా, ఉత్తరాంధ్రలో నీటిపారుదల సౌకర్యాల కోసం, విద్యాభివృద్ధి కోసం, ఉద్యోగకల్పన కోసం ప్రారంభమైన కదలికలైనా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఇప్పటికైనా ఆలోచించవలసిన సమన్యాయం అంశాన్ని ఎజెండా మీదికి తెస్తున్నాయి. ఇటువంటి సమన్యాయ ఆకాంక్ష చర్చకు వచ్చినప్పుడు మూసిపెట్టి, తొక్కిపెట్టి, అణచివేసి ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ ఏ పరిణామాలను చవిచూసిందో చరిత్ర చూపుతున్నది. ఆ గుర్తింపుతోనైనా ప్రస్తుత ఆంధ్రప్రదేశ్ పాలకులు తమ విధివిధానాలు మార్చుకోవలసి ఉంది. వీ

# చిల్‌కాట్ బోనులో చిక్కిన బ్లెయిర్

బ్రిటిష్ ప్రజల ఒత్తిడి మేరకు ప్రధాని గార్డన్, 2003లో ఇరాక్‌పై దాడి, యుద్ధానికి ముందు పరిస్థితులు, తదనంతర పరిణామాల (2004-2009)పై చిల్‌కాట్ నేతృత్వంలో 2009 జూన్ 15న దర్యాప్తు కమిషన్ వేశారు. ఇరాక్‌పై బ్రిటన్ దురాక్రమణను విచారించిన సర్ జాన్ చిల్‌కాట్ తన నివేదికను జూలై 6న ప్రచురించాడు. యుద్ధోన్మాది అమెరికాకు మరో రక్తపిశాచి బ్రిటన్ తోడవడంతో పది లక్షల మంది అమాయక ప్రజల ప్రాణాలు అర్ధాంతరంగా ఆగిపోయాయి. ఇరాక్‌పై అమెరికా, బ్రిటన్‌ల దురాక్రమణ దుర్మార్గ దాడి సమున్నత చారిత్రక, నాగరికత అనవాళ్లను శిథిల దిబ్బగా మార్చిందని నివేదిక చెప్పింది. చిల్‌కాట్ కమిషన్ నివేదిక చూస్తే నిత్యం ప్రజాస్వామ్యం జపించే అగ్ర దేశాల్లో జరిగిందేమిటో స్పష్టమవుతుంది. సద్దాం నుంచి ఏవిధమైన ముప్పులేదని, ఇరాక్ అధ్యక్షుడు సద్దాం హుస్సేన్‌ను అదుపాజ్ఞల్లో ఉంచితే సరిపోతుందన్న అభిప్రాయంతో ఉన్న బ్రిటన్, చాలా స్వల్పకాలంలోనే ఆ వైఖరిని మార్చుకున్న తీరును నివేదిక పట్టిచూపింది. బ్లెయిర్ ఆలోచన మారిపోగానే నిఘా సంస్థలతోసహా ప్రభుత్వ విభాగాలన్నిటా వచ్చిన మార్పును విశదీకరించింది. టోనీ బ్లెయిర్ పార్లమెంటును, దేశప్రజలను ఉద్దేశపూర్వకంగానే తప్పుదారి పట్టించారని నివేదిక తెలిపింది. సద్దాం ప్రమాదాన్ని అతిగా చేసి చూపారని, శాంతియుత పరిష్కారాల కోసం ప్రయత్నించకుండానే దాడికి దిగారని తప్పుపట్టింది. సైనిక చర్య వల్ల తలెత్తే దుష్ఫలితాల గురించి హెచ్చరించినా బ్లెయిర్ పట్టించుకోలేదని పేర్కొంది. ఇరాక్ విషయంలో ఐరాస భద్రతామండలి తీర్మానం లేకుండానే, అంతర్జాతీయ న్యాయసూత్రాలకు వ్యతిరేకంగా యుద్ధానికి దిగితే అది చట్టవిరుద్ధమవుతుందని మొదట్లో చెప్పిన అటార్నీ జనరల్ పీటర్ గోల్డ్‌స్మిత్ అమెరికా వెళ్లొచ్చి స్వరం మార్చిన వైనాన్నీ, నిఘా సంస్థలు ప్లేటు ఫిరాయించడాన్నీ కమిషన్ ప్రస్తావించింది.

అప్పటి అమెరికా అధ్యక్షుడు జార్జి బుష్-బ్లెయిర్‌ల మధ్య సమావేశం అనంతరమే ఈ మార్పు సంభవించిందని రుజువుచేసింది. 'ఏదేమైనా నీతోనే నేను...' అంటూ 2002 జూలై 28న బ్లెయిర్ బుష్‌కు పంపిన నోట్‌లో చెప్పడాన్ని ప్రస్తావించింది. ఇప్పుడు ఈ మాటలే ప్రపంచమంతా మార్మోగుతున్నాయి. బుష్‌కు దాసోహమన్న బ్లెయిర్ నేలబారు వ్యక్తిత్వాన్ని పరిహసిస్తున్నాయి. యుద్ధంలో పాల్గొంటే వచ్చే పర్యవసానాలు అంచనా వేసుకోకుండా, ఏకపక్షంగా నిర్ణయాలు తీసుకుని, తన చర్యలకు దేశాన్ని బలి చేశారని నివేదిక రుజువు చేసింది. పశ్చిమాసియాలోని చమురు సంపదను కొల్లగొట్టాలని ఆంగ్లో-అమెరికన్ కూటమి ఇరాక్ తదితర దేశాలపై దురాక్రమణ దాడులు చేస్తోంది. ఇరాక్ యుద్ధం వల్ల పది లక్షల మంది పౌరులు చనిపోయారు. వీరుగాక వికలాంగులుగా, అనాథలుగా, జీవన్మృతులుగా మిగిలినవారు చనిపోయిన వారికి రెట్టింపు ఉంటారు. ఈ నష్టం, కష్టాలు ఇన్నేళ్లయినా ఆగలేదు సరికదా అంతకంతకు పెరుగుతూ పోతున్నాయి. అది నిజానికి ఇరాక్‌కు మాత్రమే పరిమితమై లేదు. పశ్చిమాసియా దేశాలను చుట్టుముట్టింది. ఐఎస్‌కు పురుడు పోసింది. ఇప్పుడు అది ప్రపంచ దేశాలను సైతం వెంటాడుతోంది. యుద్ధ నేరానికి పాల్పడిన బుష్- బ్లెయిర్ లను యుద్ధ నేరస్థులుగా గుర్తించి శిక్షించాలని ప్రజలు ఒత్తిడి తేవాల్సి ఉంది.

- ఎ. నర్సింహా రెడ్డి వీ





❖ **తెలుగు సాహిత్యంలో స్త్రీవాద విమర్శకులు** – వ్యాస సంపుటి – డా. కందాళ శోభారాణి – శోధన ప్రచురణలు – 131 పేజీలు, 1/8 డెమీ, రు. 150, ప్రతులకు: అలుగోజు సుధాకర్, 23-11-2404/ఎ, దేశాయిపేట రోడ్, వరంగల్ – 506002; ఫోన్: 8978656327



❖ **డేట్‌లైన్ హైదరాబాద్** – దేవులపల్లి అమర్ – దేవులపల్లి పబ్లికేషన్స్ – 768 పేజీలు, 1/8 డెమీ, రు. 500, ప్రతులకు: ప్రజాతంత్ర, ఇ.నెం. 12-1-62, విజయ గార్డెన్స్, బండ్లగూడ, నాగోల్, హైదరాబాద్ – 500068; ఫోన్: 9849948829; అన్ని ప్రముఖ పుస్తక షాపుల్లో



❖ **ఆరిద్ర పువ్వు** – వీరస్వామి రచనలు – విరసం ప్రచురణ – 160 పేజీలు, 1/8 డెమీ, రు. 70, ప్రతులకు: డి.వి. రాంకి, ఎం.ఐ.జి-14, ఎపిఐఐసి కాలనీ, కార్బైడ్ కంపెనీ ఎదురుగా, మౌలాలి, హైదరాబాద్ – 500040; అన్ని ప్రముఖ పుస్తక షాపుల్లో



❖ **మెతుకు కథలు** – సంపాదకులు వేముగంటి మురళీకృష్ణ, బెల్లంకొండ సంపత్ కుమార్ – ప్రచురణ మంజీర రచయితల సంఘం – 431 పేజీలు, 1/8 డెమీ, రు. 200, ప్రతులకు: నవోదయ బుక్ హౌస్, నవచేతన బుక్ హౌస్, నవ తెలంగాణ బుక్ హౌస్, నవయుగ బుక్ హౌస్, సహచర బుక్ హౌస్ హైదరాబాద్



❖ **పులిమామిడి మద్దిలేటితో నా అనుబంధం** – జి. అంపయ్య – ప్రచురణ చందు సాహిత్య సదనం – 79 పేజీలు, 1/8 డెమీ, రు. 30, ప్రతులకు: జి. అంపయ్య, పో: కృష్ణ, మం: మాగనూరు, మహబూబ్‌నగర్ – 509352; ఫోన్ నెం. 9396574184



❖ **మల్‌దాదా** – చారిత్రక నవల – గులాబీల మల్లారెడ్డి – జైభారత్-జైహింద్ ప్రచురణలు – 179 పేజీలు, 1/8 డెమీ, రు. 200, ప్రతులకు: జి.ఎం.ఆర్. పటేల్, ఇం.నెం. 3-1-706, వావిలాలపల్లి, కరీంనగర్ – 505001; ఫోన్ నెం. 9440041351



❖ **మనసులో వెన్నెల** – చైతన్య పింగళి – ధర్మపురి ప్రచురణలు – 2 – 96 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు: ధీర పబ్లికేషన్స్, 304, ఫ్లాట్ నెం. 59, ఇ.నెం.1-6-42, బాబు టవర్స్, బాబు కాంప్లెక్స్, చైతన్యపురి, హైదరాబాద్ – 500060; ఫోన్ నెం. 8886983399, అన్ని ప్రముఖ పుస్తక షాపుల్లో



❖ **అరుణ కిరణాలు** – రెండవ భాగం – ప్రచురణ అరుణోదయ సాంస్కృతిక సమాఖ్య – 86 పేజీలు, 1/8 డెమీ, రు. 40, ప్రతులకు: వాయిస్ ఆఫ్ న్యూడెమోక్రసీ, మార్క్స్ భవన్, 658, విద్యానగర్, 7వ లైన్, హైదరాబాద్ – 500044; నవతెలంగాణ బుక్ హౌస్; నవోదయ బుక్ హౌస్; విశాలాంధ్రలలో



❖ **మిగ్గు** – కవిత్వం – పొన్నాల బాలయ్య – తెలంగాణ రచయితల సంఘం ప్రచురణ – 126 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు: పొన్నాల కృష్ణవేణి, గ్రామం: ఆరెపల్లి, పో: బస్వాపూర్, వయ: శనిగరం, మం: కొహెడ, జి: కరీంనగర్ – 505473; ఫోన్: 9908906248



❖ **ఆధునికాంధ్ర గేయకవిత్వం** – డా.జి. చెన్నకేశవరెడ్డి – జయమిత్ర సాహిత్య సాంస్కృతిక వేదిక ప్రచురణ – 505 పేజీలు, 1/8 డెమీ, సాదా ప్రతి రు. 350, మేలు ప్రతి రు. 400, ప్రతులకు: డా.జి. చెన్నకేశవరెడ్డి, విల్లా నెం. 5, సైబర్ మీడోస్, జైన్ హెరిటేజ్ స్కూల్ ఎదురు రోడ్, కొండాపూర్, హైదరాబాద్ – 500084; ఫోన్: 9492047027



❖ **దళితులెవ్వరూ చంపలేదు!!!** – మీనా కందసామి – మాతృక ప్రచురణలు – 72 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు: న్యూడెమోక్రసీ కార్యాలయం, ఇ.నెం. 2-1-716 (బి-6,ఎఫ్-4), ఎస్.వి.ఐ.ఎస్. స్కూల్ ఎదురుగా, ఒయు రోడ్, విజ్ఞానపురి కాలనీ, విద్యానగర్, హైదరాబాద్-500044; ప్రముఖ పుస్తక షాపుల్లో



❖ **ఉట్నూరు సాహితీ సంచిక** – కవితలు, పాటలు, వ్యాసాలు – ఉట్నూరు సాహితీ వేదిక ప్రచురణ – 56 పేజీలు, 1/8 డెమీ, రు. 60, ప్రతులకు: గోపగాని రమణశ్రీ, ఇ.నెం. 9-76/2, ఫకీర్‌గుట్ట, ఉట్నూరు, ఆదిలాబాద్-504203; తెలంగాణ; ఫోన్: 9440979882



❖ **కులవ్యవస్థ నిర్మాణం – వేదాలు** – సత్య బత్తుల – నవచేతన పబ్లిషింగ్ హౌస్ – 143 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు: నవచేతన పబ్లిషింగ్ హౌస్, గిరిప్రసాద్ భవన్, జిఎస్ఐ పోస్టు, బండ్లగూడ (నాగోల్), హైదరాబాద్ – 500068; ఫోన్: 24224453



❖ **సత్యం వద్దు స్వప్నమే కావాలి** – కవిత్వం – శివలెంక రాజేశ్వరీదేవి – ప్రేమలేఖ ప్రచురణ – 160 పేజీలు, 1/8 డెమీ, రు. 150, ప్రతులకు: నమాడి శ్రీధర్, ఇ.నెం. 3-129, అంబాజీపేట, తూర్పుగోదావరి -533214; ఆంధ్రప్రదేశ్; ఫోన్: 9396807070



❖ **కన్న బిడ్డల కలల యాది** – అరిందమ్ దత్తా – అమరుల బంధుమిత్రుల సంఘం ప్రచురణ – 30 పేజీలు, 1/8 డెమీ, రు. 20, ప్రతులకు: పద్మకుమారి, డోర్ నెం. 50-348-ఎల్-19బి-2, అరోరానగర్, కర్నూల్ – 518002



❖ **బొట్టెం అమరుల జీవిత చరిత్ర** – అమరుల బంధుమిత్రుల సంఘం ప్రచురణ – 80 పేజీలు, 1/8 డెమీ, రు. 40, ప్రతులకు: బొప్పూడి అంజమ్మ, ఇ.నెం. 3-40-1, గణపవరం, మం: నాదెండ్ల, జి: గుంటూరు-522619

# కశ్మీర్‌లో ఏం జరుగుతున్నది?

***గత కొద్ది వారాలుగా కశ్మీర్‌లో కొనసాగుతున్న హింస, కల్లోల స్థితి గురించి వివరిస్తూ ఐక్యరాజ్యసమితికి జమ్ము కశ్మీర్ పౌరసమాజ సమాఖ్య చేసిన విజ్ఞప్తి***

జమ్ము కశ్మీర్‌లో నానాటికీ దిగజారుతున్న రాజకీయ, మానవతా పరిస్థితి గురించి, తక్షణమే జోక్యం చేసుకోవలసిన అవసరం గురించి జమ్ము కశ్మీర్ పౌరసమాజ సమాఖ్య (కోయలిషన్ ఆఫ్ సివిల్ సొసైటీ) జూలై 16న ఐక్యరాజ్యసమితికి ఒక విజ్ఞప్తి చేసింది. ఐక్యరాజ్యసమితి అధికారులు జెయిద్ రాద్ అల్ హుస్సేన్ (మానవహక్కుల కమిషనర్), క్రిస్టోఫ్ హెయిన్స్ (చట్టవ్యతిరేక, ఏకపక్ష, నిరంకుశ హత్యల ప్రత్యేక రాపోర్టియర్), జువాన్ ఎర్నెస్టో మెండెజ్ (చిత్రహింసలు, ఇతర క్రూర, అమానుష, అవమానకర వ్యవహారాల, శిక్షల ప్రత్యేక రాపోర్టియర్), మైనా కియై (శాంతియుత సమావేశాల, సంఘనిర్మాణాల స్వేచ్ఛ హక్కుల ప్రత్యేక రాపోర్టియర్), డేవిడ్ కే (అభిప్రాయ, భావ ప్రకటనా స్వేచ్ఛల ప్రోత్సాహ, పరిరక్షణ ప్రత్యేక రాపోర్టియర్) ల పేరు మీద ఈ విజ్ఞప్తిని రాశారు. భారత పాలనలోని కశ్మీర్‌లో శ్రీనగర్ నుంచి జూలై 16న రాసిన ఈ లేఖ మీద జమ్ము కశ్మీర్ పౌరసమాజ సమాఖ్య కార్యక్రమ సమన్వయకర్త ఖుర్రమ్ పర్వేజ్ సంతకం చేశారు. ఆ లేఖ పూర్తి పాఠం:

గౌరవ ఐక్యరాజ్యసమితి అధికారులకు,

1) జమ్ము కశ్మీర్‌లో పౌరుల మీద కొనసాగుతున్న రాజ్య హింసనూ అణచివేతనూ వెంటనే మీ దృష్టికి తేవడానికి అత్యంత విచారంతోనూ, తక్షణమే పరిష్కరించవలసిన ఆదుర్దాతోనూ ఈ లేఖ రాస్తున్నాం. ఈ అణచివేతలో చివరికి వైద్యసేవలు అందించేవారిమీద, ప్రత్యేకంగా మృతులను, తీవ్రమైన గాయాలతో బాధపడుతున్న క్షతగాత్రులను తీసుకుపోతున్న ఆస్పత్రి వాహనాల మీద కూడ పదే పదే దాడులు జరుగుతున్నాయి. జమ్ము కశ్మీర్‌లో మరొకసారి మానవతా సంక్షోభం తలెత్తుతున్నది. ఇది తక్షణమే అంతర్జాతీయ సమాజం దృష్టికి రావలసి ఉన్నది. అంతర్జాతీయ సమాజం జోక్యం చేసుకోవలసి ఉన్నది.

2) జమ్ము కశ్మీర్‌లో ఇవాళ ఏడు లక్షల మంది సాయుధ ప్రభుత్వ బలగాలు మోహరించి ఉన్నాయి. ఇది ప్రపంచంలోకెల్లా అతి ఎక్కువ సైనికీకరణ చెందిన ప్రాంతంగా మారింది. అందువల్ల గత 26 సంవత్సరాలుగా భారత రాజ్య బలగాల చేతుల్లో ఇక్కడి పౌరులు విస్తృతంగా, ప్రణాళికాబద్ధంగా దాడులకు గురవుతున్నారు. ఇప్పటివరకూ, ఈ ప్రాంతంలో యుద్ధనేరాలతో సహా అసంఖ్యాక మానవహక్కుల ఉల్లంఘనలు జరిగాయి. డెబ్బైవేల పైచిలుకు మంది హత్యలకు గురయ్యారు. ఎనిమిదివేల పైగా వ్యక్తులు మాయం చేయబడ్డారు. చిత్రహింసలు, లైంగిక హింసలు, అత్యాచారాలు లెక్కలేనన్ని జరిగాయి. ప్రభుత్వ సాయుధ బలగాలు ఒక ప్రత్యేక అధికారాల చట్టం ద్వారానూ, అంతకన్న ముఖ్యంగా భారత రాజ్యపు ప్రత్యక్ష రాజకీయ మద్దతు ద్వారానూ విచారణ లేని, శిక్ష లేని నేరప్రవృత్తికి అలవాటు పడ్డారు. ఇంతవరకూ ఒక్కటంటే ఒక్క సందర్భంలో కూడ సాయుధబలగాల సైనికుల మీద ఏ పౌర న్యాయస్థానంలోనూ విచారణ కూడ జరగలేదు.

భారత సైనిక ఆక్రమణను తొలగించాలని, తమ మౌలిక మానవ హక్కు అయిన స్వయం నిర్ణయాధికార హక్కును గుర్తించాలనీ జమ్ము కశ్మీర్ ప్రజలు చిరకాలంగా కోరుతున్నారు. భారత రాజ్యం, దాని సాయుధ బలగాలు జమ్ము కశ్మీర్‌లో జరిపిన యుద్ధ నేరాలపై, మానవతకు వ్యతిరేకమైన నేరాలపై, అంతర్జాతీయ నేరాలపై ఒక అంతర్జాతీయ, స్వతంత్ర న్యాయవిచారణా వ్యవస్థను ఏర్పాటు చేసి ఆ నేరాలను పరిశోధించాలనీ, విచారణ జరపాలనీ కోరుతున్నారు. ప్రస్తుతం జమ్ము కశ్మీర్‌లో సాగుతున్న హింసాకాండను ఈ చారిత్రక అన్యాయపు నేపథ్యంలో, గురిచూసి అమలవుతున్న రాజ్య హింస నేపథ్యంలో, ప్రజల నిరాశా నిస్పృహల నేపథ్యంలో అర్థం చేసుకోవలసి ఉంది. దీని పరిష్కరించడం ఎంత అత్యవసరమో అర్థం చేసుకోవలసి ఉంది.

3) జమ్ము కశ్మీర్‌లో పని చేస్తున్న సాయుధ తిరుగుబాటు బృందం హిజ్బుల్ ముజాహిదీన్ కమాండర్ బుర్హాన్ ముజఫర్ వాణి ని భారత సైనిక బలగాలు 2016 జూలై 8న చంపివేశాయి. ఆ తర్వాత, జమ్ము కశ్మీర్‌లో, ప్రత్యేకించి కశ్మీర్ లోయలో, పౌరుల మీద రాజ్య బలగాల పెద్దఎత్తున దాడికి దిగాయి. బుర్హాన్ వాణి మృతికి సంతాపం పాటిస్తున్న వారి మీద జరిగిన ఈ దాడుల్లో ఇప్పటికి 42 మంది సాధారణపౌరులు చనిపోయారు. 1500 మందికి పైగా గాయపడ్డారు. ప్రస్తుత సంక్షోభ స్థితిలో ఎంత మంది చనిపోయారో, ఎంత మంది గాయపడ్డారో కచ్చితంగా చెప్పడం కూడ కష్టమే. ప్రతిరోజూ అంతకంతకూ ఎక్కువగా ఎంతో మంది పౌరుల మృతదేహాలను, క్షతగాత్రులను, చిత్రహింసలకు గురైనవారిని ఆస్పత్రులకు తీసుకు వస్తున్నారు. కశ్మీర్‌లోయలో అత్యధిక భాగం చట్టవ్యతిరేకమైన కర్ఫ్యూలో ఉంది. భౌతిక స్వేచ్ఛల మీద, మొబైల్ ఫోన్లు, ఇంటర్నెట్ సదుపాయాలతో సహా ఎలక్ట్రానిక్ స్వేచ్ఛల మీద ఆంక్షలు విధించారు. దక్షిణ కశ్మీర్ జిల్లాల మీద సంపూర్ణంగా చీకటిపరిచారు. చిన్న పిల్లలతో సహా లెక్కలేనంతమందిని నిరంకుశ నిర్బంధానికి గురిచేశారు. నిన్న, జూలై 15 శుక్రవారం నుంచి రాజధాని శ్రీనగర్ నగరాన్నే చెరసాలగా మార్చారు. మొబైల్ నెట్ వర్క్ లన్నిటినీ మూసేయించారు. ఇవాళ కశ్మీర్‌లోయ లోని ప్రధాన వార్తాపత్రికల కార్యాలయాలన్నిటిమీద దాడి చేసి, అచ్చయిన పత్రికలను స్వాధీనం చేసుకున్నారు. ఒక్క మాటలో చెప్పాలంటే జమ్ము కశ్మీర్ దిగ్బంధంలో ఉంది.

4) భారత రాజ్యం గత 26 సంవత్సరాలుగా జమ్ము కశ్మీర్‌లో అన్ని రకాల భిన్నాభిప్రాయ వ్యక్తీకరణలను పదే పదే అడ్డుకుంటున్నది. ప్రజలను ఒంటరులను చేయడానికీ, తద్వారా ఇక్కడ జరుగుతున్న యుద్ధనేరాల, చట్టవ్యతిరేక హింసాకాండల స్వభావమూ, విస్తృతీ అంతర్జాతీయ సమాజానికి తెలియకుండా చేయడానికీ భారత రాజ్యం ప్రతి ఒక్క ప్రయత్నమూ చేస్తున్నది. ప్రత్యేకంగా ఈ వార్తలు ఐక్యరాజ్యసమితికీ,

వివిధ అంతర్జాతీయ మానవహక్కుల సంస్థలకూ తెలియకుండా చేయడానికి ప్రయత్నిస్తున్నది. ఇక్కడి మానవ హక్కుల కార్యకర్తలను స్వేచ్ఛగా తిరగనివ్వడం లేదు. ప్రజా సమాచారం వారికి అందకుండా చేస్తున్నారు. తద్వారా రాజ్య బలగాలు విచారణాతీత, శిక్షాతీత ఇష్టారాజ్య అత్యాచారాలకు పాల్పడడానికి అవకాశం ఇస్తున్నారు. ఇలా సమాచార సంబంధాల మీద, కదలికల మీద రాజ్య ఆంక్షలు అమలవుతున్నప్పుడు, మేం ఇక్కడ ఇస్తున్న రాజ్య అత్యాచార వివరాలన్నీ కూడ స్థానిక స్వచ్ఛంద కార్యకర్తలు, వైద్య, ఆరోగ్య నిపుణులు ఇచ్చిన సమాచారం మీద, ఆస్పత్రులలో తెలిసిన విషయాల మీద, వార్తా సంస్థలు అందించే సమాచారం మీద ఆధారపడినవి మాత్రమే. సమగ్రమైన, స్వతంత్రమైన క్షేత్రపరిశోధన ద్వారా నిజానిజాలు సేకరించే అవకాశం లేదు.

5) జూలై 8 నుంచి ఇవాళ్టివరకూ, భారత ప్రభుత్వం, ప్రధానంగా భారత అర్ధసైనిక బలగాల ద్వారా, జమ్ము కశ్మీర్ పోలీసు సిబ్బంది ద్వారా, ప్రదర్శనలను, అంతిమ యాత్రలతో సహా అన్ని సామూహిక కలయికలను, నిరసనలను, బహిరంగ, వ్యక్తిగత భిన్నాభిప్రాయ వ్యక్తీకరణలను పాశవికమైన, దుర్మార్గమైన బలప్రయోగం ద్వారా అడ్డుకుంటున్నది. దానితోపాటు 42 మంది సాధారణ పౌరులను చంపివేశారు. లెక్కలేనంతమందికి బుల్లెట్లతో, ఇతర హింసా సాధనాలతో తీవ్రమైన, ప్రాణాంతకమైన గాయాలయ్యాయి. రాజ్య బలగాలు ఉపయోగించిన పెల్లెట్ తుపాకుల వల్ల పురుషులు, స్త్రీలు, పిల్లలతో సహా వందకు పైగా పౌరులకు కళ్లకు భయంకరమైన గాయాలు అయ్యాయి. ఈ పెల్లెట్ తుపాకులు ప్రాణాంతకమైనవి కావని ప్రభుత్వం చెపుతున్నప్పటికీ, ప్రాణాంతకమైనవేనని, విచక్షణారహితమైనవనీ, ప్రమాదకరమైనవనీ రుజువవుతున్నది. అన్నిటికన్న ముఖ్యంగా, రాజ్య బలగాలు పూర్తిగా పౌరులను శిక్షించే, అంగవికలురను చేసే ఉద్దేశంతోనే పెల్లెట్ తుపాకులు ఉపయోగిస్తున్నారని రుజువవుతున్నది. పెల్లెట్ తుపాకి గాయాలతో ఇద్దరు పౌరులు మరణించారని వార్తలు వచ్చాయి. పెల్లెట్ తుపాకి దెబ్బలతో వందకు పైగా మంది కళ్లకు శస్త్రచికిత్స చేయించుకున్నారని తెలిసింది. వారిలో అత్యధికులకు కనీసం ఒక కన్నుకు శాశ్వత అంధత్వం వస్తుందని అంటున్నారు.

6) రాజ్య హింస నిర్దిష్టంగా పిల్లలను, యువతను లక్ష్యంగా పెట్టుకుని సాగుతున్నదని స్పష్టంగా కనబడుతున్నది గనుక కశ్మీర్‌లోని పరిస్థితి తక్షణమే పట్టించుకోవలసిన అత్యవసర స్థితి. షోపియన్ పట్టణంలో రాజ్యబలగాల కాల్పులలో పదమూడు సంవత్సరాల పిల్లవాడు షాహిద్ గుల్జార్ మరణించాడు. శ్రీనగర్‌లో నాలుగు సంవత్సరాల బాలిక జోహ్రా మజీద్ గిల్కార్ పొత్తి కడుపులో, ఛాతీలో, రెండు కాళ్లకు, నుదుటి మీద పెల్లెట్ గాయాలతో శ్రీనగర్ ఆస్పత్రిలో చికిత్స పొందింది.

7) రాజ్య హింసలోని ఆందోళనకరమైన విషయమేమంటే, రాజ్య బలగాలు, ప్రత్యేకంగా కేంద్ర రిజర్వ్ పోలీస్ దళం (సిఆర్‌పిఎఫ్) అనే అర్ధసైనిక బలగాలు ఆస్పత్రుల ఆంబులెన్సులతో సహా వైద్య ఆరోగ్య సేవల మీద దాడులు చేస్తున్నాయి. కశ్మీర్‌లోయలోని అతి పెద్ద ఆస్పత్రి అయిన శ్రీనగర్‌లోని శ్రీ మహారాజా హరిసింగ్ ఆస్పత్రికి అతి ఎక్కువమంది బాధితులు రాగా, ఆ ఆస్పత్రి మీద, దక్షిణ కశ్మీర్‌లోని అనంత్‌నాగ్ జిల్లా ఆస్పత్రి మీద, బిజ్ బెహారా ఉప జిల్లా ఆస్పత్రి మీద, లాల్పొరా లోని ప్రాథమిక ఆరోగ్య కేంద్రం మీద రాజ్యబలగాలు దాడులు చేశాయి. ఆస్పత్రి భవనాల లోపల బాష్పవాయు గోళాలు ప్రయోగించడం, అత్యవసరమైన వైద్య చికిత్స అందుకుంటున్న క్షతగాత్రులను ఆస్పత్రుల లోపల అరెస్టు చేయడం కూడ జరిగాయి. అంతే కాదు, ఇప్పటివరకూ క్షతగాత్రులను ఆస్పత్రులకు తీసుకుపోతున్న ఆంబులెన్సుల మీద కనీసం 90 సార్లు రాజ్యబలగాలు దాడులు చేశాయని వార్తలు వచ్చాయి. శ్రీనగర్ కేంద్రంగా పనిచేసే అంతర్జాతీయ వైద్య స్వచ్ఛంద సంస్థ మెడిసిన్స్ సాన్స్ ఫ్రాంటియర్స్ విడుదల చేసిన అధికారిక పత్రికా ప్రకటన ఇలా వైద్య ఆరోగ్య సేవల మీద రాజ్యబలగాల దాడులు జరుగుతున్నాయని వార్తలు వస్తున్నాయని, కాని ఆ వార్తలను ధ్రువీకరించుకోవడానికి తమకు అవకాశం లేదని అంది. గతంలో పౌర ఆందోళనలు జరిగిన సందర్భాలలో, 2008లో, 2009లో, 2010లో ఇదే విధంగా వైద్య ఆరోగ్య సేవల మీద దాడులు జరిగాయి. జమ్ము కశ్మీర్ పౌరులకు "ఉమ్మడి గుణపాఠం" నేర్పడానికి ఇది ఒక మార్గమని అప్పుడు అన్నారు. గాయపడిన చాల మంది పౌరులు ఇటువంటి దాడుల వల్ల తక్షణ వైద్య సహాయం అందకపోవడంతో మరణించారు.

8) పెల్లెట్ తుపాకుల వాడకం, వైద్య, ఆరోగ్య సేవల మీద దాడులతో సహా మొత్తంగా భారత రాజ్య బలగాలు సాగిస్తున్న హింసాకాండ భారత చట్టాలకూ, అంతర్జాతీయ చట్టాలకూ స్పష్టమైన ఉల్లంఘన. జమ్ము కశ్మీర్ పౌర ప్రజానీకం నిరంతరాయంగా తమ స్వయంనిర్ణయాధికార హక్కును కోరుతున్నారు గనుక వారికి ఉమ్మడిగా శిక్ష విధించే ఉద్దేశంతో భారత రాజ్య బలగాలు ఈ హింసాకాండకు పాల్పడుతున్నాయి. అలాగే, సైనిక ఆక్రమణ ద్వారా భారత రాజ్యం 1949 జెనీవా ఒప్పందపు నిబంధనలనూ, 1977 అదనపు ఒడంబడికల నిబంధనలనూ ఉల్లంఘిస్తున్నది. పౌర లక్ష్యాలకూ, పౌరేతర లక్ష్యాలకూ మధ్య విచక్షణ చూపడం, నిర్విచక్షణగా చేసే దాడుల మీద నిషేధం, తగిన మోతాదులోనే బలప్రయోగాన్ని వినియోగించడం అనే అంతర్జాతీయ మానవీయ న్యాయ సూత్రాలను భారత రాజ్యపు చర్యలు మౌలికంగా ఉల్లంఘిస్తున్నాయి. 'చట్టబద్ధ సంస్థల అధికారులు బలప్రయోగాన్ని, మారణాయుధాలను వాడడంలో పాటించవలసిన మౌలిక సూత్రాలు 1990', 'చట్టబద్ధ సంస్థల అధికారుల ప్రవర్తనా నియమావళి, 1979' వంటి అంతర్జాతీయ మార్గదర్శక సూత్రాలను కూడ ఇక్కడ పౌరుల మీద దాడిలో రాజ్యబలగాలు ఉల్లంఘించాయి. అలాగే, గాయపడినవారిని, కదలలేనివారిని, వైద్య సంస్థలను, వైద్య సంస్థల సిబ్బందిని పరిరక్షించడానికి ఎన్నో అంతర్జాతీయ మానవీయ న్యాయసూత్రాలు, ప్రత్యేకంగా 1949 జెనీవా ఒప్పందం, 1977 అదనపు ఒడంబడికలు వంటివి ఉన్నాయి. వాటిని గౌరవించాలని, పరిరక్షించాలని, వాటి మీద దాడి చేయగూడదని ఈ ఒడంబడికలు స్పష్టంగా నిర్దేశించాయి.

9) ఈ నేపథ్యంలో జమ్ము కశ్మీర్‌లో ఈ కింది చర్యలు వెంటనే చేపట్టవలసిందిగా భారత ప్రభుత్వాన్ని అదేశించడం ద్వారా తక్షణ జోక్యం చేసుకొమ్మని మీకు విజ్ఞప్తి చేస్తున్నాం:

i. పెల్లెట్ తుపాకుల వాడకాన్ని తక్షణమే నిషేధించాలి.

ii. పౌర ప్రదర్శనకారుల మీద మందుగుండు సామగ్రిని, ఇతర మారణాయుధాలను వాడడాన్ని నిషేధించాలి

iii. వైద్య ఆరోగ్య సిబ్బంది మీద దాడులన్నిటినీ నిషేధించాలి. జమ్ము కశ్మీర్‌లో ఏ ఆస్పత్రి ప్రాంగణంలోకైనా రాజ్య సాయుధ బలగాలు వెళ్లకుండా నిషేధించాలి.

iv. అంత్యక్రియలు, బహిరంగ సంస్మరణలతో సహా శాంతియుత ప్రజా ప్రదర్శనలన్నిటిపైనా విధించిన నిషేధాన్ని, చట్టవ్యతిరేకమైన కర్ఫ్యూను తక్షణమే ఎత్తివేయాలి.

v. మొబైల్ ఫోన్ సేవల పైన, ఇంటర్నెట్ పైన విధించిన చట్టవ్యతిరేక నిషేధాన్ని వెంటనే ఎత్తివేయాలి.

# కన్నీటి కడలి కల్లోల కాశ్మీరం

***కశ్మీరీ ప్రజలపై భారత సైన్యం సాగిస్తుతున్న హింసను వ్యతిరేకిస్తూ, స్వేచ్ఛను కోరుకుంటున్న ప్రజలను పాలకులు ఉగ్రవాదుల పేరుతో అణచివేస్తున్నారని అంటున్నారు* షేక్ కరీముల్లా**

చుట్టూ మంచు పర్వత శ్రేణులు. పచ్చిక బయళ్లు. కరుగుతున్న మంచు పర్వతాలు. వసంత కాలంలో పచ్చని మైదానాల్లో విరబూసిన పూల చెట్లు తలలూపుతుంటే, విల్లో చెట్లమీద కోయిలలు పాటలు పాడుతుంటాయి. పసుపు పచ్చని పూలతో ఆవాల పంట పొలాల సోయగం, పక్వానికి వచ్చిన యాపిల్ తోటలు, కుంకుమ పూల చెట్ల నుంచి గుబాళించే కమ్మని సువాసనలు వెదజల్లే ఆహ్లాదకరమైన వాతావరణంతో అలరాడే కశ్మీరీ గ్రామీణ ప్రాంతాలు. మధ్య మధ్య చిన్న పిల్లలవలే అటూ ఇటూ తిరిగే టూరిస్టు బస్సులు. వేసవిలో పచ్చగా, శిశిరంలో బంగారు రంగులో ఉండే వరి పొలాలతో కశ్మీరీ లోయ అందాలు ప్రపంచానికే తలమానికం. అందుకే ప్రపంచ నలుమూలల నుంచి పర్యాటకులు ఈ ప్రాంతాన్ని చూడడానికి వస్తూంటారు. పర్యాటక రంగం కశ్మీరుకు ప్రధాన ఆదాయ వనరు. మంచి వ్యవసాయం, వనరులు పుష్కలంగా ఉన్న ప్రాంతం.

ఎంతో విశిష్టమైన సంస్కృతి, సంపద కలిగిన ఈ నేల దశాబ్దాల తరబడి నెత్తురోడుతుంది ఎందుకు? కశ్మీరం నిత్యం మండుతోంది ఎందుకు? ఆర్మీ క్యాంపులతో, పోలీసు, భద్రతా బలగాల పహారా నడుమ నిత్యం అప్రకటిత కర్ఫ్యూ వాతావరణంతో జన జీవనం అస్తవ్యస్తమవడం అక్కడ మామూలు. మీడియాపై నిషేదాజ్ఞలు, ఇంటర్నెట్, సెల్ ఫోన్లపై నిషేధం నిత్యావసర వస్తువులు కూడా ప్రజలకు అందని స్థితి. ప్రస్తుత తాజా అల్లర్లలో 43 మంది పౌరులు మరణించగా, 2000 మందికి పైగా గాయపడ్డారు. ప్రజలు ఆర్మీ క్యాంపులు ముట్టడించే పరిస్థితులు నెలకొన్నాయి. ప్రస్తుత ఈ స్థితికి కారణం 21 ఏళ్ల నూనూగు మీసాల యౌవ్వనస్తుడు బుర్హాన్ ముజఫర్ వానీ, మరో ఇద్దరు అతని అనుచరులైన స్థానిక కశ్మీరీ యువకులను కాల్చి చంపడం. భద్రతా బలగాలు చంపిన ఈ కశ్మీరీ యువకులు ఆర్మీకి, భారత పాలకులకు ఉగ్రవాదులు, తీవ్రవాదులు అయితే కశ్మీరీ ప్రజలకు హీరోలు అయ్యారు ఎందుకని? 21 ఏళ్ల యువకుడు, విద్యార్థికుడు, సంపన్న కుటుంబం నుంచి వచ్చిన ఈ యువకుడు ఒక ఆకర్షణీయమైన వ్యక్తిగా మారి, చనిపోయి కూడా స్థానిక ప్రజలను, యువతను ఎలా కదిలించగలిగాడు? చదువుకొని సామాజిక మాధ్యమాలను వినియోగించుకుంటూ ఎప్పటికప్పుడు తన భావాలను నిర్భయంగా ప్రకటిస్తూ వచ్చిన బుర్హాన్ కశ్మీర్‌లో నవతరానికి 'పోస్టర్ బాయ్'గా, ఆరాధనీయుడుగా మారాడు. తుపాకి పట్టుకుని ఫోటో ఫోజులిచ్చిన వాడే తప్ప స్వయంగా ఒక్క తూటా కూడా పేల్చి ఎరుగడని, అతను ఏ హింసా చర్యకు పాల్పడి ఉండడని కశ్మీరీలు నమ్ముతున్నారు. అతడు కశ్మీరీల స్వయం నిర్ణయాధికారం, భద్రతా బలగాలను కశ్మీరు నుండి తరిమివేయడం గురించి కశ్మీరీ ప్రజలు పోరాటం చేయాల్సిన అవసరం ఉందని సోషల్ మీడియాలో పోస్ట్ చేయడం అతను చేసిన నేరం. అతని అంత్యక్రియలకు లక్షలాది మంది కదిలి రావడం, ప్రభుత్వానికి, భద్రతా దళాలకు కూడా విస్మయం కలిగించింది. 'నూతన' పోరాట తరానికి మరణానంతరం కూడా 'బుర్హాన్ స్ఫూర్తినివ్వగలడని' ఒమర్ అబ్దుల్లాయే వ్యాఖ్యానించడం గమనార్హం.

బుర్హాన్‌ను అరెస్ట్ చేసే అవకాశం ఉన్నప్పటికీ కావాలనే అతన్ని చంపేశారని కశ్మీర్ ప్రజలు నమ్ముతున్నారు. అక్కడ ఎన్‌కౌంటర్ అంటే సైన్యం పౌరులను అనుమానితుల పేరిట పట్టుకుని చిత్రహింసలు పెట్టి అతి దగ్గర నుండి కాల్చి చంపడమే. ఇక్కడ మానవ హక్కుల ఊసే ఉండదు. దశాబ్దాలుగా కొనసాగుతున్న భారత పాలకుల హింసాత్మక వైఖరిపై కశ్మీరీ ప్రజలకు వ్యతిరేకత ఉంది. అయితే భారత పాలకులు మాత్రం కశ్మీరీల ప్రజాస్వామిక ఆకాంక్షలను ఎప్పుడూ గుర్తించలేదు. అణచివేతే పరిష్కారంగా వ్యవహరిస్తున్న మూలంగా వేలాది మంది ప్రాణాలు పోయాయి. ఒకవైపు సాయుధ బలగాల ప్రత్యేకాధికారాల చట్టం దుర్వినియోగంపై ఈ దేశ ఉన్నత న్యాయస్థానం ఆగ్రహం వ్యక్తం చేసిన రెండు రోజులకే ఈ ఘటనలు జరిగాయంటే పాలకులకు న్యాయస్థానాల పట్ల గౌరవం ఏపాటిదో అర్థం చేసుకోవచ్చు. కశ్మీర్ సమస్యను కేవలం శాంతి భద్రతల కోణంలో చూడరాదని చరిత్ర నిరూపించింది. పరిష్కారం లభించదని చరిత్ర చెపుతుంది. అలా చూడడం వల్ల వచ్చిన పర్యవసానమే ఇది. పలు సున్నిత సమస్యల పరిష్కారంలో ప్రపంచ అనుభవం ఇదే.

ఇప్పుడు అత్యంత క్లిష్టమైన సున్నితమైన కశ్మీరీ ప్రజల సమస్యను

---

vi. పత్రికా స్వేచ్ఛను పునరుద్ధరించాలి. వార్తా సంస్థల పనిలో ఎటువంటి జోక్యాన్నైనా నిషేధించాలి

vii. ఐక్య రాజ్యసమితి మానవ హక్కుల హైకమిషనర్ జమ్ము కశ్మీర్‌లో పర్యటించడానికి అనుమతించాలి. ఏ ఆటంకాలు కల్పించగూడదు. ఐక్యరాజ్యసమితి మానవ హక్కుల మండలి ప్రత్యేక విచారణను అనుమతించాలి.

viii. అంతర్జాతీయ సంస్థలు, ప్రత్యేకంగా ఇప్పటికే జమ్ము కశ్మీర్ నుంచి పని చేస్తున్న ఇంటర్నేషనల్ కమిటీ ఆఫ్ ది రెడ్ క్రాస్, మెడిసిన్స్ సాన్స్ ఫ్రాంటియర్స్, ఆమ్నెస్టీ ఇంటర్నేషనల్ వంటి సంస్థలు నిజనిర్ధారణ జరపడానికి నిరాటంకమైన అనుమతి తక్షణమే ఇవ్వాలి.

ix. రాజ్యబలగాలు పౌరుల మీద, వైద్య సేవల మీద చేసిన హింసకు సంబంధించి ప్రతి ఒక్క ఘటన పైనా తక్షణమే క్రిమినల్ కేసులు నమోదు చేయాలి. ఆ కేసుల వివరాలను బహిరంగంగా ప్రజల ముందు ఉంచి పరిశోధన ప్రారంభించాలి.

x. హింసాకాండ బాధితులకు తక్షణమే నష్టపరిహారాలు చెల్లించాలి. వీ

అమూలాగ్రంగా చారిత్రక దృక్పథం నుంచి చూద్దాం. రెండో ప్రపంచ యుద్ధానంతరం సామ్రాజ్యవాదం తన రూపం మార్చుకుని, పెట్టుబడిగా మారి మూడో ప్రపంచ దేశాల ప్రజలను, వనరులను, కొల్లగొట్టే విధానం రూపొందించుకుంది. దీనికి వారు పెట్టుకున్న ముద్దు పేరు 'నూతన ఆర్థిక విధానం', 'అభివృద్ధి' అనే పేర్లతో ముందుకొచ్చింది. అయితే ప్రజలు ప్రశ్నించకుండా, ఏకమై ఉద్యమించకుండా మతాన్ని, మత విద్వేషాన్ని ఉపయోగించుకుంటున్నది. దీనికి మతోన్మాద శక్తులు వారి స్వలాభం కోసం పూర్తిగా సహకరిస్తూ దేశాన్ని వల్లకాడుగా మారుస్తున్నారు. సామ్రాజ్యవాద దురాశకు మతోన్మాదానికి మధ్య ఏర్పడ్డ ఈ ముడిలో కశ్మీర్ ప్రజలు చిక్కుకున్నారు. కశ్మీర్ ప్రజలది విషాదకరమైన, వేదనా భరితమైన ఒక సుదీర్ఘ అణచివేత కథ.

ప్రస్తుతం కశ్మీర్ ప్రజలు తుపాకి మొనమీద నిలబడి ఉన్నారు. 69 సంవత్సరాల తరువాత కూడా నేటికి అక్కడ ఇంకా తుపాకులు మోగుతూనే ఉన్నాయి. ప్రజాస్వామ్యం కనుచూపు మేరలో కనిపించడం లేదు. బ్రిటిష్‌వాడు మనకు వదిలి పోయిన సమస్యల్లో కశ్మీర్ ప్రధానమైనది. 1947లో దేశ విభజన సందర్భంలో 500 పైగా ఉన్న స్వతంత్ర సంస్థానాలకు తమ తమ ఇష్టానుసారం తమ భవిష్యత్తు నిర్మించుకునే అవకాశం కల్పించారు. దేశ విభజన అనివార్యమై పాకిస్తాన్ మతం ప్రాతిపదికన, దానికి భిన్నంగా భారతదేశం లౌకిక రాజ్య విధానాన్ని ఎంచుకుంది. ఈ రెండు దేశాలలో ఏ దేశంలో నైనా చేరడానికి లేదా స్వతంత్ర దేశంగా ఉండడానికి సంస్థానాలకు అవకాశం ఇచ్చారు. సర్దార్ పటేల్ చొరవతో సంస్థానాలు చాలా వరకు భారతదేశంలో విలీనం కాగా, కశ్మీర్, హైదరాబాద్, జునాగడ్‌లు విలీనం కాలేదు. జునాగడ్‌ను పటేల్ తన చాకచక్యంతో విలీనం చేశారు. కాని మిగతా రెండు సంస్థానాల విషయంలో చాలా చిక్కులు, పరస్పర వైరుధ్యాలు ఏర్పడ్డాయి. హైదరాబాద్ విషయంలో రాజు ముస్లిం మతానికి చెందితే పాలిత ప్రజలు హిందువులు. కానీ కశ్మీర్ విషయంలో రాజు హిందువు పాలిత ప్రజలు ముస్లింలు. అయితే వీటి విలీనానికి రాజు అభిప్రాయమా లేదా ప్రజాభీష్టం కీలకమా అని ధర్మ సందేహం ఉత్పన్నమైనది.

భారత ప్రభుత్వం హైదరాబాద్ విషయంలో ప్రజల అభిప్రాయాన్ని, కశ్మీర్ విషయంలో రాజు అభీష్టాన్ని పరిగణలోకి తీసుకోవడంతో చారిత్రకంగా దీనిని న్యాయబద్ధమైన విలీన పద్ధతిగా గుర్తించడం కష్టం. హైదరాబాద్ రాజ్యంలో అప్పుడు కమ్యూనిస్టు పార్టీ భూస్వామ్యానికి వ్యతిరేకంగా పోరాటం చేస్తూ ఉంది. అలాగే భారతదేశంలోని అత్యంత కీలక ప్రాంతాలలో ముస్లింల రాజ్యం లేదా కమ్యూనిస్టు పార్టీ పాలన ఏర్పడడం ఇష్టం లేని భారత ప్రభుత్వం సైనిక చర్యల ద్వారా ఈ ప్రాంతాన్ని లోబరుచుకుంది. కశ్మీర్ విషయంలో రాజు హరిసింగ్‌తో ఒప్పందం చెసుకుంది. ఒప్పందంలో భాగంగా కశ్మీర్ ఒక స్వతంత్ర ప్రతిపత్తిగల రాష్ట్ర హోదా కలిగి ఉంటుందని కేవలం విదేశీ వ్యవహారాలు, రక్షణ శాఖ, కరెన్సీ, టెలికమ్యునికేషన్స్ శాఖలు మాత్రమే భారత ప్రభుత్వ ఆధీనంలో ఉంటాయి అని ఒప్పందం చేసుకుని రాజ్యాంగంలో పొందుపరిచారు (371 ఆర్టికల్). అలాగే ఈ ఒప్పందంలో భాగంగా కశ్మీరుకు సంబంధించి భారత పార్లమెంట్ చేసే చట్టాలు వర్తించవు. ఆ రాష్ట్ర అధినేతకు ప్రధాన మంత్రి హోదా కల్పించారు. వారికి సంబంధించిన చట్టాలు వాళ్లే చూసుకునే స్వయం పాలనాధికారాన్ని కల్పించారు. ఇది ఒక నిజమైన ఫెడరల్ వ్యవస్థ లక్షణం. ప్రపంచలో అమెరికా, కెనడాలకు ఫెడరల్ వ్యవస్థలు ఉన్నాయి. సోవియట్ యూనియన్ రాజ్యాంగంలో రష్యన్లకు దేశం నుండి విడిచిపోయే వెసులుబాటు ఉంది. అందుకే సోవియట్ యూనియన్‌లో ఎటువంటి రక్తపాతం లేకుండా జాతులు స్వతంత్ర దేశాలుగా విడిపోయాయి.

కెనడాలో కూడా క్యూబెక్ ప్రాంతం విడిపోతామంటే రెండుసార్లు ప్రజాభిప్రాయ సేకరణ చేశారు. అలాగే ఇటీవల స్కాట్‌లాండ్ విషయంలో కూడా ప్లెబిసైట్ నిర్వహించారు. కశ్మీర్‌ను దేశంలోనే ఒక స్వతంత్ర ప్రతిపత్తిగల ప్రాంతంగా అంగీకరించి, ఆ స్వతంత్ర ప్రతిపత్తిని గౌరవించే నిజాయితీని భారత పాలకులు ఆచరణలో చూపకపోవడం వలన సమస్య మరింత జటిలమవుతూ వచ్చింది. ఉదారవాది అనుకున్న నెహ్రూ 1950లలోనే సైన్యాన్ని పంపితే ఇప్పటి దాకా కశ్మీర్‌లో ఆ సైనిక పాలనే అమలులో ఉంది. కశ్మీర్ ప్రజలు భారతదేశంలో భాగంగా ఉండడానికి కశ్మీర్ రాజు ఒడంబడికే కాక కశ్మీర్ ప్రజల సంస్కృతి, లౌకిక పునాదుల మీద కొత్త జాతి రాజ్యాన్ని నిర్మిస్తామన్న నెహ్రూ ఆలోచన రాజ్యాంగ స్ఫూర్తికి దగ్గరగా ఉండడం వలన కశ్మీర్ ప్రజలు భారతదేశంలో ఉండడానికి ప్రోత్సహించాయి. అంటే వీరు నెహ్రూను నమ్మి 1947లో ముస్లిం మతస్థులైన కశ్మీర్ ప్రజలు ముస్లిం దేశం పాకిస్తాన్‌ను కాదని లౌకిక భారతావనిలో చేరడానికి నిర్ణయించుకున్నారు. వారికిచ్చిన భరోసా, హామీలు నెరవేర్చకపోవడంతో అనతి కాలంలో భారత్‌ను విద్వేషిస్తూ కశ్మీర్ లోయ నుండి భారతీయ సైనిక బలగాలు వైదొలగాలని, కశ్మీర్ స్వయం ప్రతిపత్తిని కోరుకోవడం మొదలైంది.

1949లో కశ్మీరీలు భారత్ – పాక్‌లలో ఏ దేశంలో విలీనం కావాలని కోరుకుంటున్నారో లేదా స్వతంత్రంగా ఉండాలని కోరుకుంటున్నారో తెలుపడానికి ఐక్యరాజ్య సమితి ఆధ్వర్యంలో కశ్మీర్‌లో ప్రజాభిప్రాయ సేకరణను ప్రతిపాదించగా నెహ్రూ ఆమోదించారు. తరువాత ఈ హామీని నెహ్రూ మూలన పడవేశారు. అలాగే కశ్మీర్‌ను భారతదేశంలో విలీనం చేస్తూ రాజు హరిసింగ్ భారత ప్రభుత్వంతో చేసుకున్న ఒప్పందంలో కశ్మీర్‌కు చాలా స్వయం ప్రతిపత్తి ఇవ్వబడింది. రక్షణ శాఖ, విదేశీ వ్యవహారాల శాఖ, టెలికమ్యునికేషన్ శాఖ మాత్రమే భారత ప్రభుత్వ ఆధీనంలో ఉండాలి. కశ్మీర్‌కు సొంత రాజ్యాంగం, జెండా ఉండాలి. కశ్మీర్ పాలనకు అధ్యక్షుడు ప్రధాన మంత్రి ఉంటారు. కాని ఈ ఒప్పందం లో అంగీకరించిన స్వయం ప్రతిపత్తి నెమ్మదిగా తుంగలో తొక్కారు.

కశ్మీర్ సింహంగా పిలుచుకునే షేక్ అబ్దుల్లా నేషనల్ కాన్ఫరెన్స్ పార్టీ (ఎన్‌సిపి) స్థాపించి, 1951లో కశ్మీర్ శాసనసభలకు జరిగిన ఎన్నికలలో (ఈ ఎన్నికలలో ఐదు శాతం కంటే తక్కువ మంది ప్రజలు ఓటింగ్‌లో పాల్గొన్నారు) మొత్తం 75 సీట్లను గెల్చుకున్నారు. అందులో 73 స్థానాలకు అసలు పోటీయే లేదు. ఎన్‌సిపి ప్రతినిధులు ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. అపార ప్రజాభిమానంతో గద్దెనెక్కిన అబ్దుల్లా కశ్మీర్‌లో మౌలికమైన భూ సంస్కరణలను అమలు పరచ పూనుకోవడమే కాక, కశ్మీర్ స్వయం ప్రతిపత్తి గురించి మాట్లాడుతుండడంతో మిత్రుడని కూడా చూడకుండా నెహ్రూ షేక్ అబ్దుల్లాను 1953లో జైల్లో పెట్టించాడు. తర్వాత కాలక్రమంలో భారత ప్రభుత్వం కశ్మీరీలా స్వయం ప్రతిపత్తి, ప్రజాస్వామిక హక్కులను కాలరాయడం ప్రారంభమైంది. దీంతో హక్కుల సాధనకై ప్రజలు ఉద్యమిస్తుండడంతో 1958లో నెహ్రూ ప్రభుత్వం ఉదారవాద ప్రజాస్వామ్య చరిత్రలోనే అత్యంత దుర్మార్గమైన అణచివేత చట్టం సాయుధ దళాల ప్రత్యేక అధికారాల చట్టాన్ని తీసుకొచ్చింది.

దాని ప్రకారం ఐదుగురు అంతకంటే ఎక్కువ మంది జనం అనుమతి లేకుండా గుమిగూడితే వారిని అనుమానితులుగా భావించి కాల్చి పారేసే అధికారం సైనికులకు లభించింది. అలాంటి కాల్పులపై ఎలాంటి న్యాయ పరమైన చర్యలు తీసుకునేందుకు వీలుండదు. ఈ చట్టంతో ప్రజా ఉద్యమాలు తీవ్ర అణచివేతకు గురైనాయి. భారత పాలకవర్గాల ప్రయోజనాలకు వ్యతిరేకంగా ఉద్యమిస్తున్న కశ్మీర్, నాగాలాండ్, మిజోరాం, పంజాబ్‌లలో అంటే ముస్లిం, క్రైస్తవ, శిఖ్ఖు లాంటి మైనార్టీ ప్రజలు నివసించే ప్రాంతాలలోనే ఈ చట్టం ఎక్కువగా ప్రయోగించ బడింది. హిందూయేతర ప్రాంతాలలోని ప్రజల భావోద్వేగాలు అణచబడ్డాయి. ఇది నేడు ఎంత వరకు వెళ్లిందంటే ఆర్యుల కంటే ముందు నుంచీ ఈ గడ్డపై ఉంటున్న అమాయక భూమి పుత్రులైన ఆదివాసి ప్రజానీకాన్ని, వారి అటవీ సంస్కృతిని వారి మాతృ భూమి నుంచి నిర్ధాక్షిణ్యంగా తరిమికొట్టే ప్రయత్నాలు జరుగుతున్నాయి.

ఈ నేపథ్యంలో కశ్మీరీల స్వయం నిర్ణయాధికార సాధన లక్ష్యంతో యాసిన్ మాలిక్ నాయకత్వంలో జమ్ము కశ్మీర్ లిబరేషన్ ఫ్రంట్ (జెకెఎల్ఎఫ్) ఏర్పడింది. కశ్మీర్‌లో అత్యంత ప్రజాదరణ పొందిన మిలిటెంట్ సంస్థ అదునుకోసం ఎదురు చూస్తున్న పాకిస్తాన్ ప్రేరేపిత హిజబుల్ మొజాయిద్దీన్, లష్కరేతోయిబా లాంటి కొన్ని మిలిటెంట్ సంస్థలు కూడా ఏర్పడ్డాయి. 1989 నుంచి ఈ గ్రూపుల గెరిల్లాలు చాలా మంది సరిహద్దు అవతల సైనిక శిక్షణ పొంది, తిరిగి వచ్చి కశ్మీర్‌లోని యువతకు సైనిక శిక్షణ ఇస్తుండడంతో పరిస్థితులు చేయి దాటిపోయాయి. యువత హమ్ క్యా చాహతేహై (మనకేం కావాలి 'ఆజాది' స్వాతంత్ర్యం) 'మాకు స్వాతంత్ర్యం కావాలి' అంటూ నినదిస్తూ ఉద్యమించడం ఉధృతమైనది. దీన్ని అణచడానికి 1990లో తీవ్ర ముస్లిం ద్వేషిగా ప్రసిద్ధి పొందిన జగ్ మోహన్‌ను భారత ప్రభుత్వం జమ్ము - కశ్మీర్ గవర్నర్‌గా నియమించింది. ఇతడు వచ్చీ రాగానే స్వతంత్ర కశ్మీర్ కోసం ఉద్యమిస్తున్న వారిపై భారత ప్రభుత్వ సైన్యాలు కాల్పులు జరపడంతో వందల మంది చనిపోయారు. ఈ చర్యలతో 1990 చివరికల్లా కశ్మీర్‌లో భారత వ్యతిరేక తిరుగుబాటు పూర్తి స్థాయికి చేరుకుంది. కశ్మీరీలు 'స్వయం నిర్ణయాధికారం మా జన్మ హక్కు' అని వెలుగెత్తి చాటుతున్నారు. 'కశ్మీర్ గురించి నిజాలు రాయండి. భారత ప్రజలకు వాస్తవాలను తెలపండి. రాజ్యం చేపట్టిన కశ్మీర్ వ్యతిరేక ప్రచారాన్ని నిలవరించండి...' అని ఆల్ పార్టీ హురియత్ కాన్ఫరెన్స్ అధ్యక్షుడు మిర్వాయిజ్ ఉమర్ ఫారుక్ అన్న మాటలివి. ఆయన్ను కలిసిన జర్నలిస్టులతో 'కశ్మీర్ సమస్య మతపరమైనది కాదని, రాజకీయ, ఆర్థిక, మానవీయ సంబంధాలతో ముడిపడిన సమస్య అని.... వాస్తవాలను మరుగు పరిచి, భారతీయులకు కశ్మీరీలు వ్యతిరేకమని ప్రచారం జరుగుతున్నదని, నిత్యం కర్ఫ్యూలతో, హత్యలతో, మానవ హక్కుల ఉల్లంఘనలతో, రాజకీయ వాదుల, మత పెద్దల సామాజిక కార్యకర్తల నిర్బంధంతో కశ్మీర్ చాలా దైన్య స్థితిలో ఉందని తమరు కశ్మీర్ లోయలో స్వేచ్ఛగా పర్యటించి, వాస్తవాలను గుర్తించి నిజాన్ని బయట సమాజానికి తెలియ చేయండి' అని నిరుడు జర్నలిస్టు బృందంతో అన్న మాటలివి. దీన్ని బట్టి కశ్మీరీ ప్రజలు ఎంత ఆవేదనా భరితమైన జీవితాన్ని గడుపుతున్నారో అర్థం చేసుకోవచ్చు. ఇంత జరుగుతున్న ఏ పార్టీ అధికారంలోకి వచ్చినా పాలకుల విధానం మాత్రం తుపాకీతో అణచడమే. ఇంత జరుగుతన్న కేంద్రం ఉదాసీనంగా వ్యవహరిస్తూ ఉంది.

రోమ్ నగరం తగలబడుతుంటే ఫిడేలు వాయించుకుంటూ కూర్చున్న నీరో చక్రవర్తిని తలపిస్తూ మోడీ ఒక్క మాట కూడా మాట్లాడడం లేదు. ఆది నుంచి కశ్మీర్ యువతలో ఇంతగా ఆగ్రహం కట్టలు తెంచుకోవడానికి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అనుసరిస్తున్న నిర్బంధ విధానాలే కారణం.

ఈ అంశంపై రాజ్యసభలో జరిగిన చర్చలో జవాబిస్తూ కేంద్ర హోం మంత్రి రాజ్‌నాథ్‌సింగ్ 'కశ్మీర్‌లో ప్రజాభిప్రాయ సేకరణ ప్రసక్తి లేదని, ఆ డిమాండ్‌కు కాలం చెల్లిందని' మాట్లాడినాడు. తాజాగా జమ్ము కశ్మీర్‌కు మరో 20 కంపెనీల అదనపు బలగాలను పంపినట్లు తెలిపాడు. కశ్మీర్‌లో హింసను ప్రోత్సహిస్తుంది పాక్ అని ఆరోపించాడు. నిజమే వేర్పాటు వాదాన్ని పెంచి పోషించడానికి పొరుగు దేశం పొంచి ఉన్న తరుణంలో వివేకం గల ఏ ప్రభుత్వమైన పరిస్థితిని చక్కదిద్దడానికి ప్రయత్నించాలి. యావత్ భారతజాతి కశ్మీర్ ప్రజలకు అండగా ఉందన్న భరోసా కల్పించినప్పుడే గాయపడిన అక్కడి ప్రజల్లో విశ్వాసం నెలకొంటుంది. ఇలా చేయకుండా పుండు మీద కారం చల్లినట్లు మోడీ పిడిఎఫ్‌తో జతకలిసి ప్రజా వ్యతిరేక విధానాలకు తెరలేపారు. ఎప్పుడో వలస వెళ్లి తిరిగి వచ్చే కశ్మీరీ పండిట్లు, మాజీ సైనికులకు ప్రత్యేక నివాస కాలనీలు నిర్మించే ప్రతిపాదన. ఈ పేరుతో కశ్మీరేతర పారిశ్రామిక వేత్తలు వచ్చి స్థానిక భూములను పెద్దఎత్తున కొనుగోలు చేస్తున్నారు. భూమిని దీర్ఘకాలం లీజుకు తీసుకుంటున్నారు. వీరికి పెద్ద ఎత్తున రాయితీలు ఇస్తున్నారు. స్థానికులు ఇళ్లు, భూమి, మరింత స్వయం ప్రతిపత్తి కోసం పోరాడుతుంటే వారికి ఇప్పటి వరకు ఎటువంటి భూములు కేటాయించ కుండా, బయటి పారిశ్రామిక వేత్తలకు వందల ఎకరాల భూములను అప్పనంగా అప్పచెప్పడాన్ని కశ్మీరీలు తీవ్రంగా వ్యతిరేకిస్తున్నారు.

కశ్మీర్ లోయలో స్థానికులను మైనార్టీలుగా మార్చే విధానమేదో ప్రభుత్వాలు చేస్తున్నాయని వారు భయపడుతున్నారు. కశ్మీరీల స్వయం నిర్ణయాధికారాన్ని గుర్తించకుండా అణచివేతను ప్రయోగించడానికి కారణం కశ్మీర్‌లో చాలా విలువైన సహజ సంపద వనరులు ఉన్నాయి. ఈ సంపదను దేశ, విదేశీ కార్పొరేట్ శక్తులకు అప్ప చెప్పేందుకే ఈ మారణకాండ. ఈ చర్యలను తక్షణం ఆపాలి. కశ్మీర్ యువత ఉగ్రవాదం బాట పట్టడానికి మూల కారణాలను కనుగొనాలి. ఉపాధి మౌలిక సదుపాయాలు కల్పించి, కశ్మీర్ సమగ్రాభివృద్ధికి ప్రభుత్వాలు కృషి చేయాలి. సాయుధ బలగాల ప్రత్యేకాధికార చట్టాన్ని ఎత్తి వేయాలి. పౌరుల హక్కులను కాలరాసే చట్టాలను ఉపసంహరించాలి. కశ్మీర్‌లో శాంతియుత వాతావరణం పునరుద్ధరణకు అవసరమైన చర్యలు తక్షణం చేపట్టాలి. కశ్మీర్ ప్రజల దీర్ఘకాలిక పోరాటాలు, ఆరాటాలను, వారి దుస్థితిని ఈ నేపథ్యం నుండి అవగాహన చేసుకుంటే తప్ప కశ్మీర్ మనకు అర్థం కాదు. భారత ప్రజాస్వామ్య ఫెడరల్ వ్యవస్థ వైఫల్యం ఇక్కడ మనం చూడొచ్చు. భూటకపు సెక్యులరిజాన్ని చూడొచ్చు. గత 7 దశాబ్దాల కశ్మీరీల పోరాట చరిత్రను చూడొచ్చు. ఒక అందమైన ప్రదేశపు ప్రజల ఆరాటాన్ని చూడొచ్చు. ఇందులో రాజ్య హింసను, రాజ్య స్వభావాన్ని చూడవచ్చు. ఒక రాజ్య పరుషత్వాన్ని, అమానుషత్వాన్ని, అహంకారాన్ని ప్రజల కోణంలో చూడవచ్చు. 1990 నుండి అక్కడి ఆకాశం ఎర్రబారింది. పగలు భయంతో, రాత్రులు కర్ఫ్యూలతో కొనసాగుతున్నాయి. ఎంత ప్రమాదంలో కశ్మీరీలు ఉన్నారో మనం అర్థం చేసుకోవాలి. వారికి అండగా నిలవాలి. కశ్మీరీ చరిత్ర, సంస్కృతి, అక్కడి పోరాటాల చరిత్ర నేపథ్యంలో నుండి మనం కశ్మీర్‌ను అర్థం చేసుకోవాలి.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

# గుజరాత్‌లో దళితులపై దాడులు

***గుజరాత్‌లో దళిత, అణగారిన వర్గాలపై ఆధిపత్య కులాల దాడులు తీవ్రమవుతున్నాయంటూ, ఒక గ్రామంలో జరిగిన ఉదంతంపై నిజనిర్ధారణ కమిటీ సమర్పించిన నివేదిక***

మోట సమధియాలా గ్రామం ఉనా పట్టణం నుంచి 20 కిలోమీటర్ల దూరంలో ఉంది. 2016 జూలై 11న ఈ గ్రామంలో చర్మకారుల కులానికి చెందిన యువకులు చనిపోయిన ఆవుల చర్మాలు వలుస్తున్నారు. ఆవులను రక్షించడం అన్న పేరుతో ఈ గ్రామంలో ఆధిపత్య కులానికి చెందిన యువకులు వాళ్లపై దాడి చేశారు.

**ఘటనలోని వాస్తవాలు**

ఫిర్యాదుదారు తండ్రి బాలుభాయ్ సర్వయ్య గుజరాత్‌లో రోహిత్ అని పిలిచే చర్మశుద్ధికారుల కులానికి చెందిన వ్యక్తి. ఎంతో కాలం నుంచి అతడు ఈ కుల ఆధారిత వృత్తి చేస్తూ వస్తున్నాడు. అతడు తమ ఊరి నుంచే కాకుండా, చుట్టుపక్కల ఊళ్ల నుంచి కూడా చనిపోయిన పశువులను తెచ్చి చర్మం ఒలుస్తాడు.

మోట సమధియాలా గ్రామ సర్పంచ్ అయిన, ఆధిపత్య కులానికి చెందిన ప్రఫుల్‌భాయి కోరట్ కొంతకాలంగా బాలుభాయ్‌ని వేధిస్తున్నాడు. బాలుభాయ్ ఇంటిని కూలగొట్టించడానికి అతడు నోటీసులు కూడా జారీచేశాడు. ఆరు నెలల క్రితం వాళ్లిద్దరి మధ్య తీవ్ర వాదులాట కూడా జరిగింది. 'నువ్వు చేస్తున్న వృత్తి వదిలిపెట్టు. నీ చనిపోయిన ఆవులు ఎప్పుడైనా సజీవంగా మారి నువ్వు భారీ మూల్యం చెల్లించాల్సి ఉంటుంది' అని బాలుభాయ్‌ని గ్రామ సర్పంచ్ హెచ్చరించాడు. అయితే బాలుభాయ్ ఈ మాటలను అంతగా పట్టించుకోలేదు.

2016 జులై 11న బాలుభాయ్‌కి బేడియా గ్రామానికి చెందిన నాజాభాయ్ దానాభాయ్ ఆహిర్ నుంచి ఫోను వచ్చింది. తన ఆవుని సింహం దాడి చేసి చంపేసిందని, చనిపోయిన పశువును తీసుకెళ్లమని అతడు చెప్పాడు. బాలుభాయ్ వెళ్లి చనిపోయిన ఆ ఆవుని తెచ్చుకున్నాడు. తన చనిపోయిన ఆవుని తీసుకెళ్లమని మోతిసారాకి చెందిన జీవాభాయ్ కోలీ నుంచి అతడికి మరొక ఫోన్ వచ్చింది. చనిపోయిన ఆవులను తీసుకురావడానికి బాలుభాయ్ తన కొడుకును పంపించాడు. ఈ చనిపోయిన ఆవులను మోట సమధియాలాలోని బీడు భూములలోకి చేర్చారు. 2016 జూలై 11న ఉదయం 10 గంటల ప్రాంతంలో దళిత యువకులైన వశ్రం సర్వయ్య, రమేష్ సర్వయ్య, బేచర్ సర్వయ్య, అశోక సర్వయ్యలు చనిపోయిన ఆవుల చర్మాలు ఒలుస్తున్నారు.

ఆ సమయంలో ఒక నాలుగు చక్రాల వాహనం వచ్చి వాళ్లు చేస్తున్నది చూసి వెళ్లిపోయింది. కొంతసేపటికి రెండు వాహనాల్లో 30-35 మంది కర్రలు, ఇనప చువ్వలతో వచ్చారు. 'బతికున్న ఆవులను కోస్తున్నారురా, దొంగనాయాళ్లారా' అంటూ వాళ్లు అరవసాగారు. అంతేకాకుండా కులం పేరుతో వాళ్లను తిడుతూ, ఆ నలుగురు దళిత యువకులను కర్రలతో, ఇనుప చువ్వలతో కొట్టసాగారు. అవన్నీ చనిపోయిన అవులేనని వాళ్లు ఎంతగా మొరపెట్టుకున్నా నిందితులు కొట్టటం ఆపలేదు. ఇది చూసిన దేవిపూజక్ కులానికి చెందిన వ్యక్తి బాలుభాయ్ సర్వయ్యకి ఫోన్ చేసి అతడి కొడుకుపై, ఇతర దళిత యువకులపై ఒక పెద్ద గుంపు దాడి చేసి కొడుతోందని చెప్పాడు. దాంతో బాలుభాయ్, అతడి భార్య పరుగు పరుగున అక్కడికి చేరుకున్నారు. తమ కుర్రవాళ్లను కొట్టవద్దని వేడుకున్నారు.

దాడికి వచ్చిన వాళ్లు ఆ మాటలు వినిపించుకోకుండా గంటన్నరసేపు నలుగురు దళిత యువకులను కొడుతూనే ఉన్నారు. ఆ తరువాత వాళ్ల చొక్కాలు ఊడదీయించి బలవంతంగా వాహనంలోకి ఎక్కించారు. బాలుభాయ్ కూడా వాహనంలోకి ఎక్కడానికి ప్రయత్నించాడు కానీ అతడిని ఇనుప చువ్వతో కొట్టడంతో అతడు కిందపడిపోయాడు. అతడిని కాపాడడానికి ప్రయత్నించిన అతడి భార్యని కూడా వాళ్లు కొట్టారు. దాడి చేసిన వాళ్లు నలుగురు దళిత యువకులను ఉనా పట్టణంవైపు తీసుకెళుతున్నారు. దారిలో వాళ్లకు పోలీసు వాహనం ఎదురయింది. వాహనాలను ఆపి పోలీసులు, దాడి చేసిన వాళ్లు మాట్లాడుకున్నారు. నలుగురు దళిత యువకులను ఉనా పట్టణానికి తీసుకెళుతున్నామని దాడి చేసిన వాళ్లు చెప్పారు. ఘటనా స్థలికి వెళుతున్నామని పోలీసులు చెప్పారు. అంటే దీనంతటిలో పోలీసులకు కూడా భాగస్వామ్యం ఉందని అర్థం అవుతోంది.

ఉనా పట్టణం చేరుకున్న తరువాత నలుగురు యువకులను డిడి 03 ఎఫ్ 1294 అన్న రిజిస్ట్రేషన్ నంబరు ఉన్న వాహనానికి వెనకవైపు కట్టేశారు. ఆ కారు వెనకవైపు శివసేన అధ్యక్షులు, గిర్ సోమనాథ్ జిల్లా అని ఉంది. వాళ్లని కట్టేసిన తరువాత మళ్లీ కర్రలతో, ఇనుప చువ్వలతో కొట్టసాగారు. తరువాత ఆ నలుగురు బాధితులను ఉనా బస్‌స్టాండు నుంచి పోలీసు స్టేషనుకి తీసుకెళ్లి పోలీసు లాకప్‌లో ఉంచారు. దాడికి పాల్పడిన వాళ్లు ఈ ఘటననంతటిని వీడియో రికార్డింగు చేశారు.

ఈలోగా ఫిర్యాదు చేసిన బాలుభాయ్‌ని, అతడి భార్యని 108 అంబులెన్స్‌లో చికిత్స నిమిత్తం ఆసుపత్రికి తీసుకెళ్లారు. అయితే వాళ్లని ఉనా పట్టణం కాకుండా గిరి గఢ్డాకి తీసుకెళ్లమని అంబులెన్స్ డ్రైవరుకి పోలీసులు చెప్పారు. కానీ బాలుభాయ్, అతడి భార్య చికిత్స కోసం తమను ఉనా పట్టణానికి తీసుకెళ్లమన్నారు. పోలీసులు వాళ్లని బెదిరించి, దురుసుగా ప్రవర్తించారు.

ఇదే సమయంలో నలుగురు దళిత యువకులను కొడుతున్నారన్న

సంగతి ఉనా నగరంలో తెలిసి ఘటనాస్థలి వద్ద ప్రజలు గుమిగూడ సాగారు. దళితులు అక్కడ చేరటం చూసిన దాడికి పాల్పడినవాళ్లు అక్కడి నుంచి జారుకున్నారు.

దళితుల నుంచి ఒత్తిడి పెరగడంతో సాయంత్రం పొద్దుపోయిన తరువాత దాడికి పాల్పడిన ఈ కింది వాళ్ల మీద ఎఫ్ఐఆర్ నమోదు చేశారు:

1. ఉనా బ్లాక్, సిమర్ గ్రామానికి చెందిన ప్రమోద్‌గిరి రమేష్‌గిరి
2. ఉనా పట్టణానికి చెందిన బల్వంత్ ధీరుభాయ్
3. సామ్‌తేర్ గ్రామానికి చెందిన రమేష్ భగవాన్‌భాయ్
4. ఉనా పట్టణం, భీంపారాకి చెందిన రాకేష్
5. ఉనా పట్టణం, భీంపారాకి చెందిన రసిక్
6. గిర్‌గద్దా బ్లాకు, బేడియా గ్రామానికి చెందిన నాగ్‌జి దహ్యాభాయ్ ఆహిర్

**దళితుల కోరికలు**

1. పదవిలో ఉన్న హైకోర్టు న్యాయమూర్తితో క్షుణ్ణంగా విచారణ జరిపించాలి, వెంటనే సిట్ బృందాన్ని ఏర్పాటు చెయ్యాలి.
2. దాడి చేసిన వాళ్లు 30 మందికి పైగా ఉన్నారు కాబట్టి వాళ్లను గుర్తించడానికి 'గుర్తింపు పెరేడ్' నిర్వహించాలి.
3. దాడికి ఉపయోగించిన వాహనం/ వాహనాలను వెంటనే పట్టుకుని పోలీసు కస్టడీలోకి తీసుకోవాలి.
4. గో సంరక్షణ, 'గో రక్షణ సమితి'లను నిషేధించాలి. గో వధను నిషేధిస్తూ రాష్ట్రంలో చట్టం అమలులో ఉంది.
5. మోట సమధియాల గ్రామ సర్పంచ్ పైన చట్ట సంబంధ చర్య తీసుకోవాలి.
6. సవరించిన అత్యాచారాల (నిరోధక) చట్టం, 2015 ప్రకారం 60 రోజుల లోపల అభియోగ పత్రం దాఖలు చెయ్యాలి.
7. కేసు విచారణ సమయంలో పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా విశ్వసనీయత ఉన్న న్యాయవాదిని నియమించాలి.
8. ఉనా పోలీసు స్టేషను పోలీసులపై చట్టబద్ధ చర్య తీసుకోవాలి, వాళ్లని కూడా నిందితుల జాబితాలో చేర్చాలి.
9. అనుమానిత పోలీసు అధికారులపై ఐపిసి సెక్షన్ 166 (ఎ) కింద, సవరించిన అత్యాచారాల (నిరోధక) చట్టం, 2015లోని సెక్షన్ 4 లోని 217, 218ల కింద ప్రభుత్వం ఫిర్యాదు నమోదు చెయ్యాలి.
10. నేర విచారణ చట్టంలోని సెక్షన్ 164 కింద బాధితులు, ప్రత్యక్ష సాక్షుల స్టేట్‌మెంట్లు నమోదు చేసుకోవాలి.
11. ముఖ్యమంత్రి సహాయ నిధి నుంచి బాధుతులు ఒక్కొక్కరికి 10 లక్షల రూపాయల నష్ట పరిహారం చెల్లించాలి.

కౌషిక్ పరామర్, డా. నితిన్ గుర్జార్, సుబోధ్ పారమర్, కిరీత్ రాథోడ్, కాంతిభాయ్ పారమర్, జగదీష్ పారమర్, కాంతిభాయ్ మక్వానా, బల్‌దేవ్‌భాయ్ పారమర్‌లతో కూడిన నిజనిర్ధారణ కమిటీ సంఘటన స్థలాన్ని 2016 జులై 17న సందర్శించింది.

ఈ నిజనిర్ధారణ కమిటీ నివేదికను మొట్టమొదట ప్రచురించిన 'ఎ సాంగ్ ఫర్ నెక్స్ట్ దే' అనే వర్డ్‌ప్రెస్ బ్లాగ్ ఇలా రాసింది.

ఈ దారుణ ఘటనని వీడియో రికార్డు చేసి సోషల్ మీడియాలో ఉంచారు. దీంతో ప్రజలలో ఆగ్రహం పెల్లుబికింది. దళితులపై దౌర్జన్యాలకు, హిందుత్వ ఫాసిజానికి వ్యతిరేకంగా రాష్ట్రవ్యాప్తంగా నిరసనలు చెలరేగుతున్నాయి, ప్రజలు ఉద్యమిస్తున్నారు. బ్రాహ్మణవాద వలసవాదం నుంచి, మితవాద ఫాసిస్టు శక్తులనుంచి భారతదేశానికి స్వాతంత్ర్యం సాధించడానికి, అణిచివేతదారులను కూలగొట్టడానికి అణగారిన ప్రజలు తిరుగుబాటు చేస్తున్నారు.

ఈ ఘటన తరువాత నిరసనగా కుల ఆధారితమైన ఈ పనిని వ్యతిరేకిస్తూ దళితులు పశు కళేబరాలను కలెక్టరు కార్యాలయం ముందు పడేశారు. ఈ ఘటన జరిగిన తరువాత ఇప్పటివరకు పది మందికి పైగా దళితులు ఆత్మహత్యా ప్రయత్నం చేశారు. దళితులు ఎంతటి దారుణ పరిస్థితులలో జీవిస్తున్నారో, ఎంతటి నిస్పృహకు లోనై ఉన్నారో ఇది తెలియ చేస్తుంది. గుజరాత్ మోడల్ అసలైన రూపాన్ని ఇది చూపిస్తుంది. రాష్ట్రంలో పెల్లుబుకుతున్న దళిత ఉద్యమంతో ముస్లిం యువ కార్యకర్తలు సంఘీభావాన్ని చాటుతున్నారు. దళిత ఉద్యమంతోటి, దాని విప్లవ స్ఫూర్తితోటి సంఘీభావం వ్యక్తపరుస్తూ జన సంఘర్ష్ మంచ్ నిరసన కార్యక్రమాలు నిర్వహించింది. బాధితుల కుటుంబ సభ్యులు నష్టపరిహారాన్ని తిరస్కరించి న్యాయం, సమానత్వం, గౌరవం కోరుకుంటున్నారు.

గుజరాత్ రాష్ట్రంలో జరగనున్న ఎన్నికలలో ఈ ఘటనను వాడుకోవాలని అనేక పార్లమెంటరీ పార్టీలు ప్రయత్నిస్తున్నాయి. తోడు దొంగల్లా ఉన్న బ్రాహ్మణవాదాన్ని, పెట్టుబడిదారీ విధానాన్ని ఎన్నికల రాజకీయాల ద్వారా కూలగొట్టలేం. అణచివేతకు గురైన వర్గాల మధ్య ఐకమత్యంతో నడిచే విప్లవ ఉద్యమం ద్వారా మాత్రమే సమాజంలో అసలైన మార్పు తీసుకురాగలుగుతాం.

*(https://asongfornextday.wordpress.com/2016/07/21/atrocities-on-dalit-youths-in-una-town-gujarat-fact-finding-report/)*

*(అనువాదం: కె. సురేష్)* వీ

***రచయితలకు సూచన :*** *తక్షణ, సమకాలీన అంశాలపై రచనలు చేసి ఆ సంచికలోనే రావాలనుకొనే రచయితలు 20వ తేదీ లోగా పంపగలిగితేనే మరుసటి నెల సంచిక కోసం పరిశీలించడం సాధ్యమవుతుంది. ఆ తరువాత వచ్చిన రచన, అంశం ఎంత ముఖ్యమైనదైనా పరిశీలించడం, ముద్రణకు సిద్ధం చేయడం అసాధ్యమవుతుంది. రచయితలు గుర్తించగలరు.*

*మరొక పత్రికకు పంపిన, మరొక పత్రిక పరిశీలనలో ఉన్న, మరొక పత్రిక ప్రచురణకు ఆమోదించిన రచనను వీక్షణంకు పంపగూడదు. – సం.*

# ఒక రచయిత పునరుత్థానం

***మేధావులు, రచయితలపై హిందూత్వ ఉన్మాదులు చేస్తున్న భౌతిక, భావజాల పరమైన దాడులతో తీవ్ర ఒత్తిళ్లకు గురవుతున్న రచయితలకు, ఆలోచనాపరులకు మద్రాస్ హైకోర్టు ఇచ్చిన తీర్పు స్ఫూర్తినిస్తుందని అంటున్నారు ఎల్. అరుణ***

*నాకు తెలుసు*
*భూమి తిరుగుతుంది*
*తిరుగుతూనే ఉంటుంది*
*నేను పెరుమాళ్ మురుగన్‌ను*
*నేను బతికే ఉన్నాను*
*కాని నాలోపలి రచయిత చనిపోయాడు*
*నేను ఇంకేమి రాయను...*
*నేను ఇంకేమి మాట్లాడను...*

హిందీ మూలం : ఉజ్వల్ (వారణాసి)

'ఒక రచయితగా పెరుమాళ్ మురుగన్ ఇక చనిపోయాడు. నేను దేవుడను కాను పునరుత్థానం చెందడానికి, పైగా పునర్జన్మపై నాకు నమ్మకం కూడా లేదు. ఇకపై కేవలం ఒక ఉపాధ్యాయుడుగానే మిగిలి పోతాను' అంటూ ఏడాది క్రితం ఎంతో ఆవేదనతో తనకు తానుగా మరణశాసనం రాసుకున్న ఈ రచయిత ఇప్పుడు 2016 జూలై 5న మద్రాస్ హైకోర్టు ఇచ్చిన తీర్పుతో పునరుత్థానం చెందబోతున్నాడు. మద్రాస్ హైకోర్టు పెరుమాళ్ పక్షాన నిలిచింది. 'మళ్లీ కలం అందుకో పెరుమాళ్' అంటూ మద్రాస్ హైకోర్టు విస్పష్టమైన పిలుపునిచ్చి, రచయితగా చనిపోయిన మురుగన్‌లో జీవం పాదుగొల్పినది. ప్రస్తుతం దేశ వ్యాప్తంగా నెలకొన్న అసహన పరిస్థితులు, రచయితలు, మేధావులు, ప్రశ్నించే యువతపై దాడులు మొత్తంగా భారతదేశంలో హిందూత్వ శక్తులు అన్ని ప్రజాస్వామిక సంస్థల మీద, భావజాలం మీద పెద్ద ఎత్తున దాడులు చేస్తున్న తరుణంలో దేశ వ్యాప్తంగా తీవ్ర ఒత్తిళ్లకు లోనవుతున్న రచయితలందరికి ఈ తీర్పు ఒక బలమైన స్ఫూర్తినిచ్చిందనడంలో సందేహం లేదు. ఈ వార్త వినగానే ఒక ఉత్తేజం.... మానసికంగా ఎంతో ఉల్లాసం... వంద ఏనుగుల బలం... ఇంకేముంది పెరుమాళ్ గురించి రాయాలి అనే తలంపుతో నా కలంలో జోష్... ఇక పెరుమాళ్ అయితే 'పువ్వు' అనే చిన్న కవితతో స్పందించాడు. 'ఒక భారీ విస్ఫోటనం తర్వాత... ఇదిగో ఈ చెట్టు మళ్లీ చిగురించింది... వాడిపోయిన ఈ పువ్వు మళ్లీ వికసిస్తుంది... మరింత మెరుస్తూ మరిన్ని పరిమళాలు వెదజల్లుతూ...' అంటూ చిరు కవితతో రాయడం మొదలు పెట్టాడు.

ఆనాడు భూమి గుండ్రంగా ఉందని చెప్పిన కొపర్నికస్, బ్రూనైలను, సోక్రటీస్ లాంటి మేధావులను రాజ్యం దండించడం చరిత్రకు కొత్త కాదు. గత రెండేళ్లుగా మోడీ అధికారంలోకి వచ్చినప్పటి నుండి హిందూత్వ శక్తుల పైశాచిక దాడులు ఎక్కువైనాయి. 2013 ఆగస్టు 20న మహారాష్ట్రకు చెందిన నరేంద్ర దబోల్కర్ అను ప్రముఖ హేతువాద ఉద్యమకారుడ్ని చంపారు. ఇదే మహారాష్ట్రకు చెందిన గోవింద పన్సారే (సిపిఐ నేత) ను కూడా హతమార్చారు. వీరిద్దరు హేతువాద ఉద్యమకారులు. ఈ వరుసలో ప్రముఖ కన్నడ సాహితీ వేత్త, అకాడమీ అవార్డు గ్రహీత, హంపీ విశ్వవిద్యాలయ రిటైర్డ్ వైస్ చాన్సలర్, మూఢ నమ్మకాల వ్యతిరేక ప్రచారకుడు, హేతువాది కల్బుర్గిని 2015 ఆగస్టు 30న హిందూత్వ వాదులు కాల్చి చంపారు. ఈ హత్యా రాజకీయాలు కల్బుర్గి హత్యతో ఆరంభం కాలేదు. ఆయనతో అంతమయ్యేవి కూడా కాదు. గాంధీజీ హత్యతో ఆరంభమై నేటికీ కొనసాగుతున్నాయి. సమాజంలో శాస్త్రీయ దృక్పథంను, వివేచనను కలిగించడం పౌరులందరి బాధ్యత అని భారత రాజ్యాంగంలోని 51ఎ (ఎచ్) అధికరణ చెబుతుంది. ఈ బాధ్యతను గుర్తించి నిర్వర్తిస్తున్నందుకే హిందూత్వ శక్తులు ఈ హత్యలకు తెగబడ్డాయి. సంఘ్‌పరివార్ శక్తులు వాస్తవిక చరిత్రను, శాస్త్రీయ భావాజాలాన్ని, సాహితీ సృజనను ఏమాత్రం సహించవు. మురుగన్ మీద జరిగిన దాడి రాబోయే ఫాసిస్టు ప్రమాదానికి సూచిక. కలం మీద జులుం చరిత్రకు కొత్తకాదు. గత సంవత్సరం ఈ మతోన్మాద శక్తులు తమిళ రచయిత పెరుమాళ్ 'రచయితగా మరణించానని' ఆత్మహత్య ప్రకటన చేసేదాకా వదిలిపెట్టలేదు. ప్రముఖ చరిత్ర కారిణి రొమిల్లా థాపర్ రచనలు తగలబెట్టాలని బిజెపికి చెందిన తమిళనాడు నేత సుబ్రమణ్య స్వామి బహిరంగంగా ప్రకటించాడు. ప్రపంచ ప్రఖ్యాత పాకిస్తాన్ గాయకుడు గులాం అలీఖాన్ పాకిస్తానీ అయిన కారణంగా ముంబాయిలో పాడడానికి వీలు లేదని, ఏర్పాటైన కార్యక్రమం రద్దు చేయించారు. పాకిస్తానీ దౌత్యవేత్త రాసిన పుస్తక ఆవిష్కరణ ముంబాయిలో జరుగుతుంటే ఆ సభలో పాల్గొన్న సుధీంద్ర కులకర్ణి ముఖానికి నల్ల రంగు పూసి అవమానించారు. యుపిలో ఎద్దు మాంసం తిన్నాడనే నెపంతో అఖ్లాక్ అనే ముస్లింను అతని కుటుంబం ముందే దారుణంగా హత్య చేశారు. అలాగే మేధావులు, రచయితలపై ఫాసిస్టు దాడులు జరుగుతున్నాయి. ఢిల్లీ యూనివర్సిటీ ప్రొఫెసర్ సాయిబాబా అరెస్టుతో ప్రారంభమైన దాడులు కొనసాగుతూనే ఉన్నాయి. దీనిని ఖండించినందుకు ప్రముఖ రచయిత్రి, సామాజిక వేత్త అరుంధతీ రాయ్‌ను సైతం కంటెంప్ట్ ఆఫ్ కోర్టు నోటీసులు జారీ చేసిన నేపథ్యంలో భావ ప్రకటన స్వేచ్ఛ నేడు ప్రమాదకరంగా మారింది. ప్రత్యేక తెలంగాణ ఉద్యమంలో చురుగ్గా పాల్గొని తన రచనలతో, ప్రసంగాలతో తెలంగాణలో వాడవాడలా తిరిగి ఉద్యమాన్ని ముందుకు నడిపించిన ఓయు అసిస్టెంట్ ప్రొఫెసర్ కాశీంపై తెలంగాణ ప్రభుత్వం రాజద్రోహం కేసు పెట్టడం అమానుషం. రచయితలపై కుట్ర కేసులు నమోదు చేయడం చరిత్రకు కొత్తకాదు. ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో పార్వతీపురం, సికింద్రాబాద్, రాంనగర్, తిరుపతి, ఔరంగాబాద్ కుట్ర కేసులు ఎంతో మంది రచయితలు చవి చూశారు. ఆ కేసులు కోర్టుల్లో ఏమాత్రం నిలువలేదు. అయినా రాజ్యం కుట్ర కేసులతో రచయితలను వేధించి, రచయితల గొంతును నొక్కి వేయాలని చూస్తుంది. అరచేతిని అడ్డుపెట్టి సూర్యకాంతిని ఆపుదాం అని భ్రమిస్తుంది.

ఇక పెరుమాళ్ మురుగన్ వివాదాస్పద రచన 'మధోరు భగన్' (అర్ధనారీశ్వరుడు) అనగా శివుడు అనే అర్థాన్ని రచయిత తన పరిసరాలలోని స్థానికంగా ఉన్న సామాజిక అంశాలను తీసుకుని రాసినది. ఈ నవల రచయిత అక్కడి సాంఘిక జీవనం, సాహిత్యం, జానపదంలోని ఆధారాలను తీసుకుని అచటి మత విధానాలు, ఆచారాలు స్వతంత్ర్యానికి పూర్వం ఎలా ఉన్నాయో రాశారు. ఇది ఊహాజనితంగా రాసింది కాదు. రచయిత రెండు సంవత్సరాలు పరిశోధన చేసి స్థానిక సాహిత్యం నుండి ఆధారాలు తీసుకుని చరిత్రను నవలగా రాయడం జరిగింది. ఈ నవల 2010లోనే తమిళ భాషలో అచ్చయినది. అప్పుడు సమస్యలు రాలేదు. నాలుగేళ్ల తరువాత 2014లో పెంగ్విన్ సంస్థ ఆంగ్లంలోకి అనువాదం చేసి ప్రచురించడంతో వివాదం చెలరేగింది. ఈ వివాదానికి కారణం రాబోయే తమిళనాడు అసెంబ్లీ ఎన్నికలలో (2016) లబ్ది పొందడానికి జరిగిన రాద్ధాంతం తప్ప మరేమి కాదు. తిరు చెరిగోడ్ అర్ధనారీశ్వరుని దేవాలయాన్ని, తమ స్త్రీలను, దేవుడుని కించపరిచేదిగా ఉందని బిజెపి, ఆర్ఎస్ఎస్ శక్తులు, స్థానిక హిందూ మత సంస్థలైన 'హిందూ మక్కల్ కచ్చి', 'హిందూ మున్నని' అనే సంస్థలు నవల ప్రతులను తగులబెట్టాయి. రచయితలకు బెదిరింపులు, తిట్లు, డెత్ వార్నింగ్‌లు ఇస్తూ వీరంగం వేశాయి. దీంతో రచయిత భయపడి ఆ జిల్లా ఎస్‌పిని కలిసి రక్షణ ఇమ్మని అడిగితే రక్షణ కల్పించకుండా ఊరు వదిలి వెళ్లమని, చెన్నైకి పారిపొమ్మని సలహా ఇచ్చాడు. రచయిత కుటుంబంతో సహా చెన్నైకి మకాం మార్చుకున్నాడు. జిల్లా ప్రభుత్వ యంత్రాంగం వివాదాన్ని పరిష్కరిస్తామని ఒక సమావేశం ఏర్పాటు చేసింది. రచయిత మనస్ఫూర్తిగా పశ్చాత్తాపం పడుతున్నానని రాసిస్తానని ఒప్పుకున్న బలవంతంగా క్షమాపణలు చెప్పించింది. నవలలోని పట్టణం పేరు మార్చాలని, అమ్ముడుపోని కాపీలను వెనుకకు తీసుకోవాలని, ఇకపై సున్నిత అంశాలపై రాయనని చెప్పాలనే అంశాలను చేర్చారు. అభ్యంతరం వ్యక్తం చేసిన రచయితపై ఆగ్రహం వ్యక్తం చేయడంతో విధిలేని స్థితిలో ఇటువంటివి రాయనని ఒప్పుకున్న మురుగన్ 'ఒక రచయితగా చనిపోయానని, నేను దేవునిని కాను గనుక తిరిగి రాలేనని, నాకు పునర్జన్మ మీద నమ్మకం లేదని ఇకముందు ఒక సామాన్య ఉపాధ్యాయునిగా పెరుమాళ్ బతుకుతాడని నన్ను వదిలేయండి' అని ప్రకటించాడు. దీనితో పాతికేళ్ల ఆయన రచన సృజన నెత్తురు కక్కుకుంటూ నేల రాలింది. దేశంలోని భిన్న మతాలు, సంస్కృతుల పైనే కాక చరిత్ర పట్ల, శాస్త్రీయ భావాల పట్ల హిందూ తాలిబాన్ ఫాసిస్టు వైఖరి ఉన్న సంఘ్‌పరివార్ శక్తులు చుట్టుముట్టి రచయిత మీద దాడి చేస్తే అధికారులు, చట్టం కూడా వాటికే అండగా నిలిచిన వేళ ఆ రచయిత మరణించకుండా ఎలా ఉండగలడు? తన భావ ప్రకటన స్వేచ్ఛ, రాజ్యాంగపు హక్కులు హరించబడిన చోట రచయిత ఎలా జీవించగలడు? తన ప్రాణప్రథమైన రచనను చంపుకోవడం నిజంగా ఏ రచయితకైనా ఎంత బాధ? అది మాటలలో వర్ణించలేనిది.

ఈ నేపథ్యంలో కథ మద్రాస్ హైకోర్టుకు చేరింది. కోర్టు పెరుమాళ్ పక్షాన నిలిచి అన్ని కేసులను కొట్టివేసి, 150 పేజీల తీర్పులో న్యాయమూర్తులు విలువైన మంచి అభిప్రాయం వెలబుచ్చారు. 'మీకు పుస్తకం నచ్చకపోతే విసిరిపారేయండి. కొందరికి కొన్ని అంశాలు నచ్చలేదన్న కారణంగా పుస్తకాలు నిషేధిస్తూ పోవడం జరగని పని' అని కోర్టు తేల్చి చెప్పింది. మురుగన్ వివాదాస్పద రచన 'మధోరు బగన్'ను తాము ఎంతగానో ఆస్వాదించామని న్యాయమూర్తులు ఎస్‌కె. కౌల్, పి. సత్యన్నారాయణలు ప్రకటించారు. సాహిత్యాభిరుచులలో తేడాలుంటాయి కనుక ఒకరికి నచ్చింది మరొకరికి నచ్చకపోవచ్చును. అంతేకాని రచనలు చేసే హక్కుకు మాత్రం అవరోధాలు ఉండవు అని న్యాయమూర్తులు ప్రకటించారు. తన మనోభావాలు దెబ్బతీనకూడదని పాఠకుడు అనుకుంటే అది ఎంతో సులభం. పుస్తకం మూసేయడమే అంటూ సల్మాన్ రష్దీ వ్యాఖ్యను న్యాయమూర్తులు ఉటంకించారు. ఒక రచనను ఎలా చూడకూడదో తెలియచెపుతూ న్యాయమూర్తులు చేసిన విశ్లేషణ మరింత చక్కగా ఉంది. ఒక చిత్రకారుడు తన ఆలోచనలన్నింటిని కలగలిపి ఒక చిత్రాన్ని వేసినట్లే, ఒక రచయిత విభిన్నమైన సామాజిక స్థితిగతులను, నేపథ్యాలను, వర్ణనలను పూసగుచ్చి ఒక ఇతి వృత్తాన్ని సృష్టిస్తాడు. అందువల్ల దానిని చదివి, జీర్ణం చేసుకుని, మొత్తంగా స్వీకరించి అర్థం చేసుకోవాలి తప్ప అక్కడక్కడి ప్రస్తావనలనో, వ్యాఖ్యలనో ఏరిపట్టుకుని అశ్లీలమనో, అవమానకరమనో ఊగిపోవడం సముచితం కాదని న్యాయమూర్తులు హితవు పలికారు. 'కళ ఎప్పుడూ పవిత్రంగా ఉండదు, పవిత్రంగా ఉండేది కళ కాదు' అన్న పికాసో వ్యాఖ్యలను గుర్తు చేస్తూ రచయితలు వ్యక్తం చేసిన భావాలను, అవి అక్కడక్కడ రెచ్చగొట్టే విధంగా ఉన్నప్పటికి వాటిని సంపూర్ణంగా అర్థం చేసుకుని ప్రశంసించాలన్నది న్యాయమూర్తుల సలహా. ఈ నవలలోని అశ్లీలం, వివాహేతర సంబంధాలపై ఉన్న విమర్శలను కొట్టి పారేస్తూ వారు మహాభారతాన్ని గుర్తు చేశారు. మురుగన్ ఈ నవల ద్వారా ఏదోకథ చెప్పలేదని సామాజిక వాస్తవాన్ని చెప్పారన్న కోర్టు వ్యాఖ్య రచయితకు విలువైన ప్రశంస.

'మధోర్ బగన్' అంటే అర్ధనారీశ్వరుడు 1940 ప్రాంతాల నాటి సామాజిక జీవితాన్ని, అవసరాల నుంచి పుట్టిన ఒక ఆచారాన్ని, ఆ ఆచారాన్ని పాటించే విషయంలో ఒక కుటుంబం అనుభవించిన సంఘర్షణనూ ఈ నవల ఎత్తిపట్టింది. తమిళనాడులోని నమక్కల్ జిల్లా తిరుచెంగోడు పట్టణంలోని ప్రభుత్వ కళాశాలలో ఉపాధ్యాయుడుగా పనిచేస్తున్న పెరుమాళ్ మురుగన్ అక్కడే పుట్టి పెరిగినవాడు. తిరుచెంగోడు కొండపైన ఉన్న ప్రాచీన అర్ధనారీశ్వర ఆలయంలో ప్రతి ఏటా ఉత్సవాలు జరుగుతాయి. వాటి ముగింపు రోజున రథోత్సవం ఉంటుంది. ఇతివృత్తం ప్రకారం సంతానం కలగని ఆడవారు రథోత్సవం నాటి రాత్రి వేరే పురుషుడితో జతకట్టి సంతానాన్ని పొందే ఆచారం రచయిత కులమైన గౌండర్‌లలో ఉన్నది. నవలలోని ముఖ్య పాత్ర అయిన 'పొన్న' ఈ విధానంలో సంతానవతి కవాలా వద్దా అన్న తీవ్ర కుటుంబ సంఘర్షణకు ఈ నవల అద్దం పడుతుంది. అలనాటి ఈ సామాజిక వాస్తవికతను చిత్రీకరించిన అసలు తమిళ నవల అని, సాహిత్యం కళలు వంటివి పోలీసుల పెత్తనానికి వదిలిపెట్టలేమని న్యాయస్థానం స్పష్టం చేసింది. రచయిత ఇకపై భయపడాల్సిన అవసరం లేదని తన సృజనకు మరిన్ని వెలుగులద్ది విస్తృతమైన సాహిత్యాన్ని ఈ సమాజానికి అందించాలని కోరింది. కాబట్టి పెరుమాళ్ అందుకో అభినందనలు, చేపట్టు నీకలం. ఎందుకంటే సృజన మరణిస్తే సామాజిక చలనం అంతమవుతుంది. మానవ సమూహం స్పందనలు నశించి గడ్డకట్టిపోతుంది. దాడులు, కేసులు ఎదుర్కుంటున్న రచయితలకు సాహితీలోకం, ప్రజలు అండగా నిలబడాలి. సృజనను బతికించుకోవాలి. రచయితలు, మేధావులు, విజ్ఞాన వేత్తలు, శాస్త్ర వేత్తలు, ఆలోచనాపరులు మానవ సమాజాన్ని ప్రగతివైపు నడిపే అభ్యుదయవాదులు, దార్శనికులు, సామాజిక బాధ్యతతో జీవించే సునిశిత బుద్ధిజీవులు, సున్నిత మనస్కులు. వీరికి సంకెళ్లు వేయడమంటే ఆ సమాజానికి ద్రోహం చేయడమే అవుతుంది. వీ

*(రచయిత ఉపాధ్యాయులు)*

# దుగ్గరాజపట్నం ఓడరేవు నిర్వాసితుల సమస్య

***దుగ్గరాజపట్నం ఓడరేవు నిర్వాసితులకు ఓడరేవు నిర్మాణం వల్ల ఏర్పడనున్న ఉపాధి అవకాశాలను కల్పించాలని అంటున్నారు* ఎం.కె. కుమార్**

దుగ్గరాజ పట్నం ఓడరేవుపై కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు చిన్నచూపు చూస్తున్నాయి. వారిచ్చిన వాగ్దానాలు నీటిమూటలుగా తయారయ్యాయి. కేంద్రమంత్రి వెంకయ్యనాయుడు నెల్లూరు జిల్లాకి చెందిన వ్యక్తి అయినప్పటికీ నెల్లూరు జిల్లాకు ఒరగబెట్టిందేమి లేదు. ఈయన హయాంలో పోర్టు అభివృద్ధికి ఒక్క రూపాయి సైతం విడుదల కానీదం లేదు. వైజాగ్ పోర్టుతో సమానంగా దుగ్గరాజపట్నం ఓడరేవును అభివృద్ధి చేసి ఆ ప్రాంతాన్ని వాణిజ్యకేంద్రంగా, పారిశ్రామిక హబ్‌గా తీర్చిదిద్దుతామని సాక్షాత్తు ప్రధానమంత్రి మోడీ పలుమార్లు వాగ్దానం చేశారు. ఆయన మాటలు మీడియాలో వార్తలుగానే మిగిలిపోయాయి. కంపెనీస్ యాక్ట్ 1956 ప్రకారం దుగ్గరాజపట్నం ఓడరేవును నిర్మించ తలపెట్టారు. ఇందులో రాష్ట్ర ప్రభుత్వానికి సమాన పాత్ర ఉంటుందని బైలాస్‌లో పేర్కొన్నారు. చంద్రబాబుకి నూతన రాజధాని మీద ఉన్న మోజు, ఈ పోర్టు మీద లేదు. ఎందుకంటే నూతన రాజధానిలోని రైతుల పచ్చని పంట పొలాలతో అంతర్జాతీయ స్థాయి రియల్‌ఎస్టేట్‌ను చేస్తూ, కాంట్రాక్టులను తమ బంధువులకు, పార్టీ పెద్దలకు ఇచ్చుకుంటున్నారు. ఈ ఓడరేవు నిర్మాణం వల్ల ఎటువంటి ఆర్థిక, స్వప్రయోజనాలు తెదేపాకు సమకూరవు. అందుకే దీనిపై వారు శీతకన్ను వేశారు. మూడు సంవత్సరాల క్రితమే దుగ్గరాజు పట్నం ఓడరేవుకు మొత్తం ఖర్చు 8 వేల కోట్ల రూపాయలుగా అంచనా వేశారు.

దుగ్గరాజపట్నం ఊరికి దగ్గర మొదట ఈ ఓడరేవును నిర్మించాలని తలపెట్టారు. అయితే ఆసియాలోనే అతిపెద్ద ఉప్పునీటి సరస్సైన పులికాట్‌లో కొంతభాగం ఈ ఓడరేవు ఆక్రమిస్తుందని విమర్శలు వచ్చాయి. అలాగే శ్రీహరికోటలోని ఇస్రో నియంత్రణలో ఉన్న కొంత భాగాన్ని ఈ ఓడరేవుకు ఇవ్వాల్సి వస్తుంది. దీంతో పర్యావరణ సమతుల్యత దెబ్బతింటుందని, కేంద్ర పర్యావరణ, అటవీ శాఖలు ఈ ఓడరేవు నిర్మాణానికి అనుమతులు ఇవ్వలేదు. ఈ నేపథ్యంలో ఓడరేవును దుగ్గరాజపట్నం నుండి 20 కిమీ దూరంలో ఉన్న తూపిలిపాలెం గ్రామానికి మార్చారు. దీన్నే ఇప్పుడు దుగ్గరాజపట్నం ఓడరేవుగా పిలుస్తున్నారు. దీని కోసం ప్రభుత్వం 5,028 ఎకరాలను సేకరించాల్సిన అవసరం ఉంది. కొత్త ఓడరేవు ప్రాంతానికి కేంద్ర పర్యావరణ, అటవీశాఖ అనుమతులను సైతం ఇచ్చింది. సున్నితమైన ప్రాంతాలైన పులికాట్‌కు, ఇస్రో కేంద్రానికి ప్రస్తుత నూతన ఓడరేవు ప్రాంతం 120 కిమీ దూరంలో ఉంది. పాతరేవు ఓడరేవు నిర్మాణాన్ని వ్యతిరేకిస్తూ దేశ అత్యున్నత న్యాయస్థానమైన సుప్రీంకోర్టులో వేసిన కేసుకు సంబంధించి, రాష్ట్రప్రభుత్వం తన వాదనను సైతం వినిపించాల్సి ఉంది.

మొత్తం ప్రభుత్వం సేకరించాల్సిన 5,028 ఎకరాల్లో, 2,152 ఎకరాలు ప్రభుత్వ భూములు, 948 ఎకరాలు రిజర్వ్‌ఫారెస్ట్ అధీనంలో ఉన్నాయి. అలాగే 651 ఎకరాలు కమ్యూనిటీ ఫారెస్టు భూములున్నాయి. మిగిలిన భూములను మాత్రమే ప్రభుత్వం స్థానికుల నుండి సేకరించాల్సిన అవసరం ఉంది. నూతన రాజధాని అమరావతి కోసం ప్రభుత్వం సూమారు లక్ష ఎకరాల భూమిని సేకరించింది. ఇందులో 90 శాతం భూములు స్థానిక ప్రజలవే. వీరిని భయభ్రాంతులకు గురిచేసి, ప్రలోభపెట్టి ప్రభుత్వం వారి దగ్గర గుంచి విదేశీ రియల్‌ఎస్టేట్ సంస్థలకు అప్పగించేందుకు దళారీగా పనిచేసింది. దుగ్గరాజపట్నం ఓడరేవు విషయంలో ప్రభుత్వం ఇప్పటివరకు భూసేకరణకు సంబంధించి, పునరావాసానికి సంబంధించి ఎటువంటి రోడ్‌మ్యాపును సిద్ధం చేయలేదు. విభజన చట్టంలోను, శ్రీకృష్ణ కమీషన్ నివేదిక లోను దుగ్గరాజపట్నం ఓడరేవును అభివృద్ధి చేయాలని పేర్కొన్నప్పటికీ, కార్యరూపం దాల్చడం లేదు. మిగిలిన 1200 ఎకరాల భూములకు మాత్రమే పట్టాలున్నాయి. వీరిదగ్గర ఈ భూముల్ని కొనడానికి, ప్రభుత్వానికి 120 కోట్ల రూపాయలు ఖర్చవుతుందని ప్రభుత్వాధికారులు చెప్తున్నారు. ఇందుకోసం 1 గ్రామం, 4 కు గ్రామాలు ఖాళీ చేయాల్సి వస్తుంది. సుమారుగా 200 కుటుంబాలను వేరే ప్రాంతానికి తరలించి, వారికి పునర్‌నివాసాలను ఏర్పాటు చేయాల్సివుంటుందని ప్రభుత్వ అధికారులు పేర్కొంటున్నారు.

దక్షిణ భారతదేశంలోనే అతి కొద్దిమంది ప్రజలు మాత్రమే తమ భూములను కోల్పోతున్న ప్రాజెక్టుల్లో దుగ్గరాజపట్నం ఓడరేవు ఒకటి. ఇంత సులభమైన ప్రక్రియను ప్రభుత్వాలు ఏ మాత్రం పట్టించుకోవడం లేదు. అయితే ప్రభుత్వ అధికారులు పేర్కొన్న వివరాలు స్థానిక ప్రజలను ఒకింత భయ భ్రాంతులకు గురిచేస్తోంది. ఓడరేవుకు కావలసిన 5,028 ఎకరాలతో పాటు భవిష్యత్తులో ఓడరేవు విస్తీర్ణం పెంచాల్సివస్తే, అదనంగా 9,700 ఎకాలను సేకరించాల్సి వస్తుందని పేర్కొంటున్నారు. ఇందులోను 2,400 ఎకరాలు ప్రభుత్వ భూములే ఉన్నాయి. అయితే సుమారు 5 వేల ఎకరాల భూమూలకు ప్రైవేటు పట్టా ఉంది, ఇవి స్థానికుల, రైతుల అధీనంలో ఉన్నాయి. పోర్టు చుట్టూరా పారిశ్రామిక హబ్‌ల ఏర్పాటుకు ఈ భూములను సేరించాల్సి వస్తుందని అధికారులు చెప్తున్నారు.

దుగ్గరాజపట్నం పోర్టు ప్రకటనకే పరిమితమైంది. దీనివల్ల పదివేల ఎకరాలకు పైగా స్థానిక భూములను ప్రభుత్వాలు తమ అధీనంలోకి తీసుకుంటాయని ప్రచారం ఊపందుకోవడంతో రియల్ ఎస్టేట్ చతికిలబడింది. మధ్యతరగతి వర్గం భవిష్యత్తులో మంచి రేటు వస్తుందనే భరోసాతో కొన్న భూములను సగానికి తగ్గించి ఇచ్చినా కొనేవారు లేని పరిస్థితి నెలకొంది. భౌతిక అభివృద్ధి కోసమే పాటుపడే పాలకవర్గాలు వారి నిర్ణయాలను సత్వరమే అమలు పరచకపోవడం వల్ల కూడా అభివృద్ధి, వృద్ధిరేటు దారుణంగా పడిపోతాయి అనేదానికి నిదర్శనమే ఈ పోర్టు. వైజాగ్ తర్వాత ఆంధ్రప్రదేశ్‌లో కేంద్రప్రభుత్వం తమ అధీనంలోకి తీసుకున్న పోర్టు దుగ్గరాజపట్నమే. అందుకే దీనిపై ఆంధ్రరాష్ట్ర ప్రజలు ఎక్కువ ఆశలు పెట్టుకున్నారు. దేశంలో 13 పోర్టులు

కేంద్రం అధీనంలో ఉన్న అతిపెద్ద పోర్టులు. ఒక ఏడాదికి ఈ పోర్టుల ద్వారా 545.67 మిలియన్ టన్నుల కార్గోను కేంద్రం రవాణా చేస్తుంది. అంతేగాక మొత్తం వాణిజ్య ఎగుమతుల్లో 52 శాతం సముద్రమార్గం ద్వారానే జరుగుతుంది. కొత్త పోర్టులను అభివృద్ధి చేయడం ద్వారా 3.13 బిలియన్ టన్నుల కార్గోను 2020 నాటికి రావాణా చేయగలిగే విధంగా కేంద్రం రోడ్ మ్యాప్‌ను తయారు చేసుకుంది. పోర్టు కోసం భూసేకరణ చేయాల్సిన 5 వేల ఎకరాలకు చుట్టుప్రక్కల భూముల రేట్లు మాత్రం ఆకాశాన్నంటుతున్నాయి. రాబోయే పోర్టును చూపి రియల్‌భూమ్ తెప్పించారు. ఎకరాకు 10 లక్షల పలికే భూములన్ని ఇప్పుడు 70 లక్షలకు అడుగుతున్నా ఇవ్వడం లేదని భూబకాసురులు వాపోతున్నారు.

భారదేశంలోనే అతిపొడవైన కోస్టల్ కారిడార్‌ను కల్గిఉన్న రాష్ట్రంగా ఆంధ్రప్రదేశ్ ఖ్యాతికెక్కింది. కాని దీన్ని అభివృద్ధి చేయడంలో అధికారపక్షం నిర్లక్ష్యం వహిస్తోంది. నెల్లూరులోని మరో పోర్టైన కృష్ణపట్నం పోర్టును సివిఆర్ గ్రూప్ నిర్వహిస్తోంది. ఒక ప్రైవేటు సంస్థ నిర్వహిస్తున్న పోర్టుకు పోటీగా దుగ్గరాజపట్నం పోర్టు మారకూడదని కేంద్రం మీనవేషాలు లెక్కిస్తోందని ప్రతిపక్షాలు ఆరోపిస్తున్నాయి. దుగ్గరాజపట్నం బదులు రామాయపట్నం పోర్టును అభివృద్ధి చేస్తామని గతంలో ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌ను పాలించిన పాలకవర్గాలు కేంద్రానికి నివేదించాయి. ఇస్రో దుగ్గరాజపట్నం పోర్టు వల్ల తమ రక్షణకు ఇబ్బంది కలుగుతుందని కేంద్రానికి లేఖ రాయడం వల్ల గతంలో రాష్ట్ర ప్రభుత్వం ఆ విధంగా లేఖ రాయాల్సి వచ్చిందని అధికారులు పేర్కొంటున్నారు. ఇప్పుడు దుగ్గరాజపట్నం పోర్టు ప్రాంతాన్ని తూపిలిపాలెంకు మార్చడం వల్ల ప్రస్తుతం ఎటువంటి ఇబ్బందులు లేవని పేర్కొంటున్నారు.

బోగోలు మండలం, జువ్వలదిన్నెలో షిప్పింగ్ హార్బర్‌ను ప్రభుత్వం నిర్మిస్తుందని కాంగ్రెస్ ప్రభుత్వం గతంలో 2013లో ప్రకటించింది. వెస్ట్‌బెంగాల్, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలకు కాంగ్రెస్ ప్రభుత్వం పోర్టులను హామిఇచ్చింది. ఇందుకోసం 2012-13 ఆర్థిక సంవత్సరంలో 32 ప్రాజెక్టులను డిజైన్ చేసి అందుకు గాను 6,765 కోట్లను ఖర్చుపెట్టడానికి బడ్జెట్‌లో ప్రతిపాదనలు చేయడానికి సంకల్పించారు. దీనివల్ల అదనంగా 136.75 మిలియన్ టన్నుల కార్గోను రవాణా చేయవచ్చు. అందులో భాగంగా మొదటి విడతగా 5 ప్రాజెక్టులను త్వరితగతిన నిర్మించాలని కేంద్ర ప్రభుత్వం కాంగ్రెస్ హయాంలో భావించింది. 48.59 టన్నుల కార్గోరవాణాకోసం ఈ ప్రాజెక్టులు ఉపయోగపడతాయని, అందుకుగాను 2,045.25 కోట్లు ఖర్చువుతుందని కేంద్ర షిప్పింగ్, రవాణా శాఖ అంచనాలను సిద్ధం చేసింది. ఈ మేరకు అప్పటి కేంద్ర షిప్పింగ్ శాఖ మంత్రి జి.కె.వాసన్ లోక్‌సభలో వెల్లడించారు. ముఖ్యంగా దుగ్గరాజపట్నం పోర్టు నిర్మాణానికి సంబంధించిన అన్ని అనుమతులు, బడ్జెట్, భూసేకరణ, పునారావాస చర్యలు 2014 మార్చ్ 31 లోపలే అయిపోవాలని కేంద్రప్రభుత్వం షరతులు విధించింది. అయినా ఆ దిశగా కార్యాచరణ జరుగలేదు.

బ్రిటిష్ హయంలోనే దుగ్గరాజపట్నంలో ఓడరేవు ఉండేది. ఉప్పెనల మూలంగా అది కనుమరుగైంది. ఒకేసారి 40 పెద్ద కార్గో షిప్పులు ఈ పోర్టులో రావాణా చేసుకునే వీలుంది. చెన్నైకి 100 కి.మీ దురంలో ఉండడం వల్ల, ఇక్కడ నుండి బకింగ్‌హామ్ కెనాల్ ద్వారా జల రవాణాను చేసుకోవచ్చు. ఇప్పటికే గూడూరు నుండి చిల్లకూరు మీదుగా దుగ్గరాజపట్నానికి రైల్వేలైను నిర్మాణానికి కేంద్రం నిధులు మంజూరు చేసింది. గూడూరు, నెల్లూరు ప్రాంతాలు త్వరితగతిన పారిశ్రామిక అభివృద్ధి జరగడానికి అవకాశాలు ఏర్పడుతాయి.

ఈ పోర్టు కోసం ఎస్‌పివి మోడల్ క్రేనులను కొనాలని ప్రభుత్వం భావించింది. దీనికి అయ్యేఖర్చులో 74 శాతం కేంద్రం, 26 శాతం రాష్ట్రప్రభుత్వం భరించేవిధంగా ప్రణాళికలు సిద్ధం చేశారు. అయితే ఇది మేజర్ పోర్ట్ ట్రస్ట్ యాక్ట్, 1963కు వ్యతిరేకమైనదని బుట్టదాఖలు చేశారు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాన్ని అభివృద్ధి పథంవైపు నడిపించడానికి 5 మేజరు ప్రాజెక్టులు అవసరమని రాష్ట్ర మేధావులు భావిస్తున్నారు. తడ ప్రాంతంలో పారిశ్రామిక హబ్‌ను ఏర్పాటు చేయడం, శ్రీసిటీని చిత్తూరు, నెల్లూరు జిల్లాలకు విస్తరించడం, ఎక్కువ తయారీకేంద్రాలను రాష్ట్రంలో ఏర్పాటు చేయడం, చెన్నై-తిరుపతి, నెల్లూరు -బెంగళూర్ పారిశ్రామిక కారిడార్‌ను ఏర్పాటు చేయడం. దుగ్గరాజపట్నం ఓడరేవును నిర్మించడం. ఈ ప్రణాళికలను రాష్ట్ర ప్రభుత్వం పెడచెవిన పెట్టింది. చెన్నైలో వరదలు వచ్చిన నేపథ్యంలో పెట్టుబడులు ఆంధ్రప్రదేశ్‌కు తరలి రావడానికి సిద్ధంగా ఉన్నా చంద్రబాబు పట్టించుకోవడం లేదనే విమర్శలు వస్తున్నాయి.

నూతనంగా ఏర్పడిన ఆంధ్రప్రదేశ్ అభివృద్ధికి దుగ్గరాజపట్నం పోర్టు ఎంతగానో ఉపయోగ పడుతుందనడంలో సందేహంలేదు. ఈ పోర్టు వల్ల పారిశ్రామికాభివృద్ధి త్వరితగతిన జరుగుతుంది. అయితే స్పష్టమైన, నిర్దిష్టమైన, ప్రజల జీవనోపాధికి అవసరమైన పునరావాస చర్యలు తీసుకోవాల్సిన అవసరం ఉంది. ప్రభుత్వాలే అభివృద్ధి పేరిట ప్రజల భూముల్ని తీసుకుని వారిక తక్కువ స్థాయిలో పునరావాసాన్ని, నష్టపరిహారాన్ని అందిచండంతో పాటు, ఆ అభివృద్ధిలో వారిని భాగస్వాములను చేయడం లేదు. అందుకే పాలకవర్గం చేపట్టే అభివృద్ధి విధానాలను మెజారిటీ ప్రజలు వ్యతిరేకిస్తున్నారు.

వ్యవస్థలో నెలకొన్న ఆర్థిక అసమానతలను పారదోలే విధంగా ప్రభుత్వం అభివృద్ధి కార్యక్రమాలను చేపట్టాలి. దుగ్గరాజపట్నం పోర్టు వల్ల మత్స్యకారులు తమ జీవనోపాధిని కోల్పోకుండా చూడాలి. వారిని అంతర్జాతీయ మార్కెట్‌లో భాగస్వాముల్ని చేయాలి. భూములు కోల్పోతున్న స్థానిక ప్రజలకు ప్రత్యామ్నాయంగా వేరేచోట అంతకు రెండింతలు భూముల్ని ఇవ్వడమే గాక, వాటికి సాగునీరు, సబ్సిడీకి వ్యవసాయ పనిముట్లు, విత్తనాలు ఇచ్చి, వారి దిగుబడిని ప్రభుత్వమే మార్కెట్ చేయాలి. అంతేగాక, భూములు కోల్పోయిన వారికి ఇంటికొక ప్రభుత్వ ఉద్యోగం ఇవ్వాలి. పోర్టువల్ల లక్ష ఉద్యోగాలు వస్తాయని అంచనా వేస్తున్నారు. ఈ పోర్టులో నెల్లూరు జిల్లా వాసులకు ప్రథమస్థానం ఇస్తూ, ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర పౌరులకే లక్ష ఉద్యోగాలను కల్పించాలి. కోస్టల్ కారిడార్‌లో ఏర్పాటు చేసిన, చేయబోతున్న థర్మల్ ప్రాజెక్టులను, న్యూక్లియర్ ప్రాజెక్టులను వెంటనే రద్దు చేయాలి. అయితే 20 వేల మెగావాట్ల థర్మల్ విద్యుత్ కేంద్రాలను ఏర్పాటు చేయడానికి ప్రభుత్వం పెద్ద ఎత్తున చర్యలు చేపడుతోంది. వీటి వల్ల నెల్లూరులో ఇప్పటికే సాయంత్రమైతే నల్లని బూడిద ఇళ్లలోకి చేరుతోంది. తాగేనీటిలోను ఇది పైన తేలుతోంది. దీనివల్ల నెల్లూరు ప్రజలు విషజ్వరాల బారిన పడుతున్నారు.

ఇప్పటికే ఈ థర్మల్ విద్యుత్ కేంద్రాలపై ప్రజాసంఘాలు ఐక్యకార్యాచరణను రూపొందించుకుని పోరాటం చేస్తున్నారు. అలాగే హైకోర్టులోను ఆ మేరకు వాజ్యం వేశారు. మెజారిటీ ప్రజానీకానికి ఆమోదయోగ్యమైన విధంగా దుగ్గరాజపట్నం పోర్టును నిర్మించి, ఆ అభివృద్ధిలో స్థానికులను భాగస్వాములను చేయాలి. స్థానిక ప్రజల నైపుణ్యాన్ని ఉపయోగించుకునే విధంగా పోర్టు నిర్మాణం జరగాలని ప్రజలు ఆకాంక్షిస్తున్నారు.

*(రచయిత పౌరహక్కుల సంఘం కార్యకర్త)* వీ

# కాలుష్య నగరంగా విశాఖపట్నం

***సహజసిద్ధ అందాలతో, సముద్రంతో ఎంతో ఆరోగ్యవంతమైన విశాఖపట్టణాన్ని పరిశ్రమల పేరుతో పాలకులు కాలుష్య కూపంగా మార్చేస్తున్నారనీ, ఇది ప్రజల ఆరోగ్యాలపై, పర్యావరణంపై తీవ్ర ప్రభావం చూపుతోందనీ అంటున్నారు పి.వి. రమణ***

ఒకప్పుడు విశాఖపట్నం అంటే అత్యంత సుందర నగరమే కాకుండా, పర్యావరణ పరంగా ఆరోగ్యకరమైన వాతావరణంతో విలసిల్లేది. కేవలం పర్యాటకులే కాకుండా వేలాది మంది దేశం నలుమూలల నుండి వివిధ ఆరోగ్య సమస్యలతో ఉన్న వారు విశాఖ వాతావరణంలో కోలుకోవచ్చుననే నమ్మకంతో వచ్చేవారు. కానీ, ఆ పరిస్థితులు పూర్తిగా మారిపోయాయి. నిజానికి విశాఖ నేడు ఒక రోగగ్రస్థ నిలయంగా మారిపోయిందనడంలో అతిశయోక్తి లేదు. విశాఖను కాలుష్యం చాలా వేగంగా కబళిస్తుంది. ఒకప్పుడు కాన్సర్ రోగం గురించి మాటే వినబడని చోట, నేడు నగరంలో కాన్సర్ బాధితులే ఎక్కువగా కనబడుతున్నారు. గుండెపోటు, శ్వాసకోశ వ్యాధులు, కిడ్నీ వ్యాధులు, నరాల వ్యాధులు లాంటి ప్రాణాంతక రోగాలతో ప్రజలు విలవిలలాడుతున్నారు. ప్రమాదకరమైన వివిధ రకాల కాలుష్యాల కలయిక కారణంగా ఎన్ని రకాల వైద్య పరీక్షలు చేయించినా తమ అసలు రోగమేమిటో నిర్ధారణ కాక ప్రజలు తీవ్ర ఆందోళనకు గురౌతున్నారు. ఆసుపత్రులూ, డాక్టర్ల క్లీనిక్‌లూ వేలాది మంది రోగులతో కిటకిటలాడుతున్నాయి.

విశాఖ బౌల్ (లోతైన గిన్నె) ప్రమాణంలో ఉంటుంది. ఈ విధంగా ప్రకృతి సహజంగా చుట్టూ కొండలతో లోతైన ప్రదేశంగా ఏర్పడడం ఒకనాడు నగరానికి గొప్ప వరంగా భావించే వారు. ప్రజలు ఆరోగ్యంగా సంతోషంతో జీవించేవారు. అప్పటికే బౌల్ ఏరియాలో ఉండవలసిన పరిశ్రమల కన్నా ఎక్కువ నిర్మాణమయ్యాయి కాబట్టి ఇక మీదట ఎటువంటి పరిశ్రమల నిర్మాణము జరగకుండా చూసుకోవాలని, లేకపోతే తీవ్ర ప్రమాదానికి దారి తీస్తుందని జాతీయ పర్యావరణ సంస్థలు, అనేక మంది నిపుణులు కొద్ది సంవత్సరాల క్రితమే హెచ్చరించారు. కానీ ఆ హెచ్చరికలను ఏ మాత్రం ఖాతరు చేయకుండా అడ్డూ అదుపూ లేకుండా పెరిగిపోయిన పారిశ్రామిక కాలుష్యం కారణంగా ఈ బౌల్ ఏరియా అత్యంత ప్రమాదకరంగా మారిపోయింది. 2010లో కేంద్ర పర్యావరణ మంత్రిత్వశాఖ విశాఖ కాలుష్యం మీద శాస్త్రవేత్తలూ, పర్యావరణ వాదుల వత్తిడి వల్ల నూతన పరిశ్రమల ఏర్పాటు మీద నిషేధం విధించింది. పలు పరిశ్రమల ఉత్పత్తి మీద కోత సైతం విధించడం జరిగింది. కానీ కార్పొరేట్ శక్తుల వత్తిడితో తిరిగి 2013లో ఆ నిషేధాన్ని ఎత్తివేసింది. 196 చదరపు కిలోమీటర్లు విస్తీర్ణం బౌల్ ఏరియాగా ఉన్న నగరంలోకి కాలుష్యం ఒకసారి వస్తే తిష్ఠవేయడం తప్ప బయటకు పోయే మార్గం ఉండదు. ఏడాదికి తొమ్మిది నెలలు నగరంపైకి నైరుతి దిశ నుంచి గాలులు వీస్తుంటాయి. ఏ దిశ నుంచి గాలులు వీస్తుంటాయో అదే చోట పరిశ్రమలున్నాయి. పోర్టు నుంచి ఎన్టీపీసీ, ఫార్మాసిటీ వరకు ప్రతి దాని నుంచి కాలుష్యం నగరంపైకి వస్తూనే ఉంటుంది. నగరంలోకి కాలుష్యం రావడానికి రెండు కారణాలు. ఒకటి నరవ పాస్. రెండోది సముద్రం. నైరుతి నుంచి వస్తున్న కాలుష్య వాయువులు ఉత్తరంగా పోకుండా నరవపాస్ (కొండలు) అడ్డుకుని నగరంపైకి వచ్చేలా చేస్తోంది. మరోవైపు ఈ కాలుష్య వాయువులు నగరంపైకి వచ్చేలా సముద్రం నుంచి వచ్చే గాలులు ప్రభావితం చేస్తాయి.

పోర్టు నుంచి రెయిన్ కేన్సలింగ్ పరిశ్రమ, హెచ్‌పిసిఎల్, కోరమాండల్ ఫెర్టిలైజర్స్, ఉక్కు కర్మాగారం, ఎన్టీపీసి, ఫార్మాసిటీ వరకు వెదజల్లే ఘన, వాయు కాలుష్యాలు, పరిశ్రమల నుంచి విడుదలయ్యే రకరకాల కాలుష్యాలు. ఇవే కాకుండా భూగర్భ జలాల కాలుష్యం, తాగునీటి కాలుష్యం, శబ్ధ కాలుష్యం, వాహనాల కాలుష్యం, చెత్త కాలుష్యం మొత్తం అన్నీ ప్రాణాంతకంగా మారుతున్నాయి. 2013లో ఇస్రోతోపాటు ఇండియన్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ సైన్సెస్‌లకు చెందిన శాస్త్రవేత్తలు దేశంలో గాలి కాలుష్యం మీద అధ్యయనం నిర్వహించారు. దానిలో తీరప్రాంతాన ఉన్న విశాఖపట్నం అత్యంత కాలుష్య నగరంగా గుర్తించారంటే ప్రమాదం ఏ స్థాయిలో ఉందో విశిదమవుతుంది.

అత్యంత ప్రమాదకరంగా మారి పోర్టు కాలుష్యం నగరంపై కోరలు చాస్తోంది. ఎండల తీవ్రత కారణంగా పోర్టులోని బొగ్గు నిల్వలు పొడిబారి పోతున్నాయి. ఏమాత్రం గాలివీచినా బొగ్గు రాసులపై నుంచి దుమ్ము గాల్లోకి లేచి నగరాన్ని కమ్మేస్తోంది. భారీగా బొగ్గు నిల్వలు పేరుకు పోవడం, బొగ్గు గాల్లోకి లేచిపోకుండా ఉండేందుకు పోర్టు యాజమాన్యం జాగ్రత్తలు పాటించడంలేదు. దీంతో ఇప్పటివరకు వన్‌టౌన్, జ్ఞానాపురం ప్రాంతాలకే పరిమితమైన కాలుష్యం ఇప్పుడు డాబాగార్డెన్స్, దొండపర్తి, అక్కయ్యపాలెం దాటి సీతమ్మధార, బాలయ్యశాస్త్రి లేఅవుట్ వరకూ విస్తరించింది. ద్విచక్ర వాహనాలపై వెళ్లేవారికి ధూళి కంట్లో పడి ఇబ్బందులకు గురిచేస్తుండగా, గాలితోపాటే ధూళి రేణువులు ఇంట్లోకి వచ్చేస్తున్నాయి. కిటికీలు, తలుపులు మూసేసినా సరే ఇళ్లంతా దుమ్ము, ధూళితో నిండిపోతుంది. వన్‌టౌన్, జ్ఞానాపురం ప్రాంతాలలో అయితే తలుపులు వేసుకుని భోజనం చేసినా బొగ్గు ధూళి అన్నం, నీళ్లపై పడుతుండడంతో వాటితోనే తిని, తాగాల్సిన పరిస్థితి నెలకొంది. దీనివల్ల అనేక ఆరోగ్య సమస్యలు చుట్టుముడుతుండగా, చిన్నారుల్లో ఎదుగుదల లోపించడం, తక్కువ శరీర బరువు వంటి సమస్యలు తలెత్తుతున్నాయి.

పోర్టు నుంచి వెలువడే దుమ్ము, ధూళి కోటవీధి, చిలకపేట ప్రాంతవాసుల ప్రాణాలను హరిస్తోందని చెప్పాలి. పోర్టులో బొగ్గుతోపాటు ప్రమాదకరమైన సల్ఫర్, బాక్సైట్, ఇనుప ఖనిజం వంటి వాటిని కూడా డంపింగ్ చేస్తున్నారు. ఆ సమయంలో సరైన జాగ్రత్తలు పాటించకపోవడంతో దుమ్ము, ధూళి కణాలు గాల్లో కలిసిపోతున్నాయి. అదే గాలిని ఆయా ప్రాంతాల ప్రజలు పీల్చుతుండడంతో అనేక రోగాల బారిన పడుతున్నారు. చిన్నపిల్లల నుంచి వృద్ధుల వరకు రక్తహీనత, తక్కువ శరీర బరువు, శ్వాసకోశ సమస్యలతో బాధపడుతున్నారు. అలాగే చర్మ సంబంధిత వ్యాధులు కూడా చుట్టుముడు తున్నాయి. పదేళ్లప్రాయం వుండే పిల్లలు సాధారణంగా 15 నుంచి 20 కిలోల బరువు వుండాల్సి వుంటే కాలుష్యం కారణంగా ఆయా ప్రాంతాల్లో పిల్లలు పది కిలోలకు

మించి వుండడం లేదు. తినే తిండి నుంచి తాగే నీరు వరకూ అంతా బొగ్గు, ఐరన్ ఓర్‌తో కూడివుంటుండడంతో అనారోగ్యం పాలవుతున్నారు. కొంత మంది అయితే తాము పుట్టి పెరిగిన ఇళ్లను వదులుకోలేక.. తమ పిల్లల అనారోగ్యాన్ని చూడలేక ఏదో ఒక చోట హాస్టల్‌లో చేర్పించి చదివించుకుంటున్నారు.

పోర్టు కాలుష్యం కారణంగా విశాఖ పాతనగరం వన్‌టౌన్ పూర్తిగా మసిబారింది. ఈ ప్రాంతంలోని కట్టడాలన్నీ నల్లగా మసకబారి పోయాయి. కొత్తగా కట్టిన భవనాలు సైతం కొద్దిరోజులకే నల్లగా మారిపోతున్నాయి. ఇక్కడ ఏ ఇంటి గోడమీద చెయ్యేసినా నల్లటి బొగ్గు అంటుకుంటుంది. వీధి కుళాయిల నుంచి నీటిని ఇంటికి తెచ్చేలోపే నల్లటి ఐరన్ ఓర్ నీటిపై తేలియాడుతుంటుంది. ఇంటిమీద వాటర్ ట్యాంకులకు కొద్ది క్షణాలు మూత వేయకపోతే చాలు, నీరంతా నల్లగా మారిపోతోంది. ఏదైనా వాహనాన్ని ఒక అరగంట సేపు నిలిపితే దానిపై బొగ్గు, ఐరన్ ఓర్ రేణువులు పడి నల్లగా తయారవుతోంది.

చిన్నపాటి గాలి వేస్తేచాలు.. విశాఖ పాతనగరంతోపాటు జ్ఞానాపురం, డాబాగార్డెన్స్, అల్లిపురం, అక్కయ్యపాలెం, సీతమ్మధార వంటి ప్రాంతాలపై కారుమేఘంలా కాలుష్యం దర్శనమిస్తుంది. పోర్టులో డంప్‌చేసిన బొగ్గు రేణువులు గాల్లో కలిసిపోయి వాహన చోదకులు, కాలినడకన వెళ్లేవారి కంట్లో పడి మంట పుట్టిస్తున్నాయి. ఆస్తమా వంటి ఆరోగ్య సమస్యలున్నవారికి ఎడతెరిపి లేని దగ్గు, తుమ్ములతో ముక్కుపుటాలు మండుతుంటాయి. దుస్తులు మసిబారుతాయి. ముఖంపై చేతిరుమాలు పెట్టి తుడుచుకుంటే నల్లగా అంటుకుపోతుంది.

వేసవిలో పోర్టు నుంచి బొగ్గు ధూళి ప్రమాదకరంగా మారుతుంది. ఏప్రిల్ 20 నుంచి 25 వరకు ప్రమాదకరంగా బొగ్గు ధూళి నగరంపై కమ్మేసిన విషయాన్ని కాలుష్యం కొలిచే యంత్రాలే స్పష్టం చేశాయి. పోర్టు అప్రమత్తమైందని అధికారులు చెప్పిన గత నెల చివరిలో మరోసారి నగరంపై ధూళి కమ్మేసింది. జివిఎంసి వద్ద కాలుష్య నియంత్రణ మండలి యాంబియంట్ ఎయిర్‌క్వాలిటీ ద్వారా నమోదైనా వివరాలు ఈ విషయాన్ని స్పష్టం చేశాయి. పిఎం-10 సాధారణంగా 100 పిపిఎం వరకు ఉండవచ్చు. అయితే మే 20 నుంచి 31 వరకు నమోదైన వివరాలు చూస్తే ... 170 పీపీఎం వరకు పిపిఎం-10 రికార్డుయింది. వరుసగా 11రోజులు పాటు స్థాయికి మించి పిఎం -10 నమోదైన విషయాన్ని అధికారులు గుర్తించారు. మరింత ప్రమాదకరమైన పిఎం 2.5 చూస్తే 60 పిపిఎం వరకు ఉండవచ్చు. కానీ... మే నెలలో 11 రోజులు పరిశీలిస్తే... రెండురోజులు 60 పిపిఎం దాటినా... మిగిలిన రోజులు కూడా 60కు కొంచెం తక్కువగా నమోదైంది. ప్రమాదకరమైన ధూళి కాలుష్యం నగరంపై కమ్మేసిందన్న విషయం దీని ద్వారా రుజువవుతుంది. ఫార్మా సిటీ మరింత చేటు చేస్తోంది. పరవాడలోని ఫార్మా సిటీ, గాజువాకలోని విభిన్న పరిశ్రమల నుండి వెలువడే రసాయనిక వ్యర్థాలు.. వాయు, జల భూ కాలుష్యాలకు కారణమవుతున్నాయి. రసాయన కాలుష్యాన్ని పూర్తిగా శుద్ధి చెయ్యడానికి అయ్యే ఖర్చు చాలా ఎక్కువగా ఉంటుంది. అందువల్ల చాలా పరిశ్రమల్లోని వ్యర్థాలను శుద్ధి చెయ్యకుండానే అక్కడికి చేరువలో ఉన్న వాగుల్లోనికి, నేరుగా సముద్రంలోనికి విడిచిపెడుతున్నారు.

పరవాడ సింహాద్రి థర్మల్ పవర్ ప్లాంట్ వెలుగులు నింపుతోందని సంబరపడుతున్నామే తప్ప చుట్టు ప్రక్కల ఉన్న గ్రామాల్లోని ప్రజల ఆరోగ్యం గురించి పట్టించుకోవడంలేదు. ఇక్కడి బూడిద చెరువు నుంచి వచ్చే బూడిద, అందులోని దాగి ఉండే పాదరసం, సల్ఫర్ డయాక్సైడ్, నైట్రోజన్ ఆక్సైడ్, లెడ్ తదితర భార లోహాల వల్ల శ్వాసకోస వ్యాధులు, క్యాన్సర్లు, చర్మ సంబంధమైన వ్యాధులు, కిడ్నీలు పాడవ్వడం, నరాలకు సంబంధించిన వ్యాధులు రావడం, ఒకటేమిటి ఎన్‌టిపిసి పరిసర ప్రాంతాలన్నీ... అత్యధిక శాతం కాలుష్యమైపోయాయి. శరీరంపై మచ్చలు ఏర్పడుతున్నాయి. ఎన్‌టిపిసి చుట్టుపక్కల శతాబ్దాలుగా ఉన్న ఉప్పు మళ్లు పంటకు అనువుగా లేవు. ఎన్‌టిపిసి, ఫార్మాసిటీల వ్యర్థ జలం వల్ల... తయారైన ఉప్పు... నగరవాసులే్న కాకుండా.. ఈ ఉప్పును వాడే చాలా ప్రాంతాలవారిని బలితీసుకుంటున్నాయి. పిట్టవానిపాలెం గ్రామంలో సమగ్రంగా సర్వే నిర్వహిస్తే ఎన్‌టిపిసి కాలుష్యానికి అక్కడ ప్రజలు ఏ విధంగా బలవుతున్నదీ కనిపిస్తుంది.

ద్వారకానగర్ వద్ద గాలిలో కాలుష్యకారకాల పరిమాణాలను తెలిపే యంత్ర పరికరాల ద్వారా పరిశీలించి ఏప్రిల్ 8, 2016వ తేదీన 'టైమ్స్ ఆఫ్ ఇండియా' దినపత్రికలో ప్రచురించిన వివరాలు పట్టికలో ఉన్నాయి.

నగరంలో లక్షలాది మంది విడుదల చేస్తున్న వ్యర్థ జలాలు అండర్

| కాలుష్య కారకాలు | ఉండవలసిన పరిమితి మి.గ్రా/మీ3 | ప్రస్తుతం ఉన్న స్థాయి మి.గ్రా/మీ3 |
|---|---|---|
| బెంజిన్ | 4.55 | 14.8 |
| కార్బన్ మోనాక్సైడ్ | 0.74 | 1.71 |
| అమ్మోనియా | 7.11 | 10.90 |
| నైట్రోజెన్ ఆక్సైడ్ | 21.67 | 43.30 |
| ఓజోన్ | 33.24 | 65.70 |
| పిఎమ్10 | 76.13 | 146 |
| పిఎమ్2.5 | 37 | 66 |
| సల్ఫర్ ఆక్సైడ్ | 26.53 | 53.50 |
| వ్యర్థ జలాల కాలుష్యం | | |

గ్రౌండ్ డ్రైనేజి నుంచి నేరుగా సముద్రంలోనికి విడుదలవ్వడం వల్ల మత్స్య సంపదకు ముప్పు వాటిల్లుతుంది. అంతేకాక ఆ చేపలు తినే వారి ఆరోగ్యం పాడవుతోంది. వేరొక ప్రక్కన తరుచూ ఈ అండర్ గ్రౌండ్ డ్రైనేజీలు పొంగి ప్రవహించడం, పలు చోట్ల భూగర్భంలోనికి విడుదలవ్వడం వల్ల భూగర్భ జలాలు కలుషితమవుతున్నాయి. దీని ప్రభావం సైతం నగరవాసులపై పడుతోంది.

జివిఎంసి పరిధిలో వున్న ఇళ్లలో ఉత్పత్తి అయ్యే వ్యర్థ జలాలతోపాటు మురుగునీటిని అండర్ గ్రౌండ్ డ్రైనేజీ (యుజిడి) ద్వారా నగరంలో వున్న మూడు మురుగునీటిశుద్ధి కేంద్రాలకు పంపిస్తుంటారు. అక్కడ నీటిని శుద్ధిచేసిన తరువాత సముద్రంలోకి విడిచి పెడుతుంటారు. దీనివల్ల సముద్ర జలాలు కలుషితం కాకుండా చూడడంతోపాటు సముద్ర జీవుల ఉనికిని కాపాడేలా చర్యలు తీసుకోవాలి. అయితే నగరమంతటా యూజీడీ వ్యవస్థ అందుబాటులో లేకపోవడంతో ఆయా ప్రాంతాల్లోని మురుగునీరంతా ఓపెన్‌డ్రెయిన్స్ ద్వారా గెడ్డలో కలుస్తోంది. జివిఎంసి పరిధిలో సుమారు 176 కిలో మీటర్ల పొడుగున 47 గెడ్డలు ఉన్నాయి. నగరవాసుల వ్యర్థ జలాలతోపాటు ఇంట్లో ఉత్పత్తి అయ్యే చెత్తాచెదారాలను కూడా ఇంటిపక్కన ఉండే గెడ్డల్లో పడేస్తుండడంతో అవి చెత్తతో నిండిపోతున్నాయి. గెడ్డలకు ఎలాంటి మెష్‌లు లేకపోవడంతో దీనికి అడ్డుకట్ట వేసేందుకు వీల్లేకుండా పోతుంది. గెడ్డలోని వ్యర్థాలను అడ్డుకునే వ్యవస్థ ఏర్పాటు చేయకపోవడం, సముద్ర తీరంలో అయినా యూజీడీకి అనుసంధానించక పోవడంతో గెడ్డల ద్వారా ప్రవహించే చెత్తాచెదారాలు నేరుగా సముద్రంలో కలిసిపోతున్నాయి. దీనివల్ల సాగర జలాలు

కలుషితమవ్వడంతో పాటు సందర్శకులు తీవ్ర దుర్గంధంతో ఇబ్బందులకు గురవుతున్నారు.

సాధారణంగా మురుగునీటిని సముద్రంలో కలిసేముందు ట్రీట్‌మెంట్ ప్లాంట్‌లోకి మళ్లించి శుద్ధి చేశాకే సముద్రంలోకి విడిచిపెట్టాలి. అయితే దీనిపై జివిఎంసి అధికారులు దృష్టిసారించక పోవడంతో ఆ పరిస్థితి లేకుండాపోయింది. కోస్టల్ బ్యాటరీ నుంచి ఆర్కే బీచ్, లాసన్స్‌బే కాలనీ, తెన్నేటి పార్కు, రుషికొండ వంటి ప్రాంతాల్లో మురుగునీటి గెడ్డలు నేరుగా సముద్రంలో కలుస్తున్నాయి, దీనివల్ల ఆర్కేబీచ్, కోస్టల్ బ్యాటరీ ప్రాంతాల్లో అయితే తీరం ఒడ్డునే చెత్తా చెదారాలు దర్శనమిస్తుండడంతో పాటు తీవ్ర దుర్గంధం వెదజల్లుతోంది. దీనివల్ల బీచ్‌కు వచ్చే సందర్శకులు ముక్కు మూసుకుని గడపాల్సిన దుస్థితి నెలకొంది.

**వాహనాల కాలుష్యం**

నగరంలో దాదాపు 12 లక్షల వాహనాలు రోడ్ల మీద తిరుగుతున్నాయి. పాత స్కూటర్ నుంచి అప్పుడే కొన్న ఖరీదైన కారు వరకు ప్రతి దాని నుంచి పొగ వస్తుంది. ఇలా లక్షల వాహనాల నుంచి రోజూ టన్నులకొద్దీ కాలుష్య కారకాలు నగరంపైకి విరజిమ్ముతున్నాయి. బౌల్ ఏరియా కావడంతో వాహనాలు వదిలే పొగ ఇక్కడే సెటిలవుతుంది.

ప్రజారోగ్యంపై వాయు కాలుష్యం ప్రభావం ఎంతో తీవ్రంగా ఉంటోందని పలువురు నిపుణులు చెబుతున్నారు. గాలిలో వుండే అతి సూక్ష్మ ధూళి కణాలు నేరుగా ఊపిరితిత్తుల్లోకి వెళ్లి స్థిరపడతాయి. దీంతో శ్వాసకోస వ్యాధులతో పాటుగా గుండెపోటుకు దారితీస్తుంది. వాహనాల నుంచి వెలువడే కార్బన్‌మోనాక్సైడ్ హెమోగ్లోబిన్‌లో కలిసి మెదడుకు ఆక్సిజన్ సరఫరాను అడ్డుకునే ప్రమాదం ఉంది. నగరంలో దాదాపు 10 శాతం మంది అస్తమా, పలు శ్వాసకోస వ్యాధుల బాధితులు ఉన్నారని అంచనా. ఈ వ్యాధులతో తాము బాధపడుతున్నట్లుగా తెలియనివారు ఇంకా ఎక్కువేనని వైద్యులు చెబుతున్నారు. క్యాన్సర్ కేసులు పెరగడానికి వాహన కాలుష్యం కూడా ఒక కారణమని వైద్యులు చెబుతున్నారు. ఐదేళ్ల క్రితం కాలుష్య నియంత్రణ సంస్థ చేసిన అధ్యయనంలో పోర్టు, జ్ఞానాపురం వంటి పలు కాలుష్యప్రాంతాల్లో ఎక్కువగా శ్వాసకోస వ్యాధులకు అవసరమైన మందులే మెడికల్ షాపుల్లో అమ్ముడవుతున్నట్లు తేలింది.

**ఊరినే వదిలేస్తామంటున్న తాడి గ్రామ ప్రజలు**

తరతరాల నుండి తాము పుట్టి పెరిగిన గ్రామాలను వదలడానికి సాధారణంగా ఏ ప్రాంత ప్రజలు అంగీకరించరని మనకు తెలుసు. కాని, కేవలం భయంకరమైన ఫార్మాసిటి కాలుష్యం కారణంగా ఇక ఎంత మాత్రమూ గ్రామంలో బ్రతకలేమని తాడి, చిన తాడి, పెద తాడి, తాడి కోలనీలకు చెందిన దాదాపు 4000 మంది ప్రజలు ప్రకటించారు. ఇంకా ఎక్కువ కాలం అక్కడ నివసిస్తే మొత్తం గ్రామమే స్మశానంగా మారిపోతుందని భీతిల్లిపోతున్నారు. చుట్టూ ఉన్న ఫార్మాసిటీ కంపెనీల వరుస ప్రమాదాలతో ఒక వైపు ఆందోళన చెందుతున్న ప్రజలకు మరోవైపు కాలుష్యం సమస్య కూడా తోడవడంతో ప్రజలు ఉక్కిరిబిక్కిరి అవుతున్నారు. ఇప్పటికే భూగర్భ జలాలన్నీ కాలుష్యం కావడంతో తాగు నీటి కోసం పడరాని పాట్లు పడుతున్నారు. దుర్వాసన వల్ల గ్రామంలో ఉండలేని పరిస్థితి నెలకొంది. అనేక మంది వివిధ రోగాలతో పాటు కిడ్నీ వ్యాధులకు కూడా గురైనట్లు తెలిపారు. ఎక్కువగా చర్మ, ఊపిరి తిత్తుల వ్యాధులకు గురౌతున్నారు. గ్రామ ప్రజలందరినీ బలి తీసుకునే బదులు తమ గ్రామాన్ని వేరే చోటుకు తరలించాలని సంవత్సరాల తరబడి ఆ ప్రాంత ప్రజలు ఆందోళనలు కొనసాగిస్తున్నారు. కాని, అధికారుల హామీ ఇచ్చికూడా నేటికీ తరలింపు జరపలేదు.

**ప్రమాదకరమైన చెత్త కాలుష్యం**

విశాఖలో చెత్తను శాస్త్రీయంగా నిర్వహించే నిర్మాణాలు లేకపోవడంతో చాలా చోట్ల బహిరంగ స్థలాల్లో డంప్ చేస్తున్నారు. చెత్తకుప్పలు విపరీతంగా పెరిగిపోవడంతో అనేక చోట్ల వాటిని తగలబెడుతున్నారు. ఇది చాలా ప్రమాదకరమైన కార్యక్రమం. ఎన్విరాన్‌మెంటల్ మేనేజ్‌మెంట్ అండ్ ప్రొటెక్షన్ యాక్ట్ 2002 (ఇఎమ్ఎ) క్లీన్ ఎయిర్ యాక్ట్‌లు చెత్తను కాల్చడాన్ని నిషేధించాయి. అయినా చట్ట విరుద్ధంగా చెత్తను కాలుస్తున్నారు. చెత్తను కాల్చడం వల్ల డియెక్సిన్స్, తదితర 30 రకాల విషపూరిత రసాయన పదార్థాలు వెలువడతాయి. ఇవి తేలికగా గాలిలో కలిసిపోయి చెట్ల మీద, ఆహార పదార్థాల మీద ఆవహిస్తాయి. చెట్ల ఆకులు తిన్న పశువులు తీవ్రమైన అనారోగ్యాలకు గురవుతున్నాయి. చెత్త కాల్చినప్పుడు విడుదలయ్యే పొగ వల్ల చుట్టుపక్కల ప్రాంతాల ప్రజల కళ్లు మండడం, గాలి పీల్చుకోవడానికి కష్టపడడం లాంటి పరిస్థితులు ఏర్పడుతున్నాయి.

బోరవానిపాలెం సమీపంలో కాపులుప్పాడ డంపింగ్ యార్డులో చెత్తను కాల్చడం వలన వస్తున్న విపరీతమైన పొగ సమీప గ్రామాలు, కాలనీలలో ప్రజల ఆరోగ్యంపై తీవ్ర ప్రభావాన్ని చూపుతుంది. సుమారు 100 ఎకరాల స్థలంలో 15 సంవత్సరాల క్రితం ఏర్పాటు చేసిన డంపింగ్‌యార్డుకు నగరంలోని అన్ని ప్రాంతాలనుండి రోజుకు 1000 టన్నుల చెత్తను లారీలలో తరలిస్తున్నారు. ఈ ప్రాంతంలో పేరుకుపోయిన చెత్త సుమారు 10 లక్షల టన్నుల వరకు ఉంటుందని అంచనా. వేల టన్నుల చెత్తను ప్రతిరోజూ తగలబెడుతుంటారు. దీని కారణంగా కాలుష్యంతో నిండిన దట్టమైన నల్లని పొగ యార్డు చుట్టుప్రక్కల ప్రాంతాలలో ఉన్న ప్రజలందరూ పీల్చవలసివస్తుంది. తద్వారా వారికి ఊపిరాడక శ్వాసకోస వ్యాధులకు గురిఅవుతున్నారు. బోరవానిపాలెం, మారికవలస, పరదేశిపాలెం, పాతపరదేశిపాలెం, ఆర్టీసీకోలనీ, రాజీవ్‌గృహకల్పకాలనీ, శారదనగర్ లాంటి అనేక ప్రాంతాల ప్రజలు రోగాల పాలవుతున్నారు.

చెత్త కాల్చడం వల్ల విడుదలయ్యే పోలీ సైక్లిన్ ఆరొమాక్ హైడ్రోకార్బన్స్ వలన కాన్సర్ వ్యాధి వస్తుంది. ఒలాటైల్ ఆర్గానిక్ కాంపౌండ్స్ వలన శ్వాసకోస వ్యాధులు, గొంతు, ముక్కు, కళ్లు మంటలు, కళ్లు తిరగడం, వాంతులు లాంటి సమస్యలు తలెత్తుతాయి. హెక్సాక్లోరో బెంజీన్ వలన నీటిలో చేపలు, ఇతర జంతువులు, పక్షులలో సైతం విభిన్న జబ్బులు సంభవిస్తున్నాయి. కార్బన్ మోనాక్సైడ్ వలన తలనొప్పి, కళ్లు తిరగడం, వాంతులు లాంటి సమస్యలు వస్తాయి. ఇంకా ఇతర రసాయనాలు అల్డే హైడ్స్, క్లోరోఫ్లోరో కార్బన్స్, హెవీమెటల్స్, హైడ్రాలిక్ యాసిడ్, హైడ్రోజన్ సల్ఫైడ్, ఓజోన్, నైట్రోజన్ ఆక్సైడ్స్, పోలి న్యూక్లియర్, అరోమాటిక్ హైడ్రొకార్బన్స్, సల్ఫర్ ఎక్స్ ఆక్సైడ్‌ల వలన తీవ్రమై రోగాలు సంభవించే ప్రమాదం ఉంది. చెత్తనిర్వహణలో సరైన జాగ్రత్తలు తీసుకోకపోవడం వల్లనే సూరత్‌లో మహా భయంకరమైన ప్లేగు వ్యాధి సంభవించింది.

**విద్యుత్తును కూడా వదలని కాలుష్యం**

విశాఖలో మే నెలలో అకస్మాత్తుగా ట్రాన్స్‌ఫార్మర్‌లు విఫలమై కొన్ని గంటలపాటు మొత్తం విద్యుత్తు సరఫరా నిలిచిపోయింది. దీనికి బొగ్గుధూళి, ఫ్లైయాష్, ఇనుప ఖనిజం ధూళీ కలసి విద్యుత్తు తీగలను కలిపే పింగాణీ ఇన్సులేటర్సు మీద చేరుకుని ఒక ముద్దలాగా అంటుకుపోవడంవలన ఈ సంఘటన చోటుచేసుకున్నట్లుగా సంబంధిత

విద్యుత్తు శాఖ అధికారులు పేర్కొన్నారు. దీని కారణంగా దాదాపు 6 నుంచి 7 గంటల పర్యంతం విశాఖలో రైళ్ళు నిలిచిపోయాయి. ఆసుపత్రులలో శస్త్ర చికిత్సలు నిలిచిపోయాయి. ఇలాంటి ప్రమాదాలు భవిష్యత్తులో మరిన్ని జరిగే ప్రమాదం ఉందని నిపుణులు ఆందోళన చెందుతున్నారు.

**రోగాలను పంచుతున్న చెట్లు**

లూథియానాలో ఏడు ఆకుల చెట్ల (ఆల్‌స్టోనియా స్కోలారీస్) ను వేల సంఖ్యలో నాటారు. ఈ చెట్ల వలన ఆ ప్రాంత ప్రజలకు అనేక అంటు రోగాలు అతి వేగంగా దాడి చేస్తున్నటు తేలింది. ఈ చెట్లు పూర్తిగా పెరిగితే మరింత వేగంగా రోగాలను కలుగజేస్తుందని నిపుణులు చెప్తున్నారు. 'ఈ చెట్లకు గాల్ అనే క్రిమి ఆశ్రయించి పెరుగుతుంది. దాని కారణంగానే ఆకులు ఉబ్బిపోయినట్లుగా మారి నష్టాన్ని కలుగజేస్తున్నాయి. అత్యధిక కాలుష్యమున్న ప్రాంతాలలో ఈ చెట్లను నాటుతున్నారు. అటువంటి ప్రాంతాలలో ఈ చెట్లు సులువుగా పెరుగుతాయి. పైగా వీటికి తక్కువ నీరు అవసరం ఉంటుంది. ఈ కారణాల వలన కాలుష్య ప్రాంతాలలో ఈ చెట్లను నాటుతున్నారు. కానీ, వీటి వలన ప్రమాదం పొంచి ఉంది' అని లూథియానా మునిసిపల్ కార్పొరేషన్ ఉద్యానవన శాఖ అధికారి డా. బ్రిజ్ మోహన్ అన్నారు. మొక్కలు నాటే ఉద్యమంలో భాగంగా మన విశాఖలో కూడా ఈ ఏడు ఆకుల మొక్కలను 50 వేల వరకు నాటినట్లు తెలుస్తుంది. వీటి వలన కాలుష్యం తగ్గడమేమో గాని, ప్రజలకు మరిన్ని రోగాలు వచ్చే పరిస్థితులు కనబడుతున్నాయని పర్యావరణ నిపుణులు భావిస్తున్నారు.

**ప్రమాదకరంగా మారిన కాలుష్యం**

2015 జనవరి 26న రిపబ్లిక్ దినోత్సవానికి హాజరైన అమెరికా అధ్యక్షుడు ఒబామాకు ఆ దేశ పత్రికలు 'మిస్టర్ ప్రెసిడెంట్, ఈ ప్రపంచంలోనే అత్యంత కలుషితమైన గాలి ఇక నీ జీవితంలో ఆరు గంటలు హరించబోతుంది' అని హెచ్చరించాయి. దాంతో ఒబామా భారత్‌లో కాలుష్యం బారిన పడకుండా రక్షణ కోసం అమెరికా రాయబార కార్యాలయం వారు 1800 ఎయిర్ ప్యూరిఫైర్స్ కొనుగోలు చేశారు. దీనిని బట్టి మన దేశంలో ప్రధాన నగరాలలో ఎంత ప్రమాదకరమైన గాలి కాలుష్యం వెలువడుతుందో అర్థమవుతుంది.

'సంపన్నులు విలాసవంతమైన కార్లలో తిరుగుతూ పర్యావరణాన్ని కలుషితం చేయడం కుదరదు' అని సుప్రీమ్ కోర్టు 2015 డిసెంబర్‌లో వాఖ్యానించింది. ఢిల్లీలో కాలుష్య నియంత్రణ కోసం డీజల్ కార్ల రిజిస్ట్రేషన్ నిషేధం విధించాలని నేషనల్ గ్రీన్ ట్రిబ్యునల్ అభిప్రాయపడినపుడు, వ్యతిరేకించిన కార్ల కంపెనీలను 'ప్రజల జీవితాలు అపాయంలో ఉన్నప్పటికీ మీరు మాత్రం కార్లు అమ్ముకోవాలనే చూస్తున్నారు' అని ఆ కంపెనీలను విమర్శించడం కూడా జరిగింది.

2010లో ఐక్యరాజ్యసమితి గాలి కాలుష్యం కారణంగా భారతదేశంలో సంవత్సరానికి 6,27,000 మంది క్యాన్సర్, గుండెపోటు, శ్వాసకోస వ్యాధులులాంటి రోగాల కారణంగా మరణిస్తున్నారని ప్రకటించింది.

భారతదేశ ప్రమాణాల ప్రకారం 2.5 మైక్రాన్ల సూక్ష్మ ధూళి రేణువులు (2.5 పిఎం) 40 మైక్రోగ్రాములకు మించరాదు. కాని ప్రపంచ ఆరోగ్యసంస్థ నిర్ధారించిన పరిమితి కన్నా ఢిల్లీలో ఈ రేణువులు పరిమితి 15 రేట్లు ఎక్కువగా ఉన్నట్లు నమోదు అయింది. ప్రపంచవ్యాప్తంగా 2.5 పి.ఎమ్ అత్యధిక స్థాయిలో ఉన్న 20 నగరాలలో భారత్‌లోనే 13 నగరాలు ఉన్నట్లు ప్రపంచ ఆరోగ్యసంస్థ వెల్లడించింది.

ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్స్ ఆధ్వర్యంలో జరిగిన ఒక అధ్యయనం ప్రకారం వచ్చే 5 సంవత్సరాలలో బెంగుళూరు ఒక ' మృత నగరం' గా మారిపోతుందని నిర్ధారించారు. గత 4 దశాబ్దాలుగా 78 శాతం ఆకుపచ్చని వృక్షజాలం తగ్గిపోవడం, 79 శాతం నీటివనరులు తగ్గిపోవడం, భారీపట్టణీకరణలో భాగంగా సాగిన నిర్మాణాల పరిమాణం 525 శాతం వరకు పెరిగిపోవడం, 60 లక్షల వాహనాలు రోడ్లమీద పరిగెడుతూ భారీ కాలుష్యాన్ని వెదజల్లడం, తీవ్రమైన ట్రాఫిక్ సమస్యలు దీనికి ప్రధానకారణాలుగా పేర్కొన్నారు.

ప్రతిరోజు చిన్న చిన్న కారణాలకే ట్రాఫిక్‌జామ్‌లో ప్రజలు తీవ్రమైన ఘర్షణలకు పూనుకోవడం చూస్తుంటే, భవిష్యత్తులో ఒకరినొకరు చంపుకోవడానికి కూడా వెనుకాడని పరిస్థితులు కనబడుతున్నాయని, కర్నాటక పత్రిక డిప్యూటీరెసిడెంట్ ఎడిటర్ కిరణ్‌ప్రకాష్ వాఖ్యానించారు. విశాఖపట్నం కూడా బెంగుళూరు పరిస్థితికి భిన్నంగా లేదు. ఇంకా అదనంగా కాలుష్యం కూడా తోడవడంతో మొత్తం నగరం రోగ గ్రస్థ నగరంలా మారిపోయింది.

విశాఖ నగరంలో కాలుష్య తీవ్రతను తగ్గించడానికి నిర్దిష్ట కాల వ్యవధితో కూడిన కార్యాచరణ ప్రణాళికను రూపొందించాలని 2015 ఫిబ్రవరి 1న పర్యావరణ, అటవీ, శాస్త్ర, సాంకేతిక శాఖలపై ఏర్పాటైన పార్లమెంటరీ కమిటీ ఆదేశించింది. పచ్చని చెట్లతో గ్రీన్ విశాఖగా మార్చేందుకు నగరంలోని అన్ని సంస్థలు, ప్రభుత్వ శాఖలు సమన్వయంతో పనిచేయాలని పేర్కొన్నారు. దీనికి సంబంధించి ఒక ప్రణాళికను తయారు చేసి తమకు నివేదించాలని కమిటీ ఛైర్మన్ అశ్వనీకుమార్ పేర్కొన్నారు. ఈ సందర్భంగా అధికారులతో సమావేశమైన కమిటీ విశాఖలో వాయు, శబ్ద కాలుష్యంపై ప్రధానంగా చర్చించింది. విశాఖ పోర్టు సహా పరిసరాల్లో ఉన్న వివిధ ప్రభుత్వ, ప్రైవేట్‌రంగ పరిశ్రమల నుంచి వెలువడుతున్న కాలుష్యాన్ని నియంత్రించేందుకు చేపట్టాల్సిన చర్యలతో పాటు నగరాన్ని హరితవనంగా రూపొందించడం పై చర్చించింది. టాటా ఆధ్వర్యంలో క్యాన్సర్ ఆసుపత్రి ఏర్పాటు, ప్రకృతి విపత్తులకు సంబంధించిన అంశాలపై చర్చించింది. దేశంలో అత్యంత కాలుష్య నగరాల్లో విశాఖ ఒకటని, దానిని నివారించే బాధ్యత ప్రభుత్వంపై వుందని కమిటీ ఛైర్మన్ పేర్కొన్నారు. నాలుగేళ్ల క్రితం విశాఖలో పర్యటించినప్పుడు నిర్దేశించిన లక్ష్యాలను ఏ మేరకు సాధించారో సమీక్షించేందుకు వచ్చామన్నారు.

2015 సెప్టెంబర్ 29న ప్రభుత్వరంగ సంస్థల ఉన్నతాధికారులతో సమావేశమైన ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు "పరిశ్రమల కాలుష్యం శృతిమించినపుడు, ప్రమాదాలు ఎక్కువగా జరిగినపుడు ప్రజలలో అశాంతి ప్రబలుతుంది. అటువంటి ఇబ్బందులు రాకుండా అన్ని రకాల చర్యలు తీసుకోవాలని" ఆదేశించారు. అదే సమావేశంలో పోర్టు కాలుష్య తీవ్రతను అరికట్టలేకపోయిన పోర్టు ఛైర్మన్‌ను తీవ్రంగా విమర్శించడం జరిగింది. కానీ ఇదంతా డ్రామా అని రుజువు చేస్తూ, ఏ సంస్థయితే మొత్తం విశాఖపట్టణాన్ని కాలుష్యమయం చేయడంలో ప్రధాన భాగస్వామిగా ఉందో ఆ సంస్థ ఛైర్మన్ టి. కృష్ణబాబునే అధ్యక్షుడిగా నియమిస్తూ 'కాలుష్యంపై టాస్క్‌ఫోర్స్'ను 2015 అక్టోబర్ 15న ఏర్పాటు చేయడం విశేషం. ఈ కమిటీలో విశాఖ ఉక్కుకర్మాగారం సిఎమ్‌డి, ఎన్‌టిపిసీ జీమ్, ఎచ్‌పిసిఎల్‌ఇడి, తూర్పు నావికాదళ ప్రతినిధి, కాలుష్య నియంత్రణ మండలి కార్యదర్శి, ఏయు, గీతంయూనివర్శిటీల ప్రతినిధులు పది మంది సభ్యులుగా ఉంటారు. ఈ కమిటీ ప్రతినెలా ఒకసారి సమావేశమై కాలుష్యం తగ్గించడానికి తగిన చర్యలు చేపడుతుందని ప్రకటించారు. ఈ కమిటీలో భాగస్వాములుగా ఉన్న పరిశ్రమలన్నీ కాలుష్యాన్ని కుమ్మరిస్తూ ప్రజల ప్రాణాలను ప్రమాదంలో పడేస్తున్నాయి.

# మల్లన్నసాగర్ మరణ మృదంగం

***ప్రాజెక్టులు కట్టడం ఎంత అవసరమో అక్కడ నిర్వాసితులైన ప్రజల పునరావాసం కూడా అంతే అవసరమనీ, ప్రజల మౌలిక సమస్యలు పరిష్కరించకుంటే వారు ఉద్యమిస్తారనీ అంటున్నారు ఎ. పున్నయ్య***

ప్రపంచ ప్రఖ్యాతి చెందిన మార్క్సిస్టు ఆర్థికవేత్త పాల్ స్వీజీ చెప్పినట్లు 'సమాజం పట్ల శాస్త్రీయ అవగాహనతో చేసిన ఊహ నిజం కాకుండా విఫలం అయినప్పుడు మూల సిద్ధాంతాన్నే పునఃసమీక్షించాల్సిన అవసరం ఉంటుంది'.

నిట్ట నివులునా నిప్పులు కురిసే ఎండకాలమైనా, గత రెండు సంవత్సరాలుగా రాష్ట్రమంతటా కరువు రక్కసి కరళ నృత్యం చేస్తున్నా, గొంతు తడుపుకోవడానికి కోసుల దూరం ప్రయాణంలో నీటి పాయ జాడలేకున్నా అయిదడుగుల లోతులోనే అపార జల సంపదను కడుపులో దాచుకున్న కొండపాక, తొగుట మండలాలు ఇప్పుడు భగ్గున మండుతున్నాయి. ఇంకిపోని జలధారలతో ఏడాదంతా పచ్చని పంట పొలాలతో కళ్లనిండా సంతోషంతో తరతరాలుగా జీవిస్తున్న జనతరంగం ఉబికి వస్తున్న ఎడతెగని కన్నీటి ధారలతో శోక సముద్రాలై ఉప్పొంగుతున్నాయి.

అటేడు తరాలు ఇటేడు తరాలు పద్నాలుగు తరాలుగా ఏర్పరుచుకున్న భూ బంధాన్ని, గోరంత భూమిలేకున్నా కొండంత అనుబంధాన్ని మూటగట్టుకున్న కూలీ కడుపుల్ని, కొంప, గోడు, ఎద్దు, ఎవుసంతో సహా పద్నాలుగు గ్రామాల ప్రజల పచ్చని బతుకుల్ని ఫణంగా పెట్టి ముంచెత్తడానికి కొరమీసం దువ్వుతున్న శ్రీ కొమురెల్లి మల్లన్న సాగర్ ఎక్కడిది? బంగారం లాంటి పంట భూముల్ని ముంచి ప్రజల బతుకుల్ని ఛిద్రం చేసే ఈ ప్రాజెక్టు పాలకుల బంగారు తెలంగాణలో ప్రజాహితం కొరకా, ప్రజాహతం కొరకా, పరిశీలించాల్సిన అవసరం ఉంది.

**మల్లన్నసాగర్ పూర్వాపరాలు**

మూడు, నాలుగు జిల్లాల ప్రయోజనాలతో ముడిపడి ఉందని చెపుతున్న పాలకుల ప్రతిపాదిత ఈ మల్లన్నసాగర్ ప్రాజెక్టు నిర్మాణ ప్రదేశం, 2007లో అప్పటి ప్రభుత్వం ప్రతిపాదించిన ప్రాణహిత - చేవెళ్ల ఎత్తిపోతల పథకానికి అనుసంధానం చేసిన ప్రాంతమే, అదే 1.5 టిఎంసి సామర్థ్యం గల మెదక్ జిల్లా తొగుట మండలంలోని తడకపల్లి చెరువు.

1.5 టిఎంసి సామర్థ్యం గల ఈ చెరువును స్వతంత్ర తెలంగాణలో నూతన పాలకులకు పుట్టిన ఆలోచనగా అభివర్ణించుకుని, సమీప పంట పొలాలను, గ్రామాలను ముంచి ఎకరానికి 50 టిఎంసిల సామర్థ్యం గల మల్లన్నసాగర్‌గా నిర్మించ తలపెట్టారు.

ఈ జల సమాధిలో సమీధలై పోతున్న 14 గ్రామాల ప్రజానీకం కష్టాలు కడతేర్చడానికన్నట్లు ఇంతకు ముందు ఎప్పుడు, ఎవరు ఇవ్వని పరిహారాన్ని ఇస్తున్నట్లు, ఆర్భాటంగా ప్రభుత్వం ప్రకటించుకున్నది. అయితే, ప్రజాహిత ప్రాజెక్టుల నిర్వాసితులు ఎదుర్కొంటున్న బాధల నుండి విముక్తి కలిగించడానికి కేంద్ర ప్రభుత్వం '2013 భూసేకరణ పునరావాసం, పునఃస్థిరీకరణ, న్యాయబద్ధమైన పారదర్శక నష్టపరిహార హక్కు చట్టం'ను తీసుకొచ్చిన విషయాన్ని పాలకులు మరిచిపోరాదు.

కాని బంగారు తెలంగాణ నిర్మించి ప్రజల కలలను పండిస్తామని గొప్పగా చెప్పుకుంటున్న పాలకులు ప్రజా ప్రయోజనాలకు ప్రాధాన్యతనిచ్చే 2013 చట్టానికి తూట్లు పొడిచి, పొరుగు రాష్ట్రం తమ రాజధాని

---

అటువంటి కంపెనీలు సమస్య పరిష్కారానికి పనిచేస్తాయని ఎవరికీ నమ్మకం లేదు. స్థిరమైన ఫలితాలనిచ్చే చర్యలు చేపట్టే బదులు ఈ పరిశ్రమలు ప్రజలను మభ్య పుచ్చడానికి పర్యావరణాన్ని పరిరక్షిస్తామని ప్రకటిస్తూ పిల్లలకు నోట్‌బుక్స్ పంచుతున్నారు. బీచ్ రోడ్‌లో రన్‌లు నిర్వహిస్తున్నారు. కాలుష్యం మీద డ్రాయింగ్ కాంపిటీషన్లు పెడుతున్నారు.

**పరిశ్రమల పక్కన నిలబడే కాలుష్య నియంత్రణా మండలి**

విశాఖ నగరంలోని ఓ స్టార్ హోటల్‌లో ఎపిపిసిబి ఆధ్వర్యాన ఫార్మా కంపెనీల ప్రతినిధులతో నిర్వహించిన సమావేశంలో పరిశ్రమలు వెదజల్లే కాలుష్యానికి కారణం సాంకేతిక పరమైనదేనని ఆంధ్రప్రదేశ్ పొల్యూషన్ కంట్రోల్ బోర్డ్ (ఎపిపిసిబి) ఛైర్మన్ జి. ఫణికుమార్ వెల్లడించారు. ప్రజల ఆరోగ్యాలను కాపాడేందుకు ఫార్మా కంపెనీలు ప్రయత్నించాలని, కాలుష్య నియంత్రణకు తగిన చర్యలు తీసుకోవాలని కోరారు. ఆరోగ్యం బాగోలేక పోతే ఏ విధంగా రోగిని డాక్టర్ చికిత్స చేస్తారో, పొల్యూషన్ కంట్రోల్ బోర్డ్ కూడా ఫార్మా కంపెనీలను అదేవిధంగా పరిగణించాలన్నారు.

కాలుష్య నియంత్రణ మండలి యాజమాన్యాల వద్దకు వైద్య బృందాల్ని పంపి ఆ సంస్థ వద్దే క్లినిక్‌లు ఏర్పాటు చేసేలా చర్యలు తీసుకోవాలని వివరించింది. దీనివల్ల ఆ ప్రాంతంలో నివాసితుల నుంచి వ్యతిరేకత కూడా తగ్గించవచ్చని నిర్ణయించింది. వీటితో పాటు పారిశ్రామిక సంస్థలు మూసివేయాలని నోటీసులు ఇచ్చే కంటే... యాజమాన్యాల వద్దకు వైద్యుల బృందాన్ని పంపి కాలుష్య నివారణకు తీసుకోవాల్సిన చర్యలను వివరించడం మేలని కాలుష్య నియంత్రణ మండలి భావిస్తోంది. దీనిని బట్టి కాలుష్య నియంత్రణా మండలి ఎవరి పక్షాన పనిచేస్తుందో అర్థమవుతుంది.

పర్యావరణ శాస్త్రజ్ఞులు, జాతీయ సంస్థలు హెచ్చరిస్తున్నప్పటికీ కేంద్రంలో మోది, రాష్ట్రంలో చంద్రబాబు నాయుడు అభివృద్ధి పేరుతో కొనసాగిస్తున్న విధానాల ఫలితమే ఈ ప్రమాదకర పరిస్థితులని వేరే చెప్పనక్కర్లేదు. కాలుష్యం తీవ్రంగా పెరిగిపోయి ప్రజల ప్రాణాలు ప్రమాదంలో పడుతున్నా నియంత్రణా చర్యలు చేపట్టే బదులు మరింత కాలుష్యాన్ని పెంచే పరిశ్రమలను ఏర్పాటు చేయడానికి పూనుకుంటున్నారు. దేశం మొత్తంగా కాలుష్య బాధిత ప్రాంతాలు పెరిగి పోతున్నాయి. విశాఖ పూర్తిగా మృత నగరంగా మారకుండా అడ్డుకోవాల్సిన బాధ్యత మనందరిమీదా ఉంది.

*(రచయిత కార్మికోద్యమ నాయకులు)* వీ

నిర్మాణానికి అవసరమైన రోడ్లు, భవనాల కొరకు భూసేకరణ (ప్రొక్యూర్) గాను భూమిని స్వాధీనం చేసుకోవడానికి గాను, ప్రభుత్వ ప్రతినిధిగా కలెక్టర్ నేరుగా రైతులతో లావాదేవీలు జరిపే విధంగా అమలులోకి తెచ్చిన 123 జిఒను తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం వెసులుబాటు ఉండే విధంగా తర్జుమా చేసుకుని నిర్వాసితుల బాధ్యతల నుండి తప్పుకోవడానికి, ప్రజల కలలను కల్లలు చేయడానికే ప్రయత్నిస్తుంది. ఆ రాష్ట్ర ప్రభుత్వం 2013 చట్టంలోని ప్రయోజనాలను నెరవేర్చలేక తెచ్చుకున్న అదే అసంబద్ధ జిఒ నిజప్రతి అయిన జిఒ 123లో భూ నిర్వాసితుల అంశం చర్చించలేదు.

ఈ 123 జిఒ ద్వారా నేరుగా రైతుల నుండి భూ ఒప్పందం చేసుకొని కుదిరిన బేరం మేరకు తక్షణ పరిహారాన్ని ఇవ్వడమే నిర్వాసితులకు గొప్ప పరిహారంగా ప్రకటించుకుంది. ప్రజలు కోరుకుంటే 2013 చట్టాన్ని అమలుపరుస్తామన్న ప్రభుత్వపు ఆర్భాటపు మాటల్లో వాస్తవం లేదని ప్రజలు గుర్తించారు.

**వంచనకు గురిచేసిన అసంబద్ధ జిఒ 123**

ప్రభుత్వం నిర్వాసితుల నోట్లో మట్టికొట్టడానికి 2015 జూలై 30న జిఒ 123ను తీసుకొచ్చింది. దానిని బట్టి ఒకప్పుడు వ్యవసాయం దండుగని భ్రష్టు పట్టించిన చంద్రబాబు విధానాలనే స్వతంత్ర తెలంగాణలో కూడా ఈ ప్రభుత్వం అనుసరిస్తుంది. ఒక వైపు ప్రభుత్వం జిఒ 123 ప్రకారం బాధితులకు పెద్ద ఎత్తున లబ్ది చేకూర్చుతున్నామని చెపుతూనే జిఒ 123కి తీసుకొచ్చిన సవరణల మాటను ఎత్తకపోవడం, ప్రభుత్వ కుటిల నీతికి నిదర్శనం.

ప్రభుత్వం స్వయంగా తానే రూపొందించుకున్న జిఒ 123కి సవరణ చేస్తూ సరిగ్గా 50 రోజుల్లో జిఒ 190, జిఒ 214 పేరుతో బాధిత ప్రజలను. నిపుణులను సంప్రదించడానికి గాని తమ అభ్యంతరాలను చెప్పి నష్టపరిహారం కాని, మరొక దానికి గాని ఆలోచించుకునే అవకాశం ఇవ్వకుండా, కేవలం 7 రోజుల్లో ఒప్పంద పత్రాలపై సంతకాలు చేయించుకోచూడడం అత్యంత దుర్మర్గం.

ఈ నేపథ్యంలో జిఒ 123లోని డొల్లతనాన్ని బయట పెట్టి, 2013 చట్టంలోని ప్రయోజనాలను అటు ప్రతిపక్షాలు ఇటు మేధావులు ప్రజా ప్రయోజనం దృష్ట్యా బహిర్గతపరిచారు. వాస్తవాలను గ్రహించిన నిర్వాసితులు పాలకుల బంగారు ప్రయోజనాల కోసం బలైపోతున్న తమ భవిష్యత్తును అంచనా వేసుకున్నారు. ఏ ప్రాజెక్టు లేకుండా తమ సొంత నీటి వనరులతో రెండు పంటలను పండించుకునే 'నేల తల్లిని నీటిలో ముంచడానికి' ఇష్టపడలేదు. తాము కోల్పోనున్న కొంప, గూడు, భూమి, పుట్రా అన్నింటిని అంచనా వేసుకుని పక్క ప్రాంతాలకు వలస జీవులై వెళ్లే క్రమంలో ప్రభుత్వం ఇచ్చే పరిహారంతో 100 గజాల భూమి కొనలేని స్థితిలో జిఒ 123ను కాదని 2013 చట్టం ప్రకారం కలిగే ప్రయోజనాలను కోరితే, 123 జిఒ ప్రయోజనాలకంటే తక్కువ ప్రయోజనం చేకూరుతుందని ప్రభుత్వం అబద్దపు ప్రచారానికి పూనుకుంది. నిజానికి ప్రభుత్వం ఇచ్చే పరిహారం తమ మూడు సంవత్సరాల పంట విలువలతో సమానమని రైతులు ఆలస్యంగా గ్రహించారు. అప్పటికే అమాయకులైన కొద్ది మంది రైతులు రెవెన్యూ అధికారుల మాయ మాటలకు మోసపోయి ఒప్పంద పత్రాలపై సంతకం చేశారు. మరికొంత మంది స్థానిక అధికార పార్టీ నాయకుల, ప్రజా ప్రతినిధుల అనుచిత ప్రభావానికి బలవంతపు వాతావరణంలో విధిలేక తలవంచారు. ఈ బాధితులు కూడా పైన చెప్పినట్లు బహిర్గత ప్రజా ప్రయోజనాలను గ్రహించి 123 జిఒను కాదని, 2013 చట్టాన్ని కోరడంతో ప్రభుత్వానికి దిక్కుతోచని స్థితి ఏర్పడింది. దీంతో ప్రభుత్వ పెద్దలలో స్పష్టతలేక ఆందోళనపడి ప్రజలను మరింత ఆందోళనకు గురిచేస్తూ ఎలాగైనా అక్కడి రైతులను ఒప్పించేందుకు ఎటువంటి కుటిలనీతికైనా పాల్పడాలనుకుంది. అందులో భాగమే 'పిడికెడు మంది ప్రయోజనం కోసం లక్షల ఎకరాల సాగును వేలాది మంది రైతుల ప్రయోజనాలను నెరవేర్చే ప్రాజెక్టును ఆపలేమని అహంకారంగా ప్రకటించుకుంది.' దానిని సమర్థించుకోవడానికి స్థానిక మండలాలలోని ఏ ఒక్క రైతు పాల్గొనని కృత్రిమ, ప్రాజెక్టు అనుకూల ఉద్యమాన్ని సృష్టించింది.

పార్టీ కార్యకర్తలతో పక్క జిల్లాల సంబంధం లేని రైతు నాయకులతో ర్యాలీలు, ధర్నాలు చేయించింది. వ్యవసాయానికి దూరంగా పట్టణాల్లో నివసిస్తున్న, ప్రాజెక్టు ప్రయోజనం పొందే రైతులతో, 'కుహాన మేధావులతో', తన సొంత మీడియాతో ప్రాజెక్టు అనుకూల చర్చలకు తెర లేపింది.

**2013 చట్టంలోని ప్రధానాంశాలు**

బాధిత ప్రజలు ఆశిస్తున్న, ప్రతిపక్షాలు గోషిస్తున్న ప్రజా ప్రయోజనాల 2013 చట్టంలోని ముఖ్యాంశాలు. ప్రభుత్వం ముందుగా భూసేకరణ చేపట్టే ప్రాంతాలకు నోటిఫికేషన్ ఇచ్చి గ్రామ సభలు నిర్వహించాలి. డ్రాఫ్టు నోటిఫికేషన్ ద్వారా నిర్వాసితులను గుర్తించాలి. పునరావాస అంచనా పథకం తయారి గ్రామ సభలో బహిరంగ విచారణ, అభ్యంతరాల స్వీకరణ, ప్రకటనల ప్రచురణ, నోటీసుల జారీ అనంతరం జిల్లా కలెక్టర్ ఆధ్వర్యంలో తుది అవార్డు అభ్యంతరాలకు 60 రోజుల గడువు ఇవ్వాలి. కలెక్టర్ సమీప గ్రామాల భూముల మార్కెట్ విలువలు సగటు ఆధారంగా ధర నిర్ణయించాలి. పట్టణ ప్రాంతాల్లో అదే రేటు ఇచ్చి గ్రామీణ ప్రాంతాల్లో రెండు రెట్లు అధికంగా ఇవ్వాలి. భూమి లేదా భవనానికి అనుబంధంగా ఉన్న ఆస్తుల విలువలను లెక్క కట్టి, భూమిలో ఉన్న పంటలు, మొక్కలు, చెట్ల వల్ల యజమానికి జరిగే నష్టపరిహారంతో పాటు, భూమి నుంచి వేరు చేయడం వల్ల జరిగే ఇతర అనుబంధ నష్టాలను పరిగణలోకి తీసుకొని మొత్తం పరిహారాన్ని నిర్ధారించిన తర్వాత నిర్ధారిత పరిహారానికి వందశాతం అదనపు మొత్తం సోలిషియంగా కలిపి తుది పరిహారాన్ని నిర్ణయించాలి. నిర్వాసితులకు అప్పటి ఇందిరా అవాస యోజన ప్రమాణాల మేరకు పక్కా ఇంటిని నిర్మించి ఇవ్వాలి. పట్టణ ప్రాంతాల్లో 50 చదరపు మీటర్ల నిర్మాణ స్థలం కంటే తక్కువకాని విస్తీర్ణంలో ఇల్లు నిర్మించి ఇవ్వాలి. ఏదైనా కుటుంబం ఇల్లును తీసుకోవడానికి ఇష్టపడకపోతే ఇల్లు నిర్మాణానికి అంతే మొత్తం ఆర్థిక సహాయం అందించాలి. భూసేకరణతో భూమిలేని కుటుంబంగా మారిన ఎస్‌సి, ఎస్‌టిలకు రెండున్నర ఎకరాలు, ఇతర కులాలకు ఒక ఎకరం సాగు భూమి ఇవ్వాలి. ప్రాజెక్టు వల్ల ఉద్యోగాలు కల్పించబడితే, నిర్వాసితుల కుటుంబంలో ఒకరికి ఉద్యోగం ఇవ్వాలి. లేదా ప్రతి బాధిత కుటుంబానికి ఒకే దఫా రు. 5 లక్షలు చెల్లించాలి. లేదా ప్రతి కుటుంబానికి కనీసం నెలకు రెండు వేల చొప్పున 20 సంవత్సరాల వరకు చెల్లించాలి.

పశువుల కొట్టాలు, చిన్న చిన్న దుకాణాలు వేరే చోట నిర్మించుకోవడానికి కనీసం రు. 25 వేల మొత్తానికి తగ్గకుండా ఒకసారి చెల్లించాలి. సాగునీటి, జల విద్యుత్ ప్రాజెక్టు వల్ల నిర్వాసిత కుటుంబాలయితే రిజర్వాయర్లలో చేపలు పట్టుకోవడానికి హక్కులు కల్పించాలి. బాధిత కుటుంబాలకు కేటాయించే భూమి, ఇంటి రిజిస్ట్రేషన్లు, స్టాంపు డ్యూటి ఖర్చులను భూమి సేకరించిన సంస్థలే భరించాలి. ఇందులో ఎలాంటి వివాదాలు ఉండరాదు.

నిర్వాసితులు పునరావాసం పొందడానికి వీలుగా కనీస మౌలిక సౌకర్యాలను కల్పించాలి. గ్రామాల్లో రోడ్లు, డ్రైనేజి, పారిశుద్ధ సౌకర్యాలు కల్పించి వాటిపై బాధిత కుటుంబాలకు హక్కులు కల్పించాలి. ప్రతి బాధిత కుటుంబానికి సురక్షిత మంచినీటి వసతి, విద్యుత్ సౌకర్యం, పశువులకు తాగునీటి వసతి, మేత వనరులు కల్పించాలి. వీటితో పాటుగా అంగన్‌వాడి కేంద్రాలు, పాఠశాలలు, కళాశాలలు, ఆట స్థలాలు, కమ్యూనిటి సెంటర్స్, దేవాలయాలు చవడి, ఆరోగ్య కేంద్రాలు, పశువైద్య కేంద్రాలు, పోస్టాఫీసులు, స్మశానవాటికలు, విత్తన కేంద్రాలు, ఎరువులు, నిల్వ కేంద్రాలు, వీధి దీపాలు, రవాణ సౌకర్యాలు మొదలైనవి అందుబాటులోకి తేవాలి.

**ఎదురుదాడి చేస్తున్న ప్రభుత్వం**

పై ప్రయోజనాలను నెరవేర్చలేని ప్రభుత్వం అసంబద్ధమైన జిఒ 123తో నిర్వాసితుల నోర్లు మూయించాలనుకోవడం దుర్మార్గం. ఈ ప్రాజెక్టు ప్రభావిత ప్రాంతపు ప్రజలతో మాట్లాడకుండా 'వ్యాప్కోస్' సంస్థకు కోట్ల రూపాయలిచ్చి, సర్వే జరుపుకొని ఊహకు మించిన కొన్ని రెట్ల సామర్థ్యంతో ప్రాజెక్టు నిర్మాణం తలపెట్టింది.

డిపిఆర్‌ను (డిటైల్డ్ ప్రాజెక్ట్ రిపోర్ట్) ప్రజల ముందు చర్చించకుండా, ఏకపక్షంగా ప్రాజెక్టు నిర్మాణానికై పూనుకోవడం ప్రభుత్వ నిరంకుశత్వానికి, అహంకారానికి నిదర్శనం. ప్రాజెక్టు నిర్మాణంలోని సాదక బాధకాలను మదింపు చేయకుండా, ప్రాజెక్టు రీ – డిజైన్ పేరుతో ప్రజలకు వాస్తవాలను తెలియకుండా వ్యవహరించిన ప్రభుత్వ పనితీరును ఆక్షేపించి, ఎండగట్టిన ప్రతిపక్షాలను, మేధావుల అభిప్రాయాలను కనీసంగానైనా సమీక్షించకుండానే ఎదురు దాడికి దిగి ముకుమ్మడిగా విరుచుకుపడిన తీరు ప్రభుత్వ నియంతృత్వానికి పరాకాష్టగా నిలిచింది.

**తీవ్ర ఆందోళనలో నిర్వాసితులు**

కోర్టులు, మేధావులు బలవంతపు భూసేకరణను వ్యతిరేకిస్తున్నా నేటికి ప్రభుత్వం ప్రతిష్టకు పోతుంది. పోలీసులను అడ్డుపెట్టుకుని గ్రామస్థులను గ్రామాల్లోనే నిర్బంధిస్తున్నది. తమ సమస్యలు కలెక్టరుకు విన్నవిద్దామని బయలుదేరిన గ్రామాల ప్రజలను గ్రామ శివార్లలోనే నిర్దాక్షిణ్యంగా ఆపినారు. స్వయంగా భారీ నీటిపారుదల శాఖా మంత్రి పక్క మండలంలోని తమ అనుకూల సర్పంచులు, నలుగురు రైతులతో సమావేశమై భూమి ఇవ్వడానికి ఒప్పుకున్నట్లు అనైతిక ప్రకటనలతో ప్రజలను గందరగోళానికి గురిచేస్తున్నారు. ఆయా గ్రామస్థులు ఆయా వ్యక్తులను, సర్పంచులను నిర్బంధించి తమకు తెలియకుండా మంత్రితో జరిపిన సమావేశాల పట్ల తీవ్ర నిరసనలు తెలియజేశారు. ప్రభుత్వమే ప్రజల మధ్య చిచ్చుపెట్టి కుట్ర పూరితంగా వాళ్ల ఐక్యతను దెబ్బతీయాలని చూస్తోంది. ఎలాగైనా కట్టితీరుతామని నిరంకుశ వైఖరితో వ్యవహరిస్తోంది. ఈ వైఖరితో ఆయా గ్రామాల్లో నివసిస్తున్న సాధారణ జనం ఊరు విడిచిపోతే మేం ఎక్కడ బతకాలి, ఎలా బతకాలి, దిక్కు మొక్కులేని మేం చనిపోతే కనీసం మమ్ముల్ని పారేసే దిక్కు కూడా ఉండదేమో అనే మానసిక ఒత్తిడికి గురవుతున్నారు.

ఈ ఆవేదనతోనే తోగుట మండలం పల్లెపహాడ్ గ్రామంలో బచ్చలి నర్సయ్య అనే 20 గుంటల భూమి ఉన్న ఒక వృత్తి జీవి ఊరు విడిచిపోతే నన్ను పారేసే దిక్కులేదని, బలవంతంగా తాను పుట్టి పెరిగిన ఊరిలోనే ఆత్మహత్యకు పాల్పడ్డాడు. నర్సయ్య మరణం ఊరితో పెనవేసుకున్న బంధాన్ని తెలియజేస్తుంది. ఇది భౌతికంగా ఆత్మహత్య కావొచ్చు కాని అది పరోక్షంగా రాజ్యం నిర్దయగా చేసిన హత్యే.

నర్సయ్య ఆత్మహత్య అనంతరం భూ నిర్వాసితుల్లో, కాబోయే నిరాశ్రయుల్లో తీవ్ర ఆందోళన నెలకొంది. ఈ నేపథ్యంలో ప్రభుత్వానికి ప్రజాస్వామ్య బద్ధంగా తమ నిరసనను తెలియజేయాలని భావించారు.

సింగారం, ఎర్రవల్లి, పల్లెపహాడ్, వేములఘట్ గ్రామాల ప్రజలు కూకునూర్‌పల్లిలోని మంగోల్ చౌరస్తా వద్ద రాజీవ్ రహదారిపైన శాంతియుతంగా ధర్నా నిర్వహించేందుకు, తమ నిరసనలు తీవ్రంగా తెలియజేసేందుకు రైతులు, మహిళలు, పిల్లలు, వృద్ధులు భారీ ఎత్తున చేరుకున్నారు. ఉద్యమకాలంలో చీమ చిటుక్కుమన్న జై తెలంగాణ అంటూ జనాన్ని పోగుచేసుకొని ఫొటోలకు పోజులిచ్చిన నాయకులు మల్లన్నసాగర్ నిర్వాసితులు చేస్తున్న న్యాయబద్ధమైన బతుకు పోరాటానికి బాసటగా నిల్వకుండా, ప్రజలపై పోలీసుల్ని ఉసికొల్పడం అత్యంత దారుణం. పోలీసులు ప్రజలను భయభ్రాంతులను చేస్తూ వృద్ధులు, మహిళలు అని చూడకుండడా కర్కశంగా లాఠీచార్జీ జరిపారు. దీంతో కొంతమంది మహిళలు స్పృహతప్పారు. వృద్ధులు కదలలేని స్థితిలో పడిపోయారు.

ప్రభుత్వ క్రూరత్వానికి నిరసనగా ఊర్లోకి వెళ్లిన కొంత మంది యువకులు ప్రజల్ని నిరాయుధులుగా చేసి జరిపిన లాఠీ చార్జీకి వ్యతిరేకంగా ఆత్మరక్షణ కోసం చేతికందిన కర్రలతో రోడ్ల మీదకు రాగా, పోలీసులు మరింత రెచ్చిపోయి వారిపై కాల్పులు జరపడానికి పూనుకున్నారు. గాలిలోకి కొన్ని రౌండ్ల కాల్పులు జరిపారు. ప్రజలు భయభ్రాంతులై చెట్టుకొకరు, పుట్టకొకరుగా పారిపోయారు. చెలల్లో వెంటపడి పోలీసులు దొరికిన వారిని దొరికినట్లు లాఠీలతో చితకబాదారు. ఈ క్రమంలో బాధిత ప్రజలతో మాట్లాడడానికి పూనుకోకపోవడం అత్యంత విచారకరం. ప్రభుత్వం దమననీతికి వ్యతిరేకంగా బంద్‌కు పిలుపునిచ్చి, బాధిత ప్రజలను పరామర్శించడానికి వెళ్లిన ప్రతిపక్ష నాయకులను, మేధావులను, జెఎసి నాయకులను అరెస్టు చేయడం దారుణం. ఒకవైపు నిర్వాసితులను అన్ని విధాలుగా ఆదుకుంటామని నీటిమీది రాతల్లాగా నోటి మాటలతో మభ్యపెడుతూ, మరోవైపు పోలీసు నిర్బంధాల నడుమ బలవంతంగా భూములను రిజిస్ట్రేషన్ చేసుకునే చీకటి మార్గాలను అన్వేషిస్తూ ప్రభుత్వ పెద్దలు ప్రకటనలు చేస్తున్నారు.

పోరాడి తెచ్చుకున్న తెలంగాణలో మల్లన్నసాగర్ రైతులు భాగస్వాములు కారా! బతుకుల్ని ఛిద్రం చేస్తున్న స్వతంత్ర తెలంగాణ వారి పాలిట బంగారు తెలంగాణ ఎలా అవుతుంది. రైతులను, నిరాశ్రయులైన ప్రజలను నిర్దాక్షిణ్యంగా హింసించిన రాజ్యాలెన్నడు సుదీర్ఘకాలం మనగలిగిన దాఖలా లేదు. దశాబ్దాలుగా నిర్వాసితుల బాధలను, కనీళ్లను కళ్లారా చూసిన నాయకులు పాలకుల అవతారమెత్తగానే కళ్లు నెత్తికెక్కడం విస్మయం గొలుపుతుంది. పాలక పక్షం అన్నట్లు పులిచింతల ముంపు కాంగ్రెస్ పాపం అయితే, పోలవరం తెలుగుదేశం పాపం అయితే, మల్లన్నసాగర్ రేపటి మీ పాపానికి ప్రతిఫలం అవుతుంది.

ప్రజా ప్రయోజనాలకు ప్రాజెక్టులు ఎంత అవసరమో ప్రాజెక్టు నిర్వాసితుల ప్రయోజనాలు అంతే ముఖ్యం. ఇప్పటికైనా ప్రభుత్వం దగ్గర నిజాయితి, చిత్తశుద్ధి ఉంటే అత్యధిక ప్రయోజనాలు అందించే 2013 చట్టాన్ని తుచ తప్పకుండా అమలు చేస్తూ, నిర్వాసితులకు మరింత ఉదారాత్వాన్ని చాటాలి. వారికి బహుళ ప్రయోజనాలు చేకూర్చాలి. అందుకోసం చట్టంలో చర్చించనప్పటికి ప్రభుత్వం ఔదార్యంతో వ్యవహరించాలి. ఏలిన ప్రభుత్వ పెద్దలు గత ప్రభుత్వాల పాలనా కాలంలో నిర్మించిన ప్రాజెక్టుల బాధితుల గోడును చూసి కూడా పరిహారం చెల్లించడంలో నిర్లక్ష్యం వహిస్తే అందుకు ఎప్పటికైనా ఆ పాప పరిహారం చెల్లించుకోక తప్పదు.

*(రచయిత అసిస్టెంట్ ప్రొఫెసర్, తెలంగాణ యూనివర్సిటీ)* వీ

# ప్రభుత్వానికి ఇంజనీర్ల ఫోరం లేఖ

***భారీ వ్యయంతో కూడిన భారీ ప్రాజెక్టుల నిర్మాణాల వల్ల ప్రజలు అధిక సంఖ్యలో నిర్వాసితులవుతారనీ, చిన్న, మధ్యతరహా ప్రాజెక్టుల వల్ల వ్యయం, నిర్వాసితుల సంఖ్య కూడా తక్కువగా ఉంటుందనీ సాంకేతిక ఆధారాలతో వివరిస్తున్నది* తెలంగాణ ఇంజనీర్ల ఫోరం**

ఇటీవల 'కాలువ ద్వారా సుందిళ్లకు నీరు' తెలంగాణ ప్రభుత్వం పరిశీలనలో అనే అంశం ప్రచురితమైనది. ఇప్పటికైనా తెలంగాణ ప్రభుత్వం పరిశీలిస్తున్నందులకు కృతజ్ఞతలు. కానీ చివరికి పంతానికి పోయి ఈ పరిశీలన కావాలని నీరు గార్చి – తిరిగి "కాళేశ్వరం – మేడిగడ్డ నుండే ఎల్లంపల్లికి నీళ్లు తరలించే ప్రయత్నం మొదటికి తెస్తే తెలంగాణ ప్రజలు ప్రేక్షకపాత్ర వహించవలసినదే. ఎందుకనగా తెలంగాణ ప్రభుత్వానికి ఎదురు చెప్పే నాథుడే కరువైనారు – ఎదురు చెప్పినా ఈ ప్రభుత్వం పెడచెవిన పెట్టే పరిస్థితే కొనసాగుతున్నది.

'కాలువ ద్వారా సుందిళ్లకు' అనే ప్రతిపాదన వెలుగులోనికి రావడానికి కారణం ఈ రచయిత అంతర్గత కృషి వల్లనే జరిగినది. ఈ రచయిత తెలంగాణ సాధన ఉద్యమంలో నిజాయితీగా, చురుకుగా పాల్గొని, జలవివక్షత విషయంలో తెలంగాణ ప్రజలను చైతన్య పరచినారు. ఈ విషయంలో శ్రీకృష్ణ కమిటీకి రిపోర్టు అందజేసినారు. తన స్వంత ఖర్చుతో 'రాష్ట్రంలో నదీజలాల లభ్యత, పంపిణీలో తెలంగాణ పట్ల వివక్షత' అనే ఒక పుస్తకం రచించి, ముద్రించి, ఉద్యమకాలంలో తెలంగాణ ప్రజలకు అందించి తెలంగాణ ప్రజలను కార్యోన్ముఖులను చేసినారు. ఇప్పటికి తెలంగాణ పునర్నిర్మాణంలో కృషిచేస్తూ, ప్రజలకు సూచనలు అందిస్తున్నారు. ఈ రచయిత సాగునీటి శాఖ విశ్రాంత ఇంజనీరు, సాగునీటి రంగ విశ్లేషకులు, సిద్దిపేట ప్రాంత వాస్తవ్యులు (స్వగ్రామం : లక్ష్మాపూర్ – ఏటిగడ్డ కిష్టాపూర్)

నీళ్లు – నిధులు – నియామకాలు అనే ప్రధానమైన అంశాలపై తెలంగాణ ప్రజలు ఉద్యమించి, అనేక ప్రాణత్యాగాల వల్ల తెలంగాణ రాష్ట్రం ఏర్పడినదనే విషయాన్ని మరిచిపోయి – తెలంగాణ రాష్ట్రం సిద్ధించినందున, "ఒక్క నిధులు మాత్రం – సంవత్సరానికి లక్షకోట్లు అందుబాటులోనికి వచ్చినందున ఈ నిధుల నిరర్థకమైన వినియోగము పైన అధిక శ్రద్ధాసక్తులు ఈ ప్రభుత్వం కనబరుస్తున్నట్లు రూఢీ అవుతున్నది. సాగునీటి ప్రాజెక్టుల పేర్లు మార్చి రీడిజైన్ల పేరుతో లక్ష నుండి లక్షన్నర కోట్లు ఈ ఐదు సంవత్సరాల కాలంలో వ్యయం చేయాలనే తలంపే ఎక్కువ కనబడుతున్నది. దీనివల్ల బంగారు తెలంగాణ, అప్పుల తెలంగాణగా మారే ప్రమాదం పొంచి ఉన్నది. భవిష్యత్తులో తెలంగాణ ప్రజలు క్షమించరు. ఇప్పటికే ఇరవై నెలల కాలంలో అరవై వేల కోట్ల అప్పులు చేయడం జరిగినది. మనకు విభజనలో సుమారు 69 వేల కోట్ల అప్పు సంక్రమిస్తే, పై అరవై వేల కోట్లను కలుపుకొని మొత్తం లక్షా ఇరవై మూడు వేల కోట్ల అప్పు ఇప్పటికే అయినది. దీనికి సంవత్సరానికి 7 నుండి 8 వేల కోట్లు వడ్డీ కింద చెల్లించవలసిన పరిస్థితి ఆసన్నమయినది. ఈ పరిస్థితిలో తెలంగాణలో సాగునీటి ప్రాజెక్టుల విషయంలో లోతుగా అధ్యయనం చేయకుండా, బెనిఫిట్ కాస్టు రేషియో పాటించకుండా కొత్త ప్రభుత్వం, కొత్త పేర్లు, కొత్త రీడిజైన్లు, కొత్త అగ్రిమెంట్ల పేరు మీద ప్రాజెక్టుల వ్యయం రెట్టింపు చేసే దృక్పథంతో ఈ ప్రభుత్వం ప్రయాణిస్తున్నట్లు వ్యక్తమవుతున్నది. సాగునీటి ప్రాజెక్టుల విషయంలో పూర్తిస్థాయి అధ్యయనం చేయకుండా ప్రాజెక్టుల వ్యయము ఇబ్బడిముబ్బడిగా పెంచుకుంటూ పోతున్నది.

వాస్తవానికి తెలంగాణలో 2004 ముందు మొత్తం 47 లక్షల ఎకరాలకు సాగునీటి సౌకర్యం మేజర్, మీడియమ్, మైనర్ ప్రాజెక్టుల కింద అందుబాటులో ఉన్నది. 2004 తరువాత జలయజ్ఞంలో గత ప్రభుత్వం మరో 33 కొత్త ప్రాజెక్టులను చేపట్టింది. ఈ 33 ప్రాజెక్టుల కింద 50.50 లక్షల ఎకరాలకు నిర్దేశిత సాగునీరు అందించడానికి ఈ ప్రాజెక్టులు చేపట్టబడినవి. కొన్ని ప్రాజెక్టులు 90 శాతం పనులు పూర్తయ్యాయి. మరికొన్ని ప్రాజెక్టుల పనులు కొనసాగుతున్నవి. వీటిలో మహబూబ్‌నగర్ జిల్లాలోని నాలుగు ఎత్తిపోతల పనులకు కేవలం ఒక వేయి కోట్ల రూపాయలు ఖర్చు చేసినట్లయితే 8 లక్షల ఎకరాల సాగు అందుబాటులో రాగలదు. ఒక ప్రాణహిత – చేవెళ్ల మినహాయిస్తే మొత్తం ఈ 32 ప్రాజెక్టులు పూర్తి చేయడానికి కేవలం రు. 11,000 కోట్లు ఖర్చు చేస్తే అదనంగా 34 లక్షల ఎకరాల సాగు అందుబాటులోనికి రాగలదు. ప్రాణహిత చేవెళ్ల కింద 16.40 లక్షల ఎకరాలు సాగు ప్రతిపాదన. ఇప్పటికే దీనికింద రు. 7,849 కోట్లు ఖర్చు చేసినారు. పాత ప్రతిపాదన ప్రకారం మిగతా పనులు పూర్తిచేయడానికి రు. 28,415 కోట్లు మాత్రం అవసరం. కానీ కొత్త డిజైన్ పేరు మీద 80 వేల కోట్లకు ఈ ప్రభుత్వం పెంచినది. 2014 సంవత్సరం పూర్వమే తెలంగాణలో సుమారు కోటి ఎకరాలకు (అనగా 47+50.50 = 97.50 లక్షల ఎకరాలు) ప్రాజెక్టులు చేపట్టినారు. కానీ వీటిని ఈ ప్రభుత్వం పూర్తిచేయకుండా ప్రాజెక్టుల రీడిజైన్ పేరుతో వ్యయం ఇబ్బడిముబ్బడిగా పెంచి తెలంగాణకు ఆర్థిక భారం చేయబోతున్నది.

పై పరిస్థితులను పురస్కరించుకొని తక్కువ ఖర్చుతో ఎక్కువ ప్రయోజనాలు చేకూర్చే ప్రతిపాదనలు, సూచనలు తెలంగాణ ప్రజల ముందు, తెలంగాణ ప్రభుత్వం ముందుకు తీసుకువస్తూ అమలు చేసి తెలంగాణ ప్రజలకు ప్రయోజనం చేకూర్చాలన్న దృక్పథంతో విజ్ఞప్తి.

1) కాలువ ద్వారా సుందిళ్లకు తుమ్మిడిహట్టి నుంచి నీరు :

గత ఉమ్మడి రాష్ట్రంలో 2008లో జలయజ్ఞంలో భాగంగా ప్రాణహిత – చేవెళ్ల ఎత్తిపోతల పథకం (పిసిఎల్ఐఎస్) ద్వారా తెలంగాణలో 16 లక్షల 40 వేల ఎకరాలకు మెట్టసాగు అందించాలని ఈ పథకాన్ని చేపట్టి పనులు మొదలు పెట్టినారు. కానీ ఈ కొత్త ప్రభుత్వం ఈ ప్రాజెక్టును వివాదమైనదిగా మార్చివేసిన విషయం తెలిసినదే. రీడిజైన్ పేరుతో ప్రాణహిత నది 50 మీటర్ల దిగువన ఉన్న, మేడిగడ్డ – కాళేశ్వరం నుండి ఎల్లంపల్లికి 160 టిఎంసిల నీరు తరలించే ప్రతిపాదన ముందుకు తెచ్చి మొత్తం ప్రాజెక్టు వ్యయాన్ని 40 వేల కోట్ల నుండి 80 వేల కోట్లకు

పెంచినది. దీనిలో భాగంగా మొదటిది మేడిగడ్డ వద్ద (అనగా కాళేశ్వరం దిగువన) +100 మీటర్ల లెవల్‌లో ఒక బ్యారేజీ, రెండవది +124 మీటర్ల లెవల్‌లో అన్నారం దగ్గర రెండవ బ్యారేజీ, సుందిళ్ల దగ్గర +134 మీటర్ల లెవల్‌లో మూడవ బ్యారేజి కొత్తగా నిర్మించి, ఎల్లంపల్లి బ్యారేజీ లోనికి 160 టిఎంసిల నీటిని ఎత్తి పోయాలని ప్రతిపాదించినది.

అనగా ఈ మూడు బ్యారేజీల నుండి మూడు దశలలో మూడు చోట్ల (24+10+14 = 48 మీటర్ల ఎత్తుకు) ఎత్తిపోయడానికి మూడు పంపు హౌజుల నిర్మాణం చేపట్టి +100 మీటర్ల లెవల్‌లో కాళేశ్వరం నుండి +148 మీటర్ల ఎత్తులో ఉన్న ఎల్లంపల్లికి నీళ్లు తరలించాలని నిర్ణయించినారు. అయితే ప్రాణహిత చేవెళ్ల పాత ప్రతిపాదన ప్రకారం +152 మీటర్ల లెవల్‌లో తుమ్మిడిహట్టి వద్ద ప్రాణహిత నదిపై బ్యారేజీ నిర్మించి, +148 మీటర్ల లెవల్‌లో ఉన్న ఎల్లంపల్లికి నీళ్లు తరలించవలసి ఉండెను. ప్రాణహిత నదిపై +152 మీటర్ల లెవల్‌కు, మహారాష్ట్ర ప్రభుత్వం ఒప్పుకోవడం లేదని పైగా అక్కడ నీటి లభ్యత 120 టిఎంసిలు మాత్రమేనని 50 మీటర్ల దిగువన ఉన్న కాళేశ్వరంకు మార్చినారు. (గమనిక : సాగునీటిని ఒక మీటరు ఎత్తుకు నీళ్లను ఎత్తిపోయడానికి వేలకోట్ల వ్యయభారం అవుతుంది.) కాళేశ్వరం నుండి తుమ్మిడిహట్టి 50 మీటర్ల దిగువన ఉన్నది. కావున ఈ 50 మీటర్ల దిగువకు వచ్చి నీటిని ఎత్తిపోయడం అధిక వ్యయభారం కాగలదు. సుందిళ్ల బ్యారేజి ఎల్లంపల్లికి దిగువన గోదావరి నదిపై +134 మీటర్ల లెవల్‌తో ప్రతిపాదించినారు. ఈ 134 మీటర్ల లెవల్ నుండి 148 మీటర్ల లెవల్‌లో ఉన్న ఎల్లంపల్లికి కేవలం 14 మీటర్ల ఎత్తుతో 160 టిఎంసిల నీళ్లను ఎత్తిపోయవచ్చు. ప్రాణహిత చేవెళ్ల ప్రతిపాదన ప్రకారం తుమ్మిడిహట్టి నుండి మైలారం గ్రామం వరకు 72 కి.మీ. పొడవు కాలువ ద్వారా నీటిని తీసుకువచ్చి, మైలారం వద్ద 10 పంప్‌హౌజ్‌ల నిర్మాణం చేపట్టి కేవలం 19 మీటర్ల ఎత్తుతో నీటిని ఎత్తిపోసినట్లయితే +148 మీటర్ల ఎత్తులో ఉన్న ఎల్లంపల్లికి నీటిని తరలించవచ్చు. ఈ 72 కి.మీ. కాలువ పనులు 50 శాతం పైగా పనులు పూర్తి అయినవి. కాలువ వెడల్పు 68 మీ. 22 వేల క్యూసెక్కుల నీటి తరలింపు సామర్థ్యంతో అనగా రోజుకు 2 టిఎంసిల నీళ్లను తరలించవచ్చు.

ఈ వ్యాసంలో సూచిస్తున్న ప్రతిపాదన ప్రకారం ఈ 72 కి.మీ. కాలువను మరో 25 నుండి 30 కి.మీ. పొడిగించి జయపూర్ వాగులోకి కలిపి లింకు చేసినట్లయితే సుందిళ్లకు నీళ్లు కాలువ ద్వారా అనగా గ్రావిటీ ద్వారా తుమ్మిడిహట్టి నుండి సుందిళ్లకు నీళ్లు రాగలవు. ఎలాంటి ఎత్తిపోతలు అవసరం లేదు. ఖర్చులేదు. సుందిళ్లకు నీరు చేరుకున్న తరువాత కేవలం 14 మీటర్ల లిఫ్ట్‌తో ఎల్లంపల్లిలోనికి ఎత్తిపోయవచ్చు. ఈ జయపూర్ వాగు ఎల్లంపల్లి బ్యారేజీకి దిగువన సుందిళ్లకు పైభాగంలో గోదావరి నదిలో +125 మీటర్ల లెవల్‌లో కలుస్తున్నది. పాత ప్రతిపాదనను యథావిధిగా కొనసాగిస్తూ మైలారం నుండి 10 పంపుల ద్వారా ఎల్లంపల్లికి నీళ్లు తరలించవచ్చు. అనగా పై రెండు విధాలుగా ఎల్లంపల్లికి 160 టిఎంసిల నీళ్లను అతి తక్కువ ఖర్చుతో తరలించవచ్చు. మైలారం నుండి జయపూర్ వాగు లింకు 26 కి.మీ. పొడవు. ఇందులో 16 కి.మీ. టన్నెలు బోడాపూర్ గ్రామం నుండి మిట్టపల్లి గ్రామం వరకు. 5 కి.మీ. ఫారెస్టు ఏరియా. మిగతాది వ్యవసాయ భూమి. జయపూర్ వాగు, జయపూర్ పవర్‌ప్లాంట్ మధ్య నుండి ఈ లింకు కాలువ తీసుకవచ్చి జయపూర్ వాగులో కలిపే అవకాశం ఉన్నది.

2) తుమ్మిడిహట్టి వద్ద +148 మీటర్లకు అనుమతి లభించినప్పటికీ 160 టిఎంసిల నీటిని తరలించుకోవచ్చు.

తుమ్మిడిహట్టి వద్ద ప్రాణహిత నది గర్భం లెవల్ +140 మీటర్లు – నది ఇరువైపుల ఒడ్డుల లెవల్స్ + 148 మీటర్లు అనగా నదీగర్భంలో 8 మీటర్ల ఎత్తు నీళ్ల అందుబాటులో ఉంటాయి. మహారాష్ట్ర ప్రభుత్వం ఈ నదీ గర్భంవరకే నీళ్లు నిలుపుటకు అవకాశం ఇస్తుంది. ప్రస్తుతం తవ్విన 72 కి.మీ. కాలువ సిల్ లెవల్ +144 మీటర్లు. అనగా ఈ లెవల్ నుండి నీటిని కాలువలోకి (డ్రా చేస్తారు) పంపుతారు. ప్రతి సంవత్సరం తుమ్మిడిహట్టి వద్ద ఎలాంటి బ్యారేజీ లేకుండానే ప్రాణహిత నది వరదలు వచ్చినప్పుడు +152 నుండి 154 మీటర్ల ఎత్తు వరకు వరద ప్రభావం కొనసాగుతున్నది. కావున ప్రాణహిత నది ఇరువైపులా ఫ్లడ్ బ్యాంకు (వరదకట్టలు) నిర్మించి, మహారాష్ట్రను ఒప్పించే ప్రయత్నం చేసి యథావిధిగా +152 మీటర్ల ఎత్తు బ్యారేజి నిర్మించే ప్రయత్నం చేయడం సముచితం. ఈ లెవల్‌లో కేవలం 1852 ఎకరాలు మాత్రమే ప్రభావిత ముంపు జరుగుచున్నది. ఈ భూమి ఎట్లాగు వరదకాలంలో ముంపుకు గురి అవుతున్నది.

ఒకవేళ మహారాష్ట్ర ఒప్పుకోకపోతే +148 మీటర్ల లెవల్‌కే బ్యారేజి అనగా టి. హనుమంతరావు పోలవరానికి ఇచ్చిన డిజైన్ ప్రకారం జీరో సబ్‌మెర్జెన్స్ బేస్‌డ్ బ్యారేజి ప్రకారం బ్యారేజి నిర్మించి ఇప్పటికే తవ్విన 72 కి.మీ. కాలువ లోనికి నీటిని తరలించవచ్చు. ఈ కాలువ వెంబడి కూడ ఇరు వైపుల 4 నుండి 6 మీటర్ల ఎత్తు వరకు ఫ్లడ్ బ్యాంక్ (వరద కట్టలు) నిర్మించినట్లయితే వరదకాలంలో మరో 2 టిఎంసిల నీళ్లు అదనంగా అనగా రోజుకు 4 టిఎంసిల వరకు తుమ్మిడిహట్టి నుండి ఎల్లంపల్లికి తరలించవచ్చు. అవసరమైతే ఈ 72 కి.మీ. కాలువ సిల్ లెవల్ + 144 మీటర్ల నుండి +141 మీటర్లకు ఎత్తు తగ్గింపు చేసుకొని, కాలువ వెడల్పు 68 మీటర్ల నుండి 90 మీటర్ల వరకు వెడల్పు పెంచుకొని, మైలారంవద్ద పంపులను 10 నుండి 20కి పెంచుకుని అధికంగా నీటిని తరలించవచ్చు. తక్కువ ఖర్చుతో 160 టిఎంసిల నీటిని పొందవచ్చు.

3) తుమ్మిడిహట్టి వద్దనే ప్రాణహిత నదిలో నీటిలభ్యత పుష్కలం.

ప్రాణహితనది గోదావరి నదికి ముఖ్యమైన ఉపనది. దీనిని జి–9గా పిలుస్తారు. మన ఆదిలాబాద్ జిల్లా బార్డర్ వరకే దీనిలో పెనుగంగా (జి–7), వార్ధా (జి–8), వైను గంగా (జి–9) అనే మూడు నదుల కలయిక ప్రాంతమే తుమ్మిడిహట్టి. ఇక్కడి నుండి ప్రాణహిత నదిగా (జి–9)గా పిలుస్తారు. ఈ ప్రాణహిత నది కాళేశ్వరం వరకు 115 కి.మీ. పొడవు ప్రయాణంచేసి గోదావరినదిలో +95 మీటర్ల లెవల్‌తో కలుస్తుంది. కాళేశ్వరం – మేడిగడ్డ దిగువన ఇంద్రావతి నది (జి–11) +82 మీటర్ల లెవల్‌లో గోదావరి నదిలో కలుస్తుంది. గోదావరి నదికి 50 శాతం నీటి లభ్యత ఈ రెండు నదుల నుండే లభిస్తున్నది. ఈ రెండు నదుల ఎగువ పరీవాహక ప్రాంతం అధికంగా అటవీ ప్రాంతం కాబట్టి నీటి లభ్యత ఎక్కువ లభిస్తున్నది. ప్రాణహిత గోదావరిలో కలిసే వరకు, గోదావరినదిలో నీటికొరత ఎక్కువ, తెలంగాణకు ఈ రెండు ఉపనదుల నీళ్లే ఆధారం. వీటి ద్వారా 705 టిఎంసిల నికర జలాలు తెలంగాణకు లభ్యమవుతున్నాయి. ఈ ప్రాణహిత నది తుమ్మిడిహట్టి వద్ద లభించే నీళ్లే కాళేశ్వరం వద్దకు చేరుకుంటాయి. ఇక్కడ 90 నుండి 120 రోజులు నీరు లభిస్తుంది. తుమ్మిడిహట్టి కాళేశ్వరం వద్ద లభించే నీటి వ్యత్యాసం స్వల్పం. ఇటీవల ముఖ్యమంత్రి తుమ్మిడిహట్టి వద్ద సరాసరి 1100 టిఎంసిల నీళ్లు లభిస్తాయని తెలిపారు. కాళేశ్వరం వద్ద 1500 టిఎంసిలు ఉన్నట్లు చూపించారు. అనగా తుమ్మిడిహట్టి వద్ద 1100 టిఎంసిల నీటిలభ్యత ఉన్నది. కాబట్టే ప్రాణహిత–చేవెళ్ల ప్రాజెక్టు

తుమ్మిడిహట్టి నుండి చేపట్టినారు. కేంద్ర జలసంఘం తేది 2009 జూలై 27న ఈ ప్రాణహిత–చేవెళ్ల ఎత్తిపోతల పథకానికి 160 టిఎంసిల నీళ్ల వినియోగానికి అనుమతి ఇచ్చినది. తుమ్మిడిహట్టి వద్ద నికరముగా లభించే జలాలు 273 టిఎంసిలు అని లెక్క తేల్చింది. అందులో నుండి 160 టిఎంసిలు అనుమతించింది. తుమ్మిడిహట్టి వద్ద అనుమతి పొంది 50 మీటర్ల దిగువన ఉన్న కాళేశ్వరానికి సైట్ మార్చినట్లయితే అనేక చిక్కులు వస్తాయి. ఆంధ్ర అడ్డు పడగలదు. ఎందుకనగా రహస్యంగా ప్రాణహిత, ఇంద్రావతి నదుల నుండే పోలవరానికి 301 టిఎంసిల నికరజలాలను ఆంధ్రా వాళ్లు అక్రమంగా లోగడ కేటాయింప జేసుకున్నారు. వాస్తవానికి ఇవి తెలంగాణ హక్కు నీళ్లు. ఇప్పుడు సైట్ మార్చినట్లయితే పోలవరం కేటాయింపును బయటకు తీసుకువచ్చి దిగువ హక్కుల కింద లోగడ తుమ్మిడిహట్టి వద్ద కేటాయించిన 160 టిఎంసిల నికర జలాలకు అడ్డుపడగలరు.

4) మల్లన్నసాగర్ (పాత తడ్కపల్లి), కొండపోచమ్మ సాగర్ (పాత పాములపర్తి).

ఈ రెండు రీడిజైన్‌లో భాగంగా ప్రతిపాదించినారు. మల్లన్నసాగర్ అంత పెద్ద 50 టిఎంసిల నీటి నిలువ స్థాయిలో నిర్మించడం అవసరం లేదు. పూర్వ యథాస్థితి 1.5 టిఎంసిల స్థాయి సరిపోతుంది. కొండపోచమ్మ సాగర్ (పాత నీటి నిల్వస్థాయి 1.00 టిఎంసి) కానీ ఇప్పుడు 21 టిఎంసిలతో నిర్మించ తలపెట్టినారు. తరువాత 8 టిఎంసిలకు కుదిస్తున్నారు. మల్లన్నసాగర్‌లో సుమారు 22 వేల ఎకరాల ముంపుతో పాటు 8 గ్రామాలు పూర్తిగా 6 గ్రామాలు పాక్షికంగా ముంపుకు గురవుతున్నాయి. 14 గ్రామాల ప్రజలు ఈ మల్లన్నసాగర్ వల్ల ముంపుకు గురై నిరాశ్రయులవుతున్నారు. పైగా ఇందులో 2500 ఎకరాల అటవీ భూమి, అటవీ సంపద ముంపుకు గురవుతున్నది. ఈ ప్రాంతంలో నామమాత్రంగా ఉన్న ఈ ఒక్క అటవీ సంపద కూడ ముంపుకు గురై ఈ ప్రాంతంలో పర్యావరణ సమతుల్యత దెబ్బతింటున్నది.

పైగా ఎల్లంపల్లి నుండి నీటిని ఎత్తిపోతల ద్వారా ఈ రెండు అతిపెద్ద బ్యాలెన్సింగ్ రిజర్వాయర్‌లను నింపడం అధిక వ్యయంతో కూడుకున్న పని. వృథా ఖర్చు కాగలదు. ఎందుకనగా నీటి ఆవిరివల్ల ప్రతి సంవత్సరం 15 శాతం నుండి 20 శాతం నీటిని నష్టపోతాం. నీటి సీపేజి (భూమిలోకి నీరు ఇంకిపోవడం వల్ల) 15 శాతం నుండి 20 శాతం నీటిని నష్టపోతాం. మూడవది పైపుల ద్వారా అనేక కిలోమీటర్ల నుండి నీటిని ఇక్కడికి ఎత్తిపోసి తీసుకురావడం వల్ల పైపులలో ఫ్రిక్షన్ లాస్ (అనగా పైపులలో నీటి ప్రవాహం నిరోధం) వల్ల అధిక అశ్వశక్తి విద్యుత్తు అవసరం. ఈ నష్టాలతో 30 శాతం నుండి 40 శాతం నీటిని నష్టపోగలం. అనగా పై కారణాల వలన మల్లన్నసాగర్‌లో ఎత్తిపోతల ద్వారా అతి ఖరీదైన నీటిని తీసుకువచ్చి 50 టిఎంసిలను నిలువ చేయడం అధిక ఆర్థికభారం, ప్రతి సంవత్సరం మోయలేని భారం. సాధారణంగా వర్షపు నీటి ద్వారా నదుల ద్వారా ఉచితంగా లభించే నీటితో నిండే చెరువులలో, డ్యాంలలో ఈ ఆవిరి నష్టం గాని సీపేజి నష్టం గాని అంతగా పట్టించుకోరు. కానీ ఖరీదైన ఎత్తిపోతల నీటి విషయంలో ఈ నష్టాన్ని లెక్కలోనికి తీసుకోవాలి.

కొత్త రీడిజైన్‌లో భాగంగా మల్లన్నసాగర్, ఇతరత్రా చోట్ల రింగు బండ్ టైప్ ఎర్తు డ్యాంలు (వలయాకారం మట్టికట్టలు) ప్రతిపాదించి అందులో చాలా ఎత్తు వరకు నీటిని నింపాలని నిర్ణయించినారు. ఈ వలయాకారపు భారీస్థాయి మట్టికట్టలు ఇవి చాలా ప్రమాదకరం. అనేక కారణాల వల్ల వలయాకారంలో ఏ చోట తెగిపోతాయో తెలీదు. ప్రమాద రక్షణ చర్యలు, ఏ చోట తీసుకోవాలో తెలియదు. ఇలాంటి భారీస్థాయి మట్టికట్టలు దేశంలో ఎక్కడ కూడా నిర్మించి భారీస్థాయిలో నీటిని నిలువ చేయలేదు. సాంకేతికంగా నదులు, వాగుల, లోయల ప్రాంతానికి అడ్డంగా మట్టికట్టలు నిర్మించి, నీళ్లు నిలువ చేస్తారు. ఇప్పుడున్న డ్యాంలు, చెరువులు వీటికి సాక్ష్యం. ఈ కొత్త ప్రభుత్వం ముంపు బాధితుల విషయంలో లోగడ ఉన్న విధానాలు అమలు చేయడం లేదు. 2013 చట్టంగాని, జి.ఓ. నెం. 68లో పొందుపరచిన విధానాలు గానీ, భూమికి–భూమి, పునరావాస కేంద్రాల నిర్మాణాలు గానీ ఏవీ పాటించడం లేదు. సోషల్ ఇంపాక్టు, ఎకనామిక్ ఇంపాక్ట్, ఎన్విరాన్‌మెంట్ ఇంపాక్టు మొదలగు సవివరమైన సర్వేలు నిర్వహించకుండా సవివరమైన ప్రాజెక్టు రిపోర్టులు తయారు చేయకుండా, గ్రామసభలు నిర్వహించి వాటి అభిప్రాయాలు, తీర్మానాలు తీసుకోకుండా, బలవంతంగా జి.ఓ. 123 ద్వారా భూసేకరణ చేయడం న్యాయం కాదు.

5) మల్లన్నసాగర్, కొండపోచమ్మ సాగర్‌లకు ప్రత్యామ్నాయాలు.

ప్రాణహిత నది తుమ్మిడిహట్టి నుండి ఎల్లంపల్లి వరకు 130 కి.మీ.ల పొడవు ప్రాంతంలో ఆదిలాబాద్ జిల్లా పడమర నుండి తూర్పు వరకు అనేక నదులు ప్రవహిస్తున్నవి. అనగా ప్రాణహిత వైపు 1) కోటిపల్లి వాగు (తండంవాగు), 2) నీల్‌వాయి, 3) పెద్దవాగు, 4) ఎర్రవాగు, 5) బెజ్జూరువాగు), 6) కౌతాలవాగు; గోదావరి నదివైపు 1) రాలివాగు, 2) రాళ్లవాగు, 3) జయపూరు వాగు, 4) గొల్లవాగు, 5) చెన్నూరు వాగు మొదలగునవి.

పై వాగుల నుండి స్వంత పరీవాహక ప్రాంతం ద్వారా లభించే 40 నుండి 50 టిఎంసిల నీటిని వడిసిపెట్టుకొనే (నిలుపుకునే) అవకాశం ఉన్నది. ఈ నీరంతా ప్రాణహిత నదిలో తుమ్మిడిహట్టి కింది భాగంలో కలుస్తున్నది. ఒక పెద్ద వాగు పైన 15 నుండి 20 టిఎంసిల బ్యాలెన్సింగ్ రిజర్వాయరు నిర్మించుకొనే అవకాశం ఉన్నది., మిగతా అన్ని వాగులపై 60 నుండి 70 టిఎంసిల నీళ్లను ఇక్కడనే నిలుపుకునే అవకాశమున్నది. ఈ 60 నుండి 70 టిఎంసిల నీళ్లు కేవలం తుమ్మిడిహట్టి నుండి కాలువ ద్వారా అనగా గ్రావిటీ ద్వారా ఈ ప్రాంతంలో నీటిని నిలుపుకోవచ్చు. ఎలాంటి ఎత్తిపోతల ఖర్చు అవసరం లేదు. అదే మల్లన్నసాగర్, కొండపోచమ్మ సాగర్‌లకు బదులుగా ఇక్కడ 50+20 = 70 టిఎంసిల నీళ్లను నిలుపుకోవచ్చు. పాత ప్రతిపాదనలో ఇక్కడి వాగులపై స్టోరేజీ రిజర్వాయర్లు పెట్టలేదు. అనగా తుమ్మిడిహట్టి, ఎల్లంపల్లి మధ్యన ప్రవహిస్తున్న వాగులపై అడ్డంగా చిన్నచిన్న బ్యారేజీలను నిర్మాణం చేసుకొని తక్కువ ఖర్చుతో నీటిని కాలువల ద్వారా (గ్రావిటీ ద్వారా) నిలుపుకోవచ్చు. ఈ వాగుల నుండి లభించే నీరు కనీసం 40 నుండి 50 టిఎంసిలు అదనంగా మనకు చేకూరగలదు. అనగా తుమ్మిడిహట్టి వద్ద లభించే నీటికి అదనం. (160 + 40 =200 టిఎంసి).

6) ప్రాణహిత–చేవెళ్ల ఎత్తిపోతల పథకంపై ఎల్లంపల్లి దిగువన – మల్లన్నసాగర్ లాంటి భారీ కొత్త రిజర్వాయర్లు అవసరం లేవు.

ఇప్పటికే అందుబాటులో ఉన్న అనేక మేజర్, మీడియం, మైనర్ ఇరిగేషన్ చెరువులు, కుంటలు నింపుకుంటే సరిపోతుంది. కింద పేర్కొన్న అన్ని ప్రాజెక్టులు గోదావరి బేసిన్‌లో ఉన్నవి. మనకు శ్రీరాంసాగర్ నుండి ప్రాణహిత నది కలిసేవరకు గోదావరినదిలో నీటికొరత ఎక్కువ. 4, 5 సంవత్సరాలకొకసారి కూడా నీరు దొరకడం లేదు. అన్ని ప్రాజెక్టుల కింద ఉన్న నిర్దేశిత ఆయకట్టు సేద్యం కావాలంటే ప్రాణహిత, ఇంద్రావతి నదుల నుండి లభించే నీరే శరణ్యం. కావున కింద పేర్కొన్న అన్నింటినీ

| ప్రాజెక్టు, చెరువుల పేరు | నీటి నిల్వ సామర్థ్యం (టిఎంసిలలో) |
|---|---|
| 1) ఎల్లంపల్లి | 20 |
| 2) మిడ్‌మానేరు+ ఎగువమానేరు | 28 |
| 3) లోయర్ మానేరు | 25 |
| 4) పాత ప్రతిపాదనల ప్రకారం 10 రిజర్వాయర్లు | 16 |
| **మొత్తం** | **89** |
| 5) ప్రస్తుతం అందుబాటులో ఉన్న మీడియం, చెరువులు, కుంటల వాటి నిల్వ సామర్థ్యం (మొత్తం గోదావరి బేసిన్‌లో 175 టిఎంసిలు) (కనీసం) | 125 |
| **మొత్తం** | **214** |
| 6) నింపాలనుకునే ప్రతిపాదిత రిజర్వాయర్లు : | |
| ఎ) సింగూరు ప్రాజెక్టు | 30 |
| బి) నిజాంసాగర్ & ఘనపూర్ | 20 |
| సి) శ్రీరాంసాగర్ | 86 |
| **మొత్తం** | **350** |

స్టోరేజి రిజర్వాయర్లుగా ఉపయోగించుకోవచ్చు. శ్రీరాంసాగర్ కింద సుమారు 200 టిఎంసిలు, నిజాంసాగర్ కింద 58 టిఎంసిలు కేటాయింపు జలాల కొరతను కూడా వీటి ద్వారా తీర్చుకోవచ్చు.

పట్టిక ప్రకారం మనకు 350 టిఎంసిల నీటిని స్టోరేజి (నిల్వ) చేసుకునే అవకాశం ఉన్నది. రీడిజైన్ పేరుతో మల్లన్నసాగర్, ఇతర బ్యాలెన్స్ రిజర్వాయర్లు చేపట్టి, ప్రజలను నిర్వాసితులను చేయడం, వేల కోట్ల ప్రజాధనాన్ని వృథా చేయడం సమంజసం కాదు. ప్రాణహిత–చేవెళ్ల పాత ప్రతిపాదనలోని 10 చిన్న చిన్న బ్యాలెన్సింగ్ రిజర్వాయర్ల ద్వారా ఈ ఎత్తిపోతల వల్ల సేకరించే 160 టిఎంసిల గోదావరి నీటిని పైన పేర్కొన్న స్టోరేజి రిజర్వాయర్లకు ఎప్పటికప్పుడు పంపిణీ చేయవచ్చు. నిర్దేశిత మెట్టసాగుకు నీటిని అందించవచ్చు. భారీస్థాయిలో మల్లన్నసాగర్ నిర్మాణం అవసరంలేదు. పాత తడకపల్లి 1.50 టిఎంసిల స్థాయి సరిపోతుంది.

కేంద్ర జలసంఘానికి పాత ప్రతిపాదనలోని 10 చిన్న చిన్న కొత్త రిజర్వాయర్ల కింద కేవలం 16 టిఎంసిల స్టోరేజి మాత్రమే ఉన్నట్లు ఈ ప్రభుత్వం చూపినందున కేంద్ర జలసంఘం స్టోరేజి రిజర్వాయర్లు పెంచుకొమ్మని సూచించింది. కానీ పై 350 టిఎంసిల స్టోరేజి రిజర్వాయర్లు ఇప్పటికే అందుబాటులో ఉన్నట్లు చూపలేదు. పాత ప్రతిపాదనలో ఎల్లంపల్లి, మిడ్‌మానేరు కలుపుకొని మొత్తం 65 టిఎంసిల స్టోరేజి ఉన్నట్లు కూడా చూపలేదు. కొత్త రీడిజైన్‌లో భాగంగా మొత్తం 178.42 టిఎంసిల స్టోరేజితో 20 రిజర్వాయర్లు ప్రతిపాదించారు. సాధారణంగా ఎత్తిపోతలపై 10 నుండి 20 శాతం స్టోరేజి అవసరం. అనగా 32 టిఎంసిలు మాత్రం సరిపోతుంది. కానీ 350 టిఎంసిల స్టోరేజ్ అందుబాటులో ఉన్నది. జలయజ్ఞంలో భాగంగా రాయలసీమలో గానీ, దేశంలో మరెక్కడా గానీ ఎత్తిపోతల ప్రాజెక్టులపై భారీస్థాయిలో స్టోరేజి రిజర్వాయర్లు నిర్మించలేదు. దేశంలో ఎక్కడాలేని విధంగా మల్లన్న సాగర్ 50 టిఎంసిల నీటి నిల్వస్థాయితో చేపట్టడం టి.హనుమంతరావు, సీనియర్ ఇంజనీర్లు కూడా వీటిని సమర్థించడం లేదు.

7) శ్రీరాంసాగర్ 330 మీటర్ల ఎత్తు, నిజాంసాగర్ 429 మీటర్ల ఎత్తులో ఉన్నవి.

ప్రాణహిత–చేవెళ్ల ద్వారా నీటిని నింపాలనుకుంటే ఎల్లంపల్లి బ్యారేజి నుండి గోదావరి నది వెంబడి తక్కువ దూరంతో ఎత్తిపోతల ద్వారా తీసుకెళ్లి తక్కువ ఖర్చుతో నింపుకోవచ్చు. ఫ్రిక్షన్ లాసెస్ చాలా తక్కువ. దీనికి బదులుగా మల్లన్నసాగర్ నుండి నింపాలనుకోవడం అధిక ఆర్థికభారం, ఖర్చు వృథా కాగలదు. ఎందుకనగా +148 మీటర్ల ఎల్లంపల్లి నుండి +530 మీటర్ల లెవల్‌లో ఉన్న మల్లన్నసాగర్‌కు ఎత్తిపోతల ద్వారా నీటిని చాలాదూరం నుండి తీసుకువచ్చి 330 మీటర్లు, 429 మీటర్‌ల లెవల్‌లో ఉన్న ఈ ప్రాజెక్టులకు పంపించడం అధిక ఆర్థికభారం కాగలదు.

8) సింగూరు ప్రాజెక్టు +523 మీటర్ల లెవల్‌లో ఉన్నది.

ఈ ప్రాజెక్టు కింద 530 మీటర్ల లెవల్ నుండి అనగా తడకపల్లి లేదా మల్లన్నసాగర్ నుండి నింపుకోవచ్చు., సింగూరు ప్రాజెక్టు 30 టిఎంసిల సామర్థ్యం ఇది జంటనగరాలకు తాగునీరు అందిస్తున్నది., హిమాయత్ సాగర్ 3 టిఎంసిలు, ఉస్మాన్‌సాగర్ 3 టిఎంసిలు గోదావరి జలాలతో నింపుకున్నట్లయితే హైదరాబాద్ సిటీకి ప్రత్యేకంగా కొత్త రిజర్వాయర్లు నిర్మించుకోవడం అవసరం లేదు.

9) కాళేశ్వరం మేడిగడ్డ వద్ద +100 మీటర్ల లెవల్‌లో బ్యారేజీ నిర్మించుకోవాలనుకుంటే ఈ లెవల్ నుండే శ్రీరాంసాగర్ రెండవదశ ఆయకట్టు 5 లక్షల 87 వేల ఎకరాలకు కాకతీయ కాలువను అనుసంధానం చేసి నీళ్లు అందించవచ్చు. అదేవిధంగా +95 మీటర్ల లెవల్‌తో ఇచ్చంపల్లి ప్రాజెక్టును చేపట్టాలి. ఈ లెవల్‌కు ఇతర రాష్ట్రాల అభ్యంతరం లేదు.

10) తుమ్మిడిహట్టి నుండి కాళేశ్వరం వరకు 115 కి.మీ. పొడవున పారుతున్న ప్రాణహిత నదిపై నాలుగు బ్యారేజీలు నిర్మించుకొనే అవకాశం ఉన్నది. వీటి ద్వారా 250 × 4 = 1000 మెగావాట్ల జలవిద్యుత్తు లభించే అవకాశం ఉన్నది. ప్రాణహిత నది గర్భంలో 10 నుండి 15 మీటర్ల నీటినిల్వ ఎత్తు లభిస్తున్నది. కావున మహారాష్ట్రతో నాలుగు బ్యారేజీల గురించి ఒప్పందం కుదుర్చుకొని పై బ్యారేజీల నిర్మాణం చేపట్టడం తెలంగాణకు సాగునీటితో పాటు జలవిద్యుత్తు లభించగలదు.

11) గోదావరి నదిపై అనేక వరుస బ్యారేజీలు నిర్మాణం చేసుకునే అవకాశం ఉన్నది. అనగా ఒక బ్యారేజీ నీళ్లు ఇంకో పై బ్యారేజీకి తగిలేవిధంగా (షేక్‌హ్యాండ్ సిస్టమ్) బ్యారేజి నిర్మాణం చేసుకోవచ్చు. వీటిద్వారా నావిగేషన్ సౌకర్యం పొందవచ్చు. కానీ మొదట ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంతో సంప్రదించి, పోలవరం ప్రాజెక్టు నుండి సముద్రపు ఓడలు వచ్చేవిధంగా, మార్గం సుగమం చేసుకోవాలి. లేకుంటే పోలవరం ప్రాజెక్టు నావికా మార్గానికి అడ్డంకి కాగలదు., తెలంగాణలోని అన్ని ఉపనదులు, వాగులు, వంకల మీద అనేక చెక్‌డ్యాములు, మైనర్, మీడియం ఇరిగేషన్ ప్రాజెక్టులు గుర్తించి, పరిశోధించి చేపట్టి తెలంగాణలో కురిసే ప్రతి నీటిబొట్టును ఎక్కడికక్కడ ఒడిసిపట్టి నిలుపుకుంటే సత్వర ప్రయోజనాలు చేకూరగలవు. ఇది భారీస్థాయి ప్రాజెక్టులకంటె తక్కువ ఖర్చుతో సత్వర సాగునీటి ప్రయోజనాలు పొందవచ్చు. అప్పుడు రైతులు ఆత్మహత్యల బారినుండి ఉపశమనం పొందగలరు.

పై ప్రతిపాదన వల్ల సుమారు 25 నుండి 30 వేల కోట్ల ప్రజాధనం ఆదా కాగలదు. ఈ సందర్భంగా పై ప్రతిపాదనలను, సూచనలను ప్రజల ముందుకు, తెలంగాణ ప్రభుత్వం ముందుకు తీసుకువస్తూ పునః సమీక్షించుకోవలసిందిగా కోరుచూ.. ప్రజాధనాన్ని కాపాడాలని విజ్ఞప్తి.

*(దొంతుల లక్ష్మీనారాయణ, కన్వీనర్, తెలంగాణ ఇంజినీర్స్ ఫోరం)* వీ

# తెలంగాణలో విద్యుత్ చార్జీల పెంపు

*తెలంగాణ ప్రజలపై విద్యుత్ చార్జీల పెంపు భారం ప్రభుత్వ విధానాల వైఫల్య కారణమేననీ, ఈ విధానాలు రాష్ట్ర ప్రజలపై పెను భారం కానున్నాయనీ అంటున్నారు* **కె. రఘు**

ఎట్టకేలకు చార్జీల పెంపుపై రెగ్యులేటరీ కమిషన్ తన నిర్ణయాన్ని ప్రకటించింది. 2016 జూలై 1 నుండి కొత్త చార్జీలు అమలులోకి వచ్చాయి.

**చార్జీల పెంపులో ముఖ్యాంశాలు**

- జూలై 2016 నుండి మార్చి 2017 వరకు మిగిలిన 9 నెలలలో వినియోగదారులపై పడే చార్జీల భారం 1527 కోట్ల రూపాయలు.
- చార్జీల పెంపు సగటున 7.5 శాతం.
- 100 యూనిట్ల కన్నా తక్కువ విద్యుత్తు వాడే 60 లక్షల గృహ వినియోగదారులపై చార్జీల భారం ఉండదు.
- పరిశ్రమలపై 10 నుండి 12 శాతం వరకు చార్జీలను పెంచారు.

**ఈ కింది వినియోగదారులకు ప్రత్యేక క్యాటగరీని ఏర్పరచారు**

- క్షౌరశాలలకు (ఎల్‌టి-II డి)
- గొర్రెలు, మేకల పెంపకానికి (ఎల్‌టి - III (V))
- హైదారాబాద్ మెట్రో రైల్ - ఎచ్‌టి - V (బి)
- పగటిపూట రైతులకు 9 గంటల విద్యుత్ సరఫరా చేయాలనే నిర్ణయం కారణంగా రాత్రి పూట విద్యుత్ వినియోగం గణనీయంగా పడిపోతుంది. దీంతో విద్యుత్ ఉత్పత్తి ప్లాంట్లను రాత్రి పూట మూసివేయాల్సిన పరిస్థితులు ఏర్పడతాయి. కాబట్టి, రాత్రి పూట విద్యుత్ వినియోగాన్ని పెంచడానికై, పరిశ్రమలు రాత్రిపూట (రాత్రి 10 గంటల నుండి ఉదయం 6 గంటల వరకు) వినియోగించే విద్యుత్తుకు చార్జీలను యూనిట్‌కు ఒక రూపాయి తగ్గిస్తారు.
- ఆదాయపు పన్ను మదింపుదారులకు కూడా వ్యవసాయ రంగ ఉచిత విద్యుత్తు వర్తిస్తుంది.
- ప్రభుత్వం డిస్కంలకు ఇచ్చే మొత్తం సబ్సిడీ రూ 4584.50 కోట్లు.

**మధ్య తరగతిపై తీవ్ర భారం**

కొత్త విద్యుత్ చార్జీలు 100 యూనిట్ల కన్నా ఎక్కువగా విద్యుత్ వినియోగించే మధ్య తరగతి వినియోగదారులపై తీవ్రమైన ప్రభావం చూపెట్టనుంది. గృహ వినియోగదారులపై పడే పాత, కొత్త చార్జీలు పట్టిక - 1 విధంగా ఉన్నాయి.

ఈ చార్జీలకు అదనంగా కస్టమర్ చార్జీలు కూడా ఉంటాయి.

మధ్య తరగతి గృహ వినియోగదారులపై చార్జీల భారాన్ని అర్థం చేసుకోవాలంటే చార్జీల అమలులో ఉన్న 'టెలిస్కోపిక్', 'నాన్-టెలిస్కోపిక్' పద్ధతుల గురించి తెలుసుకోవాలి.

**పట్టిక - 1**

**2016-17 సంవత్సరానికి గృహ వినియోగదారులపై చార్జీలు**

| కాటగరీ | విద్యుత్ చార్జీలు | |
|---|---|---|
| | **2015-16** | **2016-17** |
| గృహ వినియోగం | | |
| ఎల్‌టి-I (ఏ) (0-100 వరకు) | | |
| 0-50 | 1.45 | 1.45 |
| 51-100 | 2.60 | 2.60 |
| ఎల్.టీ.-I (బి)(i) (100-200 వరకు) | | |
| 0-100 | 2.60 | 3.30 |
| 101-200 | 3.60 | 4.30 |
| ఎల్.టీ.-I (బి)(ii) | | |
| (200 యూనిట్ల పైన) | | |
| 0-200 | 0-50 - 2.60 | 5.00 |
| | 51-100 - 3.25 | 5.00 |
| | 101-150 - 4.90 | 5.00 |
| | 151-200 - 5.65 | 5.00 |
| 201-300 | 201-250 - 6.80 | 7.20 |
| | 251-300 - 7.30 | 7.20 |
| 301-400 | 7.80 | 8.50 |
| 401-800 | 8.50 | 9.00 |
| 800 యూనిట్ల పైన | 8.50 | 9.50 |

**గృహ వినియోగదారులపై కస్టమర్ చార్జీలు**

| విద్యుత్ వినియోగం | 2015-16 | 2016-17 |
|---|---|---|
| 0-50 | 25 | 25 |
| 51-100 | 30 | 30 |
| 101-200 | 35 | 50 |
| 201-300 | 40 | 60 |
| >300 | 45 | 80 |

**టెలిస్కోపిక్ పద్ధతి:** ఈ పద్ధతిలో విద్యుత్ వినియోగం ఒక శ్లాబు నుండి మరొక శ్లాబులోకి మారినపుడు, అదనపు చార్జీల వర్తింపు కేవలం అదనపు వినియోగం వరకే పరిమితమవుతుంది. ఉదాహరణకు ఏదేని వినియోగదారుని విద్యుత్ వినియోగం 50 నుండి 100 యూనిట్లు

పెరిగిన చార్జీల ప్రభావం గృహ వినియోగదారులపై ఎలా ఉండబోతోందో చూద్దాం

| విద్యుత్ వినియోగం | 2015-16 చార్జీల ప్రకారం భారం (రూ.లలో) | 2016-17 చార్జీల ప్రకారం భారం (రూ.లలో) | పెంపు మొత్తం (రూ.లలో) | పెంపు శాతం |
|---|---|---|---|---|
| 100 | 50×1.45+50×2.60+30=232.50 | 50×1.45+50×2.60+30=232.50 | 0.00 | 0.00 |
| 101 | 100×2.60+3.60+35=298.60 | 100×3.30+4.30+50=384.30 | 85.70 | 28.70 |
| 200 | 100×2.60+100×3.60+35=655.00 | 100×3.30+100×4.30+50=810 | 155.00 | 23.66 |
| 201 | 50×2.60+50×3.25+50×4.90+50×5.65+ 6.80+40= 866.80 | 200×5.00+7.20+60=1067.20 | 200.40 | 23.11 |
| 300 | 50×2.60+50×3.25+50×4.90+50× 5.65+50×6.80+50×7.30+40=1565 | 200×5.00+100×7.20+60=1780 | 215.00 | 13.73 |
| 301 | 50×2.60+50×3.25+50×4.90+50×5.65+ 50×6.80+50×7.3+7.80+45=1577.80 | 200×5.00+100×7.20+8.50+80 =1808.50 | 230.70 | 14.62 |
| 400 | 50×2.60+50×3.25+50×4.90+50×5.65+ 50×6.80+50×7.3+100×7.80+45=2350 | 200×5.00+100×7.20+100× 8.50+80=2650.00 | 300.00 | 12.76 |
| 401 | 50×2.60+50×3.25+50×4.90+50× 5.65+50×6.80+50×7.3+100×7.80+ 8.50+45=2358.50 | 200×5.00+100×7.20+100× 8.50+9.00+80=2659.00 | 300.50 | 12.74 |
| 500 | 50×2.60+50×3.25+50×4.90+50× 5.65+50×6.80+50×7.3+100×7.80+ 100×8.50+45=3199.50 | 200×5.00+100×7.20+100× 8.50+100×9.00+80=3550 | 350.50 | 10.95 |

ఉంటే, మొదటి 50 యూనిట్లకు యూనిట్‌కు రూ 1.45, ఆపై వినియోగానికి యూనిట్‌కు రూ 2.60 విధిస్తారు.

**నాన్-టెలిస్కోపిక్ పద్ధతి:** ఈ పద్ధతిలో విద్యుత్ వినియోగం ఒక శ్లాబు నుండి మరొక శ్లాబులోకి మారినపుడు అదనపు చార్జీలు మొత్తం విద్యుత్ వినియోగానికి వర్తిస్తాయి. ఉదాహరణకు విద్యుత్ వినియోగం 101 యూనిట్లు ఉంటే, 2016-17 చార్జీల ప్రకారం మొదటి మొత్తం 100 యూనిట్లకు, యూనిట్‌కు రూ 3.30, ఆ పై వినియోగానికి యూనిట్‌కు రూ 4.30 చార్జీలను విధిస్తారు.

మొదట్లో రాష్ట్రంలో టెలిస్కోపిక్ చార్జీల విధానం అమలులో ఉండేది. క్రమంగా పాక్షికంగా నాన్-టెలిస్కోపిక్ పద్ధతిని 2015-16 వరకు అమలు చేశారు. ప్రస్తుతం ప్రకటించిన చార్జీలలో మొదటి 100 యూనిట్ల వినియోగం వరకే టెలిస్కోపిక్ పద్ధతి ఉండి, మిగిలిన వినియోగానికి మొత్తం నాన్-టెలిస్కోపిక్ పద్ధతిని అమలు చేశారు.

చార్జీల పెంపు కేవలం 7.50 శాతం అని ప్రభుత్వం చెప్పినా, ఈ పెంపు సుమారు 29 శాతం వరకు ఉంటుందని అర్థం అవుతుంది. చార్జీల పెంపు ప్రభావం 100 నుండి 200 యూనిట్లను వాడే మధ్య తరగతి వినియోగదారులపై అత్యధికంగా ఉంటుందని పట్టిక-7 ద్వారా స్పష్టం అవుతుంది.

**యూనిట్ అదనంగా వాడితే రూ 400 పైగా మోత**

నాన్-టెలిస్కోపిక్ పద్ధతి కారణంగా మధ్య తరగతిపై కొన్ని ప్రత్యేకమైన పరిస్థితులలో విపరీతమైన భారాలు పడతాయి. ఉదాహరణకు ప్రస్తుతం 200 యూనిట్లు వాడే వినియోగదారులు ఒక్క యూనిట్ అదనంగా వాడితే దాని ప్రభావం ఎలా వుంటుందో చూద్దాం.

- 200 యూనిట్లకు ప్రస్తుత చార్జీల ప్రకారం వచ్చే బిల్లు : రు. 655.00
- 201 యూనిట్లకు పెరిగిన చార్జీల ప్రకారం వచ్చే బిల్లు : రు. 1067.20
- **ఒక్క యూనిట్ అదనంగా వాడినందుకు పెరిగిన బిల్లు : రు. 412.20.**

అలాగే

- 100 యూనిట్లకు ప్రస్తుత చార్జీల ప్రకారం వచ్చే బిల్లు :రు. 232.50
- 101 యూనిట్లకు పెరిగిన చార్జీల ప్రకారం వచ్చే బిల్లు :రు. 384.30
- **ఒక్క యూనిట్ అదనంగా వాడినందుకు పెరిగిన బిల్లు : రు. 151.80**

ఒక్క యూనిట్ అదనంగా వాడితే ఈ స్థాయిలో చార్జీలు పెరుగుతాయని వినియోగదారులకు అవగాహన లేదు. దాంతో కేవలం చార్జీల పెంపు కారణంగానే బిల్లు పెరిగిందని చాలా మంది అనుకుంటారు. ఈ విధంగా ఒక్క యూనిట్ కారణంగా ఇంతగా బిల్లు పెరుగుతుందని ముందే తెలుస్తే ఈ వినియోగదారులు జాగ్రత్త పడే అవకాశం ఉంది. ఈ దిశగా డిస్కంలు ఎలాంటి ప్రయత్నమూ చేయడం లేదు. ఒకవేళ తెలిసినా వినియోగదారులు మీటరు రీడింగు చూసుకుంటూ విద్యుత్ వాడకాన్ని నియంత్రించడం చాలా కష్టం.

వినియోగదారులు జాగ్రత్తగా ఉన్నప్పటికీ డిస్కంల మీటర్ రీడర్లు మీటర్ రీడింగులో ఒక్క రోజు ఆలస్యం చేసినా వినియోగం మరో శ్లాబులోకి వెళ్లే ప్రమాదం ఉంది. మీటర్ రీడింగు ప్రతి నెలా ఖచ్చితంగా 30 రోజులకే తీయాలని ఎలాంటి నిబంధన లేదు. సాధారణంగా నెలలో

విద్యుత్ సంస్థలకు ప్రధానంగా ఆదాయాన్నిచ్చే సంస్థ రైల్వే. రైల్వేల నుండి విద్యుత్ సంస్థలకు అన్ని చార్జీలను కలుపుకొని ప్రతీ యూనిట్‌కు రూ 7 కుపైగానే ఆదాయం వస్తున్నది. అయితే ఇటీవల రైల్వేలు విద్యుత్ సంస్థల నుండి కాకుండా, నేరుగా బహిరంగ మార్కెట్లో విద్యుత్తును కొనాలని ఆలోచిస్తున్నాయి. రైల్వేలకు కేంద్ర ప్రభుత్వం డీమ్డ్ లైసెన్స్ హోదాను ఇచ్చింది. సాధారణంగా ఏ వినియోగదారుడైనా ఒకవేళ విద్యుత్ సంస్థల నుండి కాకుండా నేరుగా బహిరంగ మార్కెట్లో విద్యుత్తును కొంటే ఆ వినియోగదారుడు విద్యుత్ సంస్థలకు 'క్రాస్ సబ్సిడీ సర్చార్జ్'ను చెల్లించాల్సి వస్తుంది. 'క్రాస్ సబ్సిడీ సర్చార్జ్'ను రెగ్యులేటరీ కమిషన్ నిర్ణయిస్తుంది. కానీ రైల్వేలకు ఈ 'క్రాస్ సబ్సిడీ సర్చార్జ్'ల చెల్లింపులపై కేంద్ర ప్రభుత్వం మినహాయింపు ఇచ్చింది. ఇదే విధంగా హైదరాబాద్ మెట్రో రైల్ కూడా ప్రారంభమైన తర్వాత డిస్కంల నుండి కాకుండా బహిరంగ మార్కెట్లో నేరుగా విద్యుత్తును కొనాలనే ప్రయత్నాలను మొదలు పెట్టింది. ఒకవేళ రైల్వేలు విద్యుత్ సంస్థల నుండి కాకుండా నేరుగా బహిరంగ మార్కెట్లో విద్యుత్తును కొనుగోలు చేయడం మొదలు పెడితే విద్యుత్ సంస్థలకు జరిగే నష్టం అపారం. పేద వర్గాలకు లభించే క్రాస్ సబ్సిడీలు తగ్గిపోయి ప్రభుత్వాల మీద, ప్రజల మీద పడే భారాలు పెరుగుతాయి.

మొదటి రెండు వారాలలో మీటర్ల రీడింగు తీసుకుంటారు. కాబట్టి వినియోగం ఖచ్చితంగా 30 రోజులకు తీసే అవకాశం లేదు. శ్లాబు మారడంవల్ల డిస్కంలకు అదనపు ఆదాయం సమకూరడంతో, ఖచ్చితంగా ప్రతి 30 రోజులకు మీటర్ రీడింగ్ తీసుకునేందుకు ప్రయత్నాలు ఏమీ జరగడం లేదు. 'టెలిస్కోపిక్' పద్ధతిలో ఇలాంటి ప్రమాదం ఉండదు. కాబట్టి 'నాన్-టెలిస్కోపిక్' స్థానంలో 'టెలిస్కోపిక్' విధానాన్ని ప్రవేశ పెట్టాలి. అప్పటి వరకు మీటర్ రీడింగును 30 రోజులకు సవరించే విధంగా బిల్లింగ్ సాఫ్ట్‌వేర్‌ను మార్చాలి. 2016-17 టారిఫ్ ఆర్డర్‌లో ఈ మేరకు రెగ్యులేటరీ కమిషన్ విద్యుత్ సంస్థలకు ఆదేశాలు జారీచేసింది.

**చార్జీల పెంపే పరిష్కారమా?**

చార్జీల పెంపుతో విద్యుత్ సంస్థలు నష్టాల నుండి బయట పడతాయా? విద్యుత్ సంస్థల రెవిన్యూ లోటు 2014-15 నాటికి రూ 13867 కోట్లు. 2015-16లో ఈ లోటు సుమారు రూ 3900 కోట్లు. వచ్చే సంవత్సరానికి ఈ లోటు రూ 20000 కోట్లు దాటుతాయి. ప్రస్తుతం చార్జీల పెంపు ద్వారా విద్యుత్ సంస్థలకు వచ్చే అదనపు ఆదాయం రూ 1527 కోట్లు మాత్రమే. అంటే చార్జీల పెంపు ద్వారా విద్యుత్ సంస్థల నష్టాలు పూర్తిగా తీరే అవకాశం లేదు. నిజానికి చార్జీల పెంపుతో విద్యుత్ సంస్థల ఆర్థిక పరిస్థితిపై ప్రతికూల ప్రభావం పడే అవకాశం ఉంది. ఎందుకంటే, విద్యుత్ చట్టం 2003 అమలు లోకి వచ్చిన తరువాత, విద్యుత్ సంస్థలకు అధిక ఆదాయాన్ని సమకూర్చే పరిశ్రమలు, వ్యాపార సంస్థలు, డిస్కంల నుండి కాకుండా నేరుగా బహిరంగ మార్కెట్లో విద్యుత్తును కొనే అవకాశం కలిగింది. చార్జీలు ఎక్కువగా పెరిగినప్పుడు ఈ వర్గాలు డిస్కంలకు దూరం అయ్యే ప్రమాదం ఉంది. ఇప్పటికే చాలా పరిశ్రమలు బహిరంగ మార్కెట్లో విద్యుత్తును కొనడం మొదలు పెట్టాయి. అలాగే సోలార్ లాంటి ప్రత్యామ్నాయ మార్గాలపై వినియోగ దారులు దృష్టి పెడుతున్నారు. దీంతో విద్యుత్ సంస్థలు మరింత నష్టాల్లో కూరుకు పోవడం ఖాయం.

**చార్జీలను పెంచకుండా విద్యుత్ సంస్థలు నష్టాల నుండి ఎలా బయట పడతాయి?**

నష్టాల నుండి బయట పడాలంటే మొదట నష్టాలకు కారణమేంటనే విషయం పరిశీలించాలి. విద్యుత్ సంస్థల మొత్తం ఖర్చులలో 85 శాతం విద్యుత్ కొనుగోలు ఖర్చు ఉంటుంది. గత కొన్ని సంవత్సరాలుగా విద్యుత్ కొనుగోలు ఖర్చు విపరీతంగా పెరిగిపోయింది. దీనిని నియంత్రించాల్సిన అవసరం ఉంది. విద్యుత్ కొనుగోళ్లలో పోటీ బిడ్డింగు పద్ధతిని అవలంబించడం, 'పిట్-హెడ్' ప్లాంట్ల నిర్మాణంపై దృష్టి పెట్టడం, ప్రాజెక్టుల నిర్మాణ ఖర్చు తగ్గించడం, సకాలంలో ప్రాజెక్టులను పూర్తి చేయడం, ఇంధన కొనుగోళ్లలో, సరఫరాలో, వినియోగంలో జాగ్రత్త వహించడం, తద్వారా విద్యుత్ ఉత్పత్తి ఖర్చును తగ్గించడం లాంటి చర్యలపై విద్యుత్ సంస్థలు దృష్టి పెట్టాలి. అలాగే సరఫరా, పంపిణీ నష్టాలు కూడా వాస్తవానికి విద్యుత్ సంస్థలు చెబుతున్నదాని కన్నా చాలా అధికంగా ఉంటాయి. సరఫరా, పంపిణీ నష్టాలను తగ్గించి చూపెట్టడానికై, వ్యవసాయరంగ వినియోగం పెంచి చూపెట్టడం బహిరంగ రహస్యం. కాబట్టి వాస్తవ సరఫరా, పంపిణీ నష్టాలు లెక్కించి, ఈ నష్టాలను తగ్గించే ప్రయత్నం చేయాలి. విద్యుత్ వినియోగంలో, ప్రధానంగా వ్యవసాయ రంగంలో సామర్థ్య పెంపు చర్యలు (కెపాసిటర్లను పెట్టడం లాంటి చర్యలు) చేపట్టడం తప్పనిసరి.

*('తెలంగాణ విద్యుత్ రంగంలో ఏం జరుగుతున్నది?' రెండేళ్ల పరిణామాలపై విశ్లేషణ – పుస్తకంలో నుంచి)*

*(రచయిత అధికార ప్రతినిధి, తెలంగాణ జాయింట్ యాక్షన్ కమిటీ (టీజేఏసీ)*

## రాబోయే సంచికలలో...

- పేదరికం తగ్గనిదే అభివృద్ధి అసాధ్యం - వి. హనుమంతరావు
- భారత వ్యవసాయ సమస్యపై మరోచూపు - డి. నరసింహారెడ్డి
- సెక్యులరిజం - టెర్రరిజం - విద్యాభూషణ్
- ఉద్యమ మేధావి ప్రొ. బి జనార్దన్ రావు - సుంకరి సత్యం
- ఆధునిక బానిస భారతం - సంతోష్

# ఉద్యోగులకిచ్చిన హామీలు మరచిన ప్రభుత్వం

*రాష్ట్రం ఏర్పడి రేండేళ్లు పూర్తయినా ప్రభుత్వం ఉద్యోగులకు ఇచ్చిన హామీల పట్ల నాన్చుడు ధోరణి అవలంబిస్తోందని అంటున్నారు* **బి. రామకృష్ణ**

తెలంగాణ రాష్ట్రంలో తొలి ప్రభుత్వం ఏర్పాటు చేసిన ఉద్యమ పార్టీగా చెప్పుకున్న టిఆర్ఎస్, దాని నాయకుడు కెసిఆర్ పై కొన్ని నమ్మకాలు ఉద్యోగులకు ఉండడం సహజం. అడక్కుండానే తెలంగాణ స్పెషల్ పే అని టిఆర్ఎస్ ప్రభుత్వం 2014 ఆగస్టు 14 నుండి ఇచ్చింది. ఆ తరువాత పే రివిజన్ స్కేల్స్(పిఆర్సి) బకాయిలను చెల్లిస్తుందని ఎదురు చూసిన ఉద్యోగులకు నిరాశే మిగిలింది. సాధారణంగా పే రివిజన్ కమిషన్‌ను ఆలస్యంగా నియమిస్తున్నారు. అదేవిధంగా పే రివిజన్ కమిషన్ వేతనాలను ఇవ్వాల్సిన తేదీ నుండి కాకుండా సంవత్సరాలు గడిచాక గాని అమలు చేయడం లేదు. ఆ కాలానికి చెల్లించవల్సిన బకాయిలను నగదు రూపంలో కాకుండా నోషనల్ పేరుతో పేపర్ పైన మాత్రమే సూచిస్తారు. మరికొన్ని బకాయిలను నగదు రూపంలో కాకుండా జనరల్ ప్రావిడెంట్ ఫండ్ (జిపిఎఫ్) ఖాతాల్లో జమచేస్తున్నారు. ఈ సారి పే రివిజన్ స్కేల్స్-2015లో భాగంగా 2013 జూలై 1 నుండి 2014 జూన్ 1 వరకు వేతన బకాయిలను నోషనల్‌గా చూపించారు. 2014 జూన్ 2 నుండి 2015 ఫిబ్రవరి 2 వరకు 9 నెలల బకాయిలను జిపిఎఫ్‌లో జమ చేస్తామన్నారు కానీ స్పష్టత ఇవ్వలేదు. బాండ్ల రూపంలో ఇస్తామని ఒకసారి, జిపిఎఫ్‌లో జమచేస్తామని మరోసారి చెబుతూ పోయారు. నేటి వరకు ఈ రెండూ జరగలేదు. వీటికి సంబంధించి ఉత్తర్వులు తరువాత వస్తాయని చెప్పారు. స్వయంగా ముఖ్యమంత్రి ప్రకటించి పదహారు నెలల కాలం గడిచిపోతున్నప్పటికి ఎలాంటి ఉత్తర్వులు రాలేదు.

మార్చ్ 2015 నుండి నూతన పే రివిజన్ స్కేల్స్ ప్రకారం ఉద్యోగులు జీతాలు తీసుకుంటున్నారు. గతంలో కొత్త ఖఖీఅ అమల్లోకి వచ్చిన వెంటనే కొన్ని బకాయిలను జిపిఎఫ్‌లోకి జమచేసేవారు. కానీ తెలంగాణ రాష్ట్రం ఏర్పడి మొట్టమొదటి ముఖ్యమంత్రిగా కల్వకుంట్ల చంద్రశేఖర్ రావు పదవి చేపట్టాక ఆ పరిస్థితికి భిన్నమైన ఆచరణ అమల్లోకి వచ్చినట్లైంది. నిజానికి ఉద్యోగులకు నిబంధనల ప్రకారం ఇవ్వాల్సిన దాన్ని ఇవ్వకుండా టిఆర్ఎస్ ప్రభుత్వం తన మార్కును చూపుకుంటున్నట్లైంది. ఈ ప్రభుత్వంపైన వెంటవెంటనే ఒత్తిడి ఎందుకని, ఇప్పుడిప్పుడే అడుగులు వేస్తున్నదనో, ఆంధ్ర పాలకుల చెర నుండి విడివడి తనకుతానుగా లేచి నిలుస్తున్నదనో, తెలంగాణ ఉద్యమంలో రాజకీయ పార్టీగా తమతో కలసి నడిచిందనో, మనోళ్లే కదా! నిన్నమొన్నటిదాకా భుజం, భుజం కలిసి సాగినాం కదా! ఈ ప్రభుత్వం వద్ద చనువు ఉంటుందనో, చొరవతో పనులు చేయించుకోవచ్చనో, మన ప్రభుత్వమే కదా అనే భ్రమలో, నమ్మకాలో, విశ్వాసాలో ఏవైతేనేమి కానీ ఈ ప్రభుత్వం పనితీరుపై వేచి చూసే ధోరణితో చాలావరకు ఉద్యోగ సంఘాలు ఉంటూ వచ్చాయి.

టిఆర్ఎస్ పాలనలోకొచ్చి రెండేళ్లు గడిచిన సందర్భంలో కూడా అసలు డిమాండ్స్ గానే చెప్పబడనవి అయిన పే రివిజన్ స్కేల్స్ 2015 బకాయిలను జిపిఎఫ్ లో వేయమని, హెల్త్ కార్డులను అన్ని ఆస్పత్రుల్లో అనుమతించమని, రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగులందరికి హెల్త్ కార్డులు ఇవ్వమని డిమాండ్ చేసే కార్నర్‌కు నెట్టివేయబడుతున్నారు. ఏ ప్రభుత్వమైనా దినవారి కార్యక్రమంగా ఇవి చేయవలసినవే తప్పిస్తే వీటికి ఏ అధ్యయనాలు అవసరం లేదు. చిక్కుముల్లు ఏమీ లేనట్టివి కూడా. వీటిని కూడా టిఆర్ఎస్ ప్రభుత్వం నాన్చుతూ పోతున్నది. ధనిక రాష్ట్రం అని చెబుతూ వచ్చిన కెసిఆర్‌కు ఇవి ఓ లెక్కాకాదు, సమస్య అసలేకాదు.

అన్ని వర్గాల ప్రజలు తెలంగాణ కోసం ఉద్యమించారు. తెలంగాణ ఉద్యమంలో విద్యార్థులు మిలిటెంటుగా కదిలారు. ఎందరో ప్రాణత్యాగాలు చేశారు. ఈ ఉద్యమంలో ఉద్యోగుల పాత్ర కీలకమైనది, గణనీయమైనది. సకల జనుల సమ్మెలో భాగంగా నెలకు పైగా తెలంగాణ కోసం సమ్మెచేశారు, విధులను బహిష్కరించారు. ఉద్యోగులు తమ వృత్తిపర డిమాండ్స్ కాకుండా కేవలం తెలంగాణ సాధనే ఏకైక డిమాండ్‌గా సమ్మె చేసి చరిత్రలో నిలిచిపోయారు. అలా సమ్మె చేయడం చట్టవిరుద్ధమని ఎమర్జెన్సీ సర్వీసెస్ మెయింటనెన్స్ యాక్ట్(ఎస్మా) పేరుతో ఉద్యోగులను శిక్షించే, బెదిరించే చర్యలను అప్పటి కాంగ్రెస్ ప్రభుత్వం చేపట్టడం జరిగింది. అయినప్పటికీ వాటిని లెక్క చేయకుండా సమ్మెను కొనసాగించారు. ఉపాధ్యాయులు సమ్మెకాలం దినాలను బర్తీ చేసేందుకు అదనంగా సెలవు రోజుల్లో పనిచేసి పాఠాలు బోధించి విద్యార్థులకు నష్టం కలగకుండా చూసుకున్నారు. ఈ సమ్మె అప్పటి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలపై తెలంగాణ కోసం తీవ్రమైన ఒత్తిడిని తెచ్చింది. తెలంగాణ రాష్ట్ర సాధనకోసం జరిగిన ఉద్యమంలో ఉద్యోగులు, ఉపాధ్యాయులు, లెక్చరర్లు, ప్రొఫెసర్లు, ఆర్టీసీ, విద్యుత్ రంగ ఉద్యోగులు, కార్మికులు, సింగరేణి కార్మికులు ఒకటేమిటి అన్ని రకాల ఉద్యోగులు సమ్మెలో పాల్గొన్నారు. 1400 మంది వరకు విద్యార్థులు, యువకులు, ఇతరులు కాల్చుకుని, ఉరేసుకుని, ఇతరత్రా ఆత్మ బలిదానాలకు పాల్పడ్డారు. వీటన్నింటి ఫలితంగా తెలంగాణ సాధించబడింది. అయితే ఈ ఖ్యాతినంతా సొమ్ము చేసుకోవడంలో టిఆర్ఎస్ ముందున్నది.

తమ సర్వీస్ పర డిమాండ్లను పక్కనపెట్టి కేవలం తెలంగాణ కోసం చారిత్రాత్మక సమ్మెను నెలరోజులకు పైగా చేసిన ఉద్యోగులకు ఉఖఈలో కలపాల్సిన 9 నెలలు వేతన బకాయిలను కూడా పక్కకు పెట్టడం ద్వారా ప్రభుత్వం తాను చెప్పుకున్నట్లుగా 'ఉద్యోగ ఫ్రెండ్లీ' అనబడుతుందా?

వేచిచూద్దాం అనుకునే సంఘాలకు ఇంకా వేడి తగులకపోవడాన్ని ఏమనుకోవాలో? జూన్ 2, 2014 తరువాత రిటైర్ అయిన వారికి గ్రాట్యూటీ బకాయిలు రావలసి ఉన్నది. పెన్షనర్లకు బకాయిలు రావలసి ఉన్నది. ఇంతమందికి అందాల్సిన బకాయిలను చెల్లించకుండా ఉద్యోగుల స్నేహపూర్వక అనేది అటుంచి కనీసం దక్కాల్సినవి కూడా దక్కకుండా చేయడం కెసిఆర్ ప్రభుత్వానికే చెల్లింది.

గత పే రివిజన్ కమిషన్ (పిఆర్‌సి) అమలయిన నుండి 5 ఏళ్ల కాలంలోగా కొత్త పిఆర్‌సి వేయాలి. సకాలంలో వచ్చిన పిఆర్‌సిలు దాదాపుగా లేవు. అందువల్ల ఉద్యోగులు నష్టపోతూనే ఉంటారు. కొంతమేరకు కంపేన్‌సేట్ చేసేందుకు మధ్యంతర భృతిను (ఐఆర్) ఇస్తుంటారు. 5 ఏళ్ల కాలం పూర్తయినా ఏ రెండేళ్లకో గాని కొత్త వేతనాల స్థిరీకరణ జరుగదు. ఇందులో కొంత కాలాన్ని నోషనల్‌గా పరిగణించి నగదుగా చెల్లించనే చెల్లించరు. కొన్ని నెలల బకాయిలను సాధారణ భవిష్య నిధి(జిపిఎఫ్) లో వేస్తుండడం ఆనవాయితీగా వస్తున్నది. నిజానికి ప్రతి 5 ఏళ్లకోసారి పెరిగే ధరలకు అనుగుణంగా కొత్త వేతన స్థిరీకరణ జరగాలి. అలా చేయకుండా ఆలస్యం చేస్తుండడం సాధారణ విషయంగా మారిపోయింది. సాధారణంగా ప్రతి ఐదేళ్లకోసారి వేసే పిఆర్‌సి కోసం కూడా పోరాటాలు చేసిన సందర్భాలు చరిత్రలో ఉన్నాయి. మామూలుగా ఇచ్చే కరువు భత్యం (డిఎ)ల కోసమూ ఉద్యమాలు చేసిన దాఖలాలు ఉన్నాయి. ఉద్యమపార్టీగా చెప్పబడి, ఉద్యోగ స్నేహపూరితమని అధికారంలోకి వచ్చిన టిఆర్ఎస్ కూడా అదే కోవలోకి చేరిపోవడం ఉద్యోగుల పట్ల చూపుతున్న నిర్లక్ష్య వైఖరికి నిదర్శనం. అప్పుడే అధికార మత్తులోకి టిఆర్ఎస్ చేరిపోయిందని అనిపిస్తున్నది. అయినా కూడా చాలావరకు ఉపాధ్యాయ, ఉద్యోగ సంఘాలు ఇంకా ఈ ప్రభుత్వం పట్ల వేచి చూసే పరిస్థితిలో ఉండడమే విషాదం.

కరెంటు చార్జీలు, ఇంటి అద్దెలు, వైద్యం ఫీజులు, మందులు, ఉప్పు, పప్పు బియ్యం కూరగాయలు మొదలగు వాటి ధరలు పెరగకుండా ఉంటే ఉద్యోగుల జీతాలు పెంచాల్సిన అవసరమేరాదు. కాని అలా జరుగదు. అటువైపు ప్రభుత్వాలు చర్యలు తీసుకోలేకపోతున్నాయి. ఉన్నతస్థాయి ఉద్యోగులకు తప్పిస్తే కొత్త పేరివిజన్ స్కేల్ ద్వారా జీతాలు పెరిగినట్లు అనిపించినా నిజ వేతనాల్లో పెరిగిన ధరలతో పోల్చినప్పుడు మార్పేమి ఉండదు. నిజంగా ఉద్యమాలు జీతాల పెంపుకోసం కాకుండా ధరలు పెరుగకుండా చేస్తే ఉద్యోగులకే కాదు సాధారణ ప్రజలందరికి మేలు జరుగుతుంది. ఇదే విషయాన్ని గతంలో ఉపాధ్యాయ ఉద్యమ నాయకుడు ఆకుల భూమయ్య చెప్పి ఉన్నాడు.

2014 నవంబర్ 1న ప్రారంభించిన హెల్త్ కార్డులపై నగదు రహిత వైద్యం అమల్లోకి రాకుండా పోయింది. చాలావరకు కార్పొరేటు ఆసుపత్రుల్లో ఈ కార్డులను పట్టించుకోవడం లేదు. ఈ ఆసుపత్రులన్ని ప్రభుత్వ సబ్సిడిలతో నడుస్తున్నవే. పేదలకు రాయితీలతో కూడిన వైద్యాన్ని అందిస్తామని అంగీకరించిన తరువాతనే అనుమతులు పొంది ఉన్నవి. అటువంటి వాటిలో ప్రభుత్వ మాటకు, చట్టాలకు, నియమ నిబంధనలకు విలువ లేకుండా పోయింది. ఈ సందర్భంలో ఎవరు ఎవరిని శాసిస్తున్నారో, ఎవరు శక్తిమాన్‌లుగా విలసిల్లుతారో అర్థం చేసుకోవచ్చు.

విద్యా, వైద్యం అనేవి ఏ వ్యవస్థలోనైనా ప్రభుత్వ బాధ్యతగా ఉంటుంది. ఉండాలి కూడా. ప్రస్తుతం ఈ రెండూ ప్రభుత్వ బాధ్యత నుండి తప్పించబడుతున్నాయి. సమాజం పురోగమించడానికి, ప్రగతిశీలంగా ఎదగడానికి తనకుతానుగా తనలోని వ్యక్తులకు విద్యను, వైద్యాన్ని తప్పనిసరిగా అందించాల్సి ఉంటుంది. ఇవి ఎవరికి వారుగా తమ వ్యక్తిగత వ్యవహారంగా చూడబడేవి కాదు. మొత్తం సమాజమే వీటికి బాధ్యత పడాల్సి ఉంటుంది. కాని ఇవి దేశవ్యాప్తంగా అలాగే రాష్ట్రంలో కూడా ప్రైవేటు సంస్థల చేతుల్లో వ్యాపారసరకుగా మారిపోయాయి. ఇవి వ్యాపార వస్తువులుగా మారడం అంటే ఆ సమాజంలో పతనాన్ని, విలువల రాహిత్యాన్ని సూచిస్తుంది. ఆరోగ్యవంతమైన మనుషులు ఆరోగ్యవంతమైన సమాజాన్ని నిర్మిస్తారు. ఆరోగ్యవంతమైన సమాజం సామాజికావసరాలను తీర్చే ఉత్పత్తిని చేయగలుగుతుంది. ప్రజలందరి దైనందిన అవసరాలను తీరుస్తుంది. ఈ సందర్భంలో "అనారోగ్యాన్ని తొలగించాలంటే అనారోగ్యకరమైన ఆర్థిక వ్యవస్థను సరిచేయాలి" అని నార్మన్ బెథూన్ చెప్పిన మాటలు గుర్తుకు రాకమానవు.

నిజానికి ప్రైవేటు, కార్పొరేట్ ఆసుపత్రుల వ్యవస్థనే సరైంది కాదు. పూర్తిగా ఉచితంగా ప్రతి ఒక్కరికీ వైద్యం అందించే సమాజం ఉండాలి. అటువైపుగా ఈ సమాజం ఎదగాల్సి ఉంది. అందుకోసం ప్రజాస్వామిక ప్రభుత్వాలు, వ్యవస్థలు కృషి చేయాలి. అలాంటిదిపోయి ప్రైవేటు వైద్యశాలలు, వ్యాపార దృష్టితో లాభాలు ఆర్జించే కంపెనీలుగా మారడం, ఈ సమాజ దుస్థితిని తెలుపుతున్నది. అందుకు ఈ ప్రభుత్వాలు బాసటగా నిలవడం అనేది మరింత దిగజారుడుతనానికి నిదర్శనం అని అనుకోకుండా ఉండలేము. ఉచిత, నాణ్యమైన విద్య, వైద్యం అనేవి ఉద్యోగులకే కాదు అందరు ప్రజలకు అందించబడాలి. అలాచేయడానికే ప్రభుత్వం, ప్రజాస్వామిక వ్యవస్థలున్నాయి. అంతేగాని ప్రజలచే ఎన్నుకోబడిన పాలకవ్యవస్థలు చేష్టలుడిగి, అసహాయంగా, కార్పొరేటు సంస్థలను దేబిరిస్తున్నట్లుగా మారడం ప్రజలను అవమానించినట్లే అవుతుంది.

ప్రజలందరికి మెరుగైన వైద్యం అందేలా ప్రభుత్వ ఆసుపత్రులను విస్తరించి, వాటిలో సరైన వైద్య సిబ్బందిని, వైద్య పరికరాలను, యంత్రాంగాన్ని ఏర్పాటు చేయకుండా 'ఆరోగ్యశ్రీ' అనే పథకం ద్వారా ప్రైవేటు వాటికి లాభాలు చేకూర్చే విధానాన్ని ముందుకు తెచ్చారు. నిజానికి ఉద్యోగులదైనా, సాధారణ ప్రజలదైనా, ఉన్నతస్థాయి పదవుల్లో ఉన్న ఏ వ్యక్తిదైనా ఆరోగ్యం ఆరోగ్యమే. ప్రాణం ప్రాణమే. ఇందులో ఒకరిది తక్కువ, మరొకరిది ఎక్కువ అనేది ఉండదు. ఉండకూడదు కూడా. ఇది ఆచరించవల్సిన ఒక ఆదర్శం. దీన్ని చేరుకోవడానికి ప్రతి సమాజం కృషిచేయాలి. అందులో సఫలీకృతం కావడంలోనే ఆ సమాజ ఔన్నత్యం ఉంటుందనడంలో సందేహపడవల్సిందేమిలేదు. అందుకోసం అందరూ ఉద్యమించాల్సి ఉన్నది.

అధికారంలోకొచ్చి రెండు సంవత్సరాలు గడిచి, ప్రభుత్వం హామీపడ్డ హెల్త్ కార్డులను ప్రారంభించి 20 నెలలు పూర్తయ్యాక కూడా, హెల్త్ కార్డులపై నగదు రహిత వైద్యం నిరుపయోగంగా మారింది. మరీ విచిత్రమేమిటంటే ఎయిడెడ్, రెసిడెన్షియల్, మోడల్ స్కూల్స్ ఉపాధ్యాయులు, సిబ్బందికి, ప్రభుత్వ రంగ సంస్థల, వైద్య విధాన పరిషత్, మున్సిపల్ ఉద్యోగులకు హెల్త్ కార్డులను ఇంకా వర్తింపచేయనేలేదు. ఉద్యోగుల్లోనే కొందరికి వర్తింపు, మరికొందరికి మినహాయింపు వివక్షపూరితంగా వ్యవహరించడం ఈ ప్రభుత్వానికి చెల్లుబాటు

# అమరావతి - బుద్ధుడు - వెంకటేశ్వరస్వామి

***అమరావతి బౌద్ధ స్థూపం వద్దకు వెంకటేశ్వరుని తీసుకురావడం చారిత్రక తప్పిదమనీ, ఈ చర్యను మార్క్సిస్టులు, అంబేడ్కరైట్లు, బుద్ధిస్టులు తాత్వికంగా ఎదుర్కొని పోరాడాల్సిన చారిత్రక అవసరం ఉందనీ అంటున్నారు డా. కత్తి పద్మారావు***

తిరుమల తిరుపతి దేవస్థానం (టిటిడి) అమరావతిలో హిందూ భక్తి కార్యక్రమాలు బుద్ధ విగ్రహం దగ్గర నిర్వహించాలని తలపెట్టడం చారిత్రక అవగాహన లేని కార్యం. తిరుపతి దేవాలయ నమూనాని విజయవాడ పిడబ్ల్యు గ్రౌండ్‌లో నిర్మించి పుష్కరాలకు వచ్చే భక్తుల నుండి కానుకలు స్వీకరించాలనే కార్యక్రమం కూడా అర్థం లేనిదే. చారిత్రకంగా మనం పరిశీలించినట్లయితే అమరావతి వందకు వంద శాతం బౌద్ధక్షేత్రం. ఆంధ్రదేశంలో బౌద్ధం ప్రజా ఉద్యమంగా క్రీస్తు పూర్వం రెండవ శతాబ్దం నుంచే వర్ధిల్లింది. నాటి శాసనాల వల్ల వర్తకులు, దళిత బహుజనులు, స్త్రీ జనం బౌద్ధాన్నే పోషించినట్లు, స్తూపచైత్య విహారాలు నిర్మించినట్లు తెలుస్తుంది.

ఇప్పటికీ భారతదేశ వ్యాప్తంగా వాణిజ్య పారిశ్రామిక కేంద్రాలైన పట్టణ, నగరాల సమీపంలోనూ, రహదారుల మీద బౌద్ధ క్షేత్రాలుండడం గమనించదగిన విషయం. చర్మకారులతో సహా సామాన్య ప్రజానీకం బౌద్ధం పట్ల శ్రద్ధ వహించారు. ఇంతటి ప్రజాదరణ ఉన్నందునే బౌద్ధం పట్ల శాతవాహనులు సహనం వహించారు. బౌద్ధ సంస్థలను పోషించారు. గౌతమీపుత్ర శాతకర్ణి, అతని కుమారుడు పులోమావి బౌద్ధులకు దానధర్మాలు చేశారు. శ్రీ యజ్ఞశాతకర్ణి నాగార్జునుని పోషించాడని ప్రసిద్ధి. శ్రీ విజయశాతకర్ణి శాసనం నాగార్జున కొండలో ఇటీవల దొరికింది. ఈ కాలపు కళా కావ్యాలకు ప్రాణం బౌద్ధధర్మం. బౌద్ధమత ప్రశస్తి కొరకు పెక్కు నిర్మాణాలు కావింపబడ్డాయి. వీటిలో స్తూపాలు, చైత్యాలు, విహారాలు, గుహలు మొదలైనవి ఎన్నో రకాల కట్టడాలు ఉన్నాయి. కొన్ని స్తూపాలు శిలానిర్మితాలు. కొన్ని ఇటుక కట్టడాలు. ఆంధ్రదేశాన సంకారం (బొజ్జన్న కొండ) వద్ద గుహాలయ ఏకశిలా స్తూపాలు ఉన్నాయి. ఇటుకతో కట్టబడిన మహా చైత్యాలలో అమరావతి స్తూపం, భట్టిప్రోలు స్తూపం గొప్ప నిర్మాణాలు. ఇట్టి స్తూపాలు ఆంధ్రదేశంలో కుప్పలు కుప్పలుగా ఉన్నాయి. శాలిహుండం, రామతీర్థం, సంకారం, ఆదుర్రు, పిఠాపురం, గుంటుపల్లి, జగ్గయ్యపేట, నందిగామ, గుడివాడ, ఘంటసాల, అమరావతి, భట్టిప్రోలు, నాగార్జున కొండ, గోలి, చినగంజాం మొదలైన ఎన్నో స్థలాలలోను, తెలంగాణాలో గుమ్మడిదుర్రు, అల్లూరు కొండాపురం, ఫణిగిరి, గాజులబండలలోను స్తూపాలు ఉన్నాయి.

బౌద్ధ భిక్షువుల నివాసాలకు, సభా సమావేశాలకు కొండలు దొల్చిన గుహలు, గుహావిహారాలు ఉండేవి. ఇటువంటి గుహలు ప్రధానంగా మహారాష్ట్ర దేశంలో కన్పిస్తున్నాయి. కన్హేరీ, నాసిక, కార్లే మున్నగుచోట్ల నిష్ఠుర పర్వతముల దొలిచి, బౌద్ధశిల్ప నిర్మాణం శాతవాహనాంధ్ర శిల్పులకే చెల్లుతోంది. కళా నైపుణ్యానికి కొండలు కూడ మైనంవలె మెత్తబడైనా అనిపించాయి. కోరుకొండ, ఎర్రంపాలెము, గుంటుపల్లి మున్నగుచోట్ల గుహలు ఉన్నాయి.

ఇకపోతే బుద్ధుని శారీరక అవశేషాలపైన నిర్మితమైన స్మారక చిహ్నాలే స్తూపాలు లేక చైత్యాలు. వీనిలో మూడు రకాలుండేవి. 1) ధాతు గర్భాలు: శారీరక అవశేషాలపై నిర్మించేవి. 2) పారిభోజకాలు: బుద్ధుడు ఉపయోగించిన వస్తు గర్భితాలు. 3) ఉద్దేశిక స్తూపాలు: ధాతువులు లేకుండా నిర్మించినవి... ఆంధ్రదేశంలో భట్టిప్రోలు, అమరావతి, జగ్గయ్యపేట, ఘంటసాల, శాలిహుండం స్తూపాలు చాలా ప్రాచీనాలైన ధాతుగర్భాలు శ్రీ పర్వత మహాచైత్యం యజ్ఞశ్రీ కాలంలో నిర్మించబడింది. ఇవిగాక ఆంధ్రదేశంలో అనేకచోట్ల స్తూపాలు వెలశాయి. ఇవి ఇటుకల నిర్మాణాలు. వీని ఉపరితలంలో శిల్పాలతో నిండిన పాలరాతి పలకలు తాపడం చేసేవారు. ఆంధ్రదేశ స్తూపాలన్నింటిలో అమరావతీ స్తూపం చాలా అద్భుత నిర్మాణం. పునాదుల చెంత ఈ స్తూపం వ్యాసం 162 అడుగులు: దాని పైని అండం వ్యాసం 142 అడుగులు. అమరావతీ ప్రాకారం మనోహర శిల్ప సమన్వితం ఈ శిల్పాలకు బుద్ధుని జీవితంలోని పంచకల్యాణంలు, బుద్ధ జాతక కథలు, సామాన్య జీవిత దృశ్యాలు కథా వస్తువులు.

కృష్ణా లోయలోని స్తూపాలలో చాలావాటికి నాలుగు దిక్కుల్లో వేదికలు. వానిపై ఐదేసి 'ఆయక స్తంభాలు' ఉన్నాయి. ఇవి పంచకళ్యాణాలను, బుద్ధుని జననం, మహాభినిష్క్రమణం, సంబోధి, ధర్మచక్ర ప్రవర్తనం, మహా పరినిర్వాణం సూచిస్తాయని చరిత్రకారులు చెబుతున్నారు.

---

అవుతున్నది. అయినా హెల్త్ కార్డులు పొందినవారికి మాత్రం ఏం ప్రయోజనం ఉన్నది? ప్రభుత్వ ఉద్యోగాలన్నప్పుడు అన్ని ప్రభుత్వ శాఖల్లో పనిచేసే వారందరు వస్తారు కదా. కొందరికి హెల్త్ కార్డులు వర్తింపజేసి మరికొందరికి వర్తింప చేయకపోవడలం ఎలా సరైంది అవుతుంది. ఈ నేపథ్యంలో 2016 జూన్ 30న హైదరాబాద్‌లోని ఇందిరా పార్క్ వద్ద ఉద్యోగులు, ఉపాధ్యాయులు, పెన్షనర్లు మహాధర్నాను నిర్వహించారు. ప్రభుత్వాన్ని ప్రశ్నించారు. అతి మామూలుగా అందాల్సిన వాటి కోసం కూడా రాష్ట్రం నలుమూలల నుండి రాజధానికి తరలిరావడం అనేది ప్రభుత్వం సిగ్గుపడాల్సిన విషయం. పే రివిజన్ స్కేలు బకాయిలు, హెల్త్ కార్డులు అనేవి ప్రభుత్వం ఢంకా బజాయించి ఉద్యోగులకు హామీ పడ్డ విషయాలు. కనీసం తాను చెప్పిన, సునాయసంగా చేయగలిగే, పరిష్కరించగలిగే వీటి పట్ల నాన్చి వేత ధోరణిని అవలంభిస్తోంది. ధర్నాకు కూడా స్పందన లేదు. ఎంతగా మొద్దుబారి పోయిందో కదా ఈ ప్రభుత్వం.

*(రచయిత ఉపాధ్యాయులు)*

ఆంధ్రదేశంలో ఉద్దేశిక స్తూపాలు అనకాపల్లి చెంత సంఘరంలోని లింగాల మెట్టలో గుంటుపల్లిలో కన్పిస్తాయి. ఆంధ్రదేశంలో అనేక స్తూపాల నుండి శిల్పాలు లభించాయి. అశోకుని కాలం నుండి ఆంధ్రదేశంలో స్థానికమైన శిల్పపద్ధతి పెంపొందినట్లు కనిపిస్తుంది. ఆంధ్ర శిల్పుల కౌశల్యం సాంచీస్తూప ద్వారతోరణాలలోను అమరావతీ నాగార్జునకొండ శిల్పాల లోను పరాకాష్టనొందిందని పండితుల అభిప్రాయం. ఆంధ్ర బౌద్ధ క్షేత్రాలన్నింటిలో అమరావతి సుప్రసిద్ధ మైనందున, అమరావతీ స్తూపం నుండి లభ్యమైన శిల్పంనందలి పద్ధతులే ఇతరాంధ్ర స్తూప శిల్పములందు కూడా ప్రతిఫలించినందున బౌద్ధయుగ ఆంధ్ర శిల్పమునకు 'అమరావతీ రీతి' అనే పేరు వచ్చిందని చరిత్రకారులు చెబుతున్నారు. సాంచీ బర్హూత్ శిల్పములవలె కేవలం దేశీయ సంప్రదాయములకు అనుగుణంగా తయారై అమరావతీ శిల్పమొక ప్రత్యేక నైపుణ్యాన్ని, ప్రశస్తమైన వ్యక్తిత్వాన్ని ప్రదర్శిస్తుంది. అందుచే 'అమరావతీ రీతి' అనే పేరు సార్థకమయింది. సాంచీ, బార్హూత్ శిల్పం గ్రామీణమైన ప్రకృతి సాన్నిహిత్యాన్ని ప్రదర్శింపగా, అమరావతీ శిల్పం నాగరికత జీవిత వైలక్షణాన్ని ప్రదర్శిస్తుందని విమర్శకుల అభిప్రాయం. బహుశా అందుకు కారణం ధనికులైన శ్రేష్ఠి గృహవతుల పోషణలో అమరావతీ శిల్పం తయారవడం కావచ్చును.

ఇక వెంకటేశ్వరస్వామి విషయానికి వస్తే ఇతని మీద పరిశోధన చేసిన వారు ఇతడు మొదలు గిరిజన దేవతని, ఈ విగ్రహం స్త్రీ ఆకారమని చెప్పారు. మరికొందరు 'వెంకన్న'ను వైష్ణవీకరించి బ్రాహ్మణులు దీన్ని సొంతం చేసుకొని ఆయన పేరు మీద శృంగార భావాలను ప్రచారం చేసి భక్తులను ఆకర్షించారని చెబుతారు. ఈ విషయం మీద పాండిచ్చేరి యూనివర్సిటీ ప్రొఫెసర్ సుబ్రహ్మణ్యం నాయుడు చాలా పరిశోదన చేశారు. సుప్రభాతంలో వచ్చే 'కమలాయత చూచుక కుంకుమతో, విమలారుణ తాతుల నీలతనో' అనే మాట నుండి ఉత్తిష్ఠ ఉత్తిష్ఠ నరశార్దూలా! ఒకపక్క గరుడ పక్షి వాహనంగా గలవాడా అని సంబోధిస్తూ నరుల్లో శార్దూలము వంటివాడా! అని సంబోధన వినిపిస్తుంది. ఆ రోజుల్లో పులులు కొండల మీద ఎక్కువగా ఉండేవని వాటిని వేటాడిన వీరుడైన, నల్లని గిరిజనుడు ఉండేవాడని, అతడు పులి వేటలో చనిపోతే గిరిజనులు అతన్ని దేవుణ్ణి చేశారని మరొక కథనం ఉంది. ఇప్పటికీ చిరుతల సంచారం ఇక్కడ ఉంది.

అజ్ఞానానికి నిదర్శనగా విలసిల్లిన పుణ్యక్షేత్రాలు నేడు అవినీతికి, దోపిడీకి ఆలయాలుగా మారాయి. తిరుపతి, భద్రాద్రి, శ్రీశైలం, కోటప్పకొండ, ద్రాక్షారామం, అన్నవరం, సింహాద్రి, కనకదుర్గ, మంగళగిరి మొదలైనవి మన రాష్ట్రంలో ప్రసిద్ధి చెందిన పుణ్యక్షేత్రాలు. వీటిలో తిరుమల తిరుపతి అతి ముఖ్యమైనది. తిరుపతి ఆదాయం సంవత్సరానికి వేల కోట్లని చెప్పవచ్చు. దీనికి కారణం వెంకన్న దోపిడీ దొంగలు, అక్రమ వ్యాపారస్తులు, పెట్టుబడిదార్లు భక్తులు కావటమే. ప్రజల మూఢ భక్తి, పురోహిత వర్గాల ప్రచారం, అక్రమ సంపాదనాపరులు నిత్యం చెల్లించే కానుకలు వెంకన్నకింత గిరాకీ ఉండటానికి కారణం.

'రాతిబొమ్మలకేల రంగైన వలువలు' అన్నాడు మన వేమన. కాని మన తిరుపతి దేవుడు ప్రపంచంలోకల్లా ధనికుడు. పచ్చులు, గోమేధికాలు, వైఢూర్యాలు, వజ్రాలు పొదిగిన 27,287 క్యారెట్ల బరువుగల నవరత్న ఖచితమైన మకర తోరణం మన వడ్డీకాసులవాడికుంది. కృష్ణదేవరాయలు చేయించిన 3308 క్యారెట్ల నవరత్న కిరీటం ఉంది. 10 కోట్ల విలువ గల ఆభరణాలు, 6 కోట్ల విలువ గల బంగారం ఉంది. 5 కోట్ల విలువ గల వజ్రాల కిరీటం చేయించారు. వెంకన్న దర్శనానికి 20 వేలు మొదలుకొని 20 రూపాయలు దాకా రేట్లున్నాయి. స్వరాజ్య ఫలితంగా అవతరించిన కొత్త ధనికులూ, సినిమా తారలూ, ప్రొడ్యూసర్లూ, మంత్రులు మొదలైన వారికి ఇక్కడ అందే సౌకర్యాలు వర్ణించనలవికావు. దొంగ భక్తులకు, డబ్బున్న భక్తులకు, ఓట్ల కోసం వాగ్దానాలు, నోట్ల కోసం వేషాలు మార్చే రాజకీయ నాయకులకే ఈ పుణ్యక్షేత్రాలు ఉపయోగపడుతున్నాయి. పాపం మూఢ భక్తులకు మిగిలేది మౌఢ్యమే. దేముని పేరిట అమాయక ప్రజలను అజ్ఞానంలో ఉంచటానికి పాలక పురోహిత వర్గాలు రచించిన వ్యూహమే ఈ పుణ్యక్షేత్రాలు.

మరోపక్క విజ్ఞానం వికసించి మానవుడు, గ్రహాంతరయానాలు చేస్తున్న ఈ వైజ్ఞానిక యుగంలో బలులు, జాతర్లు, యాగాలు ఎక్కువయ్యాయి. ప్రజలలో ఉన్న అజ్ఞానం, అనాగరికత, నిరక్షరాస్యత వలన మౌఢ్యం పరాకాష్టకు చెందుతూ ఉంది. ఆలోచన, అవగాహన లోపించి అనాగరిక, ఆటవిక సంస్కృతి తాండవిస్తూ ఉంది. ప్రభుత్వం సెక్యులర్ స్టేట్‌గా చెప్పబడుతున్న ఈ దేశంలో ఇటువంటి వివేకం లేని మౌఢ్యానికి సోపానాలు నిర్మిస్తూ ఉంది. చరిత్రను తడిమి చూస్తే నాటి బౌద్ధారామాలన్నీ నేడు పాటి దిబ్బలుగా మిగిలిపోయాయి. 'అమరావతి లో బౌద్ధ స్తూపం పైనే అమరేశ్వరాలయ నిర్మాణం జరిగింది'. 'క్రీస్తు పూర్వం 300 సంవత్సరాల నుంచి క్రీ.శ. 700 సంవత్సరాల మధ్యగల వెయ్యి సంవత్సరాల కాలంలో బౌద్ధమతం వెల్లివిరిసింది. ఆనాటి బౌద్ధుల చారిత్రక అవశేషాలు ఈనాటి తవ్వకాలతో బయల్పడగలవు' క్రీస్తుశకం 7, 8 శతాబ్దాలలో కాలముఖులనే శైవులు విజృంభించి సింహ పరిషత్తును స్థాపించి, బౌద్ధమతాన్ని, బౌద్ధ శిల్పాన్ని, బౌద్ధ కళా సంపదల్ని, బౌద్ధ సాహిత్యాన్ని, బౌద్ధ ఆరామ సీమల్ని ధ్వంసం చేశారని చారిత్రక పరిశోధకులు భావిస్తున్నారు. ఏది ఏమైనా హిందూమత దౌర్జన్యానికి దురహంకారానికి బౌద్ధం బలవంతంగా నాశనం చేయబడినట్లు మనకు తెలుస్తుంది. భారతదేశంలో మతఅసహనాలకు ఇవి చిహ్నాలు. అమరావతి బౌద్ధ స్తూపం సన్నిధిలోకి వెంకటేశ్వరుని తీసుకురావడం చారిత్రక తప్పిదం అవుతుంది. చైనావాళ్లు మన బౌద్ధంలో తత్త్వాన్ని, బోధనని, జ్ఞానాన్ని, శిల్పాన్ని తీసుకువెళ్లి అన్నిరకాలుగా అభివృద్ధి చెందారు.

చైనా వెళ్లి మన ముఖ్యమంత్రి నిధులు అడుక్కొంటున్నాడు. అమరావతి నుండేమో బౌద్ధాన్ని తరమాలని చూస్తున్నాడు. ఇందుకు రెండు వందల బౌద్ధ దేశాలతో సంబంధం విఫలమయ్యే ప్రమాదం గుర్తించలేకపోతున్నాడు. హిందూ మతోన్మాదం వలన బౌద్ధ సంస్కృతిలో ఉన్న సమతా వికాసాన్ని కోల్పోయే ప్రమాదం ఉందని తెలుసుకోలేక పోతున్నాడు. బౌద్ధ సామాజిక జీవనం వల్లనే ఉత్పత్తి పెరుగుతుందని, జాతీయత, అంతర్జాతీయత విస్తరిల్లుతాయని అవగాహన చేసుకోలేకపోతున్నాడు. ముఖ్యమంత్రి అంధత్వం వల్లే ఈ అనాలోచిత చర్యలన్నీ జరుగుతున్నాయి. వైదికమేదో, అవైదికమేదో తెలియకపోవడం ముఖ్యమంత్రి అజ్ఞానం. ఇందుకు ఆయన చరిత్రకు సమాధానం చెప్పవలసి వస్తుంది. ఈ చర్యను మార్క్సిస్టులు, అంబేడ్కరైట్లు, బుద్ధిష్టులు తాత్వికంగా ఎదుర్కొని పోరాడాల్సిన చారిత్రక సందర్భం ఇది.

*(రచయిత సామాజిక తత్త్వవేత్త, వ్యవస్థాపక అధ్యక్షులు నవ్యాంధ్రపార్టీ)* వీ

# కామన్ సివిల్ కోడ్ పూర్వాపరాలు

***ఉమ్మడి పౌర స్మృతిని ప్రవేశపెట్టడానికి కేంద్ర ప్రభుత్వం మరొకసారి ప్రయత్నాలు ముమ్మరం చేసిన సందర్భంలో దాని పూర్వాపరాలు వివరిస్తున్నారు* బైరెడ్డి సతీష్**

ఇటీవల కేంద్ర ప్రభుత్వం ఉమ్మడి పౌర స్మృతిని (యూనిఫాం సివిల్ కోడ్) ప్రవేశపెట్టే సాధ్యాసాధ్యాలను పరిశీలించమని లా కమిషన్‌ను కోరటం దేశవ్యాప్తంగా మరోసారి ఈ అంశంపై తీవ్రమైన చర్చకు తెరలేపింది. బిజెపి. సైద్ధాంతిక మాతృసంస్థ అయిన రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్ ప్రధాన ఎజెండాలో భాగమైన ఈ యూనిఫాం సివిల్ కోడ్ అంశాన్ని అమలు చేయించే ప్రయత్నాలను తీవ్రంగానే సాగిస్తున్నది. ఒకే దేశం ఒకే చట్టం నినాదంతో దేశ వ్యాప్తంగా 'మెజారిటీ' ప్రజల అభిప్రాయాన్ని ఈ ప్రతిపాదిత కామన్ సివిల్ కోడ్‌కు అనుకూలంగా మలిచేందుకు అన్ని ప్రయత్నాలు చేస్తున్నది. దేశ ప్రజలందరికి ఒకే చట్టం వర్తించాలని, దేశ సమగ్రతా, సమైఖ్యతలను కాపాడాలంటే ఈ చట్టం అనివార్యమని, ఇంకే సమూహానికి ప్రత్యేకమైన, స్వంతమైన చట్టాలుండకూడదని వాదిస్తున్నది. భారత దేశ భిన్నత్వాన్ని, వైవిధ్యాన్ని గుర్తించ నిరాకరించే ఈ శక్తులు ఈ దేశం ఏకశిలాసదృశ్య మైనదని, ఈ దేశంలో ఉండే హిందూయేతర మతవిశ్వాసాలు కల్గిన వారందరూ విదేశీయులని, వారి రాకతోనే ఈ దేశ జ్వాజ్వల్యమానమైన చరిత్ర దెబ్బ తిన్నదని అంత గొప్ప గతాన్ని అఖండ భారత నిర్మాణం ద్వారా మాత్రమే పునః స్థాపన చేసుకోగలమనే హిందూ సాంస్కృతిక జాతీయవాద సిద్ధాంత మూలాల్లోంచి ఈ యూనిఫాం సివిల్ కోడ్ అంశాన్ని అర్థం చేసుకోవాలి.

భారత దేశంలో అధికార మార్పిడి జరిగిన అనంతరం ఏర్పడిన రాజ్యాంగ పరిషత్, రాజ్యాంగ రచనా క్రమంలో జరిగిన పరిణామాల్లో ఈ ఉమ్మడి పౌర చట్టంపై ప్రస్తావన ఉన్న మాట చారిత్రక సత్యం. డ్రాఫ్టింగ్ కమిటి అధ్యక్షుడైన డా. బి.ఆర్. అంబేద్కర్, సభ్యులు కె.ఎం. మున్షి, గోపాలస్వామి అయ్యంగార్, అల్లాడి కృష్ణస్వామి అయ్యర్ పూర్తి స్థాయిలో ఈ ఉమ్మడి పౌర చట్టానికి అనుకూలంగా ఉన్నారు. పౌర స్వేచ్ఛకు, ప్రాథమిక హక్కులకు విఘాతంగా ఉండి వివక్షను, అసమానతలను పెంపొందించే ఈ సామాజిక వ్యవస్థను సంస్కరించాలే గానీ మొత్తం మనిషి జీవితాన్ని శాసించేలా మతానికి ఇంత విస్తృతమైన అధికారం ఎందుకివ్వాలని అంబేద్కర్ ఆనాడే ప్రశ్నించాడు. కె.ఎం. మున్షి అయితే అభివృద్ధి చెందిన ముస్లిం దేశాల్లో కూడా వ్యక్తిగత చట్టాలు ఉమ్మడి పౌర చట్టాన్ని ప్రవేశ పెట్టకుండా నిరోధించలేకపోయాయని వాధించాడు. పోకర్ సాహెబ్, మహ్మద్ ఇస్మాయిల్ లాంటి ముస్లిం నాయకులు ఉమ్మడి పౌర చట్టం అంటే తరతరాలుగా ఆచరిస్తున్న వ్యక్తిగత చట్టాన్ని (పర్సనల్ లా) ఉల్లంఘించే నియంతృత్వమౌతుందని వ్యతిరేకిస్తూ వాదించారు.

ఆనాడు నెలకొని ఉన్న సున్నితమైన రాజకీయ పరిస్థితుల నేపథ్యంలో ఒక వైపు జాతీయతను పెంచే దిశలో ఉమ్మడి పౌర చట్టం ఉండాలని, మరోవైపు దేశ భిన్నత్వం, మైనారిటీల అస్థిత్వం, హక్కుల అంశాలు బలంగా ముందుకు రావడంతో గాంధీ, నెహ్రూల జోక్యంతో ఆదేశిక సూత్రాలలో భాగంగా ఆర్టికల్-44 రూపంలో 'భారత భూభాగంలో నివసిస్తున్న ప్రజలందరికి వర్తించేలా ఉమ్మడి పౌర చట్టానికి రాజ్యం కృషి చేయాలి' అని చెప్పబడింది. అయితే ఆదేశిక సూత్రాలేమీ ప్రభుత్వాలు విధిగా అమలు చేయాల్సిన రాజ్యాంగబద్ధ బాధ్యత లేనటువంటివి.

1980లలో భర్త నుండి విడాకులు పొందిన షాబాన్ అనే ముస్లిం మహిళ భరణం కోరుతూ సుప్రీంకోర్టును ఆశ్రయించడంతో కోర్టు ఆమెకు భరణం ఇవ్వాలని ఆదేశించటమే కాకుండా ఉమ్మడి పౌర చట్టం ఆవశ్యకతను నొక్కిచెప్పటంతో దేశంలో ప్రత్యేకించి ముస్లిం సమాజంలో పెద్ద కలకలమే చెలరేగింది. ముస్లిం వ్యక్తిగత చట్టాల్లో న్యాయవ్యవస్థ జోక్యం చేసుకుంటుందని అతివాద ముస్లిం వర్గాలు ఆందోళన చేయడంతో ఓటు బ్యాంకు రాజకీయాలతో నాటి సుప్రీంకోర్టు తీర్పును రద్దుపర్చేలా పార్లమెంట్ ముస్లిం ఉమెన్ (ప్రొటెక్షన్ ఆఫ్ రైట్ ఆన్ డైవర్స్) యాక్ట్-1986 ను తీసుకొచ్చింది. ఆ తర్వాత లతీఫ్ వర్సెస్ యూనియన్ ఆఫ్ ఇండియా కేసు తీర్పుతో ముస్లిం మహిళల సమస్యలకు న్యాయబద్ధమైన, ఆమోదయోగ్యమైన పరిష్కారం కొంతమేరకు సాధ్యమైంది.

రాజ్యాంగ రచనా నేపథ్యంలో, ఈ దేశ అత్యున్నత స్థాయి కోర్టు తీర్పుల సందర్భంలోని చర్చ ఉమ్మడి పౌర చట్టంను ప్రవేశ పెట్టాల్సిన ఆవశ్యకత, సంఘ పరివార్ బిజెపి పార్టీ లేవనెత్తుతున్న చర్చకు మౌలికమైన తేడా ఉన్నది. రాజ్యాంగ రచనాకాలపు చర్చకు ప్రగతి కారకమైన స్వభావం, ప్రజాస్వామిక దృక్పథం, ప్రజల మధ్య ఐక్యతను పెంచే, భిన్నాత్వాన్ని, లౌకికతత్వాన్ని గౌరవించే గుణం ఉన్నది. పరివార్ ప్రచారమంతా మైనార్టీల అస్థిత్వాన్ని, సాంస్కతిక ప్రత్యేకతను తక్కువచేసే, అవహేళన చేసే అహంకారపూరితమైన మెజారిటి నియంతృత్వ స్వభావం కల్గి ఉన్నది. వారిని తమ అదుపు ఆజ్ఞల్లో పెట్టుకొనే ఆధిపత్యవాద ఎజెండా మాత్రమే ఉన్నది. మత విశ్వాసాల ఆధారంగా ఏర్పడిన ఏ వ్యక్తిగత చట్టాలు సమానత్వ భావన, వ్యక్తిగత జీవితంపై స్వేచ్ఛనంగీకరించే స్వభావం, వివక్షారహితంగా ఉండకపోవడమే కాకుండా పితృస్వామిక లక్షణాలతో మహిళల హక్కుల్ని హరించేలా అసలు హక్కులే లేకుండా చేసేలా ప్రగతి నిరోధకంగా ఉన్నాయనడంలో ఎలాంటి సందేహం లేదు.

అన్ని మతాలు స్త్రీల అస్థిత్వం పట్ల రూపాల్లో తేడా ఉన్నప్పటికినీ సారంలో వివక్షనే కల్గి ఉన్నాయి. ఇవాళ బి.జె.పి. అంటున్న కామన్ సివిల్ కోడ్ (అదేంటో ఇప్పటి వరకు వారికే స్పష్టత లేదు)తో ముస్లిం మతంలోని మహిళలకు లింగన్యాయం (జెండర్ జస్టిస్) జరుగుతుందని వారి స్వేచ్ఛలు పరిరక్షించబడతాయని చాలా గొప్పగా చెప్పుకుంటున్నది. అదేదో ఒక్క ముస్లిం మతంలోనే మహిళలకు తీవ్రమైన వివక్ష, అన్యాయం జరుగుతున్నట్టు! నలుగురు భార్యలు, మూడు తలాక్‌ల నుండి విముక్తి అవుతారని చెబుతున్నది, బహుభార్యత్వం ఒక్క ముస్లిం మతానికే చెందిన చెడు లక్షణం అనే అర్థం వచ్చేలా. హిందూమతంలో కూడా చాలా విస్తృతంగా ఇది కనబడుతుందనేది మరువరాదు. ఒప్పందంగా పెండ్లి,

విడాకుల విషయంలో ముస్లిం మహిళల ప్రయోజనాలే కాపాడబడుతున్నాయి హిందూ 'పవిత్ర' వివాహాలకంటే. నిజానికి బహుభార్యత్వం విషయంలో పర్సనల్ లా ప్రకారం 'భార్య'గా ప్రయోజనాలు, భర్త విధిగా పాటించాల్సినవి ఉన్నాయి. కానీ హిందూ వివాహ వ్యవస్థలో బహు భార్యత్వం చట్టరీత్యా నిషేధం కావడంతో రెండో, మూడో పెండ్లి ద్వారా భార్యలైన స్త్రీలకు ఎలాంటి చట్టబద్ధమైన రక్షణలేదనేది కూడా గమనార్హం. అలా అని బహుభార్యత్వం సమర్థనీయమైనదని చెప్పడం కాదు. అలాంటి ఆచరణ ఉన్న మతంలో కనీస రక్షణలున్నాయని చెప్పడం కోసమే.

మొత్తంగా స్త్రీలను వ్యక్తులుగా గుర్తించని కేవలం 'భార్యలు'గా తయారుచేసే పితృస్వామిక వివాహ వ్యవస్థను ప్రశ్నించేలా, రక్షణలు పొందేలా ఈ సంఘ పరివార్, బిజెపిలు చెప్తున్న ఉమ్మడి పౌర చట్టంలో ఇలాంటి అంశాలు చేర్చే పనిచేయగల్గుతుందా? మగవారినే యజమానిగా, హక్కుదారునిగా గుర్తించే హిందూ అవిభాజిత కుటుంబ చట్టం అది ఎంతగా స్త్రీల పట్ల వివక్షను పాటించిందనే విషయాన్ని మాత్రం ఈ శక్తులు చెప్పటం లేదు. ఏ మత చట్టాలు కూడా అన్ని ప్రాంతాల్లో ఏకరూపతను కల్గిలేవు. వందల, వేల ఏళ్ల క్రితం ఆనాటి మనిషి పరిజ్ఞానపు పరిధిలో విశ్వాసాల ఆధారంగా ఏర్పర్చుకొని, అవే అంతిమ సత్యాలు అని మత విశ్వాసం కల్గినవారు నమ్మటం, మార్పువీలులేని (అన్ ఆల్టరేబల్) నిరంతర ఆచరణీయాలు అని బలంగా ముందుకు తీసుకుపోయే ధోరణే ప్రమాధకరమైనది, ప్రగతి నిరోధకమైనది.

ఒక నిర్దిష్ట భూభాగంలో నివసించే మానవ సమూహానికి ఆ సమూహంలో ఏ విశ్వాసాలు, మనోభావాలు ఉన్నా కూడా వారి ఉమ్మడి అనుభవంలో నుంచి, ఉమ్మడి ప్రయోజనాల కోసం, ఉమ్మడి అంగీకారంతో ఏర్పర్చుకున్న చట్టాలు అందరికి సమానంగా వర్తింపబడాలనడం సార్వత్రికంగా ఆమోదనీయమైనదే అదీ ఎటువంటి అసమానతలు, వివక్ష లేని సమాజమైతేనే. సంక్లిష్టమైన భిన్నత్వం, వ్యవస్థీకృతమైన పీడన, అసమానతలు, ఆర్థిక దోపిడి, ప్రాంతాల మధ్య వివక్ష వీటి ఆధారంగా ఏర్పడే చైతన్య స్థాయిలు, సంపద, జ్ఞానం, అధికారం, ఉత్పత్తి సాధనాలు కొందరి చేతుల్లో కేంద్రీకృతమైతే ఉమ్మడి పౌరస్మృతులు అమలౌతాయా?

సమాన హక్కుల్ని కల్పించడం దానికదే అంతిమ లక్ష్యం కాదు. సమానంగా హక్కుల్ని అనుభవించగలిగే భౌతిక పరిస్థితులను కూడా ఏర్పర్చాలి. అంతరాల సమాజంలో హక్కుల్ని అందిపుచ్చుకోవటం అంత సులభమైనది కాదు. చట్టం ముందు అందరు సమానమన్నా, అందరికీ చట్టాన్ని సమానంగా వర్తింపచేయటంలో అమలవుతున్న పక్షపాతం, వివక్ష ప్రజలందరి అనుభవాల్లో ఉన్నాయి.

ఈ దేశ రాజ్యాంగం మైనార్టీలకు తగిన రక్షణలు, వారి అస్థిత్వాన్ని కాపాడుకునే పరిస్థితులను కల్పించింది. ఆ ప్రత్యేక రక్షణలను అమలు చేయడానికి సుముఖంగా లేని వర్గమే ఇవాళ అధికారంలో ఉండి ఉమ్మడి పౌర చట్టం పేరుతో వారిని భయపెట్టే కుతంత్రాలకు పాల్పడుతున్నది.

ఒక విశ్వాసపు చట్రంలోకి బయటినుండి చట్టాల పేరుతో సంస్కరించే పనికంటే అంతర్గత సంస్కరణ మొదలయ్యేలా ఇతర రూపాల్లో కృషి జరగాల్సి ఉన్నది. అన్ని మత వ్యవస్థలు అశాస్త్రీయమైనవీ, అభివృద్ధి నిరోధకమైనవీ. ప్రగతిశీలమైన భావజాలాన్ని పెంచడం ద్వారా మాత్రమే వారిని ఇటువంటి ఉమ్మడి చట్టంలోకి తీసుకురాగలం తప్ప బలవంతంగానో, మెజారిటీ ఆమోదాన్ని మైనార్టీలపై రుద్దడం ద్వారానో తేవడం అసాధ్యం, అవాంఛనీయం. అన్ని మతాల పర్సనల్ చట్టాలకు ఒకే రూపం లేకపోగా వాటికి భిన్నమైన భాష్యాలు, ఆచరణలు కూడా ఉన్నాయి. ముస్లిం పర్సనల్ లా లోనే సున్నీ, షియాల వైరుధ్యం కనబడుతుంది. క్రిస్టియానిటి కూడా అంతకంటే భిన్నమైనదేమీ కాదు. చారిత్రక, భౌగోళిక, సామాజిక, సాంస్కృతిక అంశాల ఆధారంగా కూడా విభిన్న రూపాల్లో అవి ఆచరించబడుతున్నాయి. ఒకే మతంలోని వారు భిన్న ప్రాంతాల్లో నివసిస్తున్న సందర్భాల్లో ఆ ప్రాంతపు ఆచారాలు, కట్టుబాట్లు కూడా వారి జీవితాలను నిర్దేశిస్తున్నాయి.

ఈశాన్య రాష్ట్రాలు ప్రధానంగా గిరిజన తెగలు నివసించే ప్రాంతాలు. ఒక్క రాష్ట్రంలోనే అనేక తెగలు తమవైన కట్టుబాట్లతో మనుగడ సాగిస్తున్నవి. నాగరికతా ప్రభావం అన్ని ప్రాంతాలు, అన్ని సామాజిక వర్గాలపైన ఒకేరకంగా లేదు. పాలక వర్గాలు అమలు పరుస్తున్న విధానాల మూలంగా తలెత్తుతున్న వైరుధ్యాలు కూడా భిన్న సమూహాల ప్రత్యేకతలను, వారి అభివృద్ధి ఆకాంక్షల్ని గుర్తించకుండా, శాస్త్రీయ ఆలోచనలను పెంచే చర్యలను చేపట్టకుండా వారిని చుట్టుముట్టిన గతకాలపు వెనకబాటు భావజాలాన్ని తమ రాజకీయ ప్రయోజనాల కనుగుణంగా వాడుకునే వ్యవస్థలో ప్రజల్లో ప్రగతిశీల భావనలను పెంపొందించలేవు. ప్రజల్లోని అంధత్వం, మూఢత్వం రాజకీయ పదవుల్ని తెచ్చినంత కాలం వాటిని నిర్మూలించే పనిని ఈ రాజకీయాలు, ఆయా సమూహాల్లోని ఆధిపత్య శక్తులు చేయవు. ఇంకా వాటిని పెంచిపోషించి ప్రజలను చీకట్లోనే తొక్కిపెడతాయి.

ఇండియన్ క్రిమినల్ లా దేశ ప్రజలందరికి వారి వారి మత విశ్వాసాలతో సంబంధం లేకుండా సమానంగా వర్తించినపుడు ఈ ఉమ్మడి పౌర చట్టం ఎందుకు ఆమోదనీయం కాదు అనే ప్రశ్న ఈ దేశ మధ్యతరగతిని ఆలోచింపచేయడమే కాకుండా ఆమోదాన్ని తెలిపేలా కూడా చేస్తుంది. ఇక్కడ బి.జె.పి.లాంటి పార్టీలకు కూడా ఓటు బ్యాంకు రూపంలో కావల్సింది ఇదే. నేర న్యాయానికి, పౌర చట్టానికి మధ్య ఉన్న మౌలికమైన తేడాను అర్థం చేసుకోవాల్సి ఉంది.

సివిల్‌కోడ్ ప్రధానంగా వ్యక్తిగత అంశాలతో ముడిపడి ఉన్నది. వివాహం, విడాకులు వారసత్వం, దత్తత, భరణం లాంటి అంశాలతో వ్యవహరించేదే సివిల్ కోడ్. వీటన్నింటిలో వ్యక్తుల చారిత్రక, సాంస్కృతిక, విశ్వాసపరమైన సున్నితమైన అంశాలు, మనోభావాలు ఇమిడి ఉండడం దీనిని మరింత సంక్లిష్టం చేస్తున్నవి. కొన్ని వందల, వేల ఏళ్లుగా ఈ అంశాలలో నిర్ణయాత్మకమైన పాత్రను పోషిస్తున్న కట్టుబాట్లు, మత చట్టాలు బలంగా నాటుకొని పోవడం, వాటికి రాజ్యాల, రాజ్యాంగాల గుర్తింపు, రక్షణ ఇవ్వడం, ఓటు బ్యాంకు రాజకీయాలు ఇవన్నీ కలగలిసి ప్రగతి కారకమైన మార్పులకు ప్రతిబంధకంగా నిలుస్తున్నాయి. వర్తమాన నేపథ్యంలో ఈ సివిల్‌కోడ్ ప్రతిపాదనలో చట్టపరమైన అంశాలకంటే రాజకీయాలు, మెజారిటీ ఆధిపత్యమే ముందు నిలుస్తున్నవి. సార్వత్రికంగా ఆమోదం పొందిన హక్కులను పరిరక్షించే, ప్రగతి కారకమైన అంశాలు ఎవరి నుంచైనా స్వీకరించి ఉమ్మడి చట్టాలను తయారుచేయొచ్చు. ఆయా వర్గాల తోడ్పాటు, వారి ప్రమేయం లేకుండా వారికి వర్తింపచేసే చట్టాల తయారీ మరిన్ని వైరుధ్యాలకు, విచ్ఛిన్నతకు దారితీస్తుంది. ఏ మతంలోని వెనకబాటుతనమైన, అభివృద్ధి రాహిత్యమైన శాస్త్రీయవిద్యను అందివ్వటం, స్త్రీలను అభివృద్ధిలో భాగస్వామ్యం చేయటం ద్వారా కొంతమేరకు అధిగమించడం సాధ్యమౌతుంది. ప్రజా ఉద్యమాల ద్వారా సాధించుకున్న ప్రజా ప్రయోజనాలకు ప్రత్యేకించి మహిళా ప్రయోజనాలను కాపాడే ప్రత్యేక చట్టాల అమలు విషయంలో ఏ మాత్రమూ చిత్తశుద్ధిని ప్రదర్శించని ప్రభుత్వాలు అన్ని వర్గాల ప్రమేయమూ, సమ్మతీ లేకుండా కొత్త చట్టాలను తీసుకొచ్చే యత్నాలు ఏ మాత్రం వాంచనీయం కాదు.

గృహహింస నుండి రక్షణ పొందే 2005 చట్టం, ముస్లిం మహిళల

# మోడీ అమెరికా పర్యటన - పొగడ్తల మోత

***మోడీ రెండేళ్ల పాలనలోనే ప్రజా వ్యతిరేక విధానాలకు అనుకూలంగా అమెరికాతో దుర్మార్గ ఒప్పందాలు చేసుకున్నాడనీ, సామ్రాజ్యవాద దేశాలకు భారతదేశాన్ని తాకట్టు పెడుతున్నాడనీ అంటున్నారు* ఎ. నర్సింహా రెడ్డి**

మోడీ 2014 మే 26న ప్రధానిగా బాధ్యతలు చేపట్టిన తర్వాత ఇప్పటి వరకు 40 దేశాలలో పర్యటించారు. 2015 సంవత్సరంలో 28 దేశాలు, 2016లో ఇప్పటి వరకు 12 దేశాల్లో పర్యటించారు. జూన్ 7-8 తేదీలలో అమెరికాలో పర్యటించారు. అమెరికాలో మోడీ ఒబామాతో ఒక గంట పాటు ఏకాంత చర్చలు జరిపారు. ఈ చర్చలలో మోడీ అమెరికా సామ్రాజ్యవాదుల ముందు సాగిలపడి వారి డిమాండ్లన్నింటికీ తలొగ్గినట్లుగా కనబడుతోంది. ఈ సంవత్సరాంతంలో జరుగనున్న 'వాణిజ్య విధాన నివేదిక'లో అమెరికా కార్పొరేట్ కంపెనీలకు మార్కెట్ అనుకూల విధానాలను రూపొందిస్తానని ఒబామాకు మోడీ హామీ ఇచ్చారు. అమెరికా పార్లమెంటు సంయుక్త సమావేశంలో మోడీ చేసిన ప్రసంగంలో ఆద్యంతం అమెరికా భజనే ప్రతిధ్వనించింది. అయితే ఆయన ప్రసంగం భారతదేశ గౌరవప్రతిష్ఠలను ఇనుమడింప చేసిందనీ, దేశ ప్రయోజనాలకు అనేక విధాలా మేలు చేకూరుతుందనీ బిజెపితో పాటు కార్పొరేట్ మీడియా దేశంలో ప్రచారం సాగించింది. తన రెండేళ్ల పాలనలో మోడీ అమెరికాలో పర్యటించడం ఇది నాలుగోసారి, ఒబామాతో సమావేశం కావడం ఇది ఏడోసారి.

ఒబామా తన ఆప్తమిత్రుడనీ, అమెరికా ప్రజాస్వామ్యానికి దేవాలయమనీ, భారత్ అమెరికాకు నమ్మకమైన భాగస్వామి అనీ మోడీ అభివర్ణించారు. మానవ జాతి శాంతియుత జీవనానికి అమెరికా చేసిన సేవ వెలకట్టలేనిదని ప్రశంసించారు. పదేపదే కృతజ్ఞతలు ప్రకటించారు. జాతీయవాదం, దేశభక్తి లాంటి మాటలు వల్లిస్తున్న మోడీ, రెండో పెద్ద దేశానికి నేతృత్వం వహిస్తున్న ప్రధాని ఇంతగా సాగిలపడడం మన దేశ ప్రయోజనాల మాట అటుంచి జాతి ఆత్మగౌరవానికి భంగం కలుగజేసి నట్లయింది. దేశభక్తి ముసుగులో దేశాన్ని అమెరికా సామ్రాజ్యవాదుల

---

విడాకులకు సంబంధించిన 1986 చట్టం, బాల్యవివాహాల నిషేధ చట్టం లాంటి వాటిని పర్సనల్ లా లకి విరుద్ధమైన అంశాలు కలిగి ఉన్నప్పటికి సమర్ధవంతంగా అమలు పర్చవచ్చు. హిందూ వివాహ చట్టం కూడా దాని పరిధిలోకి వచ్చే వ్యక్తులందరికి, సమూహాలకి ఒకే రకమైన అన్వయింపు లేకుండా మినహాయింపులు కూడా ఉన్నాయి. అనేక తెగలకు వారి సంప్రదాయ కట్టుబాట్లకు, ఇతర చట్టాలకిందికి వచ్చేవారికి మినహాయింపు ఇవ్వడం జరిగింది. 1954లో భారత పార్లమెంట్ ఒక ప్రత్యేక వివాహ చట్టాన్ని (ది స్పెషల్ మారేజ్ ఆక్ట్-1954) సెక్యులర్‌గా రూపొందించి మతపరమైన, సంప్రదాయ పద్ధతిలో కాకుండా ఇతరేతరమైన ఏ రూపంలో పెళ్లి చేసుకున్నా చట్టబద్ధతను కల్పించే వెసులుబాటును చేర్చింది. ఇలాంటి చట్టాలను ఇవాళ యూనిఫాం సివిల్ కోడ్ గురించి మాట్లాడే శక్తులేవీ వారి కుటుంబాలకు, సమూహాలకు వర్తింప చేసుకోవడానికి సిద్ధంగా లేవు.

కాపు పంచాయతీలు, పరువు, కుటుంబ గౌరవం పేరుతో అనేక హత్యలకు, దౌర్జన్యాలకు, హింసకు పాల్పడుతున్న ఏ సామాజిక వర్గాన్ని కూడా కట్టడి చేయలేని శక్తులే ఉమ్మడి కోడ్‌ను కూస్తున్నాయి. పైగా వారి భావజాలమే హక్కులను ఉల్లంఘించే ఇలాంటి అనాగరిక చర్యలకు ప్రేరేపిస్తున్నది. ఈ దేశంలోని మత, సామాజిక సమూహాలు వారి అంతర్గత లోపాలు, బలహీనతలకంటే ఎదుటి శ్రేణుల లోపాలపై దృష్టి కేంద్రీకరించి వ్యవస్తీకృత సమస్యలకు పరిష్కారం వెతికే పనిలో ఉంటాయి. ఈ క్రమంలో మరిన్ని వైరుధ్యాలు సమాజంలో తలెత్తుతున్నాయి. స్త్రీ పురుష సంబంధాలను అసమ తలంలో నిలిపిన పితృస్వామిక ఆధిపత్య వ్యవస్థను కూల్చడం యూనిఫాం సివిల్ కోడ్‌లతో సాధ్యం కాదు. మొత్తం సమాజంలోనే ఉన్న భిన్న సమూహాలకు ఒకే రకమైన న్యాయం అందివ్వకపోగా, ఒకే సమూహంలో సగానికి తీవ్ర అన్యాయం అనేది ఇవాల్టి న్యాయంగా కనబడుతున్నది.

అసమానతల మూలాల్లోకి వెళ్లకుండా పైపై పూతలకు పాల్పడడం ఆధిపత్య వ్యవస్థలను కొనసాగించడమే అవుతుంది. దేశంలో ఇప్పటికే ఏవో కొన్ని కొద్దిమేర ప్రగతిశీలకంగా, ప్రజాస్వామికంగా, లౌకికంగా స్థిరపడిన పౌర చట్టాలున్నాయి. అటువంటి వాటిని అన్ని మత సమూహాలు, సామాజిక వర్గాలు గౌరవించేలా, అన్వయింపచేసుకునేలా ఒక సమీకృత కృషి నిరంతరం జరగాల్సి ఉన్నది.

ఉమ్మడి చట్టానికి ఒక ఉదాహరణగా చెప్పబడుతున్న పోర్చుగీస్ సివిల్ ప్రొసీజర్ కోడ్ 1939 గోవా కూడా అత్యున్నత చట్టమేమీ కాదు. అది అక్కడి క్రైస్తవ సమూహపు భిన్నత్వాన్ని, వైరుధ్యాన్ని గుర్తించిందనే వాస్తవాన్ని మరువరాదు. హిందూ మతంలోని భిన్నమైన ఆచారాలను, కట్టుబాట్లను కూడా గుర్తించింది. ఆస్తి సంబంధ వ్యవహారాల్లో పెండ్లి సమయంలో ఆస్తిలో 50 శాతం వాటాను జీవిత భాగస్వాములు పొందే అంశం ఆ చట్టంలో పొందుపరిచారు. అయినప్పటికీ, వివాహ వ్యవస్థలో స్థిరపడిన ఆధిపత్య సంబంధాలు ఆ నిబంధనను నీరుగార్చేలా చేస్తున్నాయని, గృహహింస, ఇతర హింసారూపాలు స్త్రీలపై ఏమాత్రం తగ్గలేదని అక్కడి అధ్యయనాలు స్పష్టం చేస్తున్నాయి.

స్త్రీ, పురుష సమానత్వం, సామాజిక ఆర్థిక సమానత్వాలను సాధించకుండా అడ్డుగా ఉన్న వ్యవస్థీకృతమైన ఆధిపత్య తాత్విక భావజాల మూలాలను పెకిలించివేసే పునాదిరంగ పోరాటాలకు పదునుపెట్టాలే తప్ప ఉమ్మడి చట్టాల రూపంలో పైపూతలు ఏవో ఒరగబెడతాయనుకోవడం వట్టి భ్రమే!

*(రచయిత ఆంగ్ల ఉపన్యాసకులు)* వీ

రథచక్రాల కిందికి నెట్టివేయడమే బిజెపి, మోడీ ప్రవచిస్తున్న జాతీయ వాదమా? అన్న సందేహం కలుగుతుంది. మరోవైపు ఈ పర్యటనలో ఆయన అమెరికాతో కుదుర్చుకున్న కీలక ఒప్పందాలు వివాదాస్పదమైనవీ, దేశానికి హానికరమైనవీ, మన దేశ స్వావలంబనకు, స్వేచ్ఛకు, సార్వభౌమత్వానికి విఘాతం కలిగించేవే. ఈ వాస్తవాలను కప్పిపుచ్చి జనాన్ని మాయపుచ్చేందుకు గోబెల్స్ ప్రచారానికి దిగారు.

అమెరికా సామ్రాజ్యవాదం ఒక యుద్ధోన్మాది. ఆయుధ బేహారి. చరిత్రలో ఎన్నో దురాక్రమణ యుద్ధాలు చేసి మారణహోమం సృష్టించింది. లక్షలాది మంది ప్రాణాలు తీసింది. అంతకు రెట్టింపు క్షతగాత్రులను చేసింది. కోట్లాది రూపాయల విలువ గల ఆస్తులు ధ్వంసం చేసింది. ఆయా దేశాల్లో తన తొత్తు పాలకులను పెట్టి సహజ వనరులను లూటీ చేస్తోంది. ప్రపంచ పోలీసుగా ప్రపంచ దేశాలపై కార్పొరేట్ల ప్రయోజనాల కోసం పెత్తనం చెలాయిస్తోంది. రెండు పొరుగు రాజ్యాల మధ్య చిచ్చుపెట్టి, లేదా దేశంలోనే అంతర్గత యుద్ధాన్ని సృష్టించి ఆయుధాలు విక్రయించి సొమ్ము చేసుకోవడం ఆ దేశ లక్ష్యం, నైజం. పలు దేశాల నేతలను కుట్ర పూరితంగా హత్య చేయించింది. ఇంత దుర్మార్గమైన చరిత్రగల అమెరికా మోడీకీ అతి పెద్ద ప్రజాస్వామ్య దేశంగా కనిపించడం, శాంతియుత జీవనానికి అమెరికా చేసిన సేవలు వెలకట్టలేనివనడం, ప్రజాస్వామ్యానికి దేవాలయమని కీర్తించడంలో ఏమాత్రం ఔచిత్యం లేదు. మోడీ స్వభావానికి, అమెరికా స్వభావానికి మధ్య సారూప్యత ఉంది. ఎందుకంటే భారత్‌లో మోడీ ప్రధానిగా ఎదిగిన చరిత్రకు, ప్రపంచంలో అగ్రరాజ్యంగా మనగలుగుతున్న అమెరికా చరిత్రకు చాల పోలికలు ఉన్నాయి. అమెరికాకు ఆధిపత్య వ్యూహం ఉన్నట్లే, మోడీకి కూడ విస్తరణవాద వ్యూహం ఉండి ఉంటుంది.

1974లో భారత్ అణు పరీక్ష జరిపినప్పుడు అమెరికా కన్నెర్ర చేసింది.స్వతంత్ర దేశంగా ఎదగకుండా ఆంక్షలతో నియంత్రించింది. రష్యా ప్రతిపాదన మేరకు, అప్పటికే అణు పరిజ్ఞానం ఉన్న దేశాలు ఒక కూటమిగా ఏర్పడ్డాయి. కొత్త దేశాలకు ఈ అణు పరికరాలను లేదా పరిజ్ఞానాన్ని సరఫరా చేయకూడదనే నిర్ణయం తీసుకున్నాయి. అణు పరిజ్ఞానం ప్రమాదకరం కనుక ఇతర దేశాలకు వ్యాపింప చేయుకూడదనేది ఈ దేశాల వాదన. కానీ తమ దగ్గరున్న అణ్వాయుధాల గురించి ఈ దేశాలు మాట్లాడవు. ఈ ఒప్పందంపై సంతకం చేసిన దేశాలు తమకు వీలైనపుడల్లా ఉల్లంఘిస్తూనే ఉన్నాయి. ఇప్పుడు కూడా అమెరికా పెట్టే సవాలక్ష ఆంక్షలు, అడ్డగోలు కోరికలను భారత్ నెరవేరిస్తేనే ఎన్ఎస్‌జీలో సభ్యత్వానికి మార్గం సుగమం అవుతుంది. ఇన్నాళ్లూ మన సాంకేతికాభివృద్ధిని ఆంక్షల రూపంలో అడ్డుకొన్నది అమెరికా అనే విషయాన్ని గుర్తించాల్సి ఉంది. అణు సరఫరాల బృందం ఏర్పడ్డదే భారత్‌కు వ్యతిరేకంగా అన్నది చారిత్రక సత్యం. భారత్ అలీనవిధానం, స్వతంత్ర విదేశాంగ విధానాన్ని 1990 వరకు అనుసరించింది. ఇప్పటి వరకు అణ్వస్త్ర రాజ్యాల గుత్తాధిపత్యాన్ని నిరసిస్తూ అణ్వస్త్ర వ్యాప్తి నిరోధక ఒప్పందం (ఎన్‌పీటీ) పై, ఆ తర్వాత సమగ్ర అణు పరీక్షల నిషేధ ఒప్పందం (సీటీబీటీ) పై కూడా సంతకం చేయలేదు. వాజ్‌పేయి హయాంలో అణుపరీక్ష జరిపినందుకు అమెరికా కూటమి అనేక విధాల ఆంక్షలతో భారత్‌ను వేధించింది. అణు సామగ్రి సరఫరా బృందం (ఎన్ఎస్‌జీ)లో చేర్చుకోకుండా అడ్డుకొంది.

2008లో మన్మోహన్‌సింగ్ సర్కారు అణు ఇంధన ప్రయోజనాల పేరిట మన విదేశాంగ అలీన విధానం నుంచి పక్కకు తప్పుకొని అమెరికా పంచన చేరింది. ఇంతకాలం అణుపరీక్షలకు భారత్‌ను దూరంగా పెట్టాయా అంటే అదీ లేదు. 2008 సెప్టెంబర్‌లో భారత్– అమెరికా అణు ఒప్పందం జరిగినప్పుడు ఏ దేశమూ అభ్యంతరం చెప్పలేదు. ఎన్ఎస్‌జీ భారత్‌పై ఆంక్షలు ఎత్తివేసింది. భారత్ అణ్వస్త్ర వ్యాప్తి నిరోధక ఒప్పందం (ఎన్‌పీటీ)పై సంతకం చేయలేదు. ఎన్ఎస్‌జీలో సభ్యత్వం లేదు. వీటి నియమాలకు విరుద్ధంగా భారత్ అణు పరీక్షలు జరిపింది. తనకు తాను అణ్వస్త్ర దేశంగా ప్రకటించుకున్నది. అయినా 2008లో ఆంక్షలు ఎందుకు ఎత్తివేసినట్టు? అంటే అమెరికా, ఫ్రాన్స్, రష్యా మొదలైన దేశాల అణు సామాగ్రిని అమ్మడానికి సిద్ధంగా ఉన్నాయి. భారత్ అణు సామాగ్రి వ్యాపారానికి లాభసాటి మార్కెట్‌గా అవతరించింది. దీంతో భారత్‌పై ఆంక్షలు ఎత్తివేయాలన్న అమెరికా సూచనకు చైనా సంకోచం లేకుండా సమ్మతిని తెలియజేసింది.

ఈ విధానం దేశ సార్వభౌమత్వానికీ, స్వతంత్ర అణువిధానానికీ చేటు చేస్తుందని అప్పుడే ప్రజలు, అణు శాస్త్రవేత్తలు ఆందోళ వ్యక్తం చేశారు. ఇప్పుడు మోడీ మన్మోహన్‌ను మించిపోయి అమెరికాకు లొంగుబాటు ప్రదర్శిస్తున్నారు. అమెరికా అంతర్జాతీయ వ్యూహాల్లో భారత్ తన వెంట ఉంటుందనే నమ్మకం కలిగించిన తర్వాతే ఒబామాగానీ, అమెరికా కాంగ్రెస్‌గానీ మోడీని నమ్ముతున్నాయనే వాస్తవం విస్మరించ రాదు. భారత ప్రజల భద్రతగురించిగానీ, భారత సార్వభౌమాధికారం ఎంతగా అమెరికా గుప్పిట్లోకి వెళ్తుందని గానీ, అణువిద్యుత్తును వినియోగించే వినియోగదారుడు ఎంతటి భారం భరించవలసి ఉంటుందనే విషయాన్ని గానీ మోడీ పట్టించుకోలేదు. అమెరికా వ్యూహానికి తోడ్పడుతున్నందున అంతర్జాతీయ అణ్వస్త్ర రాజ్యాల కూటమి (న్యూక్లియర్ వెపన్ స్టేట్స్)లో, దాని అనుబంధ ఎన్ఎస్‌జీలో భారత్ సభ్యత్వం పొందడానికి తాజాగా అమెరికా అనుకూలత వ్యక్తం చేయడంలో దాగి ఉన్న మర్మమిదే.

ఒబామా – మోడీ మధ్య జరిగిన భేటి అనంతరం ఇరువురు కలిసి చేసిన సంయుక్త పత్రిక ప్రకటనలో ప్రధానంగా నాలుగు అంశాలను ఉభయదేశాలు ప్రకటించాయి. 1) అణుసామాగ్రి బదలాయింపుపై అవగాహన (లాజిస్టిక్స్ ఎక్ఛేంజ్ మెమోరాండం ఆఫ్ అండర్‌స్టాండింగ్), 2) మిస్సైల్ టెక్నాలజీ నియంత్రణ రిజీమ్ (ఎంటీసీఆర్), 3) దీనికి సంబంధించిన సాంకేతిక సరఫరాలకు సహకారం, 4) అణు ఇంధన సరఫరా బృందం (ఎన్ఎస్‌జీ)లో సభ్యత్వం కోసం భారత్ అభ్యర్థనను ఆమోదింపచేయడం.ఈ ఒప్పందాల ఫలితంగా రక్షణ రంగంలో భారత్‌ను అమెరికా ప్రధాన భాగస్వామిగా గుర్తించిందని, దీంతో రక్షణ రంగ సంబంధిత వాణిజ్య, సాంకేతిక బదిలీల విషయంలో తనకు అత్యంత సన్నిహితంగా ఉన్న మిత్రులతో సమానంగా భారత్‌ను అమెరికా పరిగణిస్తుందని, అణుసరఫరా బృందం (ఎన్ఎస్‌జి)లోకి, మిస్సైల్ టెక్నాలజీ కంట్రోల్ రెజీమ్ (ఎంటిసిఆర్)లోకి భారతదేశ ప్రవేశానికి అమెరికా పూర్తి మద్దతిస్తుందని మోడీ సంతోషభరితుడయ్యాడు. మోడీ భారత్ తిరిగి రాగానే భారతదేశానికి అగ్రరాజ్య హోదా కల్పించిన గౌరవంగా పేర్కొన్నాడు. ఈ ప్రకటనలతో ఏమాత్రం సంబంధం లేకుండానే, భారతదేశ పౌర అణుకార్యక్రమం ఇప్పటికే పూర్తిస్థాయిలో అమెరికా అదుపులో వుందనేది స్పష్టం.

క్షిపణి నియంత్రణ రిజీమ్ (ఎంటిసిఆర్)లో 35వ సభ్యునిగా చేర్చుకోటానికి ఒబామా పూర్తి అంగీకారం తెలిపారు. ఇంకేముంది మీడియా అంతా మోడీని ఆకాశానికి ఎత్తేశాయి. 300 కిలోమీటర్లులోపు పయనించే క్షిపణుల తయారీకి అనుమతి లభించబోతోంది. ఎంటిసిఆర్‌లో సభ్యత్వం వల్ల ఇప్పటివరకూ దక్కని అత్యున్నత స్థాయి క్షిపణి సాంకేతిక పరిజ్ఞానం భారత్ కొనుగోలు చేయగలదు.. అలాగే బ్రహ్మోస్ వంటి క్షిపణులను అమ్ముకోగలదనే ప్రచారం సాగుతోంది. రష్యా గనుక ఒప్పుకుంటే వియత్నాం లాంటి దేశాలకు ఎగుమతులు చేయవచ్చు. తద్వారా ఆయుధాలను తయారుచేసుకుని మన దేశం విదేశీ మారక ద్రవ్యాన్ని సంపాదించుకోవచ్చని ఉవ్విళ్లూరుతుంది.

ఈ మిస్సైల్స్ టెక్నాలజీ కంట్రోల్ రిజీమ్ (ఎంటిసిఆర్) ద్వారా సభ్యదేశాల నుండి సాంకేతిక పరిజ్ఞానం, తయారుకు అవసరమైన లోహాలు, విడిపదార్థాలు మనం దిగుమతి చేసుకోవచ్చు. కనుక ఒరిస్సా లోని అబ్దుల్‌కలాం క్షేత్రం నుంచి అనేకరకాల క్షిపణులను ఉత్పత్తి చేయవచ్చు. శ్రీహరికోట నుంచి రాకెట్‌లను అంతరిక్షంలోకి పంపించ వచ్చు. మనక్షిపణుల, రాకెట్‌ల కీర్తి గగన శిఖరాలను తాకుతుందని, ఆ తరువాత మనం ఎన్ఎస్‌జి సభ్యత్వాన్ని పొందే అవకాశం ఉంటుందని, అణు బాంబులను, అణు రియాక్టర్లను తయారుచేసే అవకాశం దీనిద్వారా సంక్రమిస్తుందని మోడీ భ్రమల్లో ఉన్నారు. దీంతో భారతదేశం పెద్ద శక్తివంతమైన దేశంగా ఎదుగుతుందని, మన దేశాన్ని చూసి ఇరుగు పొరుగు దేశాలు, ప్రపంచదేశాలు వణికిపోతాయని పగటి కలలుకంటు న్నారు. పొరుగు దేశాలు భయపడిపోయి వ్యాపారాలావాదేవీలు మనతో చేసుకుంటాయి, విపరీతమైన అభివృద్ధి జరిగిపోతుంది. జీడీపీ పెరుగుదల తో దేశం సర్వతోముఖాభివృద్ధి చెందుతుందని, దేశంలో ఇంక సమస్యల నేవే ఉండవని, అచ్చేదిన్ వచ్చేస్తున్నాయని నమ్మబలుకుతున్నారు.

ఎన్ఎస్‌జీలో ప్రవేశానికి భారత్‌కు చైనా అడ్డుపడుతుందని ప్రచారం జరుగుతోంది. నిజానికి చైనాను ఒప్పించకుండా భారత్ ఎన్ఎస్‌జీలో చేరలేదు. అట్లాగే భారత్‌ను పూర్తిగా అడ్డుకునే పరిస్థితి చైనాకు లేదు. పోనీ భారత్‌కు అడ్డు చెబుతున్న చైనా ఎన్ఎస్‌జీ నియమ నిబంధనలకు కట్టుబడి ఉందా అంటే అదీ లేదు. ప్రపంచమంతా కండ్లప్పగించి చూస్తుండగానే ఎన్ఎస్‌జీలో సభ్యత్వం లేని పాకిస్థాన్‌కు అణు రియాక్టర్లను సరఫరా చేసింది. దీనికి అమెరికా అభ్యంతరం చెప్పలేదు. అప్పుడు పాకిస్థాన్‌తో అమెరికాకున్న అవసరం అటువంటిది. భౌగోళిక రాజకీయా లు, వాణిజ్య ప్రయోజనాలకు సంబంధించి చైనా కోరికలు భారత్ తీరిస్తే అభ్యంతరాలు దూది పింజల్లా తేలిపోతాయి. ఎన్ఎస్‌జీ సమావేశం ఈ ఏడాది చివరలో మరోసారి జరగాలనే నిర్ణయం తీసుకున్నందున ఆలోగా చైనాను మెప్పించి, ఒప్పించగలిగితే భారత్‌కు అర్హత ఉన్నట్లు, లేకపోతే లేనట్లు. అమెరికాతో సత్సంబంధాలు చైనాతో సంబంధాలు చెడకుండా సమతుల్యత పాటించడాన్ని మోడీ విస్మరిస్తున్నారు.

పౌర అణు సహకారం, భారత నిబద్ధత, రక్షణ ఒప్పందాలు దేశ ప్రయోజనాలకు హానికరం. ఎక్కడైనా అమెరికా సైనిక జోక్యం చేసుకుంటే విమానాలు ఇంధనం నింపుకొనేందుకు మన దేశం సౌకర్యం కల్పించాలి. ఏ చైనా పైనో, పాక్‌పైనో అమెరికా తన ప్రయోజనాల కోసం దాడికి తెగబడితే ఆ దేశం మన పొరుగున ఉన్నదైనా, మిత్ర దేశం అయినా సరే అగ్రరాజ్యానికి తప్పనిసరిగా సహకరించాల్సిందే. అమెరికాతో స్నేహం పులి మీద స్వారీలాంటిది. ఎన్ఎస్‌జీలో సభ్యత్వం కోసం అమెరికాను భారత్ మరింత సంతృప్తి కలిగించితేనే మద్దతు ఇస్తుంది. అంటే అమెరికా కూటమి దగ్గర పోగుపడిన కాలంచెల్లిన అణు విద్యుత్ పరికరాలను భారీ మూల్యంతో మనకు అంటగట్టేందుకు అంగీకరించాల్సి ఉంటుంది. దక్షిణ చైనా సముద్రంలో చైనా అమెరికాల మధ్య సాగే ఆధిపత్య పోరులో భారత్ తలదూర్చడంవల్ల లేనిపోని సమస్యలు వస్తాయి. ఆసియా ఖండం లో ఉద్రిక్తత పెరుగుతుంది. చైనాతో ఇప్పటికే మనకున్న సమస్యలు మరింత జటిలమవుతాయి. 'మిస్సైల్ టెక్నాలజీ నియంత్రణ రిజీమ్' ఒప్పందం చేసుకుని చైనాకు వ్యతిరేకంగా దాని పొరుగున ఉన్న దేశాలకు భవిష్యత్తులో బ్రహ్మోస్ క్షిపణులు విక్రయించాలనుకున్నప్పుడు, ఎన్ఎస్‌జి లోకి భారత్‌ను చేర్చుకోవడాన్ని చైనా సమర్థిస్తుందని మనం ఎలానమ్మాలి?

ఒబామా – మోడీ చేసిన ఉమ్మడి ప్రకటన గమనిస్తే భారత్‌ను అమెరికాకు అన్ని విధాలా తాకట్టు పెట్టేలా చేసినట్లుంది. చైనా వృద్ధిని, వాణిజ్య దూకుడును తట్టుకోలేని అమెరికా 2011 నవంబరులో రచించిన ఆసియా పీవోట్‌లో భాగంగా హిందూ మహాసముద్రం, పసిఫిక్ మహా సముద్ర ప్రాంత దేశాలతో మచ్చిక చేసుకుంటూ చైనాకు వ్యతిరేక కూటమిని వాణిజ్యపరంగా, మిలిటరీ పరంగా ఏర్పరచింది. ఇందులో అమెరికా తెలివిగా భారతదేశం, ఫిలిప్పైన్స్, వియత్నాం, జపాన్, ఆస్ట్రేలియా, మలేషియా, సింగపూర్ వంటి దేశాలతో తననుంచి ఆయుధా లను కొనిపించి చైనాపై ఎక్కు పెట్టిస్తుంది. ఇప్పుడు అమెరికా కడుతున్న చైనా వ్యతిరేక కూటమిలో భారత్‌ను చేర్చినట్లుంది. చైనాకు వ్యతిరేకంగా భారత్‌ను ఉపయోగించుకోవాలనేది అమెరికా ఎత్తుగడ. ఒకవైపు ఆయుధ పోటీతో, వాణిజ్య దిగ్బంధంతో చైనాను బలహీనపరచడం, మరోవైపు భారతదేశం వంటి దేశాలకు ఆయుధాలను అమ్మి స్వదేశీ సాంకేతిక పరిజ్ఞానాన్ని నీరుగార్చడం ప్రధాన వ్యూహం. ఈ వ్యూహంతో అమెరికా తన చైనా వ్యతిరేక ఆయుధ ఖర్చు లను మన దేశాలపై మోపి, అమెరికా ఆయుధ కర్మాగారాల లాభార్జనకు పూనుకుంటుంది.

దక్షిణ చైనా సముద్రంలో అమెరికా ఉద్దేశపూర్వకంగా జోక్యం చేసుకొని ఉద్రిక్తతలు సృష్టిస్తోంది. అమెరికా అనుసరిస్తున్న ఈ ఘర్షణాత్మక వ్యూహంలోకి మనల్ని నెట్టినట్లవుతుంది. భారత్, చైనాల మధ్య వైరుధ్యాలు వేరు. చైనాను లక్ష్యంగా చేసుకున్న అమెరికా కూటమిలో చేరడం వేరు. పాకిస్థాన్‌కు చైనా సహకరిస్తుందనే సాకు చూపడంలో కూడా అర్థంపర్థం లేదు. పాకిస్థాన్‌లో ఉగ్రవాదం పురుడు పోసుకుంటుందని అమెరికా కాంగ్రెస్‌లో మోడీ చెప్పడానికి ముందుగానే కశ్మీర్‌లో లష్కరే తొయిబా దుష్టపాత్రను చైనా మీడియా సూటిగా మనల్ని విమర్శించింది. అమెరికా ఇంతవరకూ ఎప్పుడూ పాకిస్థాన్‌ను తప్పుపట్టలేదు సరికదా దానికి ఎఫ్15, ఎఫ్16 యుద్ధ విమానాలను, ఆయుధాలను సరఫరా చేస్తూనే ఉన్న విషయాన్ని గుర్తుంచుకోవాలి.

ఆఫ్ఘన్, ఇరాక్, లిబియా యుద్ధాలతో కుంటుపడ్డ ఆర్థిక వ్యవస్థ, రష్యాతో బెడిసిన సంబంధాలు, చైనాతో ఆర్థిక పోటీ ఎదుర్కొంటున్న నేపథ్యంలో ఆసియా పసిఫిక్ ప్రాంతంలో భారత లాంటి నమ్మకస్తులను తయారు చేసుకోవడం అమెరికాకు అనివార్యం, అత్యవసరం. ప్రపంచ ఆధిపత్యంలో అమెరికా దాడి స్థితి నుంచి రక్షణ స్థితికి చేరుకుంది. ఈ సమయంలో భారత్ తనవైపే అన్న స్పష్టమైన సంకేతాలు ఇవ్వగలుగు తోంది. ఇది అమెరికా రాజకీయ భౌగోళిక వ్యూహంలో భాగమే. ఆసియా దేశాలపై పెత్తనం కోసం, మిలిటరీ స్థావరాల స్థాపన కోసం, తద్వారా కునారిల్లిపోతున్న అమెరికా ఆర్థిక వ్యవస్థకు జవసత్వాలు అందించాలన్న

వ్యూహంతోనే చైనా, రష్యా దేశాలకు వ్యతిరేకంగా వర్ధమాన దేశాల సంరక్షణ వ్యవస్థ ఆచరణలోకి రాకూడదనే ఉద్దేశంతోనే అమెరికా గొడుగు క్రిందనే సంయుక్త రక్షణ వ్యవస్థ ఏర్పాటు ప్రయత్నాలు గత కొంతకాలం నుంచి కొనసాగిస్తూనే ఉంది. అందువల్లనే ఇండియా–పాకిస్థాన్‌లను, ఇండియా–చైనాలను కలువకుండా చేయాలని అమెరికా సంకల్పించింది. మన పాలకులు ఈ కుట్రను గమనించకపోతే చరిత్ర క్షమించదు.

సోవియట్ యూనియన్ పతనానంతరం అమెరికా పెత్తనాన్ని కొంతైనా నిలువరించాలంటే భారత్, చైనా సంబంధాలు కీలకమని అంతర్జాతీయ నిపుణులు చెబుతున్నారు. ఇందులో రష్యాను కూడా కలుపుకోవాలని సూచిస్తున్నారు. భారత్, చైనా రష్యా కలయికే ప్రపంచ శాంతికీ, అమెరికా ఒంటెత్తు పోకడను, అగ్రవాదాన్ని నిరోధించడానికీ వీలుకల్పిస్తుందని భావిస్తున్నారు. ఈ దశలో చైనాను అన్ని విధాలా ఒంటరిని చేసి తన కుట్రలు, కుయుక్తులు కొనసాగించేందుకు ఆసియా–పసిఫిక్ ప్రాంతంలో ఒక నాటో తరహా సైనిక కూటమిని నిర్మించేందుకు అమెరికా ప్రయత్నం చేస్తోంది. అంతేకాదు, చైనా రష్యాల వ్యూహాత్మక మైత్రిని ఎదుర్కొవాలనే వ్యూహాన్ని అమెరికా రూపొందిస్తున్నది. జూన్ 3–5ల మధ్య సింగపూర్‌లో జరిగిన ఆసియా భద్రత సదస్సులో అమెరికా రక్షణమంత్రి కార్టర్ ప్రసంగం ఈ విషయాన్ని తేటతెల్లంచేసింది. ఆసియా ఖండంలో అమెరికా పెంచు తున్న ఘర్షణాత్మక వ్యూహంలో మనం పాలుపంచుకోవడం అనాలోచితమే కాక అవాంఛనీయం కూడానని చెప్పక తప్పదు. అంతేగాక భారత్ అమెరికాకు వత్తాసుగా మారడం విదేశాంగ నీతికి పూర్తిగా భిన్నమైంది.

అమెరికాతో సైనిక సహకార ఒప్పందం కుదుర్చుకోవడంతో అమెరికా సైన్యాలు యుద్ధ సమయంలో అమెరికా విమానాలు, నౌకలు ఇతర వాహనాలు మరమ్మత్తు సమయంలో భారత్‌గడ్డపై ఉండేందుకు అనుమతించబడతాయి. అవి విశ్రాంతి తీసుకోవడానికి, మజా చేయడానికి కూడా వీలు కల్పించబడుతుంది. ఇతర సౌకర్యాలు పొందటానికి కూడా అనుమతిస్తారు. ఆఫ్ఘనిస్తాన్, ఇరాక్, అరేబియా, ఇతర కల్లోలిత ప్రాంతాల్లో నాటో దళాలను ఉపయోగించినట్లు ఈ ప్రాంతంలో కూడా అమెరికా సైనిక దుస్సాహసాలకు మన సైన్యాన్ని కూడా చేరవలసిందిగా ఆహ్వానిస్తారు. అమెరికా ఆధిపత్యాన్ని స్థాపించడానికి ఏ దేశంలో దురాక్రమణకైనా దోహదం చేయడానికి, నాటో తరహా కూటమి ఏర్పాటును సృష్టించడానికి ఇరుదేశాల సైన్యం మధ్య వ్యవస్థాపక సహకారానికి అంతిమంగా దారి తీస్తుంది.

ప్రధాని మోడీతో అమెరికా రక్షణ మంత్రి వాషింగ్టన్‌లో ఈ రక్షణ ఒప్పందాన్ని సుదృఢం చేయడానికి సమాచార భద్రత ఒప్పందం, మౌలిక ప్రాతిపదిక సౌకర్యాల ఒప్పందం, మౌలిక పరస్పర మార్పిడి– సహకార ఒప్పందాలను వీలైనంత త్వరలో చేసుకోవాలని ప్రతిపాదించాడు. ఈ మూడు ఒప్పందాలతో దేశరక్షణ, అంతరంగిక భద్రత విషయంలో అమెరికా సామ్రాజ్యవాదం శాసించే పరిస్థితి కల్పించబడుతుంది. దీంతో భారత్ సార్వభౌమత్వం, స్వయం ప్రతిపత్తి కోల్పోవడం జరుగుతుంది. అనేక దేశాల్లోని కీలుబొమ్మ రాజ్యాల్లాగానే భారత్ కూడా మారిపోతుంది. అంతిమంగా జరిగేదేమంటే... అమెరికా ఆయుధ కంపెనీల వ్యాపారానికి భారత్ మార్కెట్‌గా మారడమే.

ప్రపంచ ఆయుధ వ్యాపారంలో ఒక్క అమెరికానే అరవై శాతానికి పైగా వాటా కలిగి ఉంది. ఈ దశలో మన క్షిపణి పరికరాలు, ఆయుధ సామగ్రిని ఎగుమతి చేసుకోవడమనేది వట్టి భ్రమే. మోడీ కుదుర్చుకున్న ఒప్పందాల వల్ల మన సైనిక, రక్షణ, ఆయుధ వ్యవస్థలను అంతర్జాతీయ ఆయుధ బేహారులకు అప్పగించడానికే దారితీస్తుంది. భారీ ఎత్తున రక్షణ సామగ్రిని అమ్మడంతోపాటు, ఆసియా–పసిఫిక్ ప్రాంతంలో భారత్‌ను తమ ప్రయోజనాలు కాపాడే దేశంగా తీర్చిదిద్దడం అమెరికా లక్ష్యమనేది తెలిసిందే. ఆసియా – పసిఫిక్ ప్రాంతంలో (అమెరికా) భద్రతా ప్రయోజనాలు కాపాడే స్థాయికి చేరుకునే విధంగా భారత్‌కు రక్షణ పాటవాన్ని పెంచడానికి తోడ్పడతామని మోడీ పర్యటన సందర్భంగా అమెరికా స్పష్టం చేసింది. భారత్ పాటవాన్ని పెంచడం అమెరికా ప్రయోజనం కోసమేనని కూడా పేర్కొనడం గమనార్హం. ఇది మన దేశ భద్రత, రక్షణ పాటవంపై తీవ్ర దుష్ప్రభావం చూపుతుంది. మన రక్షణ రంగాన్ని, వ్యాపార లావాదేవీలకు అవసరమైన ప్రాతిపదికలు, సరఫరా వ్యవస్థలు సృష్టించడానికే మనం అవకాశం కల్పించినట్లవుతుంది.

భారతదేశంలో నిర్దేశిత ప్రాంతంలో వెయ్యి మెగావాట్ల సామర్థ్యంగల 6 అణు రియాక్టర్ల నిర్మాణానికి వెస్టింగ్‌హౌస్ కంపెనీ పూనుకునే విధంగా, ఈ ప్రాజెక్టులకు అవసరమైన ఆర్థిక ప్యాకేజీని అమెరికాకు చెందిన ఎక్స్‌పోర్టు–ఇంపోర్టు బ్యాంకు అందజేసేవైపుగా మోడీ వ్యాపార ఒప్పందాలకు వెనువెంటనే అంగీకరించాడు. అయితే రియాక్టర్ల సరఫరాకు వెస్టింగ్ హౌస్‌ను ప్రభుత్వం ఎవరితోనూ సంప్రదించకుండా ఏకపక్షంగా ఎంపికచేసింది. ప్లాంట్‌లో ప్రమాదం జరిగితే వెస్టింగ్ హౌస్ నష్టపరిహారం చెల్లించనవసరం లేదని హామీఇవ్వడం జరిగింది. అంటే భారత ప్రభుత్వమే నష్టపరిహారం చెల్లించాలి. ఈ ప్లాంట్లలో ఉత్పత్తి అయ్యే విద్యుత్ రేటు చాలా ఎక్కువగా ఉంటుందని నిపుణుల అంచనా. ఈ ఒప్పందంపై 2017 జూన్‌లో సంతకాలు చేసుకొని తుదిరూపం తీసుకోవటం జరుగుతుంది. వెస్టింగ్‌హౌస్ నిర్మించే అణురియాక్టర్లు భారతదేశంలో ఏ ప్రాంతంలో నిర్మించబడతాయి? నిర్దేశిత స్థలంలో అవి నిర్మించ బడతాయని మాత్రమే సంయుక్త ప్రకటనలో పేర్కొన్నారు. మోడీ దీన్ని ఈ తరహా ఒప్పందాలలో 'అతి పెద్దది'గా అభివర్ణించాడు.

మోడీ దేశంలో ఫాసిస్టు విధానాలను అమలుపరుస్తూ, ప్రాంతీయ ఆధిపత్య కులీన వర్గాల ఆకాంక్షల కనుగుణంగా పొరుగు దేశాలకు వ్యతిరేకంగా, దేశంలో జాతీయ దురహంకారాన్ని రెచ్చగొట్టటంద్వారా అమెరికా అధిపత్య వ్యూహాల నుండి, అలాగే దక్షిణాసియా, హిందూ మహాసముద్ర ప్రాంతాలపై విస్తరణవాద చర్యల నుండి ప్రజల దృష్టి మరల్చే ప్రయత్నాలు చేస్తున్నారు. అందుకు మీడియా విస్తృతంగా సహకరిస్తుంది. భారత ప్రజల, దేశ ప్రయోజనాల కనుగుణమైన స్వతంత్ర, సార్వభౌమ విదేశాంగ విధానం అవసరం. అంతేగాని పొరుగు దేశాలతో తగువుపడే విధానాలకు స్వస్తి పలకాలి. భవిష్యత్తులో మనం స్వయంప్రతిపత్తి లేక అమెరికా పంచనచేరి అనుకూల విదేశాంగ విధానాలను మోడీ ప్రభుత్వం అనుసరించడంవల్ల మన పొరుగున ఉన్న సరిహద్దు దేశాలతో సఖ్యత, శాంతి, స్నేహభావం దూరమయ్యే అవకాశాలే మెండుగా కన్పిస్తున్నాయి. అందువల్ల అమెరికాతో కుదుర్చుకున్న ఒప్పందాలన్నింటి నుంచి బయటికి రావాలని డిమాండు చేయాలి. సామ్రాజ్యవాదుల ప్రయోజనాల కొరకు, దేశ సహజ వనరుల లూటీకి తోడ్పడే ఒప్పందాలను నిర్ద్వందంగా తిరస్కరించాలి. సామ్రాజ్యవాద అమెరికాతో చేతులు కలిపే విధానాన్ని ముక్త కంఠంతో ఖండించాలి.

*(రచయిత ఉపాధ్యాయ నాయకులు, రాజనీతి శాస్త్ర విద్యార్థి)* వీ

# జాతీయ విద్యా విధానం - 2016

***పరాయి పాలన నుంచి స్వదేశీ పాలన వచ్చి ఏడు దశాబ్దాలు కావస్తున్నా దేశంలో ఇప్పటికీ ఒక శాస్త్రీయమైన విద్యా విధానం రూపొందలేదనీ, విద్య ప్రైవేటీకరణ చెంది, రాజకీయాల జోక్యం పెరిగి వ్యాపార సరుకుగా మారిపోయిందనీ అంటున్నారు సిఎస్ఆర్ ప్రసాద్***

దేశంలో అధికార మార్పిడి జరిగి ఏడు దశాబ్దాలు గడిచినా ఇప్పటికీ స్పష్టమైన, శాస్త్రీయమైన, సమాజ అవసరాలకు అనుగుణమైన జాతీయ విద్యా విధానాన్ని రూపొందించుకోలేకపోవడం మేధావుల నిలయంగా చెప్పుకోబడుతున్న భారత దేశానికి సిగ్గుచేటు. 1948 సర్వేపల్లి రాధాకృష్ణన్ కమిషన్‌తో ప్రారంభమై, 1952 లక్ష్మణ్‌స్వామి మొదలియార్ కమిటీ, 1964లో కొఠారీ కమిషన్, 1986లో రాజీవ్‌గాంధీ తరహా 21వ శతాబ్దపు విద్య వంటి పలు కమిషన్‌లు ఏర్పడి తీరుబాటుగా పనిచేసి విద్యారంగంలో తేవలసిన మార్పులపై పలు సూచనలు చేశాయి. ఈ కమిటీలన్నీ విద్య ప్రయోజనం గురించి ఉదాత్తమైన అభిప్రాయాలను వెల్లడించాయి. అందరికీ అందుబాటులో విద్య, అందరికీ ఒకే రకమైన విద్య, మాతృభాషలో విద్య, ప్రభుత్వ యాజమాన్యంలో విద్య, నడవడికతో కూడిన వ్యక్తిత్వాన్ని రూపొందించే విద్య వంటి శ్లాఘనీయమైన సూచనలు అనేకం చేశాయి. అయితే సూచనల దారి సూచనలది, ప్రభుత్వ చర్యల దారి చర్యలది అయిపోయింది. ఇంతమంది మేధావులు ఎన్ని సూక్తులు వల్లించినా, కేంద్ర విద్యా శాఖను నిర్వహించిన 2016 నాటికి పరిస్థితి మళ్లీ మొదటికి వచ్చింది. విద్య చౌరస్తాలో నిలబడి ఎటు ప్రయాణించాలో తెలియని దిక్కుతోచని స్థితిలో పడింది.

ఈ నేపథ్యంలో కేంద్ర మానవ వనరుల శాఖ 2015 అక్టోబర్‌లో మాజీ కేబినెట్ సెక్రటరీ టిఎస్ఆర్ సుబ్రమణియన్ నాయకత్వంలో ఒక కమిటీని ఏర్పాటు చేసింది. ఈ కమిటీ మే 30న ప్రభుత్వానికి తన నివేదికను అందించింది. అది తన సుదీర్ఘమైన నివేదికలో ఒకరకంగా మళ్లీ పాతపాటే పాడింది కాని కొన్ని అంశాలలో మాత్రం చర్చించదగిన కొన్ని సూచనలు చేసింది. ఈ నివేదికపై ప్రభుత్వానికి అలక ఎందుకు కలిగిందో గాని ఆ నివేదికను తొక్కిపట్టింది. కేంద్రం బహిరంగ పరచకపోతే తన నివేదికను తానే పబ్లిక్ చేస్తానని సుబ్రమణియన్ హెచ్చరించారు. మొత్తం మీద ఎలాగోలా ఈ నివేదిక మీడియాలో బహిరంగం అయింది. ఇది ఇట్లా ఉండగా కేంద్ర మానవ వనరుల శాఖ నూతన విద్యా విధానం 2016 చిత్తుప్రతి అనే పేరిట ఒక పత్రాన్ని చర్చకు విడుదల చేసింది. దీనిలో ఎక్కడా ఆ కమిటీ ప్రస్తావన లేదు. ఇది 43 పేజీల ప్రతి.

అధికారంలోకి వచ్చిన ప్రభుత్వం గంభీరమైన, దార్శనికతతో కూడిన విలువలను వివిధ రంగాలలో తమ లక్ష్యాలుగా ప్రకటించుకోవడం ఈ దేశంలో అలవాటు అయింది. ఆ రీతిలోనే ఈ చిత్తుప్రతి కూడా జ్ఞానం, నైపుణ్యం, విలువలతో కూడిన విద్యను అందిస్తామని దేశ అభివృద్ధి క్రమంలో భాగస్వామి అయ్యే రీతిలో, త్వరత్వరగా మారిపోతున్న ప్రపంచీకరణ నేపథ్యంలో జ్ఞాన ఆధారిత ఆర్థిక వ్యవస్థకు అనుగుణంగా విద్యార్థులను తయారు చేస్తానని ప్రకటించింది. అందరికీ జీవితాంతం నాణ్యతతో కూడిన విద్యను అందిస్తామని, ఎవరికీ విద్య నుండి మినహాయింపు ఉండదని పేర్కొన్నది. ఈ దేశంలో ఉన్న బహుళ సంస్కృతికి ఘనమైన వారసత్వాన్ని విద్యార్థులకు అర్థం చేయిస్తామని, వారిలో లౌకిక భావాన్ని, సహనాన్ని, జాతీయ సమగ్రతను పెంపొందించేటట్లుగా విద్యా విధానాన్ని రూపొందిస్తామని వాగ్దానం చేసింది. విద్యార్థుల్లో విమర్శనాత్మక ఆలోచనలను పెంపొందిస్తామని, వాళ్లను మరింత సృజనశీలురుగా తీర్చిదిద్దుతామని కూడా పేర్కొన్నది. ఈ లక్ష్యాలు ఎంత ఉన్నతంగా కనపడుతున్నా వీటిని సాధించాల్సిన భారతీయ జనతా పార్టీ (బిజెపి) ప్రభుత్వం గత రెండేళ్ల నుంచి అనుసరిస్తున్న సంకుచిత, మత దురభిమానంతో కూడిన, అన్ని రంగాలలో విదేశీ పెట్టుబడులను భారీగా స్వాగతిస్తున్న వైనాన్ని గమనిస్తున్న వాళ్లకి ఎవరికైనా, ఈ లక్ష్యాలు ప్రజలని మోసం చేయడం తప్ప మరేం కాదని స్పష్టం అవుతుంది.

సాధారణంగా ప్రభుత్వాలలో ఉండే లోపాలను ప్రతిపక్షాలు విమర్శిస్తుంటాయి. అందుకు కూడా తావులేకుండా ప్రభుత్వమే ప్రతిపక్షంగా మారి అపుడప్పుడు సున్నితంగా తన లోపాలను తానే అంగీకరించడం ఒక ఫ్యాషన్‌గా మారింది. ఈ డాక్యుమెంటులో కూడా అలాంటి స్వీయ విమర్శనాత్మక ధోరణి కనబడుతుంది. భారత రాజ్యాంగంలోని 21-ఎ నిబంధన ఆరు నుండి పద్నాలుగు సంవత్సరాల వయసున్న ప్రతి బిడ్డకు ఉచిత, నిర్బంధ విద్యా హక్కులు ఇచ్చిందని, ఇరుగు పొరుగు బళ్లల్లో చదువుకునే హక్కు కల్పించిందని, అయినా ఆ లక్ష్యాలు నెరవేరలేదని, ఇప్పటికీ ప్రాథమికోన్నత, సెకండరీ స్థాయిలలో విద్యార్థుల ఎన్‌రోల్‌మెంట్ ఆందోళన కలిగించే రీతిలో తగ్గిపోతోందని ఈ పత్రంలో పేర్కొన్నారు. అదే విధంగా వెనుకబడిన తరగతుల, వర్గాల విద్యార్థులకు ఎల్‌కెజి, యుకెజి వంటి ప్రీస్కూల్ విద్య అందడం లేదని, చారిత్రక అననుకూల స్థితిలో ఉన్న, తొలితరం విద్యార్థులలో విద్య నేర్చుకోవడంలోను, ఫలితాలు సాధించడంలోను గణనీయమైన బలహీనతలు ఉన్నాయని, ఇది 'విద్యా ప్రక్రియతో సమత' అనే లక్ష్యానికి పెద్ద సవాలుగా మారిందని ఇందులో అంగీకరించారు.

సామాజికంగా, ఆర్థికంగా, పైమెట్టుకు చేరడానికి, మానవీయ స్థాపనకు శక్తివంతమైన సాధనంగా విద్యను గుర్తిస్తున్నామని ఈ నివేదిక పేర్కొన్నది. విద్యార్థుల నుండి వసూలు చేస్తున్న ఫీజులను బట్టి చూస్తే అన్ని స్థాయిల విద్యలోను వ్యాపారీకరణ విశృంఖలంగా సాగుతున్నదని,

ప్రమాణాలు, నాణ్యతలేని విద్యా సంస్థలు పుట్టగొడుగులుగా పుట్టుకొస్తున్నాయని, వీటి కారణంగా విద్యా వ్యవస్థపై నమ్మకం సడలుతుందని నివేదిక హెచ్చరించింది. స్థూల జాతీయోత్పత్తిలో ఆరుశాతం విద్యారంగానికి ఖర్చు పెట్టాలని కమిటీలు సూచించినా, ఇప్పటిదాకా ఏ ప్రభుత్వం 3.5 శాతానికి మించి ఖర్చు పెట్టలేదని ఈ నివేదిక వాపోయింది. ఇలా స్వీయ విమర్శతో సాగిన ఈ పత్రంలో ఈ ఏడు దశాబ్దాల కాలంలో విద్యా వ్యవస్థ ఇంత పతనం కావడానికి మౌలిక కారణాలు ఏమిటన్నది మాత్రం నామమాత్రంగా కూడ ప్రస్తావించలేదు. చతురత అంతా అక్కడే ఉన్నది. ఇంతకంటే ఈ విషయంలో సుబ్రమణియన్ కమిటీ కొంత నయం. విద్యా వ్యవస్థలో రాజకీయ నాయకుల, ప్రైవేట్ వ్యాపార సంస్థల జోక్యం అడ్డు అదుపులేకుండా పెరిగిపోవడాన్ని ఒక ప్రధాన కారణంగా సూచించింది. అయితే ఆ కమిటీ కూడా పరిష్కారాల దగ్గరకు వచ్చేసరికి కప్పదాట్లు వేసింది.

ఆ నివేదికను, ఈ డాక్యుమెంట్‌ను ఇంకాస్త పరిశీలించడానికి ముందు ఈ డాక్యుమెంట్‌లో ఉటంకించిన వివేకానందుడి మాటలను పరిశీలిద్దాం. 'మన బుర్రల్లోకి జీవితాంతం, జీర్ణం చేసుకోకుండా ఎక్కించుకుంటున్న సమాచారమే విద్య కాదు, ఒక గ్రంథాలయంలో ఉన్న గ్రంథాలన్నింటిని బట్టీ పట్టిన వారి కంటే ఉన్నతమైన ఆశయాలను జీర్ణం చేసుకుని వాటిని తమ జీవితంలో అంతర్భాగం చేసుకున్నవారు ఎక్కువ విద్యావంతులు'. ఈ పత్రం వెలువడిన కొద్దిరోజులకే ప్రకాశ్ జావదేకర్, నూతన మానవ వనరుల మంత్రిగా ప్రమాణం చేశారు. ఆయన విద్య గురించి ఏమన్నారో చూడండి. 'ఒక కొత్త ఆవిష్కరణ చేయడం అంటే ఒక తిరుగుబాటు క్రమం. తిరగబడకుండా యథాతథ స్థితిని సవాల్ చేయకుండా దేన్నయినా మీరు ఎలా ఆవిష్కరిస్తారు? భారతదేశంలో ఆవిష్కరణ సామర్థ్యం ఎందుకు సన్నగిల్లింది? ఎందుకంటే మనం ప్రశ్నించడాన్ని అనుమతించం. జిజ్ఞాసను ప్రోత్సహించం. బడిలో పిల్లలు ప్రశ్నలు అడిగితే కూర్చోబెడతాం. ఇది ఇలా కొనసాగకూడదు. పిల్లల్లో కుతూహలాన్ని రేకెత్తిస్తే నూతన ఆవిష్కరణలు జరిగి యథాతథస్థితి తొలగిపోయి మార్పు సాధ్యం అవుతుంది.'

ఘనత వహించిన ఈ మంత్రి గత రెండు సంవత్సరాలుగా హైదరాబాద్‌లోని కేంద్రీయ విశ్వవిద్యాలయంలోను, ఢిల్లీలోని జెఎన్‌యులోను, పూనాలో ఫిల్మ్ ఇన్‌స్టిట్యూట్‌లోను, జాదవ్‌పూర్ విశ్వవిద్యాలయంలోను, చెన్నైలోని ఐఐటిలోను జరిగిన దారుణమైన సంఘటనల్లో పల్లెత్తు కూడా మాట్లాడలేదు. సృజనాత్మకంగా ఆలోచించే హక్కు అమలు కోసం, భావజాలాల మధ్య, భావ సంఘర్షణ కోసం, నిర్హేతుకమైన ప్రతి విలువను ప్రశ్నించే ప్రతి హక్కు కోసం, నూతన విలువలతో కూడిన సమాజ ఆవిష్కరణ కోసం విద్యార్థులు చేసిన ప్రయత్నాలను తన పంచమాంగ దళం ద్వారా, పోలీసుల ద్వారా అణచివేయడానికి ఇంతకు ముందు ఎన్నడూ లేనిరీతిలో తన ప్రభుత్వం అనుసరించిన ఫాసిస్టు వైఖరి గురించి విమర్శించని ఈ మంత్రి విద్య ప్రయోజనం గురించి ఏం మాట్లాడాడో చూడండి. పైగా ఆయనే స్మృతి ఇరానీ నుండి బాధ్యతలు స్వీకరిస్తూ రెండేళ్ల కాలంలో మీరు నెలకొల్పిన గొప్ప సాంప్రదాయాలని కొనసాగిస్తానని కూడా అన్నాడు. ఉదాత్తమైన ఆశయ ప్రకటనలు కేవలం ప్రజలను మభ్యపెట్టడానికి, వాటి ముసుగులో తాము కోరుకుంటున్న హిందూ మత ఆధారిత సమాజాన్ని రూపొందించడానికి ఉపయోగ పడేవేనని స్పష్టమవుతుంది.

నిజానికి సుబ్రమణియన్ కమిటీ రిపోర్ట్, మానవ వనరుల శాఖ రూపొందించిన ఈ డాక్యుమెంట్ పరస్పర భిన్నమైనవి ఏమీ కావు. ఇవి నాణానికి బొమ్మ బొరుసు లాంటివే. వాళ్లు రూపొందించబోయే విద్యా విధానానికి ఈ రెండు మార్గదర్శకాలుగా ఉంటాయన్నది సత్యం. అందుచేత ఈ అంశం మీద చర్చించదలుచుకునే వాళ్లు ఎవరైనా ఈ రెండు పత్రాలలోని వివిధ అంశాల గురించి మాట్లాడవలసి ఉంటుంది.

**భాష, సంస్కృతి**

విద్యాశాఖ ప్రతిపాదించిన అంశాలలో అన్నింటి కన్నా చాలా ప్రమాదకరమైనది ఈ అంశమే. ఇందులో మాధ్యమం గురించి ప్రస్తావిస్తూ, రాష్ట్రాలు కోరుకుంటే ఐదవ తరగతి వరకు మాతృభాషలో లేదా స్థానిక భాషలో బోధన చేయవచ్చని సూచించారు. అంతేగాని అన్ని స్థాయిలలోనూ మాతృభాషలో విద్యాబోధన జరగాలని భాషావేత్తలు, మానసిక శాస్త్రవేత్తలు, విద్యా నిపుణులు చెబుతున్న వాస్తవాన్ని ఈ పత్రంలో సూత్రప్రాయంగా కూడా ప్రస్తావించలేదు.

సంస్కృతాన్ని బోధనా భాషగా చేయాలని ఈ పత్రం సూచిస్తుంది. సంస్కృతానికున్న ప్రాధాన్యతను ఆ పత్రం ఈ గుర్తించింది. 'భారతీయ భాషల ఎదుగుదలలోను, అభివృద్ధిలోను సంస్కృతానికున్న ప్రత్యేక ప్రాధాన్యతను, దేశంలో సాంస్కృతిక ఐక్యతను సాధించడానికి అది అందించిన గొప్ప సేవను దృష్టిలో ఉంచుకుని, పాఠశాల, విశ్వ విద్యాలయాల స్థాయిలో సంస్కృతాన్ని బోధించడానికి మరింత ఉదారంగా సౌకర్యాలు కల్పించాలి'. ఇది ప్రమాదకరమైన నిర్ణయం. సారాంశంలో ఇది 'తల్లి సంస్కృతంబె యెల్ల భాషలకును' అనే అవాస్తవాన్ని అంగీకరించడమే. తల్లి భాష, పిల్ల భాష అనేది ఉండనే ఉండవు. ఒక భాషలో నుంచి మరొక భాష పుట్టదని భాషా శాస్త్రవేత్తలు అంగీకరిస్తున్నారు.

పాశ్చాత్య శాస్త్రవేత్తలు కూడా పరిశోధనలు చేసి సంస్కృతం నుంచి దేశీయ భాషలు పుట్టలేదని రుజువు చేశారు. సంస్కృతం దేశీయ భాషల అభివృద్ధికి ఏమి సహాయం చేసిందో గాని, వాటి అభివృద్ధికి పెను ఆటంకంగా పనిచేసిందన్న అభిప్రాయం నికార్సైన సత్యం. అది ఎపుడూ కేవలం పండిత భాష, రాజాస్థాన భాష, పౌరోహిత్య భాష మాత్రమే. ఏ కాలంలోను అది ఈ దేశంలో ప్రజల భాష కాలేకపోయింది. దానికి పవిత్రతను అంటకట్టి అది దేవ భాష అని చెప్పుకుంటూ కేవలం బ్రాహ్మణులకు మాత్రమే దాన్ని చదువుకునే అవకాశాన్ని కల్పిస్తూ తద్వారా బ్రాహ్మణ ఆధిపత్యాన్ని సమాజం మీద నెలకొల్పిన చరిత్ర అందరికి తెల్సిందే. నాలుగు వర్ణాల హిందూ కుల వ్యవస్థ సాంస్కృతికంగా ప్రజల్ని ఎంతగా విభజించిందో అందరికీ తెలుసు. ఆ వర్ణ వ్యవస్థ దేశంలో కుల సంస్కృతిని పోషించింది గాని శ్రమ సంస్కృతిని గుర్తించ నిరాకరించింది. దానికి తోడ్పడిన సంస్కృతం దేశంలో సాంస్కృతిక ఏకత్వానికి కృషి చేసిందని చెప్పడం అచారిత్రికం.

సంస్కృతం కూడా అన్ని భారతీయ భాషలలాగా ఒకటి. అది ప్రధాన భాష మాత్రం కాదు. (సంస్కృత్ ఈజ్ నాట్ 'ది' లాంగ్వేజ్. ఇట్ ఈజ్

ఓన్లీ ఎ లాంగ్వేజ్. లైక్ ఆల్ అదర్ ఇండియన్ లాంగ్వేజెస్. ఇట్ ఈజ్ నాట్ ఈవెన్ ఫస్ట్ అమాంగ్ ఈక్వల్స్).

పైగా ఆధునిక విజ్ఞానాన్ని అందుకోవడానికి అవసరమైన సమాచారం ఏదీ లేదు. అలాంటి సంస్కృతానికి పెద్ద పీట వేయటం అంటే పాలకుల రహస్య ఎజెండాగా ఉన్న హిందూత్వను అమలు పరచటమే. ఇది మిగిలిన భారతీయ భాషల నిర్లక్ష్యానికే కాక, వెనుకబడిన, దళిత, మైనారిటీ, ఆదివాసీ వర్గాల ప్రయోజనాలను దెబ్బ తీయటానికే దారితీస్తుంది.

దాన్ని మనం తీవ్రంగా ఖండించాలి. మిగతా దేశంలో మాట ఏమో గాని మన రాష్ట్రాలలో (ఆంధ్రప్రదేశ్, తెలంగాణ) సంస్కృతం 'మార్కుల' భాషగా ఉంది. అదే దానికి తగిన స్థానం.

**యోగ**

సుబ్రమణియన్ కమిటీ తన నివేదికలో ఈ అంశానికి ప్రాధాన్యతనిస్తూ ప్రస్తావించింది. పట్టణాలలో ఉండే విద్యా సంస్థల నిర్వాహకులకు క్రీడా మైదానాలు దొరకడం సాధ్యం కావడం లేదని, అందు మూలంగా విద్యార్థులకు శారీరక వ్యాయామం ఉండటం లేదని కమిటీ అభిప్రాయ పడింది. ఇది నిజమే. పట్టణాలలో పిచ్చుక గూళ్ల వంటి భవనాలలో పాఠశాలల నుండి సాంకేతిక విద్యాసంస్థల వరకు నడుస్తున్నాయి. చట్ట ప్రకారం అయితే క్రీడా మైదానం చూపించకుండా విద్యాలయాలు నడపడానికి లైసెన్సు రాకూడదు. మరి కోళ్ల ఫారాలలాగా, జైలు గదులు లాగ ఉంటున్న ఇలాంటి విద్యా సంస్థలు తామర తంపరలాగ ఎలా పుట్టుకు వచ్చాయంటే కారణం రాజకీయ నాయకుల ఆశ్రిత పక్షపాతమే.

ఈ లోపాలన్నీ తొలగించి చట్టాన్ని కచ్చితంగా అమలు చేయాలని సూచించకపోగా ఈ కమిటీ యోగాను విద్యాసంస్థలు తప్పనిసరిగా అమలు జరిగేటట్లు చర్యలు తీసుకోవాలని సూచించింది. దాని మూలంగా విద్యార్థులలో శారీరక ఆరోగ్యం తద్వారా మానసికోల్లాసం కలుగుతుందని వారి భావన. అయితే యోగాపై ఇప్పటికే చర్చ జరుగుతున్నది. దానికి మత పునాది ఉన్నది. అది కేవలం వ్యాయామం మాత్రమే కాదు. అందులో భాగంగా అమలు పరచాల్సిన సూర్య నమస్కారాలు, ఓం అని నినదించడం హిందూ మత చిహ్నాలే.

ఇలాంటి మత వాసన కలిగిన అంశాన్ని శారీరక వ్యాయామంగా ఎవరూ పరిగణించరు. అది చేయాలా వద్దా అన్నది వ్యక్తుల ఇష్టా ఇష్టాలకు వదిలేయాలి. దాన్ని నిర్బంధంగా అమలు చేయడం అంటే హిందూత్వను దొడ్డిదారిలో విద్యా సంస్థల్లోకి ప్రవేశపెట్టడమే. ఈ యోగాకి బదులు ఇండోర్ గేమ్స్ ఆడుకోవడానికి, జిమ్నాజియం లాంటివి ఏర్పాటు చేయడాన్ని ఈ కమిటీ సూచించి ఉండవచ్చు. ఫిజికల్ ఎడ్యుకేషన్‌ను పాఠ్యాంశంలో భాగంగా చేయవచ్చును. కాని కమిటీ ఈ సిఫార్సులను చేయలేదు. పట్టణ ప్రాంతాల సంగతి అటుంచితే గ్రామీణ ప్రాంతాలలో దాదాపుగా ప్రతి పాఠశాలలోనూ విశాలమైన మైదానాలున్నాయి. కాని అక్కడ కూడా పిల్లలను ఆడించడానికి, శారీరక వ్యాయామం నేర్పించడానికి తగిన వసతులను ప్రభుత్వాలు పూర్తిగా నిర్లక్ష్యం చేశాయి. వాటి దృష్టి అంతా వందల కోట్ల రూపాయల వ్యాపారంతో ముడిపడి ఉన్న క్రికెట్, టెన్నిస్, గోల్ఫ్ వంటి ఆటల మీదనే ఉన్నది. ఇది కూడా వర్గ సంస్కృతిలో భాగం. అందుచేతనే వంద కోట్లకు పైగా జనాభా ఉన్న దేశం ఇటు హాకీ, ఫుట్‌బాల్ వంటి జట్టు ఆటలలో గాని, జిమ్నాస్టిక్స్ లోగాని చెప్పుకోదగ్గ క్రీడాకారులను సృష్టించుకోలేకపోయింది. ఈ లోపాలను పట్టించుకోని సుబ్రమణియన్ కమిటీ యోగాను పరిష్కారంగా చూపటం అంటే, హిందూత్వ ఎజెండా అమలుకు మార్గాన్ని సులభం చేయడమే.

**విద్య ప్రైవేటీకరణ**

రెండు నివేదికలూ దీన్నే ప్రస్తావించాయి. సుబ్రమణియన్ కమిటీ నివేదిక అయితే 'విద్యా దుకాణాలు' పుట్టుకొస్తున్నాయని, విద్య వ్యాపార వస్తువుగా మారిపోయిందని, బోధనాంశాలలో గాని, బోధన తీరులో గాని నాణ్యత లేదని, అభివృద్ధికి ఆమడ దూరంలో ఉన్న సామాజిక వర్గాల పిల్లలకు కనీసపు విద్య కూడా అందుబాటులోకి రాలేదని పేర్కొన్నది. దీనికంతటికీ విద్యాలయాల నిర్వహణలో రాజకీయ నాయకుల జోక్యం పెరిగిపోవడమే కారణం అన్నది కూడా పేర్కొన్నది.

విద్యాశాఖ చర్చకు పెట్టిన పత్రంలో అయితే ఈ మాత్రపు విమర్శ కూడా లేదు. కాకపోతే ఇంతకు ముందు విద్యా కమిషన్‌లు సూచించినట్లుగా జిడిపిలో ఆరు శాతం విద్య కోసం ఎప్పుడూ ఖర్చు చేయలేదని, అది సుమారు 3.5 శాతం ఎన్నడూ దాటలేదని ప్రస్తావించింది. జిడిపిలో ఆరు శాతం విద్యా అవసరాలకు ఎందుకు ప్రభుత్వం కేటాయించలేకపోయిందో పేర్కొనలేదు.

దేశ రక్షణ, ఆంతరంగిక శాంతిభద్రతల పేరిట లక్షల కోట్ల రూపాయలు ఖర్చు పెట్టడంలో అభివృద్ధి చెందిన దేశాలతో పోటీ పడుతున్న భారత పాలకులు విద్యారంగ కేటాయింపులలో ఇంతగా వెనుకబడి ఉండడం పాలక వర్గాల ప్రాధాన్యతలలోని అసంబద్ధతను తెలియజెప్తుంది.

జిడిపిలో ఆరు శాతం తప్పనిసరిగా విద్యకు కేటాయించాలనే చట్టం చేయాలని ఈ రెండు పత్రాలు ఎక్కడా పేర్కొనలేదు. పైగా విద్యాశాఖ విడుదల చేసిన పత్రంలో ఇలా అన్నారు. 'ప్రభుత్వ ప్రయత్నాలకు తోడుగా విద్యారంగంలో ప్రైవేటు పెట్టుబడిని, కార్పొరేట్ ప్రాధాన్యతను ప్రోత్సహిస్తాం.' విద్యారంగంలో పెట్టుబడులు పెట్టడాన్ని మౌలిక వసతుల కల్పనలో భాగంగా చూస్తూ పెట్టుబడులు పెట్టేవారికి పన్ను రాయితీలు కల్పించాలని సూచించింది.

కేంద్ర కార్యకలాపాలలో మాత్రం (కోర్) ప్రభుత్వ డబ్బు ఖర్చు పెడుతూ ఇతర విద్యాసంబంధ కార్యకలాపాలలోనూ, పరిశోధనా కార్యకలాపాల లోనూ విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులను ఆహ్వానించాలని సూచించింది. ప్రభుత్వ నిధులతో నడుస్తున్న ఉన్నత విద్యాసంస్థలు ఆదాయ మార్గాలను పెంచుకోవడానికి పూర్వ విద్యార్థుల నుండి, సేవా సంస్థల నుండి నిధులు రాబట్టుకోవాలని, ఫీజులు పెంచుకోవాలని, ప్రైవేట్ పెట్టుబడిని ఆహ్వానించాలని సూచించింది. సుబ్రమణియన్ కమిటీ రిపోర్ట్ కూడా నాణ్యమైన విద్య కోసం విదేశీ విద్యాసంస్థలకు ఆహ్వానం పలకాలని సూచించింది. లాభాపేక్ష దృష్టితో నడిచే వ్యాపార రంగానికి సంబంధించిన 'పెట్టుబడి' అనే పదాన్ని మానవ వనరులు సమాజానికి అనుకూలంగా తయారు చేయాల్సిన విద్యా వ్యవస్థకు సంబంధించిన

నివేదికలో వాడడం దుర్మార్గం. మానవ వనరుల అభివృద్ధి కోసం చేసే ఖర్చు పెట్టుబడి కాదు. అది ఒక సేవా కార్యక్రమం. అది ప్రభుత్వానికి రాజ్యాంగం ఇచ్చిన ఒక బాధ్యత. ఉన్నతమైన ఆ మానవ వనరే సమాజ పురోభివృద్ధికి కీలకం. ఇలాంటి సేవా రంగాల్లోకి పెట్టుబడి రూపంలో దేశీయ లేక విదేశీ పెట్టుబడులను ఆహ్వానించడం అంటే మిగతా అన్ని రంగాల వలెనే విద్యారంగంలో కూడా సామ్రాజ్యవాద ప్రపంచీకరణ అమలు చేయడమే. అంటే ఒక అవసరంగా, ఒక విలువగా, ఒక సేవగా ఉండాల్సిన విద్యను ఒక వస్తువుగా మార్చడం విద్య నేర్పేవారిని అమ్మకం దార్లుగా, విద్య నేర్చుకునే వాళ్లను కొనుగోలుదార్లగానూ మార్చడం. అంటే విద్యా మార్కెట్‌కు మార్గం సుగమం చేయడం. ప్రాచీన భారతీయ గురుకుల విద్యా వ్యవస్థ ప్రపంచాన్నంతటికీ ఆదర్శప్రాయమని వర్ణిస్తున్న ఈ మేధావులు ఇలాంటి సూచనలు చేయటం వికృతంగా ఉన్నది.

### పాఠ్యాంశాలు

పాఠ్యాంశాలు లేదా కరిక్యులమ్‌లో తీసుకు రావలసిన మార్పుల గురించి మానవ వనరుల పత్రం చాలా వివరంగా చర్చించింది. జాతీయ సమగ్రత, మత సామరస్యత, సాంఘిక సమతుల్యత వంటి లక్ష్యాలకు అనుగుణంగా సిలబస్‌లో మార్పులు తేవాల్సి ఉందని దాని అభిప్రాయం. ప్రాథమిక హక్కులు, ప్రాథమిక విధులు నేర్పించడం ద్వారా విద్యార్థులను బాధ్యతాయుత పౌరులుగా తయారు చేస్తామని ఆ పత్రం ప్రకటించింది. ఇందుకోసం ఏవేవో మార్పులని సూచించింది. అయితే వాటికి సంబంధించిన నిర్దిష్టమైన సూచనలు మాత్రం ఇందులో లేవు. సిలబస్‌ను మార్చడం అంటే పాఠ్యాంశాలని మార్చడం మాత్రమే కాదు. ఎటువంటి విలువలను సిలబస్ ద్వారా విద్యార్థులకు అందించాలన్నది ప్రధానాంశం. దీనికి సంబంధించి లోతుల్లోకి వెళ్లాల్సిన అవసరం కూడా లేదు. భారత రాజ్యాంగమే మూడు ముఖ్యమైన విలువలను ప్రతిపాదించింది. అవి ప్రజాస్వామ్యం, లౌకికతత్వం, సామాజిక న్యాయం. ఇప్పటి వరకు ఏ స్థాయిలోనూ ఈ మూడు విలువలను వాటి వాటి మూలార్థంలో పిల్లలకు బోధించే సిలబస్ ఏదీ లేదు. ఈ విలువలేవీ అయాచితంగా వచ్చినవి కావు. కొన్ని శతాబ్దాల పాటు వివిధ దేశాల ప్రజలు త్యాగాలు చేసి పోరాడి సాధించుకున్నవి ఈ విలువలు.

ఈ చారిత్రకాంశాన్ని కూడా మన పాఠ్యాంశాలు మరుగున పరుస్తున్నాయి. ప్రతి విలువకు ఒక విపరీతార్థాన్ని తీసి, విద్యార్థులకు నేర్పిస్తున్నారు. లౌకికతత్వం అంటే మతానికి రాజ్యానికి ఎటువంటి సంబంధం ఉండకూడదని చెప్పడం. రాజరిక, పురోహిత ఆధిపత్య వ్యవస్థలలో అమలైన నియంతృత్వానికి వ్యతిరేకంగా సాగిన ఉద్యమాల ఫలితంగా ఈ లౌకికవాదం ఆవిర్భవించింది. ఈ చరిత్ర చెబితే గాని మత ఆధిపత్యం ఎంత దుర్మార్గమైనదో విద్యార్థులకు తెలియదు. అదేమీ చెప్పకుండా లౌకికవాదం అంటే సర్వమత సమానత్వం అనే అర్థంలో బోధిస్తున్నారు. అదే విధంగా ప్రజాస్వామ్యం కూడా పోరాటాల ఫలితమే. ప్రజాస్వామ్యం అంటే ఒక జీవన విధానం. ఆర్థిక, సామాజిక ప్రజాస్వామ్య దేశాలలో రాజకీయ ప్రజాస్వామ్యం ఉన్నా అది పైకి ప్రజాస్వామ్యంగా కనబడుతుంది గాని సారాంశంలో ఆధిపత్య వర్గాల అనుకూల సాధనం మాత్రమే అవుతుంది. ప్రజాస్వామ్యం అంటే కేవలం ఎన్నికల తంతు అని, లెక్కకు మించిన పార్టీలు ఉండడం అనే అర్థంలో బోధన జరుగుతుంది.

అలానే సమత, సామాజిక న్యాయం అనే విలువల అంతరార్థం ఏమిటో, ఆవశ్యకత ఏమిటో తెలిపే పాఠ్యాంశాలు కూడా కనబడడం లేదు. అంటరానితనం, కుల వివక్షల తొలగింపు మాత్రమే గాక కులవ్యవస్థ రద్దు గురించిన భావన గాని, కుల అణచివేతకు హిందూ మతానికి ఉన్న సంబంధం గురించి గాని దీనికి వ్యతిరేకంగా పోరాడిన సంఘ సంస్కర్తల జీవితవివరాలు గాని పాఠ్యాంశాలలో చోటుచేసుకోవడం లేదు.

రాజ్యాంగంలోని 51-ఎ నిబంధన బాధ్యతల రూపంలో కొన్ని విలువలను ప్రస్తావించింది. అందులో రెండు అతి ముఖ్యమైనవి ఉన్నవి. 1) శాస్త్రీయ దృక్పథాన్ని, విమర్శనాత్మక పరిశీలనా పద్ధతిని కలిగి ఉండాలి. 2) మన ఉమ్మడి సంస్కృతి వారసత్వాన్ని పరిరక్షించడం. ఈ రెండు అంశాలు విద్యార్థుల ఆలోచనా రీతిని గుణాత్మకంగా మార్చడానికి ఉపయోగపడేవి. హేతుబద్ధమైన, శాస్త్రీయమైన, ప్రజాస్వామికమైన ఆలోచనగా కథనాన్ని పంచేవి. కాని ఇవేవి మన పాఠ్యాంశాల్లో ఇప్పటిదాకా భాగం కాలేదు. మనం బోధిస్తున్న చరిత్ర, సంస్కృతి అంతా బ్రిటిష్ వలసవాదులు నేర్పించిందే. మతపరమైన యుగ విభజనలు, మత సంస్కృతి, ప్రాచీన హిందూ సంస్కృతి ఎలా ముస్లిం దండయాత్రల ఫలితంగా నాశనం అయిందో వంటి అంశాలనే బోధిస్తున్నాం. ఈ దేశానికి ఏ కారణాల రీత్యానైనా గాని పాలకులుగా, పాలితులుగా వలస వచ్చిన వాళ్లు తమ తమ సాహిత్య, సాంస్కృతిక సంప్రదాయాలను ఈ దేశానికి అందించిన వైనాన్ని పిల్లలకు చెప్పడం లేదు. ప్రాచీన భారతీయ నాగరికత సంస్కృతులు మాత్రమే గొప్పవని, మిగిలిన జాతుల ప్రజలు ఈ దేశంలో అధికారంలోకి వచ్చిన కారణంగా హిందూ నాగరికత, సంస్కృతి ధ్వంసం అయ్యాయని చరిత్ర పేరిట బోధిస్తున్నాం. నిజానికి ప్రపంచంలో ప్రతి జాతికి ఒక విశిష్టమైన, విలక్షణమైన సంస్కృతి ఉంటుంది. ఏ ఒక్కటీ పవిత్రమైన సంస్కృతి కాదు. వేల సంవత్సరాలుగా మానవ సమూహాల మధ్య జరిగిన ఆదాన, ప్రదానాల ఫలితంగా బ్రాహ్మణీయ మత ఆధిపత్యానికి వ్యతిరేకంగా పోరాడిన అద్భుతమైన చార్వాకులు, లోకాయతులు, సత్యకామ, జాబాలి, శంబుకుడు వంటి వాళ్ల ప్రస్తావన పాఠ్యాంశాలలో చొరబడకుండా కట్టుదిట్టం చేశారు.

ఉమ్మడి సంస్కృతి రూపొందిందన్న చారిత్రక వాస్తవాన్ని మన పాఠ్యాంశాలు మరుగుపరుస్తున్నాయి. దీని ఫలితమే సాంస్కృతిక జాతీయవాదం పేరుతో హిందూ మత బ్రాహ్మణీయ సంస్కృతిని నెత్తికెత్తు కోవడం. ఇది చివరకు సాంస్కృతిక, జాతీయ దురహంకారానికి దారితీసి, దేశంలో నెలకొని ఉన్న జీవన వైవిధ్యాలను వైరుధ్యాలుగా మార్చి వేస్తుంది.

పాఠ్యాంశాలలో శాస్త్రీయత, విమర్శనాత్మక పరిశీలనా పద్ధతి పూర్తిగా లుప్తమయ్యాయి. శాస్త్రీయత అంటే సైన్సు బోధన కాదు. అది సమాజాన్ని, చుట్టూ ఉన్న పరిసరాలను గతితార్కికంగా, హేతుబద్ధంగా పరిశీలించి ప్రశ్నించే పద్ధతి. మన సిలబస్‌లో గాని తరగతి గదుల్లో గాని ప్రశ్నకు ఆస్కారం లేదు. పాలకవర్గాల అనుకూల భావజాలాన్ని ప్రశ్నించే విద్యార్థులను జాతి ద్రోహులుగా, దేశ ద్రోహులుగా ముద్ర వేస్తున్నారు. ఇంతటి అశాస్త్రీయమైన విద్యావ్యవస్థ కారణంగానే ఇప్పటికీ ఈ దేశంలో మూఢనమ్మకాలు పేరొందిన శాస్త్రవేత్తలలో కూడా ప్రదర్శితమవు

తున్నాయి. స్వతంత్ర ఆలోచనలు, స్వతంత్ర వ్యక్తిత్వం లేని పరాన్నభుక్కు జాతి రూపొందుతోంది. ఇలాంటి విలువలన్నీ పాఠ్యాంశాల్లో భాగమై విద్యార్థులకు వాటిని సరైన రీతిలో తెలియజేస్తే వాళ్లలో చొరవ, సృజనాత్మకత, మానసిక స్థైర్యం, స్వతంత్ర వ్యక్తీకరణ వంటి శక్తియుక్తులు అభివృద్ధి చెందుతాయి. కాని ఇలాంటి జాతి తయారు కావడం పాలక వర్గాలకు ఇబ్బంది. అందుకే అవి ఏర్పాటు చేసే కమిషన్లు కొన్ని ఉన్నతమైన ఆశయాలను, విలువలను చిలుక పలుకుల లాగా వల్లిస్తాయి తప్ప నిర్దిష్టమైన కార్యాచరణ పథకాన్ని సూచించవు.

**విద్య – రాజకీయాలు**

విద్యా వ్యవస్థ ఎదుర్కొంటున్న ప్రధానమైన సమస్యలలో ఒకటి రాజకీయాల జోక్యం పెచ్చు పెరిగిపోవడమని సుబ్రమణియన్ కమిటీ పేర్కొన్నది. ఈ కారణంగా విద్యాలయాలలో వాతావరణం కలుషితమై విద్యార్థులు చదువులకు దూరం అవుతున్నారని అభిప్రాయపడిన ఈ కమిటీ విద్యార్థులని రాజకీయాలకు దూరంగా ఉంచాలని హితవు చెప్పింది. ఇది మనం ఎప్పటి నుండో వింటున్న పాత పాటే. ఈ పాట పాడే వాళ్లకి రాజనీతి, రాజకీయాలు అనే పదాలకున్న అర్థం తెలియదు. రాజకీయాలంటే వాళ్ల భావనలో కేవలం ఓట్ల పార్టీల రాజకీయమే. భారత రాజ్యాంగం 18 సంవత్సరాలు దాటిన ప్రతి పౌరుడికి ఓటు హక్కు ఇచ్చింది.

ఓటు హక్కును కలిగి ఉండడం అంటే రాజకీయ ప్రక్రియలో భాగస్వాములు కావడమే. అలా కావాలంటే రాజకీయీకరణ తప్పనిసరి. రాజకీయీకరణ అంటే కేవలం ఓట్ల రాజకీయాల్లో పాల్గొనడం మాత్రమే కాదు. వివిధ రాజకీయ పార్టీల సైద్ధాంతిక, భావజాలాలను అవగాహన చేసుకోవడం, విశ్లేషించుకోవడం, మంచి చెడులను బేరీజు వేసుకోవడం. వివిధ రకాలైన రాజనీతి సిద్ధాంతాలను అర్థం చేసుకోవడం. వాటిల్లో ఏ సిద్ధాంతాలు లేదా భావజాలాలు ఈ దేశ పరిస్థితులని గుణాత్మకంగా మార్చడానికి ఉపయోగపడతాయో తెలుసుకోవడం. ఇవన్నీ కేవలం రాజనీతి శాస్త్రం చదివే విద్యార్థులకు మాత్రమే తెలిసి ఉండాల్సినవి కావు. సమాజంలో అంతర్భాగంగా ఉన్న ప్రతి వ్యక్తి తనని తాను, సమాజంలో భాగంగా తాను ఏమిటో అర్థం చేసుకోవడానికి ఈ రాజకీయీకరణ ఎంతైనా అవసరం. ఇది జరగాలంటే భావాల వ్యక్తీకరణకు, భావ సంఘర్షణకు విద్యాలయాలలో అవకాశం ఉండాలి. ఇలాంటి ఆరోగ్యకరమైన చర్చల ఫలితంగానే బయట సమాజంలో నానాటికీ కలుషితమై పోతున్న రాజకీయ వాతావరణం కూడా చక్కబడుతుంది. దీనికి అవకాశం విద్యాలయాలలో కల్పించకపోతే అది వెన్నెముక లేని జోహుకుంగాళ్లని తయారు చేసి నిరంకుశ పాలనకు దారితీస్తుంది.

ప్రస్తుత విద్యా విధానం బాల్యాన్ని కర్కశంగా చిదిమివేస్తుందని, సాహిత్యం పట్ల, కళల పట్ల, క్రీడల పట్ల, ప్రకృతిని పరిశీలించడం పట్ల, బాల్యంలో ఉండే సహజ సిద్ధమైన ఉత్సాహాన్ని నీరుగార్చి వేస్తుందని, తద్వారా వారిలో స్వతంత్రమైన ఊహాశక్తి, సృజనాత్మకత పూర్తిగా లోపిస్తున్నాయని విద్యావేత్తలందరూ అంటున్న మాటే. అయినా ప్రభుత్వాలు ఈ స్థితిని చక్కదిద్దే ప్రయత్నాలు ఏమీ చేయడం లేదు. ఎప్పటికప్పుడు పిల్లల్లో వ్యక్తిగత అభివృద్ధి పట్ల, కెరియర్ పట్ల ఆసక్తిని కలిగిస్తూ వాళ్లల్లో పోటీతత్వం పేరుతో స్పర్థను పెంచుతున్నది. మార్కుల కోసం చదివే చదువు తప్ప అనుభవం కోసం, జ్ఞానం కోసం చదివే చదువులకు ఎక్కడా ఆస్కారం కల్పించడం లేదు. అందరి దృష్టి ఇంజినీరింగ్, మెడిసిన్ వంటి టెక్నాలజీ విద్య మీదనే. మానవీయ సమాజ నిర్మాణానికి దోహదపడే సామాజిక శాస్త్రాల అధ్యయనాన్ని పాలకులు అటకెక్కించేశారు. ఇది అప్రయత్న పూర్వకంగా జరిగింది కాదు. మనుషులని మనుషులుగా చూడడం కాక వస్తూత్పత్తి చేసే వాళ్లుగా, కొనుగోలుదారులుగా, సేవలు అందించేవారుగా మాత్రమే చూసే వ్యాపార దృక్పథం ఇందుకు ప్రధాన కారణం. సామాజిక శాస్త్రాలే కాదు, టెక్నాలజీకి పునాదిగా ఉండే బేసిక్ సైన్సు శాస్త్రాల చదువులకు కూడా ఇదే దుస్థితి పట్టించారు. ఫలితంగా దేశంలో శాస్త్రీయ ఆవిష్కరణలు అటు మానవీయ శాస్త్రాలలోను ఇటు భౌతిక శాస్త్రం, రసాయన శాస్త్రం వంటి వాటిలోనూ పూర్తిగా అడుగంటాయి. నూట ఇరవై కోట్ల జనాభా ఉన్న దేశంలో నూతన ఆవిష్కారానికి పేరు పడిన ఇద్దరు, ముగ్గుర్ని తప్ప ఎవరి గురించి చెప్పుకోలేని దుస్థితి ఏర్పడింది. చదువంటే ఉద్యోగాలు దొరకబుచ్చు కోవడానికి ఒక సాధనంగా మాత్రమే చూసే అలవాటు పాలకవర్గాలు తల్లిదండ్రులలో పుష్కలంగా కలిగించి భాషా శాస్త్రాలలో, సామాజిక శాస్త్రాలలో చదవాలనుకున్న విద్యార్థులను వెర్రివాళ్లుగా జమకడుతున్నారు.

ఇదంతా పాలకులకు వారి తాబేదారులైన మేధావులకు తెలియదా అంటే క్షుణ్ణంగా తెలుసు. మరెందుకు ఇలా చేస్తున్నారు అంటే ఈ దేశాన్ని వ్యక్తివాదపు పెట్టుబడిదారీ దేశంగా మార్చాలని నిర్ణయించు కున్నారు కాబట్టి. ఏ దేశంలోనైనా విద్యా వ్యవస్థే కాదు, అన్ని సాంఘిక వ్యవస్థలు ఆ దేశపు రాజకీయార్థిక వ్యవస్థను అనుసరించే ఉంటాయి. సామ్రాజ్యవాద ప్రపంచీకరణ రథానికి ఈ దేశ ఆర్థికాన్ని ముడిపెడుతున్న రాజకీయ పార్టీలు దానికి అనుగుణమైన విద్యావ్యవస్థను రూపొందిస్తాయి. అయితే కొంతకాలమైనా ప్రజలను మభ్య పెట్టడానికి ఇలాంటి కమిటీలు వేసి ఉదాత్తమైన ఆశయ ప్రకటనలు చేస్తారు. అది అంతవరకే. రథం మాత్రం వాళ్లు కోరుకున్న లక్ష్యం వైపుగా, ఎంచుకున్న మార్గంలోనే ప్రయాణిస్తుంది. నిన్న మొన్నటి దాకా స్వదేశీ జపం చేసిన భాజపా, దాని అనుబంధ సంస్థలు కూడా ఇప్పుడు ప్రపంచీకరణలోనే దేశ భవిష్యత్‌ను వెదుకుతున్నాయి. ఇంకోవైపు ప్రత్యక్షంగానో, పరోక్షంగానో హిందూ సంస్కృతిని సాంస్కృతిక జాతీయవాదంగా ప్రచారం చేసి దేశంలోని సమష్టి సంస్కృతిని, వైవిధ్యాన్ని అంతం చేయడానికి ప్రయత్నిస్తున్నారు. ఈ దుర్మార్గానికి విద్యను ఒక ప్రధాన ఆయుధంగా వాడుకుంటున్నారు. ఈ కుట్రపూరితమైన స్వభావాన్ని ప్రజల హితం కోరే, ఉన్నత ఆదర్శాలను అభిమానించే లౌకిక ప్రజాస్వామిక వాదులు గుర్తించాలి, స్పందించాలి. ఇలాంటి కమిటీల మాయాజాలంలో చిక్కుకోకుండా, వాళ్లిచ్చిన ఎజెండా చుట్టూ పరిభ్రమించకుండా ప్రత్యామ్నాయ విద్యా విధానాన్ని రూపకల్పన చేయాలి. నిర్దిష్టమైన వివరణాత్మకమైన ఒక ప్రత్యామ్నాయ పథకాన్ని రచించి సమాజంలో అన్నివర్గాల ముందు చర్చకు పెట్టాలి. ఈ కర్తవ్యాన్ని ఉపాధ్యాయ సంఘాలు, విద్యార్థి సంఘాలు ఎంత త్వరగా చేపడితే అంత మంచిది.

*(రచయిత విప్లవ రచయితల సంఘం సభ్యులు)* వీ

# ముసుగులు విసిరేద్దాం!

***ప్రపంచ వ్యాప్తంగా పెరుగుతున్న మతోన్మాద నేపథ్యంలో అన్నా లూయీ స్ట్రాంగ్ రచన నుంచి ఉదాహరణ ఇస్తున్నారు***

**బి.ఎస్. రాజు**

కరుడు గట్టిన తీవ్రవాద, ఛాందసవాద ఇస్లాం, 'ఐసిస్', 'తాలిబన్', అంకా అనేకనేక ముఠా సంస్థల రూపాల్లో ఇస్లామీయ ప్రపంచ రాజ్య వ్యవస్థను స్థాపించే ఉద్దేశ ప్రచారంతో, ఇస్లాం పవిత్రతను కాపాడే ముసుగు ధరించి మానవ మారణ హోమాన్ని, బీభత్సాన్ని సృష్టిస్తూ ప్రపంచాన్ని వణికిస్తున్న సందర్భమిది. వీటికి పోటీగా ఆయా దేశాల్లో ఇతర మతవాద, జాతివాద సంస్థలు తిరిగి తలెత్తుతున్నాయి. భారతదేశంలో హిందూ మతోన్మాదం పడగవిప్పి బుసకొడుతున్నది.

రెండో ప్రపంచ యుద్ధంలో సోవియట్ రష్యా హిట్లర్ ఫాసిజాన్ని ఓడించి ప్రపంచ మానవాళికి ఓ నూతన మార్గాన్ని చూపించింది, పలు రకాల మత, పురుషాహంకార అణచివేతల్లో మగ్గుతున్న మహిళలకు నిజమైన విముక్తి సాధ్యం చేసి చూపించింది. సోవియట్ యూనియన్లో భాగమైన ఇస్లామీయ భూభాగాల్లో మత ఛాందస ముల్లాల పురుషాహంకార పెత్తనంలో, ముసుగుల అంధకారంలో నలుగుతున్న ముస్లిం మహిళలు తమ ముసుగులు ఎలా విసిరి పారేశారో, పురోగామి సోషలిస్టు ఆలోచనలు వారి జీవితాల్లో విముక్తి వెలుగులు ఎలా ప్రసరింప చేశాయో అన్నా లూయీ స్ట్రాంగ్ 'స్టాలిన్ ఇరా' అనే పుస్తకంలో 'నూతన మానవులు' అనే అధ్యాయంలో క్లుప్తంగా రాసింది.

విసిరివేయబడ్డ ముసుగులు తిరిగి కారుమేఘాలై మహిళా ప్రపంచాన్ని కమ్ముకుంటున్న సందర్భంలోనికి ఇవాళ మానవాళి ప్రవేశిస్తున్నది. సామ్రాజ్యవాద, మతోన్మాదాలు ప్రపంచ ప్రజల జీవితాలతో, రక్త మాంసాలతో జూదమాడుతున్నాయి. వేరు వేరు సందర్భాల్లో విరుద్ధ శక్తులుగా, ప్రత్యర్థులుగా పోజులు పెట్టినా, రూపంలో వేరుగా కనిపించినా, సారంలో అవి ఒక్కటే. 1928–30 కాలంలో సోవియట్ మహిళా విముక్తి ప్రస్థానంలో జరిగిన ఓ సంఘటన ఇప్పటి యువతరానికి ఉపయోగ పడుతుందనే ఉద్దేశంతో స్వేచ్ఛానువాదం చేసి అందిస్తున్నాను, చదవండి.

1917 అక్టోబర్/నవంబర్ విప్లవానంతరం సోవియట్ రష్యాలో చోటుచేసుకున్న అనేకానేక సామాజిక మార్పుల్లో స్త్రీల స్థితిలో వచ్చిన మార్పు అనూహ్యమైనది, చెప్పుకోదగ్గది. బోల్షివిక్ విప్లవం సోవియట్ మహిళలను రాజకీయంగాను, చట్టపరంగాను పురుషునితో సమానంగా నిలబెట్టింది. త్వరితగతిన పరిశ్రమలను స్థాపించడం ద్వారా స్త్రీల ముంగిటికి ఉద్యోగావకాశాలను తీసుకొచ్చింది. అంతేకాక, సమానమైన పనికి పురుషునితో సమానంగా వేతనాలు పొందేలా స్త్రీలకు ఆర్థిక స్వావలంబనను చేకూర్చింది. ఐతే, శతాబ్దాల తరబడి పాతుకుపోయి కరడుగట్టి ఉన్న దురాచారాలు, కట్టుబాట్లపై మహిళలు పోరాడి గెలవాల్సిన అగత్యం ముఖ్యంగా రష్యా గ్రామ సీమల్లో ఇంకా దిగడే ఉంది. ఈ మధ్య సైబీరియా ప్రాంతంలో ఒక గ్రామంలో చోటుచేసుకున్న సంచలనాత్మక సంఘటన ఒకటి వార్తలకెక్కి ప్రాచుర్యం పొందింది. అదేమంటే, ఈ గ్రామంలో మహిళలు ఒక్కటై నిలబడి 'స్త్రీలను, భార్యలను దుర్భాషలాడడం, కొట్టడం, హింసించడం' ఇక సహించమని, సాగనివ్వమని కట్టడి చేయడం. హుకుం జారీ చేయడం. తరతరాలుగా కొనసాగుతున్న ఈ దురాచారాన్ని ఉమ్మడి వ్యవసాయం అమల్లోకి వచ్చి, మహిళల స్వార్జిత వేతనాలు తమ సొంత చేతుల్లోనికి వచ్చిన వారం రోజుల్లోనే ఇటువంటి విప్లవాత్మక పరిణామం చోటుచేసుకోవడం గమనార్హం.

'మొట్టమొదటి సారిగా మా గ్రామ సోవియట్ ఎన్నికల్లో మహిళా సభ్యురాలిని మేం ఎన్నుకున్నప్పుడు మొగాళ్లందరూ మమ్మలను ఎంతగానో గేలిచేశారు. మలి విడత సోవియట్ ఎన్నికల్లో ఆరుగురు మహిళలను మేం ఎన్నుకున్నాం. ఇప్పుడు నవ్వడం మా వంతయింది. అందుకే మేం గర్వంతో నవ్వుతున్నాం' ఇదీ ఓ గ్రామ సోవియట్ అధ్యక్షురాలు నాతో అన్నమాట. ఇటువంటి 20 గ్రామాల సోవియట్ అధ్యక్షురాళ్లను 1928లో నా సైబీరియా రైల్ యాత్రలో కలుసుకున్నాను. ఈ ప్రయాణంలో వారితో ముచ్చటించే అవకాశం నాకు కలిగింది. వారంతా మాస్కోలో జరగబోయే సోవియట్ మహిళా సదస్సుకు వెడుతున్నారు. వీరిలో ఒక్కరు మినహా తతిమ్మా అందరూ ఎప్పుడూ సైబీరియా దాటి వెళ్లినవాళ్లు కాదు. రైలు ప్రయాణం చేసినవారు కాదు. మాస్కో సదస్సులో భాగస్వాములు కమ్మని, సోవియట్ ప్రభుత్వానికి తమ సలహాలు ఇవ్వాల్సిందని కోరుతూ వీరికి ఆహ్వానం అందింది. వారి జిల్లా సోవియట్ ఆ సదస్సులో పాల్గొనడానికి వీరిని ఎంపిక చేసింది.

సోవియట్ రష్యాలో స్త్రీ స్వేచ్ఛకు జరిగిన పోరాటంలో అతి క్లిష్టమైన సవాళ్లను ఎదుర్కొన్న ప్రాంతం మధ్య ఆసియా. ఇక్కడ మహిళ పురుషుని సొంత ఆస్తిగా లెక్క. బాల్యంలోనే వివాహ బంధానికి ఆమె అమ్ముడు సరుకుగా మారిపోతుంది. ఇక అప్పటి నుంచి ఎన్నడూ ఆమె తన మొఖాన్ని నల్లటి (పరంజా) ముసుగు నుండి బయటి ప్రపంచానికి చూపించలేదు. ఈ నల్లటి పరంజా గుర్రపు బొచ్చుతో తయారు చేయబడి ఆమె శ్వాసకు దృష్టికి ఒక అడ్డుగోడగా తయారవుతుంది. పొరపాటున ఈ ముసుగు నుండి విముక్తిని కోరుకుంటే ఆ స్త్రీని ఆమె భర్త చంపివేసే హక్కు కలిగి ఉంటాడు. ఇస్లాం మత రక్షకులైన ముల్లాలు ఈ ఆచారానికి వత్తాసుగా నిలుస్తారు. ఇటువంటి అనాగరిక సమాజంలోనికి రష్యన్ మహిళలు మొదటి సారిగా స్త్రీ విముక్తి సందేశాన్ని మోసుకొచ్చారు. శిశు సంరక్షణ కేంద్రాలను స్థాపించడం ద్వారా ఈ ప్రాంత మహిళలతో సాన్నిహిత్యాన్ని సంపాదించారు. ఈ శిశు కేంద్రాలకు మహిళలు వచ్చినప్పుడు ఒకరి ముందు ఒకరు ముసుగులు పైకెత్తుకుని మాట్లాడుకునే

వారు. అలా వారికి తోటి మహిళలతో తమ కష్ట సుఖాలు వెల్లడించుకునే అవకాశం చిక్కింది. ఈ సమయంలోనే ముసుగులతో పడుతున్న బాధలు ఒకరికొకరు పంచుకునే వారు. స్త్రీ స్వేచ్ఛ ఆవశ్యకత, అటువంటి స్వేచ్ఛ పట్ల స్పృహ కలగడానికి వారికి ఈ రకంగా ఓ అవకాశం దొరికింది. ఈ ప్రాంత కమ్యూనిస్టు నాయకులు, కార్యకర్తలు తమ భార్యల మొఖాలపై వేలాడుతున్న ముసుగులు తొలగించి తమ చుట్టూ ఉన్న సమాజానికి ఆదర్శంగా నిలవాలని పార్టీ ప్రోత్సహించింది.

1928లో మొట్టమొదటిసారిగా నేను తాష్కెంట్ వెళ్లినప్పుడు అక్కడ కమ్యూనిస్ట్ మహిళల సమావేశం జరుగుతోంది. 'కమ్యూనిస్టు మహిళా సంఘాల సభ్యులను గ్రామాల్లో హింసిస్తున్నారు, మానభంగం చేసి చంపేస్తున్నారు. ఇక మనం ఈ దుర్భరమైన ముసుగులను విసిరి పారేద్దాం – ఈ సంవత్సరాన్ని ముసుగుల విముక్తి సంవత్సరంగా పరిగణించి కార్యోన్ముఖులమవుదాం' అని ఈ సమావేశంలో ఒక పటిష్ఠ తీర్మానం చేశారు. ఈ ప్రాంతంలో జరిగిన కొన్ని దారుణమైన సంఘటనలే ఈ సమావేశంలో ఇటువంటి తీర్మానం చేయడానికి కారణమయ్యాయి. తాష్కెంట్లో, ఓ బడిలో చదువుకుంటున్న బాలిక సెలవు దినాల్లో మహిళల హక్కుల గురించి, స్వతంత్రత గురించి జరిగిన ప్రచారంలో పాల్గొంది. అటువంటి ప్రచారంలో పాల్గొన్నందుకు ఆ పిల్లను ముక్కలు ముక్కలుగా నరికివేశారు. ఇదిగో మీ స్వాతంత్ర పోరాటానికి మా బహుమతి అని రాసి ఆ పిల్ల శవాన్ని ఆమె చదువుకుంటున్న పాఠశాలకు ఓ బండిలో వేసి పంపించారు. మరొక దారుణ సంఘటన – ఎనిమిది నెలల గర్భవతి అయిన మహిళను 18 మంది దుర్మార్గులు సామూహిక మానభంగం చేసి, చంపి, ఆమె శవాన్ని ఓ నదిలో విసిరేశారు. కారణం, ఆమె ఆ ప్రాంతపు భూస్వామిని కాదని ఒక కమ్యూనిస్టు రైతాంగ కార్యకర్తను ప్రేమించి పెళ్లాడడం. ఆమె తనకు దక్కలేదని, ఆ భూస్వామి ఈ ఘాతుకానికి ఒడిగట్టాడు.

*మహిళా! ఓ, మహిళా! / మరువదు! మరువదు!*
*నీ స్వేచ్ఛా విముక్తి పోరాటాన్ని / ఈ జగమెన్నటికీ మరువదు!*
*నిన్నగ్నికి ఆహుతి చేసిన / పురుష దురహంకారానికి*
*మేం తలొగ్గం – తలొగ్గం / నిన్ను కబళించిన అగ్ని కీలలు*
*మా చేతుల్లో జ్వలించే విముక్తి కాగడాలు*
*మహిళా! ఓ, మహిళా! / మరువదు! మరువదు!*
*నీ స్వేచ్ఛా విముక్తి పోరాటాన్ని / ఈ జగమెన్నటికీ మరువదు!*

జుల్ఫియా ఖాన్ అనే స్త్రీ విముక్తి కార్యకర్తను ముల్లాలు సజీవ దహనం చేసినప్పుడు ఆ గ్రామంలో మహిళలు స్పందించి, ఆమె త్యాగాన్ని శ్లాఘిస్తూ, ఆమె పట్ల తమ ప్రేమను ప్రకటిస్తూ, పురుష దురహంకారాన్ని ఖండిస్తూ పై కవితకట్టి గానం చేశారు. ఇటువంటి కవితలెన్నో మహిళా విముక్తి పోరాట ఉద్యమంలో భాగమయ్యాయి.

మధ్య ఆసియా ఇస్లామిక్ మత ఛాందస వాదానికి కంచుకోటగా పవిత్ర బొఖారా అనే పట్టణం పేరుగాంచింది. సరిగ్గా ఇక్కడే నాటకీయంగా ముసుగుల విసిరివేత కార్యక్రమం జరపాలని స్త్రీ విముక్తి ఉద్యమం నిర్ణయించింది. పవిత్ర బొఖారాలోనే మార్చ్ 8 మహిళా విముక్తి దినం రోజున ఈ పని తలపెట్టింది. దీనిపై ముందు నుండే విస్తృతంగా ప్రచారం చేశారు. ఆ రోజు బొఖారా నగరపు పలు బస్తీల్లోనూ, వాడ వాడలా మహిళా కార్యకర్తలు వీధి సభల్లో మాట్లాడుతూ స్త్రీలందరూ తమ బురఖాలను విసరి పారేయమని పిలుపునిచ్చారు. దీనికి అనూహ్య స్పందన వచ్చింది. స్త్రీలు పెద్ద ఎత్తున సభా ప్రాంగణాలకు వచ్చారు. వేదికల ముందు నిలబడి తమ బురఖాలను విసిరి పారేశారు. అక్కడి నుండి పుర వీథుల్లో కవాతు తీశారు. ప్రభుత్వ పెద్దలు, ఉద్యమ నాయకులు కూడళ్లలో జమై వీరిని ఆహ్వానించి జేజేలు పలికారు, వీరికి తమ శుభాకాంక్షలు తెలియచేశారు. ఈ సందడిలో తామూ పాలుపంచుకుని బురఖాల నుండి విముక్తి పొందడానికి ఇళ్ల నుండి అనేక మంది మహిళలు కూడళ్లకు సాగి వచ్చారు. అక్కడ తమ ముసుగులను కేరింతలతో, చప్పట్లతో విసిరి పారేశారు. ఈ అద్భుత కవాతు సంఘటన పవిత్ర బొఖారాలో మహిళల బురఖా సాంప్రదాయాన్ని కాలదన్నింది. అయితే చాలా మంది స్త్రీలు తమ కోపోద్రిక్త భర్తల మొఖాలు చూసి భయపడి తిరిగి ముసుగులు ధరించిన మాట వాస్తవమే అయినప్పటికీ, అప్పటి నుండి ముసుగులు క్రమేణా కనుమరుగవుతూ వచ్చాయి.

సోవియట్ ప్రజాధికారం స్త్రీ విముక్తికై పలు ఆయుధాలను ఉపయోగించింది. విద్య, విజ్ఞాన ప్రచారం, ప్రగతిశీల చట్టాలు వీటిలో ప్రధానమైనవి. విస్తృత జన బాహుళ్యం ముందు ప్రజా కోర్టులు నిర్వహించి భార్యలను హత్య చేసిన వారికి మరణ దండన విధించింది. ఇదివరలో సోవియట్ ప్రభుత్వం రాక ముందు భార్యను హత్య చేయడమన్నది ఓ సాధారణ విషయం. అదొక శిక్షార్హమైన నేరం కాదు.

ఇప్పుడు మహిళలు మేల్కొన్నాక, సోవియట్ ప్రభుత్వం వారికి అండగా నిలవడంతో సమాజంలో ఆ వెనకబాటు ఆలోచనకు కాలం చెల్లింది. ఇవన్నీ ఒకెత్తైతే, రష్యా కేంద్ర పాలిత ప్రాంతంలో ఎలాగైతే పరిశ్రమలు స్థాపించడం అనే ఆయుధం ద్వారా మహిళలకు త్వరితగతిన ఫ్యూడల్ బంధనాల నుండి విముక్తి లభించిందో అదే తరహాలో మధ్య ఆసియాలోని మహిళలకు కూడా పారిశ్రామికీకరణను అమలు చేయడం ద్వారా ఎంతో మేలు జరిగింది, స్త్రీ విముక్తి సాధ్యపడింది.

పాత బొఖారా నగరంలో ఓ పట్టు తయారీ మిల్లును నేను దర్శించాను. దీని డైరెక్టర్ ఈ మిల్లు నిర్మాణపు పనుల్లో అలుపెరుగక నిద్రలేమితో పనిచేయడం మూలంగా బక్క పల్చగా నీరసించి పోయాడు. అయితే అతని ఉత్సాహం మట్టుకు ఏమాత్రం సన్నగిల్లలేదు. ఆయన నాతో అన్నాడు – ఈ మిల్లును మేము లాభార్జనకై స్థాపించలేదు. మిల్లు లాభాల స్థాయికి రావాలంటే చాలా సంవత్సరాలే పట్టొచ్చు. 'అయితే మేం తుర్కెస్తాన్లో రాబోయే అనేక కొత్త ఆధునిక పట్టు మిల్లుల్లో పనిచేసేందుకై మహిళలకు శిక్షణ ఇచ్చి తయారుగా పెట్టుకుంటున్నాం. మా మిల్లులో శిక్షణ పొందే వారంతా బురఖాలను విసిరివేసిన మహిళలే. ఇది మా మిల్లు పెట్టుకున్న ఆదర్శ నియమం. బురఖా వ్యతిరేక ఉద్యమానికి ఓ బలీయమైన స్థానంగా మేం పట్టుదలతో ఉత్తేజంతో ఇక్కడ పని చేస్తున్నాం.'

వస్త్ర తయారీ పరిశ్రమల్లో పనిచేస్తున్న యువ మహిళా కార్మికులు ముసుగుల నుండి విముక్తి చెంది రష్యాలో మహిళల వలె తలకు రుమాల్ కట్టుకుని పనిచేయడంపై ఎన్నో ఉత్తేజకరమైన కవితలల్లేరు.

*'ఫ్యాక్టరీకి వెళ్లే మార్గాన్ని / నేనెప్పుడు కనుగొన్నానో*
*అప్పుడే, అక్కడే / నేనొక ఎర్ర రుమాలును,*
*ఓ సిల్క్ రుమాలును కనుగొన్నాను / నా స్వహస్తాలతో పనిచేసి*
*సంపాయించిన పైసలతో / దానిని నా సొంతం చేసుకున్నాను*
*ఆనందంతో దానిని / నా గుండెల కద్దుకున్నాను*

# నల్లజాతి ప్రాణాలకు విలువలేదా?

***అమెరికాలో నల్లజాతి ప్రజల పట్ల అక్కడి తెల్లజాతి వారు, వారికి అండగా అక్కడి పాలకులు అవలంబిస్తున్న వివక్షను, అమలు చేస్తున్న దౌర్జన్యకాండను వివరిస్తున్నారు* రాజేంద్రబాబు అర్విణి**

మిసెస్ బెర్రీ అమెరికాలోని అయోవాలో టీచరుగా పనిచేస్తుంది. ఆమె ఆఫ్రికన్-అమెరికన్. అంటే నల్లజాతి స్త్రీ. ఆమెకు ఇద్దరు కొడుకులు. ప్రతి తల్లి తన కుమారులు మంచి వాళ్లుగా సమాజంలో గుర్తింపు తెచ్చుకోవాలని ఎలా కోరుకుంటుందో అలాగే మిసెస్ బెర్రీ కి కూడా గంపెడంత ఆశ తన కొడుకుల గురించి. తన పిల్లలకు ఎప్పుడూ బుద్ధిమంతుల్లాగా మెలగాలని బోధిస్తూ ఉంటుంది ఇలా: "తలెత్తి నిటారుగా నిలబడండి. ఎవరయినా నీతో మాట్లాడుతున్నప్పుడు వాళ్ల కళ్లల్లోకి చూసి మాట్లాడండి. ఏది మంచిదో, ఏది సరియైనదో దాన్ని గురించి నొక్కి చెప్పండి". కానీ, అమెరికాలో ప్రతి ఆఫ్రికన్-అమెరికన్ తల్లి లాగే, మిసెస్ బెర్రీ కూడా చివరన ఇంకో మాట, చాలా బాధతో నయినా సరే, చేర్చాల్సి వస్తున్నది. అదేమంటే- "పోలీసులు నిన్ను ఆపినప్పుడు, ఇవేవీ నువ్వు చెయ్యకూడదు"అని. "నేనేమీ తప్పు చెయ్యనప్పుడు పోలీసులకయినా ఎందుకు భయపడాలి, మమ్మీ!" అన్న ఆమె పెద్ద కొడుకు ప్రశ్నకు ఆమె వద్ద సమాధానమేమీ లేదు, "మనం నల్ల వాళ్లం కదా నాయనా" అనడం తప్ప.

అమెరికాలోని ఇంకో పట్టణం లాస్ ఏంజెల్స్‌లో ముగ్గురు సహోద్యోగులు లంచ్ చేస్తూ కబుర్లాడుకుంటూ ఉన్నారు. మాటల మధ్యన పోలీసుల గురించి ప్రస్తావన వచ్చింది. ఆ ముగ్గురిలో ఒకతను నల్లవాడు, మరొకడు తెల్లవాడు, ఇంకొకడు భారతీయుడు. నల్లజాతి మిత్రుడు పోలీసులతో తన అనుభవం వివరిస్తూ, తాను, నల్లజాతికి చెందిన తన మిత్రులతో కలిసి ఓ సాయంత్రం సరదాగా వ్యాహ్యాళికై వెళితే, పోలీసులు ఆపి, ఏవయినా అభ్యంతరకర వస్తువులు దాచుకున్నారేమోనని ఆపాదమస్తకం ఎలా తడిమి తడిమి చూసారో ముఖమంతా జేవురించుకు పోగా వివరించాడు. తెల్ల యువకుడు తనను ఎవరు ఎప్పుడూ ఎక్కడా ఆపలేదని, పోలీసులతో తనకెలాంటి చేదు అనుభవం లేదనీ, పైపెచ్చు తాను పోలీసు ఆఫీసర్ కావాలనుకుంటున్నానని చెప్పాడు. భారతీయుడు తనకు అమెరికా పోలీసులంటే భయము, గౌరవము రెండూ ఉన్నాయని, వారంటే తానెప్పుడూ ఆమడ దూరంలో ఉంటానని, వారితో ఎప్పుడూ ముఖా ముఖి తారస పడలేదని అన్నాడు.

ఈ సంవత్సరం (2016) జులై మొదటి వారంలో మిన్నసోటా (మినియాపోలీస్) లో తన స్నేహితురాలితో కలిసి కారులో వెళుతున్న ఓ నల్లజాతి యువకుణ్ని ఆపి, లైసెన్స్ చూపించమన్నాడో పోలీసు. కారు అద్దాలు దించి, లైసెన్స్ కాగితాల కోసం జేబులో వెతుకుతుండగా జేబులోంచి పిస్తోలు తీస్తున్నాడేమోనని అనుమానించి, ఆతని కణతలపై తుపాకీపేల్చి ఆ యువకుణ్ని అకారణంగా చంపివేసాడా పోలీసు. కార్లు పార్కుచేసే స్థలంలో ఏదో అమ్ముతున్నారనే అనుమానంతో ఇద్దరు నల్లజాతి వాళ్లను లూసియానాలోని బాటన్రోగ్ వద్ద కాల్చివేశారు పోలీసులు.

ఇదీ అమెరికాలో నల్లవాళ్ల పరిస్థితి. వాళ్లను పోలీసులు దొంగల్లాగా

---

*ఫ్యాక్టరీ సైరన్ మోత / నాలో ఇమిడి పోయింది*
*నాలో భాగమై పోయింది / నాకది సంగీతం*
*నాకది ఉత్తేజం'*

ఈ కవితను చదివేప్పుడు బ్రిటన్‌లో పారిశ్రామీకరణ జరిగిన తొలినాళ్లలో థామస్ హుడ్ రాసిన కవిత 'ఓ చొక్కా గీతం' 'సాంగ్ ఆఫ్ ది షర్ట్' గుర్తు రాకుండ ఉండదు.

'అరిగి విరిగిన వేళ్లతో, / ఎరుపెక్కిన కళ్లపై
సోలిపోతున్న కనురెప్పలతో, / ఓ మహిళ కూర్చుని ఉంది
మహిళత్వం దాయలేని చింకి పాతలతో
సూదీ దారం ఇటు అటు ఆడిస్తూ, / కుట్టు కుట్టు కుట్టు
పేదరికంలో, ఆకలితో మురికిలో,
అయినా ఆగక ఆమె చొక్కా కుదుతూనే ఉంది
సూదీ దారం ఇటు అటు ఆడిస్తూ
దుఃఖంతో పూడుకుపోయిన గొంతుతో
చొక్కా గీతాన్ని పాడుతూనే ఉంది
అయినా ఆగక చొక్కా ఆమె కుదుతూనే ఉంది'

పెట్టుబడిదారీ బ్రిటన్‌లో పరిశ్రమ దోపిడీ లాభార్జనకు సాధనంగా అవిష్కరించబడింది. అదే సోవియట్ రష్యాలో పరిశ్రమ సమష్టి సంపదను సృష్టించడానికే కాక గత సమాజ బంధనాలను ఉద్దేశ పూర్వకంగా, చైతన్యయుతంగా బద్దలు కొట్టడానికి ఓ పనిముట్టుగా రూపొందింది.

అక్టోబర్ విప్లవానికి వందేళ్లు నిండుతున్నాయి. అప్పుడు విసిరేయబడ్డ ముసుగులు విషనాగు పడగలై మహిళల ముఖాలను, మెదళ్లను తిరిగి శాసిస్తున్నాయ్. అప్పటి ప్రజా పరిశ్రమలు ఇప్పటి మాఫియాల బొక్కసాలు నింపుతున్నాయ్ దోపిడీకి పరాకాష్టై అప్పటి విముక్త మహిళకు ఆనవాళ్లై ఎర్ర రుమాలు సామ్రాజ్యవాద దోపిడీ నడిబజార్లలో మానం అమ్ముకుంటూ బతుకీడుస్తోంది.

అప్పటి అభ్యుదయ సోపానాల కాలి ముద్రలు కూడా చెరిగి పోతున్నాయ్ - సమష్టి శ్రమ, సమష్టి ప్రగతి, సమష్టి విజ్ఞానం, కమ్యూనిస్టు స్పిరిట్ కాలగర్భంలో కలిసిపోకుండా కాపాడుకోగలమా? కాపాడు కోవాలనే తపనతోనే అన్నా లూయీ స్ట్రాంగ్ చెప్పిన వాస్తవ కథనాన్ని పరిచయం చేస్తున్నాను.

*(రచయిత శ్రామిక నేస్తం సంపాదకులు)* వీ

చూస్తారు. మన దేశంలో గ్రామీణ భారతదేశం, కార్పొరేట్ భారతం అని రెండు దేశాలు ఉన్నట్టు అమెరికాలో కూడా నల్ల వారి అమెరికా, తెల్లవారి అమెరికా అని రెండు దేశాలు ఉన్నాయి. ఈ రెండు దేశాల మధ్య మన దేశంలో దళితులకు, అగ్ర వర్ణాలకు మధ్య ఉన్న అగాథంలా అంతరం విస్తరించుకొని ఉంది. అమెరికా పోలీసు వ్యవస్థ నల్లవారిని దొంగలుగా, బ్లాక్ మార్కెటీర్లుగా, ఇళ్లకు కన్నాలు వేసే వాళ్లుగా పరిగణిస్తుంది. ఎక్కడయినా ఏదయినా నేరం జరిగితే, మొట్ట మొదటి అనుమానితుడు నల్లవాడే అవుతాడు. దానికి కారణం నల్ల వాళ్లలో పేదరికం, అవిద్య ఎక్కువ ఉండడమే. అమెరికా పోలీసులలో నల్లవాళ్లు ఉన్నా, వ్యవస్థగా అమెరికా పోలీసు నల్లవాళ్లకు వ్యతిరేకం.

తెల్లవారు నల్లవారి పట్ల చూపుతున్న వివక్ష కు వ్యతిరేకంగా 1960వ దశకంలో తీవ్రమైన ప్రతిఘటనను అమెరికా చవిచూసింది. అదే కాలంలో నల్లవారి మిలిటెంట్ బ్లాక్ పాంథర్స్ ఉద్యమం మొగ్గ తొడిగింది. దాదాపు రెండు దశాబ్దాల కాలం నడిచిన బ్లాక్ పాంథర్స్ సంచలనం అమెరికా సమాజంలో పలు మార్పులు తెచ్చింది. నల్ల వారు తలెత్తుకొని జీవించే పరిస్థితిని ఆవిష్కరించింది. రాజకీయాలలో, ప్రభుత్వ పాలనలో కీలకమైన స్థానాలను కొన్నింటిని నల్ల జాతి జనులు చేజిక్కించుకొనే పరిస్థితి కూడా వచ్చింది. ఆఫ్రో – అమెరికన్ అయిన బారక్ ఒబామా దేశాధ్యక్ష పదవి చేపట్టడం  కూడా జరిగింది. ఒబామా దేశాధ్యక్షుడయితే అయ్యాడు గాని అమెరికా పోలీసు వ్యవస్థ నల్ల జాతి ప్రజలను దొంగలుగా చూడడం మాత్రం మానలేదు. విచిత్రంగా ఒబామా అధ్యక్ష పదవి చేపట్టిన నాటి నుంచి నల్ల వారి పై పోలీసు దాడులు పెరిగాయి గాని తగ్గలేదు.

గతకొన్ని సంవత్సరాలుగా నల్లవారిపై పోలీసు దాష్టీకం పెచ్చరిల్లి పోయిన ఈ పరిస్థితులలో అమెరికాలో ఒక కొత్త పౌరహక్కుల ఉద్యమం పురుడు పోసుకుంటున్నది. దానికి సంస్థాగత రూపం ఇంకా ఏర్పడలేదు దేశ వ్యాప్తంగా రగిలిపోతున్నగుండెలు తప్ప. దానిపేరే 'బ్లాక్ లైవ్స్ మాటర్' (నల్లవారి జీవితాలు విలువైనవి). ఒక నల్లజాతి యువకుడిని అకారణంగా కాల్చిచంపిన కేసులో జార్జిమ్మర్మాన్ అనే తెల్ల పోలీసు ఆఫీసర్ ఏ శిక్షా లేకుండా విడుదల కావడంపట్ల వెల్లువెత్తిన నిరసన జ్వాలలలో భాగంగా ఒక సోషల్ మీడియా గ్రూప్‌గా ఈ ఉద్యమం 2013 లో రూపుదిద్దుకొంది.

2016 జూలై మొదటి వారంలో మిన్నసోటా, లూసియానా పట్టణాలలో, అమాయకులయిన నల్లవాళ్లను, కేవలం వాళ్లు నల్లవాళ్లయి నందుకే, పోలీసు అధికారులు పరమ కిరాతకంగా కాల్చి చంపుతుండగా తీసిన వీడియో సామాజిక మాధ్యమంలో తీవ్ర సంచలనం సృష్టించి, దానికి ప్రతిగా, జూలై రెండవ వారంలో డల్లాస్ నగరంలో అయిదుగురు తెల్ల పోలీసు అధికారులను ఒక ఆఫ్రికన్ – అమెరికన్‌ను కాల్చిచంపిన సంఘటనతో బ్లాక్ లైవ్స్ మాటర్ ఉద్యమం ఒక్కసారిగా తెరమీదికి వచ్చింది. డల్లాస్‌లో అయిదుగురు పోలీసు అధికారులను చంపిన కొద్ది రోజులకే, లూసియానాలోని బెటన్‌రోగ్‌లో పోలీసు కేంద్ర కార్యాలయానికి కేవలం ఒకమైలు దూరంలోనే మరో ముగ్గురు పోలీసు ఆఫీసర్లను ఒక ఆఫ్రికన్ – అమెరికన్ యువకుడు మెషిన్‌గన్‌తో కాల్చాడు. బెటన్‌రోగ్‌లోనే కొద్దిరోజుల క్రితం కార్లు పార్క్ చేసే స్థలంలో ఏవో వస్తువులను అమ్ముతున్నారన్న నెపంతో ఇద్దరు నల్లవాళ్లను కాల్చివేసిన సంఘటన జరిగింది. దీంతో బ్లాక్ లైవ్స్ మాటర్  ఉద్యమం అమెరికాలో పతాక శీర్షికలలో చర్చించబడ్డది.

ప్రతి సంవత్సరం కొన్నివందల మంది నల్లవాళ్లు పోలీసుల చేతుల్లో మరణిస్తుండగా ఇంతవరకు ఏ ఒక్క పోలీసు అధికారికి శిక్ష పడకపోవడం నల్లజాతి వాళ్ల పట్ల న్యాయ వ్యవస్థ ఎంత వివక్షతో ఉందో అర్థమవుతుంది. భారతదేశంలో కూడా జైళ్లల్లో మగ్గుతున్నవాళ్లు, కోర్టులలో శిక్ష పడుతున్న వాళ్లు నూటికి తొంభై శాతం దళితులు, ఇతర సబ్బండ కులాల వారేనని గణాంకాలు తెలుపుతున్నాయి.

అమెరికాలో ప్రభుత్వం వారు వెల్లడించిన వివరాల ప్రకారం 2015లో 102 మంది నిరాయుధులైన నల్లవారిని, ఏదో రకమైన మారణాయుధం ధరించిన 30 మందిని (నల్లవారిని)  పోలీసులు చిన్న చిన్న నేరాల మిషతో కాల్చిచంపారు. పోలీసుల చేతిలో చంపబడిన తెల్లవాళ్లు ఇందులో 5వ వంతు మాత్రమే. అందునా చంపబడిన తెల్లవాళ్లు అందరూ ఆయుధాలు కలిగివున్న వాళ్లు. మొత్తం అమెరికా జనాభాలో నల్లవాళ్లు 13 శాతం ఉంటారు.

అమెరికాలో నల్లజాతి ప్రజలు కడు పేదరికంలో బతుకుతూ ఉంటారు. ఉద్యోగాలకు కావాల్సిన నైపుణ్యాలు ఉండవు. కష్టపడతారు కానీ, కష్టానికి తగ్గ పరిహారం లభించదు. దీనితో చిన్న చిన్న దొంగతనా లకు, డ్రగ్స్ అమ్మడానికి అలవాటు పడవచ్చు. చిల్లర దొంగతనాలకు కూడా చంపెయ్యడమేనా అన్నది పౌరహక్కుల ఉద్యమకారుల ప్రశ్న. ఏది ఏమైనా చర్మం రంగును బట్టి పౌరులతో పోలీసుల ప్రవర్తన కారణంగా అమెరికా సమాజంలో ఏర్పడ్డ ఈ విభజన ఇంకా ఇంకా పెరిగే సూచనలు ఉన్నాయి. ఇది ఆ దేశంలో ఎన్నికల కాలం కూడా. అధ్యక్ష ఎన్నికలు నవంబర్ నెలలో జరుగనున్నాయి. ప్రతి ఎన్నికల సభలో 'బ్లాక్ లైవ్స్ మాటర్' ఉద్యమంపై మీ అభిప్రాయం ఏమిటని నల్లజాతి యువకుల నుండి అభ్యర్థులకు ప్రశ్నలు ఎదురవుతూనే ఉన్నాయి. ప్రధాన ప్రత్యర్థులు సూటిగా సమాధానం ఇవ్వకుండా ప్రశ్నలను దాటవేయడం కూడా జరుగుతున్నది. ఇస్పానికులను, ముస్లింలను, చైనీయులను, భారతీయులను తిట్టి రిపబ్లికన్ పార్టీ అభ్యర్థి డోనాల్డ్ ట్రంప్ తెల్లజాతి యువతను బలంగా తన పక్షం చేసుకున్నాడు. ఈ యువతనే నల్లజాతి యవకుల్లో, మేధావుల్లో మేల్కొన్న చైతన్యానికి పోటీగా అక్కడక్కడా 'వైట్ లైవ్స్ మాటర్' అని ప్లేకార్డ్ ప్రదర్శిస్తున్నారు.

మీడియా కూడా 'బ్లూ లైవ్స్ మాటర్' అన్న కృత్రిమ ఉద్యమాన్ని సృష్టించే  ప్రయత్నం చేస్తున్నది. బ్లూ లైవ్స్ అంటే పోలీసుల జీవితాలు అని అర్థం. 'పోలీసుల జీవితాలూ విలువైనవి' అన్న నినాదం ఇచ్చే ప్రయత్నం చేస్తున్నది. అయితే ప్రజలెవ్వరూ ఆ నినాదాన్ని పట్టించుకోవడం లేదు. ఆసియా ఖండంలోని దేశాల నుండి వలస వచ్చి అమెరికాలో స్థిరపడిన వారి పిల్లలు ఈ వర్ణవివక్ష ఎందుకు అని తమ తల్లితండ్రులకు రాసినట్టుగా చెప్పబడుతున్న లేఖ ఈ మధ్య బహుళ ప్రచారం పొందింది.

రేపు రాబోయే ఎన్నికలు ఎలా ముగిసినా 'బ్లాక్ లైవ్స్ మాటర్' ఉద్యమం కొత్తపుంతలు తొక్కుతుందనడంలో ఏమాత్రం సందేహంలేదు. అమెరికాలో నూతనంగా ఉద్భవిస్తున్న ఈ పౌరహక్కుల ఉద్యమం నల్లజాతి చైతన్యాన్ని, ప్రపంచంలో అణచబడ్డ ప్రజల ఉద్యమస్ఫూర్తిని మరింత ముందుకు తీసుకుపోవడం ఖాయం.

*(రచయిత రిటైర్డ్ ప్రిన్సిపాల్)* వీ

# జనతన రాజ్యానికి ఎత్తిపట్టిన దర్పణం

- ఎన్. వేణుగోపాల్

విద్యార్థి యువజన రంగాల నుంచి వచ్చిన విప్లవ కార్యకర్తలు నలభై యాభై మంది ఏడు గెరిల్లా దళాలుగా ప్రవేశించిన దండకారణ్యం మూడున్నర దశాబ్దాలలో విస్తృత ప్రజా ఉద్యమంగా, భారత రాజ్యాన్నీ, బహుళ జాతి సంస్థలనూ ప్రతిఘటిస్తున్న బలమైన శక్తిగా ఎదిగింది. ప్రజాసైనిక దళాలు, రైతాంగ, మహిళా ప్రజాసంఘాలు, సాంస్కృతిక దళాలు క్రమక్రమంగా విస్తరించి ప్రత్యామ్నాయ పాలనా సంస్థలు ఆవిర్భవించి నిలదొక్కుకున్నాయి. ఆ ప్రాంతమే బహుళ జాతి సంస్థలకు అవసరమైన అపార ఖనిజ నిలువలకు స్థావరం కావడంతో దేశదేశాల సంపన్న వర్గాలు, పాలకవర్గాలు, దేశంలోని వారి దళారీ వర్గాలు, ప్రచారసాధనాలు ఈ ప్రాంతం నుంచి ఆదివాసులను, వారికి అండగా నిలుస్తున్న విప్లవోద్యమాన్ని అణచివేయడానికి వ్యూహాలు రచిస్తున్నాయి. విచ్చలవిడి హత్యలు, దాడులు, అరెస్టులు, అక్రమ కేసులు, దుష్ప్రచారాలు సాగిస్తున్నాయి. మూడు నాలుగు దఫాలుగా పాలకవర్గాలు సాగించిన ఈ దారుణ దమనకాండను ఆదివాసులు తట్టుకుని నిలిచారు. విప్లవోద్యమం దెబ్బ కాచుకోవడం మాత్రమే కాదు, దెబ్బ తీసే స్థితికి ఎదిగింది. ప్రత్యామ్నాయం లేనేలేదని దేశీయ, అంతర్జాతీయ పాలకవర్గాలు విర్రవీగుతున్న సమయంలో దండకారణ్య ఉద్యమం ప్రపంచానికే ఆశాజ్యోతిగా నిలిచింది. ఈ ఆశాజ్యోతిని మలిపెయ్యడానికి, తుడిచెయ్యడానికి పాలకవర్గాల కుట్రలకు, కుహకాలకు, ధన ప్రవాహాలకు, సైనిక దాడులకు అంతు లేదు. అర్ధసైనిక బలగాల వినియోగం చాలనట్టు సైనిక బలగాల వినియోగానికి, వైమానిక దాడులకు కూడ రంగం సిద్ధం చేస్తున్నారు. మిషన్ 2016 అనీ, 2016 విప్లవోద్యమానికి చివరి సంవత్సరం అవుతుందనీ, 2016 తర్వాత ఆ ప్రాంతంలో అసలు మావోయిస్టులు అనే మాటే వినబడదనీ పోలీసు అధికారులు బహిరంగంగా ప్రగల్భాలు పలుకుతున్నారు.

ఈ స్థితిలో దండకారణ్యంలో ఏం జరుగుతున్నదో తెలుసుకోవలసిన అవసరం, బాధ్యత ఆలోచనాపరులందరికీ, మనుషులందరికీ ఉన్నాయి. దండకారణ్య విప్లవోద్యమాన్ని అణచివేయడం ద్వారా పాలకవర్గాలు ఏమి సాధించ దలచుకున్నాయో, ఏ ప్రత్యామ్నాయ ప్రజా రాజ్యాధికార వ్యవస్థను మొగ్గలో చిదిమేయదలచుకున్నాయో అర్థం చేసుకోవలసి ఉంది. అలా అర్థం చేసుకోవడానికి, దండకారణ్య విప్లవోద్యమ చరిత్ర అధ్యయనానికి, అందులో ఇమిడి ఉన్న విభిన్న అంశాలను అవగాహన చేసుకోవడానికి, ప్రత్యామ్నాయ ప్రజా రాజ్యాధికార వ్యవస్థ బీజరూపంలో ఎలా పనిచేస్తున్నదో అర్థం చేసుకోవడానికి చాల ఉపయోగకరమైన పుస్తకం పాణి రాసిన 'జనతన రాజ్యం ? దండకారణ్యంలో మావోయిస్టు ఆచరణ'.

ప్రజల స్వయం నిర్ణయాధికారం కోసం, స్వావలంబన కోసం, దోపిడీ పీడనలు లేని సమాజం కోసం తరతరాలుగా జరుగుతున్న ప్రయత్నాలలో, ప్రయోగాలలో ఒక గుణాత్మకమైన మైలురాయిగా కూడ దండకారణ్యం గురించి, అక్కడ సాగుతున్న జనతన రాజ్యం గురించి తెలుసుకోవలసి ఉంది. అంటే వర్తమాన అవసరాల కోసం మాత్రమే కాదు, చారిత్రక అవగాహన కోసం కూడ దాని గురించి తెలుసుకోవలసి ఉంది. విముక్తిపోరాటంలో భాగంగా రాజ్యాధికార బీజరూపాల్ని ప్రవేశపెట్టడంలో దండకారణ్య విప్లవోద్యమానికి ఉన్న ప్రాధాన్యతను కూడ అర్థం చేసుకోవలసి ఉంది. పారిస్ కమ్యూన్ నుంచి బోల్షివిక్ విప్లవం దాకా, తూర్పు యూరప్ సోషలిస్టు రాజ్యాల దాకా విప్లవ విజయం తర్వాతనే రాజ్యాధికారం వచ్చిన శ్రామికవర్గం ఆ




**జనతన రాజ్యం** – దండకారణ్యంలో మావోయిస్టు ఆచరణ – పాణి – విరసం ప్రచురణ – 565 పేజీలు, 1/8 డెమీ, రు. 300, ప్రతులకు: డి.వి. రామక్రిష్ణారావు, ఎంఐజి-14, ఎపిఐఐసి కాలనీ, కార్బైడ్ కంపెనీ ఎదురుగా, మౌలాలి, హైదరాబాద్; అన్ని ప్రముఖ పుస్తక షాపులు

రాజ్యాధికారంతో కొత్త సామాజిక నిర్మాణానికి ప్రయత్నాలు చేసింది. చైనా విప్లవంలో మాత్రం విప్లవ క్రమంలోనే, సంపూర్ణంగా దేశ రాజ్యాధికారం చేతికి రావడానికి రెండు దశాబ్దాల ముందే ప్రాంతాలవారీగా రాజ్యాధికారం సాధించడం గురించీ, ఒక కొత్త ప్రజా పాలన నమూనాను అందించడం గురించీ ప్రయత్నాలు జరిగాయి.

భారత విప్లవంలో ప్రజల చేతికి బీజరూపమైన రాజ్యాధికారం రావడం మొదటిసారి తెలంగాణ రైతాంగ సాయుధ పోరాట కాలంలో జరిగింది గాని అది ఎక్కువకాలం సాగలేదు. ఆ తర్వాత రాజ్యాధికార స్పృహను నక్సల్బరీ ఎజెండా మీదికి తెచ్చింది. తొమ్మిది దశాబ్దాల భారత కమ్యూనిస్టు ఉద్యమ చరిత్రలో గత ఇరవై సంవత్సరాలుగా ప్రజల రాజ్యాధికారాన్ని బీజరూపంలో దీర్ఘకాలంగా, విస్తృతంగా అమలుచేస్తూ చూపుతున్నది దండకారణ్య విప్లవోద్యమమే. స్థల, కాల, విస్తృతి ప్రమాణాలలో దండకారణ్య విప్లవోద్యమం పెరూ, కొలంబియా, ఫిలిప్పైన్స్, నేపాల్ ప్రయోగాల కన్న కూడ విశిష్టమైనది. అందువల్ల జనతన సర్కార్ గురించి లోతైన అధ్యయనం జరపడానికి ప్రస్తుతం విశేషమైన ప్రాధాన్యత ఉంది. ఆ అధ్యయనానికి దారి చూపుతుంది పాణి రాసిన 'జనతన రాజ్యం'.

దండకారణ్యంలో పర్యటించి అక్కడి సామాజిక, రాజకీయ, సాంస్కృతిక, సైనిక విశేషాలు తెలిపినవారు గతంలో ఎందరో ఉన్నారు. అక్కడికి వెళ్లకుండానే ఉద్యమం గురించి అనుకూలంగానో, ప్రతికూలంగానో రాసిన రచనలు కూడ ఉన్నాయి. కొన్ని గంటలలో, ఒకటి రెండు రోజులలో అక్కడి నాయకులతో, ప్రజలతో మాట్లాడి పత్రికా కథనాలు రాసినవారు మాత్రమే కాక కొన్ని నెలలు గడిపిన సత్నాం (జంగల్ నామా, పంజాబీ 2003, ఇంగ్లిష్ 2010), కొద్దిరోజులలో, వారాలలో గడిపిన అరుంధతీ రాయ్ (వాకింగ్ విత్ ది కామ్రేడ్స్ – బ్రోకెన్ రిపబ్లిక్ 2011), యాన్ మిర్డాల్ (రెడ్ స్టార్ ఓవర్ ఇండియా 2012), గౌతం నవ్లాఖా (డేస్ అండ్ నైట్స్ ఇన్ ది హార్ట్ లాండ్ ఆఫ్ రిబెలియన్, 2012) ల పుస్తకాలు ప్రాచుర్యంలోనే ఉన్నాయి. బహుశా పాణి రచన వాటన్నిటికీ ఒకరకమైన కొనసాగింపూ, కొంత భిన్నమైనదీ కూడ. ప్రత్యక్ష అనుభవంతో దండకారణ్య విప్లవోద్యమాన్ని, జనతన సర్కార్ ను వివరించడంలో, విశ్లేషించడంలో అది గతంలోని పుస్తకాలకు కొనసాగింపే. కాని ఆ ప్రత్యక్ష అనుభవాన్ని ఎప్పటికప్పుడు రాజకీయ, తాత్విక, కళాత్మక, మానవీయ అవగాహనలతో బేరీజు వేయడంలో ఈ పుస్తకం గుణాత్మకంగానే భిన్నమైనది. అటువంటి పని కొంతవరకు మిర్డాల్ చేశారు గాని ఆయన బేరీజు వేసిన అవగాహనలు అంతర్జాతీయ స్థాయివి, స్థూలమైనవి, సాధారణమైనవి. 'జనతన రాజ్యం'లో పాణి ప్రకటించిన అవగాహనలు స్థానికమైనవి, నిర్దిష్టమైనవి, సమకాలికమైనవి.

మూడు అధ్యాయాలతో ('ప్రజా విముక్తి గెరిల్లా సైన్యంతో', 'గ్రామాల అధ్యయనం', 'జనతన సర్కార్ మహాసభలో' అనే మూడు ఉప అధ్యాయాలతో

మొదటి అధ్యాయం, 'జనతన సర్కార్ నేపథ్యంలో గ్రామరాజ్యాలు', 'గ్రామ పర్యటన విశ్లేషణ', 'ప్రయోగాత్మక ప్రత్యామ్నాయ ప్రజారాజ్యం' అనే మూడు ఉప అధ్యాయాలతో రెండో అధ్యాయం, 'దండకారణ్య సమయ సందర్భాలు' అనే మూడో అధ్యాయం), రెండు అనుబంధాలతో (ఒకటి వివిధ ప్రజా నిర్మాణాల కార్యకర్తలతో, నాయకులతో జరిపిన సంభాషణలు, మరొకటి, ఈ పుస్తకం గురించి అల్లం రాజయ్య, డా. ముదునూరి భారతి, ఆర్ వి శ్రీధర్ చేసిన విశ్లేషణలు), ప్రతాప్, పాణి రాసిన ముందుమాటలతో, 565 పేజీల ఈ సుదీర్ఘ పుస్తకం ఈ కాలపు పాఠకులను చూడగానే భయపెడుతుందేమో గాని, ధైర్యంగా ఈ దండకారణ్యంలోకీ, జనతన రాజ్యంలోకీ ప్రవేశిస్తే ఎన్నో అద్భుతమైన అవగాహనలూ, విశ్లేషణలూ, పరికరాలూ, ఎంతో సమాచారమూ దొరుకుతాయి.

"...ఆదివాసీ జీవితంలో వైవిధ్యం, విప్లవోద్యమంలో త్యాగాలు, కష్టాలు అత్యంత సహజం. నా అధ్యయనానికి ఇవి ప్రమాణాలు కాదు, అవి నా పరిశీలనాంశాలు కావు" (పే. 38–39) అని ఇంతకుముందరి పరిశీలకుల ప్రధాన లక్ష్యాలను పక్కన పెట్టి, "నా లక్ష్యం దండకారణ్య సామాజిక పరివర్తనా క్రమాన్ని తెలుసుకోవడం" (పే. 38) అని పాణి తన పరిశీలనా వస్తువును నిర్ధారించుకున్నారు. ఆదివాసి సమాజంలో సరళతకూ సంక్లిష్టతకూ మధ్య ఉన్న సంబంధం తనను నిత్యం కలవరపెట్టిందనీ, "చాలా సరళమని అనిపించిన మరుక్షణమే పైపొర విప్పి లోపలికి తొంగి చూస్తే అత్యంత సంక్లిష్ట చిత్రం అగుపిస్తోంది....ఈ సరళతలోని సంక్లిష్టత పలికే భిన్న అర్థాలేమిటి?" (పే. 47) అనీ తాను అనుసరించక తప్పని గతితార్కిక సంవిధానాన్ని కూడ ఆయన గుర్తించారు.

అలా వస్తువు, సంవిధానం నిర్ణయమైన తర్వాత పాణి కేంద్రీకరించదలచిన అంశాలు మూడు: "ఒకటి, దండకారణ్య ఉత్పత్తి వ్యవస్థలో మార్పులు. రెండు, జనతన సర్కార్ అనే పాలనా యంత్రాంగం వెనుక రాజ్య వ్యవస్థ నిర్మాణమవుతున్నదా? అలాంటి ప్రాథమిక లక్షణాలు రూపొందుతున్నాయా? మూడు, సామాజిక సంబంధాల మార్పు క్రమం ఎలా ఉన్నది?"

ఏ విషయంలోనైనా వస్తువు, సంవిధానం, కేంద్రీకరించే అంశాలు మాత్రమే కాక, పరిశీలకుల దృక్పథం ప్రాధాన్యత వహిస్తుంది. అదే వస్తువునూ సంవిధానాన్నీ కేంద్రీకరణనూ నిర్ణయిస్తుంది. ఆ పరిశీలనా క్రమంలో ఆ దృక్పథం మార్పు చేర్పులకు లోనై మెరుగవుతుంది. దృక్పథం లేకుండా తెల్ల కాగితం లాగ అన్నిటినీ పరిశీలించి, అన్నిటినీ గ్రహించదలచుకున్నాను అని ఎవరైనా అన్నా అది వాస్తవం కాదు, అది తెచ్చిపెట్టుకున్న ఉదారవాదం మాత్రమే అవుతుంది. దాని వెనుక నుంచి పరిశీలకుల దృక్పథం వ్యక్తమవుతూనే ఉంటుంది. మరొక కొసకు వెళ్లి, 'పరిశీలించే విషయాలను నా దృక్పథానికి అనుగుణంగా కత్తిరిస్తాను, నా దృక్పథానికి భిన్నమైన దృగ్గోచరాంశాలను ప్రస్తావించను' అనడం పిడివాదం అవుతుంది. దానివల్ల పరిశీలన అసమగ్రం అవుతుంది. అటు ఏ దృక్పథమూ లేకుండా దేన్నీ పరిశీలించడం సాధ్యం కాదు, ఇటు తన దృక్పథానికి లొంగిన అంశాలను మాత్రమే పరిశీలిస్తానంటే అది సమగ్ర, వస్తుగత పరిశీలనా కాజాలదు. ఒక దృక్పథం దగ్గర ప్రారంభమై, ఆ దృక్పథానికి సవాలుగా ఉండే వస్తువులను కూడ పరిశీలించి, దృక్పథాన్ని మెరుగుపరచుకుంటూ పోవడం మాత్రమే సరైన పరిశీలనా పద్ధతి. దృక్పథానికీ పరిశీలనా వస్తువుకూ మధ్య ఉండే ఈ గతితార్కిక, పరస్పర ప్రభావాలు వేసుకునే సంబంధాన్ని గుర్తించిన పాణి ఒక దృక్పథంతోనే ప్రారంభమై, కొత్త, భిన్నమైన, ప్రత్యామ్నాయమైన ఆలోచనలు కూడ చేశారు. 'ఎందుకంటే' అని రాసుకున్న ముందుమాటలో చెప్పుకున్నట్టు, ఈ పరిశీలన చేయడానికి పాణికి రెండు ప్రధాన భూమికల దృక్పథం ఉంది. ఒకటి, 'మౌలిక మార్పు వర్గపోరాటం ద్వారానే సాధ్యం అనే సందేశమే ఇవాళ దండకారణ్యానికి నిర్వచనం' అనే ప్రాతిపదిక. రెండు, 'మార్క్సిస్టులు మాత్రమే విశ్లేషించవలసిన ఎన్నో ప్రత్యేకతలు దండకారణ్య ప్రయోగంలో ఉన్నాయి' అనే ప్రాతిపదిక.

ఒక సమాజ పరివర్తనను, అందులోనూ బలమైన ప్రతికూల శక్తుల అణచివేతను ఎదుర్కొంటూ సాగుతున్న సమాజ పరివర్తనను, వర్గపోరాటం ద్వారా మాత్రమే మౌలిక మార్పు జరుగుతుందనే అవగాహనతో అర్థం చేసుకోవడానికి ప్రయత్నించినప్పుడు తప్పనిసరిగా ఆ సమాజ పరివర్తనలో ఎన్నో పరిశీలించవలసిన ప్రత్యేకతలు ఉంటాయి, ఉన్నాయి. ఆ ప్రత్యేకతలను విశ్లేషించడం మార్క్సిస్టులు మాత్రమే చేయవలసిన కృషి, మార్క్సిస్టు సిద్ధాంతానికీ, ఆచరణకూ కొత్త కానుకలు అందించే కృషి. 'జనతన రాజ్యం' పుస్తకం ఆ కృషికి అవసరమైన ఎంతో సమాచారం, ఎన్నో పరిశీలనలు, ఎన్నో చర్చనీయాంశాలు పాఠకుల ముందుకు తెస్తుంది.

**కుప్పలుగా సమాచారం**

గతంలో ఎంతమంది వెళ్లి వచ్చి రాసినప్పటికీ దండకారణ్యంలో ప్రజల స్వయంపాలన గురించి వారి పుస్తకాలలో లేని సమాచారం, ఉన్న సమాచారానికైనా కొత్త కోణాలు 'జనతన రాజ్యం'లో ఉన్నాయి.

జనతన సర్కార్ నాయకత్వంలో గ్రామస్థాయిలో భూపంపిణీ, వ్యవసాయం, సహకారం ఎలా జరుగుతున్నాయో, వాటి పట్ల నాయకత్వ అవగాహనలు ఏమిటో, ప్రజల అభిప్రాయాలు ఏమిటో ఈ పుస్తకం చాల వివరంగా చెపుతుంది. ఒకరకంగా చైనా విప్లవోద్యమ క్రమం గురించి ఎడ్గార్ స్నో 'రెడ్ స్టార్ ఓవర్ చైనా'లో, జాక్ బెల్డెన్ 'చైనా షేక్స్ ది వరల్డ్' లో, విలియం హింటన్ 'ఫాన్ షెన్' లో వివరించిన, చౌలి పో నవల 'ఉప్పెన'లో కళాత్మకంగా చిత్రణ పొందిన సామాజిక సంచలనంతో పోల్చదగిన సంచలనం దండకారణ్యంలో జరుగుతున్నదని, ఈ వివరాలు చూపుతాయి. కేవలం భూపంపిణీ, వ్యవసాయం, సహకారం గురించి మాత్రమే కాక జనతన సర్కార్ పాలనారీతుల గురించీ, విద్యా, ఆరోగ్య, న్యాయ, రక్షణ వ్యవస్థల గురించీ, స్త్రీల భాగస్వామ్యం గురించీ, ఈ కొత్త ప్రజా ప్రత్యామ్నాయ పాలనారీతులు అమలులోకి వస్తున్న క్రమంలో సంస్కృతిలో, అస్తిత్వంలో వస్తున్న పరివర్తనల గురించీ కూడ ఈ పుస్తకం వివరిస్తుంది. దండకారణ్య విప్లవోద్యమం గురించీ, సామాజిక పరివర్తన గురించీ, ఆ సామాజిక పరివర్తనకు మార్గ నిర్దేశకత్వం చేస్తున్న సైద్ధాంతిక అవగాహన గురించీ ఈ పుస్తకంలో కుప్పలుగా సమాచారం ఉంది. ఇప్పటివరకూ అరకొరగా, తెలిసీ తెలియకుండా వచ్చిన సమాచారాన్ని విశ్వసనీయంగా, సాధికారంగా, సమగ్రంగా ఈ పుస్తకం అందిస్తుంది. ఈ సమాచార విస్తృతి కూడ ఈ పుస్తకపు ప్రాముఖ్యతలలో ఒకటి.

**కొన్ని అద్భుతమైన పరిశీలనలు**

ఏ సమాచారమైనా కొత్త విషయాల పరిశీలనకూ, విశ్లేషణకూ, చర్చకూ, అన్వయానికీ దారితీయవలసిందే. 'జనతన రాజ్యం' పుస్తకం రెండో ప్రాముఖ్యత ఆ సమాచారం నుంచి ఎన్నో అద్భుతమైన పరిశీలనలు రాబట్టడంలో, కొన్ని మరింత వివరణ అవసరమైన, మరింత చర్చించదగిన అంశాలు ప్రతిపాదించడంలో, కొన్ని అంశాలు లోతుగా విశ్లేషించడంలో ఉంది. అటువంటి అద్భుతమైన పరిశీలనలు ఈ పుస్తకంలో కొన్ని డజన్లున్నాయి గాని స్థలాభావం దృష్ట్యా ఇక్కడ నాలుగైదు మాత్రం ప్రస్తావించుకోవాలి.

ఒక సామాజిక పరివర్తనను మార్క్సిస్టు దృక్పథం నుంచి పరిశీలించదలచుకున్న వారెవరికైనా సమూహం–వ్యక్తి అనే ద్వంద్వం గురించి ఆలోచనలు కలుగుతాయి. దాదాపు మార్క్స్ రచనల నాటినుంచే ఈ ద్వంద్వం గురించి మార్క్సిస్టు ఆలోచనాధారలో చర్చ ఉంది. కొందరు మార్క్సిస్టు వ్యతిరేకులు, మార్క్సేతరులు ఈ ద్వంద్వంలో మార్క్స్ చెప్పిన గతితార్కిక సంబంధాన్ని విస్మరించి, మార్క్సిజం వ్యక్తిని విస్మరిస్తుందని, అందువల్ల అది

వ్యక్తి స్వేచ్ఛకు హానికరమని అనేదాకా వెళ్లారు. కొందరు పిడివాద మార్క్సిస్టులు అంతా సమాజమే, వ్యక్తికి ఏ పాత్రాలేదు అనే అతివాదానికి కూడ లోనయ్యారు. వ్యక్తికీ సమూహానికీ మధ్య సంబంధం గురించీ, పెట్టుబడిదారీ విధానంలో వ్యక్తి సమూహం నుంచి దూరమై, అతీతం కావడం గురించీ మక్సీమ్ గోర్కీ 1907లోనే డిసింటిగ్రేషన్ ఆఫ్ పర్సనాలిటీ అనే అద్భుతమైన వ్యాసంలో విశ్లేషించాడు. సమష్టిలో భాగమైన నూతన వ్యక్తి ఆవిష్కారానికి బోల్షివిక్, చైనా విప్లవాలు ప్రయత్నించాయి. మొత్తంగా సమాజంలో వ్యక్తికీ సమూహానికీ మధ్య గతితార్కిక, సమన్వయ సంబంధాన్ని అభివృద్ధి చేయడం మాత్రమే కాదు, అగ్రగామి చైతన్యం గల కమ్యూనిస్టు పార్టీ సభ్యులలోనే ఈ ద్వంద్వపు ఘర్షణ రావచ్చునని గుర్తించి మావో సే టుంగ్ 1957లో రాసిన ఒక వ్యాసంలో "కేంద్రీకరణనూ ప్రజాస్వామ్యాన్నీ, క్రమశిక్షణనూ స్వేచ్ఛనూ, సామూహిక సంకల్పాన్నీ, వ్యక్తిగత మానసిక సౌలభ్యాన్నీ, సజీవత్వాన్నీ కలిగి ఉండే రాజకీయ పరిస్థితిని సృష్టించడమే మన లక్ష్యం" అని సామూహిక సంకల్పానికీ వ్యక్తిగత సౌలభ్యానికీ మధ్య ఉండే గతితార్కిక సంబంధాన్ని మరింత స్పష్టంగా చెప్పాడు. ఆ 1957లో రాసిన మాటే 1969లో జరిగిన ఎనిమిదో జాతీయ కాంగ్రెస్ లో చైనా కమ్యూనిస్టు పార్టీ నిబంధనావళిలో భాగమైంది. వ్యక్తికీ సమూహానికీ మధ్య సంబంధం గురించిన ఈ చర్చను వర్తమాన వర్గపోరాట నేపథ్యంలో మరొకసారి ముందుకు తేవడం 'జనతన రాజ్యం' విశిష్టత. ఆదివాసుల సామూహిక ఆలోచనా సంస్కృతికీ, కొత్త వయ్యక్తిక వ్యక్తీకరణకు మధ్య ఎటువంటి ఘర్షణ సాగుతున్నదో, ఆ దూరాన్ని అధిగమించడానికి ఎటువంటి ప్రయాస సాగుతున్నదో కనీసం మూడు చోట్ల తగిన ఉదాహరణలతో, చర్చతో 'జనతన రాజ్యం' వివరించింది. "పాత సమష్టి నుంచి బయటికి వచ్చిన వ్యక్తిని చైతన్యవంతమైన మానవులుగా తిరిగి సమష్టిలో భాగం చేయడం. ఈ పని ఇష్టపూర్వకంగా, చైతన్యవంతంగా, వ్యక్తి మిగిలి ఉండేలా జరగాలని పార్టీకి అవగాహన ఉన్నది" (పే. 328) అని పాణి రాశారు. ఈ చర్చ నిజానికి మార్క్సిజానికి గొప్ప చేర్పు.

అలాగే జ్ఞానం, నైపుణ్యం అనే సామాజిక భావనలను వర్గపోరాట నేపథ్యంలో ఎలా అర్థం చేసుకోవాలనేది కూడ మార్క్సిజంలో కీలకమైన చర్చే. పాలకవర్గాలు తమ దోపిడీ, పీడనల మీద కప్పిన మేలి ముసుగుల్లో జ్ఞానం, నైపుణ్యం అనే భావనలు కీలకమైనవి. కొందరినే జ్ఞానవంతులుగా, నిపుణులుగా గుర్తించడం మొత్తంగా అంతరాల వ్యవస్థను సమాజం చేత ఆమోదింపజేసే వ్యూహం. ఆచరణ నుంచి మాత్రమే జ్ఞానం వస్తుందనీ, ఆచరణకూ జ్ఞానానికీ మధ్య గతితార్కిక సంబంధం ఉంటుందనీ మార్క్సిస్టు జ్ఞానసిద్ధాంతం బోధించినప్పటికీ, వేల ఏళ్ల అంతరాల సమాజం వల్ల మార్క్సిస్టులలో కూడ జ్ఞానం గురించీ, నైపుణ్యం గురించీ పొరపాటు భావాలు ఉంటున్నాయి. చైనా విప్లవ క్రమంలో కూడ ఇటువంటి ఆలోచనలు, చర్చలు తలెత్తాయి. 'సరైన భావాలు ఎక్కడి నుంచి వస్తాయి' అనే సుప్రసిద్ధ వ్యాసంలో మావో ఉత్పత్తి నుంచి, ప్రయోగం నుంచి, వర్గపోరాటం నుంచి సరైన భావాలు వస్తాయని ఒక అద్భుతమైన విశ్లేషణ చేశాడు. ఉత్పత్తి నుంచి వస్తాయంటే ఉత్పత్తిలో పాల్గొనే శ్రామికుల సామూహిక ఆచరణ నుంచి, ప్రయోగం నుంచి అంటే కొత్త ఆలోచనలు చేసే, వాటిని ప్రయోగంలో పెట్టే శారీరక, మేధో శ్రామికుల నుంచి, వర్గపోరాటం నుంచి అంటే సమాజ పరివర్తనా క్రమం నుంచి అని అర్థం. నిజానికి ఉత్పత్తి, ప్రయోగం కూడ వర్గపోరాటంలో భాగమైన అంశాలే గనుక జ్ఞానాన్ని, నైపుణ్యాన్ని వర్గపోరాట నేపథ్యంలో వెతకవచ్చు. దండకారణ్య విప్లవోద్యమ అనుభవంతో, ఆదివాసుల, విప్లవోద్యమ కార్యకర్తల జ్ఞానం, నైపుణ్యం పరివర్తన చెందుతున్న క్రమం గురించి వివరించే ఈ పుస్తకం ఆ చర్చను మరింత పరిపుష్టం చేస్తుంది. అలాగే ఉత్పత్తికీ, ఉత్పాదకత పెరుగుదలకూ, శాస్త్రానికీ, స్థానిక సాముదాయక జ్ఞానానికీ ఉన్న సంబంధాన్ని గురించి చర్చలో కూడ ఈ పుస్తకం ఉత్పత్తి శక్తుల ? ఉత్పత్తి సంబంధాల అభివృద్ధి చర్చకు చాల దోహదం చేస్తుంది.

దండకారణ్య విప్లవోద్యమ ప్రత్యేకతల గురించిన చర్చ కూడ పుస్తకం మొత్తంలో ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ ఎంతో జరిగింది. "పాలకవర్గాలు చెపుతున్న అభివృద్ధి మార్గానికి ప్రజాయుద్ధం ద్వారా ప్రత్యామ్నాయం ఉన్నదని ఆచరణలో ఒక మేరకు నిరూపించడం దండకారణ్య విప్లవోద్యమ విశిష్టతల్లో మొట్టమొదటిది" అనీ, "కిందినుంచి ప్రజల నిర్ణయాధికారం ప్రకారం అభివృద్ధి పనులు, పాలనా వ్యవహారాలు సాగాలని అనుకోవడమే...విశిష్ట లక్షణం" అనీ చెపుతూనే, "అదే సమయంలో దండకారణ్యంలోని వేర్వేరు ప్రాంతాల మధ్య ఉద్యమ అభివృద్ధి దశలో తేడాలున్నాయని, మొత్తంగా ఒక దశ నుంచి మరో దశలోకి అభివృద్ధి చెందుతున్న క్రమంలో దండకారణ్య ఉద్యమం ఉన్నదని" దాని ప్రత్యేకతల మీద పరిమితులను కూడ ఈ పుస్తకం గుర్తింపజేస్తుంది.

అలాగే, వర్గపోరాటానికీ అస్తిత్వ పోరాటాలకూ మధ్య అనవసరమైన పోటీ పెట్టి జరుగుతున్న చర్చ నేపథ్యంలో ఈ పుస్తకం ఆదివాసి అస్తిత్వ పోరాటానికీ వర్గపోరాటానికీ ఎటువంటి అవినాభావ, అవిభాజ్య సంబంధం ఏర్పడిందో, అది రెంటికీ ఎలా మేలుచేసిందో వివరిస్తుంది. నిజానికి చారిత్రకంగా చూస్తే ఆదివాసి అస్తిత్వం మిగిలిన అస్తిత్వాలన్నిటికన్న ప్రాథమికమైనది. (బహుశా నైసర్గికమైన స్త్రీ-పురుష అస్తిత్వం ఒక్కటే మినహాయింపు కావచ్చు.) అటువంటి ప్రాథమికమైన అస్తిత్వం వర్గం అనే భావనతో మిళితమైనప్పుడు, ఆ అస్తిత్వాన్ని పరిరక్షించుకునే పోరాటం వర్గపోరాటంలో భాగమైనప్పుడు ఏయే అంశాలు తలెత్తుతాయో ఈ పుస్తకం నిజజీవితానుభవం నుంచి చూపుతుంది. నిజానికి అస్తిత్వం అనేది కూడ ఏకశిలా సదృశమైనది కాదు. వర్గ సమాజంలో, అంతరాల సమాజంలో అస్తిత్వానికి బహుళత్వం ఉంటుంది. సమయ సందర్భాలను బట్టి ఒక్కో అస్తిత్వం రంగం మీదికి వస్తుంది. ఒక్కోసారి భిన్న అస్తిత్వాల మధ్య విభేదం, పోటీ వచ్చే అవకాశం కూడ ఉంది. ఈ బహుళత్వాన్ని అర్థం చేసుకుని, ఆ బహుళత్వం మధ్యలో ఉండే ప్రాథమిక, మౌలిక అస్తిత్వాన్ని గుర్తించవలసి ఉంటుంది. అటువంటి ప్రాథమిక, మౌలిక అస్తిత్వం కూడ చరిత్రతో, పుట్టుకతో, ప్రాంతంతో, మతంతో, ఆచారవ్యవహారాలతో సంబంధంలో ఉండేదే. వర్గం అనేది ఉత్పత్తితో, మనుగడతో ముడిపడినది. కనుక అస్తిత్వంలోని బహుళ కోణాలన్నీ కూడ వర్గ అస్తిత్వంలో భాగమవుతాయి. ఆదివాసి అస్తిత్వంలో కూడ ఉన్న బహుళత్వాన్ని, కొనసాగుతున్న వర్గపోరాట ప్రాబల్యం వల్ల అది అందులో భాగమవుతున్న తీరును వివరించిన 'జనతన రాజ్యం' ఇతర సమాజాల్లో, సమాజంలోని ఇతర రంగాలలో అస్తిత్వ చర్చకు కొత్త కోణాలను అందిస్తుంది. ఈ సమయంలోనే తనలో తానైన వర్గం, తన కోసం తానైన వర్గంగా పరివర్తన ఎలా జరుగుతుందో మార్క్స్, ఎంగెల్స్, లెనిన్ లు చేసిన చర్చ కూడ ఉపయోగపడుతుంది.

అలాగే జనతన సర్కార్ నాయకత్వంలో జరుగుతున్న పనుల గురించి కొన్ని వ్యతిరేక వ్యాఖ్యలను అర్థం చేసుకోవడానికి అవసరమైన చర్చ కూడ ఈ పుస్తకంలో ఉంది. అక్కడ జరుగుతున్న అభివృద్ధి కార్యక్రమాలు స్వచ్ఛంద సంస్థలు చేసే లాంటివేననీ, ప్రభుత్వ అభివృద్ధి కార్యక్రమాలను మావోయిస్టులు అడ్డుకుంటున్నారనీ, ఆదివాసులకు స్వయం పాలనా వ్యవస్థలు ఇదివరకే ఉన్నాయనీ, మావోయిస్టుల 'జనతన సర్కార్' కూడ పైనుంచి రుద్దినదేననీ ఈ విమర్శలు ఎన్నో వైపుల నుంచి వస్తున్నాయి. జనతన సర్కార్ పనితీరు గురించీ, దానిమీద ప్రజల అభిప్రాయాల గురించీ, అభివృద్ధి కార్యక్రమాల గురించీ ఈ పుస్తకంలో చేసిన పరిశీలనలను ఈ చర్చల నేపథ్యంలో చూడడం ఆసక్తికరంగా ఉంటుంది. సహజమైన ఆదివాసి స్వయంపాలనకూ శాస్త్రీయమైన జనతన సర్కార్ స్వయంపాలనకూ మధ్య పోలికలూ తేడాల గురించి ఈ పుస్తకం చర్చిస్తుంది. భూపంపిణీ, అందులో అవసరమైన మార్పులు, సహకార

సంఘాలు, సహకార వ్యవసాయం, చేపల పెంపకం, నీటిపారుదల వ్యవస్థల నిర్మాణం, విద్య, చైతన్యీకరణ, ప్రయోగం వంటి వాటి ద్వారా ఉత్పత్తి శక్తుల అభివృద్ధి, ఉత్పత్తి సంబంధాలలో మార్పులు ఎట్లా జరుగుతున్నాయో వివరిస్తుంది. ఆ పరివర్తనను సుస్థిరం చేసేందుకు, ప్రజా చైతన్యంలో భాగం చేసేందుకు పాత అధికార వ్యవస్థ స్థానంలో కొత్త అధికార వ్యవస్థ ఎట్లా నిర్మాణమవుతున్నదో, ఎట్లా పనిచేస్తున్నదో వివరిస్తుంది.

"ఆదివాసి సమాజంలో వ్యవస్థలు, వాటి విడివిడి పాత్రలు, నిర్వహణ సహజంగానే కొంచెం బరువైన వ్యవహారం. ఎక్కడ ఏ విభాగం పాత్ర మొదలై ఎక్కడ ముగిసేదీ బూర్జువా వ్యవస్థలో ఓ లెక్క ఉంటుంది. ప్రత్యామ్నాయ వ్యవస్థలో కూడా ఈ లక్షణం ఉండాలి" అని ఒక నిర్మాణాత్మక కృషిలో, సమష్టి కృషిలో, పాలనలో ఉండవలసిన బాధ్యతల విభజన స్పష్టత గురించి ఈ పుస్తకం కీలకమైన వ్యాఖ్య చేస్తుంది.

సామాజిక ఉత్పత్తిలో మిగులు ఉండవలసిన అవసరం, ఆ మిగులు వ్యక్తిగత ఆస్తిగా మారకుండా చూసే ఉత్పత్తి విధానం, పాలక విధానం గురించి కూడ ఈ పుస్తకం ఆలోచనాస్ఫోరకమైన చర్చ చేస్తుంది. "దాచుకోవడం తెలియకపోవడం, సొంత ఆస్తి లేని జీవన మూలాల నుంచి వచ్చినవాళ్లు కావడం వల్ల...ఇప్పుడు ఎన్నో మార్పులు వచ్చినా...నిల్వ చేసుకొనే పద్ధతులు అలవాటు చేసుకోలేకపోతున్నారు. ఇలాంటి విలక్షణ వ్యక్తిత్వం ఉన్న ఆదివాసులు స్వయంసమృద్ధమైన అభివృద్ధి నమూనాలో పూర్తి స్థాయిలో భాగం కావాల్సే ఉన్నది. మిగులు కూడా ఉండగల అభివృద్ధికర వ్యవసాయం, అనుబంధంగా కుటీరపరిశ్రమలు జమిలిగా సాగగల ఉత్పత్తి వ్యవస్థను వాళ్లు పూర్తిస్థాయిలో రూపొందించాల్సే ఉన్నది. ఆదివాసులు తమ సంప్రదాయక జీవన మూలాల నుండి బైటికి వచ్చినప్పుడే ఇది సాధ్యమవుతుంది. అది ఒకరకంగా దండకారణ్యం విముక్తి ప్రాంతం కావడానికి అతి ముఖ్యమైన రాజకీయార్థిక షరతు" అనే లోతైన నిర్ధారణను ఈ పుస్తకం ఇస్తుంది. దీనికి కొనసాగింపుగానే ఈ నిర్మాణాల విస్తరణ ఎంతవరకు సాధ్యమనే చర్చనూ, మార్కెట్ల ప్రవేశం గురించిన చర్చనూ కూడ చేస్తుంది. ఆ క్రమంలో వర్గేతర ధోరణులు చొరబడే అవకాశాల గురించి కూడ చర్చిస్తుంది.

పైన చెప్పినవాటిలో కూడ కొన్ని అంశాలలో మరికొంత వివరణ, చర్చ అవసరం ఉంది గాని, పూర్తిగా అటువంటి వివరమైన చర్చకు అవకాశం ఉన్న కొన్ని అంశాల గురించి ప్రత్యేకంగా చెప్పుకోవాలి.

"ఆదివాసులంటే ఎవరు అనే ప్రశ్నకు కళాకారులు అని సమాధానం చెప్పుకోవచ్చు...అందువల్లనే ఆదివాసులు కేంద్రంగా సాగుతున్న దండకారణ్య మావోయిస్టు ఉద్యమం ఏకకాలంలో సాయుధమూ సాంస్కృతికమూ." (పే. 70) "దండకారణ్య పరివర్తనలో విప్లవ సాంస్కృతిక వికాసం అతి ముఖ్యమైనది. దాన్ని విస్మరించి అక్కడి నూతన వ్యవస్థలను, అధికార నిర్మాణాలను, పాలనా విధానాలను చర్చిస్తే అసమగ్రం అవుతుంది. ఆదివాసులు అనేక పాత రివాజుల నుంచి కొత్త రివాజుల్లోకి, విప్లవ సంప్రదాయాల్లోకి ప్రవేశిస్తున్నారు" (పే. 77) అనే వ్యాఖ్యలు మరింత వివరమైన, లోతైన చర్చకు అవకాశం ఇస్తాయి. తాము నాయకత్వం వహిస్తున్న ప్రజా సమూహాలతో సాంస్కృతికంగా మమేకం కాకపోయినందువల్లనే, ఎంతో సమరశీలత, చిత్తశుద్ధి ఉండిన సాయుధ నాయకత్వాలు విఫలమైన ఉదాహరణలు ప్రపంచ చరిత్రలో ఉన్నాయి. ఏకకాలంలో సాయుధం, సాంస్కృతికం కావడం, విప్లవ సాంస్కృతిక వికాసం పరివర్తనలో భాగం కావడం అనేవి వాటికవిగా ఒక పుస్తకంగా చర్చించదగిన విశిష్ట లక్షణాలు.

అలాగే సంవిధానానికీ, పరిశోధనా పద్ధతికీ సంబంధించిన ప్రశ్నలెన్నిటినో కూడ ఈ పుస్తకం అనేకచోట్ల లేవనెత్తింది. రూప సారాల చర్చ (పే. 90-93), వస్తువులో సరళత ? క్లిష్టత, పరిశోధనా పద్ధతి చర్చ (పే. 314) ఇంకా వివరంగా, స్పష్టంగా ఉండవలసి ఉంది.

**కొన్ని చర్చనీయాంశాలు**

పుస్తకంలో ఇలా అద్భుతమైన సమాచారం, పరిశీలనలు, ఆలోచనాస్ఫోరకమైన చర్చలు అసంఖ్యాకంగా ఉన్నప్పటికీ, కొన్ని వివాదాస్పదమైన చర్చనీయాంశాలు, ఇటువంటి పుస్తకంలో ఉండకపోతే బాగుండుననిపించే పొరపాటు అవగాహనలు కూడ ఉన్నాయి. "ఇందులో మావోయిస్టు ఉద్యమం అంగీకరించేవే గాక చర్చించే అంశాలు కూడా కొన్ని ఉండవచ్చు. అవి కూడా మార్క్సిస్టు ఆలోచనా ధారలో భాగమే" (పే. 35) అని రచయితే చెప్పుకున్నారు గనుక వాటిని కూడ చర్చించవలసి ఉంది. వాటిలో ముఖ్యమైనవి మూడు: ఒకటి, పదజాలంలో, ఉటంకింపులలో అజాగ్రత్త. రెండు, ఈ పుస్తక వస్తువుకు మూలమైన నక్సల్బరీ ఆలోచనలకు భిన్నమైన ఆలోచనలను అలవోకగా ప్రకటించడం. మూడు, మావోయిజం మీదనే అనుమానం కలిగే వ్యాఖ్యలు. వీటిలో మొదటివి బహుశా పొరపాట్లు కావచ్చు. అవి సరిచేసుకోవడం సాధ్యం కావచ్చు. కాని మరో రెండు చర్చించ వలసినవే అయినా ఇటువంటి పుస్తకానికి సమన్వయించనివి. వాటిమీదనే ప్రత్యేకంగా జరగవలసిన చర్చను దండకారణ్య విప్లవోద్యమ అనుభవం మధ్యలోకి తేవడం గందరగోళానికి దారితీస్తుంది.

రచయిత గాని, ఈ పుస్తకానికి కారణమైన ఉద్యమం గాని భారతదేశానికి స్వాతంత్ర్యం రాలేదని, ఇది 1947 ఆగస్ట్ లో వలస నుంచి అర్ధవలసగా మారిందని నమ్ముతున్నప్పుడు, భారత ప్రజా విముక్తి పోరాటం చేస్తున్నప్పుడు "భారత స్వాతంత్ర్యానంతరం" (పే. 54) అనడం పొరపాటు. అలాగే, బూర్జువా పాలకవర్గం "భారత మార్కెట్ అవసరాలు తీర్చగలిగే శక్తి సొంతంగా లేకపోవడంతో బైటి దేశాలపై ఆధారపడక తప్పలేదు. ఆమేరకు సామ్రాజ్యవాదానికి లోబడక తప్పలేదు.... సామ్రాజ్యవాద దేశాల మధ్య ఉన్న వైరుధ్యాలను భారత బూర్జువా వర్గం తెలివిగా వాడుకున్నది" (పే. 425) అనడం కూడ భారత పాలకవర్గాల నిజస్వభావానికి భిన్నమైన అంచనాలే. ఆదివాసి సమాజంలో సొంత ఆస్తి భావనలు, మిగులు నిల్వ భావనలు లేవని ఒకవైపు చెపుతూనే, మరొకవైపు "ఆదివాసులకు సొంత భూమి అంటే చాలా మమకారం" (పే. 445) అనడం కూడ ఈ అజాగ్రత్తకు చిహ్నమే.

అలాగే భారత ప్రజా ఉద్యమాల చరిత్ర వివరణలో తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటం గురించి పుచ్చలపల్లి సుందరయ్య, దేవులపల్లి వెంకటేశ్వరరావుల అంచనాలు మాత్రమే ఉటంకించడం (పే. 276-77) ఇటువంటి పుస్తకానికి తగదు. వారి అంచనాలు ఉటంకించినా, వారి అంచనాలపైన, అసలు తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటం పైన ఈ పుస్తకానికి మూలమైన నక్సల్బరీ పంథా అంచనాలు ఇవ్వడం సరిగ్గా ఉండేది.

ముందుమాట గురించి ఇక్కడ ప్రస్తావించనక్కరలేదు గాని ఇటువంటి అజాగ్రత్తే అక్కడ కూడ ఒకచోట వచ్చిందని చెప్పకతప్పదు. 'దండకారణ్య నిర్మాణ చిత్తరువు' అని కా. ప్రతాప్ రాసిన అద్భుతమైన ముందుమాటలో 'నయా ఉదారవాద' అనే మాట రెండుసార్లు పంటికింద రాయిలా తగులుతుంది. పాశ్చాత్య మార్క్సిస్టు, మార్క్సిస్టేతర పరిశీలకులు వాడుతున్న, సిపిఐ, సిపిఎం మేధావులు నిరభ్యంతరంగా కొనసాగిస్తున్న 'నయాఉదారవాద' అనే మాటను లోతుగా ఆలోచించవలసి ఉంది. 'ప్రపంచీకరణ అనే తటస్థమైన మాట తప్పు, దాన్ని సామ్రాజ్యవాదపు దుష్టత్వాన్ని కనబడకుండా చేయడానికి ప్రచారంలోకి తెచ్చారు. దాని బదులు సామ్రాజ్యవాద ప్రపంచీకరణ అనే వాడాలి' అని నిశితంగా వ్యాఖ్యానించిన జేమ్స్ పెట్రాస్ కూడ 'నయా ఉదారవాదం' అనే మాట వాడాడు. కాని రాజ్యం వైదొలగాలనీ, మార్కెట్ శక్తుల చలనానికి ఉదారంగా వీలు కల్పించాలనీ అనేది పద్దెనిమిదో శతాబ్ది ఉదారవాదం అయితే, దాన్ని తోసివేసి కీన్స్ రాజ్య ప్రాధాన్య సంక్షేమవాదం వచ్చిందని, 1980ల తర్వాత మళ్లీ దాన్ని తోసేసి మార్కెట్ శక్తుల విజృంభణకు

వీలుకల్పించే 'నయా ఉదారవాదం' రాజ్యమేలుతున్నదనీ పరిశీలకులు అంటున్నారు. నిజానికి తొలి ఉదారవాదమైనా, ప్రస్తుత నయా ఉదారవాదమైనా మార్కెట్ శక్తులకే తప్ప ప్రజలకు కాదు. ప్రజలవైపు నుంచి చూసినప్పుడు ఆ మాట వాడడం అది ఏదో ఉదారమైనదని పొరపాటు పడడానికే దారి తీస్తుంది.

ఇక ఇంతకన్న తీవ్రమైన సమస్యలు భారత సమాజ స్వభావం గురించి, ఉత్పత్తి విధానం గురించి, ఆ ఉత్పత్తి విధాన నిర్ధారణ వల్ల రూపొందే విప్లవ దశ గురించి పుస్తకంలో ప్రస్తావనకు వచ్చిన అంశాలు. ఒకవైపేమో ఈ పుస్తకం, భారత సమాజం అర్ధవలస అర్ధభూస్వామ్య స్థితిలో ఉన్నదని, అందువల్ల ఇక్కడి విప్లవ దశ నూతన ప్రజాస్వామిక విప్లవ దశ అని నిర్వచించుకుని సాగుతున్న విప్లవం గురించి రాసినది కాగా, మరొకవైపు దాదాపు యాభై పేజీల పాటు సమాజ స్వభావం గురించి, ఉత్పత్తి విధానం గురించి, విప్లవ దశ గురించి అనుమానాలకు దారితీసేలా చర్చ సాగింది. అవసరమైన సందర్భాలలో కూడ నూతన ప్రజాస్వామిక విప్లవం ప్రస్తావనే లేకుండా "సోషలిస్టు పారిశ్రామిక వ్యవస్థ నిర్మాణం" గురించి మాట్లాడడం, 426–436 పేజీల్లో చర్చలో నూతన ప్రజాస్వామిక విప్లవం పాత్రను తగ్గించి చెప్పడం, అర్ధవలస అర్ధభూస్వామ్య సూత్రీకరణ గురించి అసమగ్రమైన వివరణ ఇవ్వడం, పెట్టుబడి ప్రవేశానికీ పెట్టుబడిదారీ సంబంధాల ప్రవేశానికీ తేడా గుర్తించకుండా బైటి సమాజంలో పెట్టుబడిదారీ విధానం ఉన్నట్టూ, ఆదివాసి ప్రాంతాలలోకి కూడ పెట్టుబడిదారీ విధానం ప్రవేశిస్తున్నట్టూ ప్రత్యక్షంగానో, పరోక్షంగానో వ్యాఖ్యలు చేయడం వంటి ఎన్నో అంశాలు పుస్తకపు మౌలిక లక్ష్యానికే భిన్నమైన దిశలో ఉన్నాయి. ఒక సమాజంలో అనేక రకాల ఉత్పత్తి విధానాలు ఉంటాయని సరైన అంశం చెపుతూనే ప్రధాన, మౌలిక ఉత్పత్తి విధానం ఏమిటో చెప్పకపోవడం జరిగింది. ఏ వస్తువులోనైనా ఏకకాలంలో అనేక వైరుధ్యాలు ఉండడం అసహజమేమీ కాదు. కాని వాటిలో ప్రధాన వైరుధ్యమేదో, ఏ వైరుధ్య పరిష్కారం మిగిలిన వైరుధ్యాల పరిష్కారానికి మార్గం సుగమం చేస్తుందో గుర్తించవలసి ఉంటుందని మావో ఎన్నెన్నో రంగాల, ఎన్నెన్నో స్థాయిల వైరుధ్యాల గురించి వివరిస్తూ సూత్రీకరించాడు.

ఆ వెలుగులోనే భారత రాజ్య స్వభావం, సమాజ స్వభావం, ప్రధాన వైరుధ్యం, విప్లవ దశల గురించి చర్చలు జరిగాయి, జరుగుతున్నాయి. దేశ కమ్యూనిస్టు ఉద్యమ చరిత్రలో అసలు విప్లవ పరివర్తన గురించీ, రాజ్యాధికారం గురించీ ఆలోచనే లేని మొదటి రెండున్నర దశాబ్దాలు గడిచాక, రష్యా మార్గమా, చైనా మార్గమా అనే విచికిత్స ప్రారంభమైంది. నక్సల్బరీ నాటికి చైనా మార్గం అనే దాని మీద ఊనిక పెరిగింది. మితవాద తప్పును సరిచేసే క్రమంలో అతివాద తప్పు కూడ జరిగి 'చైనా ఛైర్మన్ మా ఛైర్మన్' అని గుడ్డి అనుకరణ కూడ వ్యక్తమయింది. కాని చైనా సమాజం గురించి మావో చేసిన విశ్లేషణ వెలుగులోనే అయినా భారత సమాజపు నిర్దిష్ట స్థితి గురించి, ఈ సమాజంలో జరగవలసిన విప్లవం గురించి అదే సమయంలో అధ్యయనం, సూత్రీకరణలు జరిగాయి.

భారతదేశంలో ఉన్నది పెట్టుబడిదారీ విధానమేనని, దాన్ని అధ్యయనం చేసే శ్రద్ధలేని, అధ్యయనం చేయని మార్క్సిస్టులు చైనాను గుడ్డిగా యథాతథంగా అనుకరిస్తూ అర్ధ భూస్వామ్య సూత్రీకరణ చేశారని అర్థశాస్త్రవేత్త అశోక్ రుద్రా 1970ల్లోనే ఒక ఆరోపణ చేశారు. ఇప్పుడు ఈ పుస్తకంలో కూడ చారు మజుందార్ ఎనిమిది డాక్యుమెంట్లలోనే భారత విప్లవానికి చైనా కార్యక్రమాన్ని ప్రకటించాడనీ, అందువల్ల, భారత సమాజ స్వభావం గురించి, "నిర్దిష్ట అధ్యయనం చేయవలసిన అవసరం లేకుండా పోయింది" అనీ, "ప్రత్యేకంగా విశ్లేషణ అవసరం లేకపోయింది" అనీ (పే. 366) అశోక్ రుద్రా ఆరోపణ పునరుక్తం కావడం విచారకరం మాత్రమే కాదు, అవాస్తవం, అచారిత్రకం, నక్సల్బరీ గుణాత్మక మార్పును చిన్నచూపు చూడడం. భారత సమాజం అర్ధ భూస్వామ్యమని సూత్రీకరించడానికి, ఆ సూత్రీకరణను బలపరచుకోవడానికి నక్సల్బరీ పంథా 1967 నుంచి ఇప్పటికి ఎన్నో నిర్దిష్ట అధ్యయనాలు, ప్రత్యేక విశ్లేషణలు చేసింది.

"అన్ని సమాజాల్లో చారిత్రకంగా బూర్జువా వర్గం నిర్వహించిన పాత్రే భారత బూర్జువా వర్గానికి కూడా ఉంటుంది. ఒక వర్గంగా అస్తిత్వంలో ఉంటూ తన సొంత ప్రయోజనాలను నెరవేర్చుకుంటుంది. దళారీ స్వభావం వల్ల దాని మౌలిక వర్గ లక్షణమైన బూర్జువా స్వభావం లుప్తమైపోదు. కాకపోగా దళారీ లక్షణం దాని బూర్జువా స్వభావంలో భాగంగా ఉంటుంది. అందువల్ల దాని నాయకత్వంలో జరిగే దోపిడీ బూర్జువా దోపిడీ కాకుండాపోదు. అది బూర్జువా వ్యవస్థ కాకుండా పోదు" (పే. 398) అనే మాటల్లో కూడ చర్చనీయమైనది చాల ఉంది. చారిత్రకంగా బూర్జువావర్గానికి ఒకే పాత్ర లేదు. వర్తక, పారిశ్రామిక పెట్టుబడి కాలంలో, యూరప్ లో బూర్జువా ప్రజాస్వామిక విప్లవాల కాలంలో అది భూస్వామ్య వ్యతిరేక పాత్రను నిర్వహించింది. ద్రవ్య, గుత్త పెట్టుబడి దశలోకి, సామ్రాజ్యవాదంలోకి ప్రవేశించినతర్వాత అది భూస్వామ్యంతో, వలస, అర్ధవలస దేశాల స్థానిక అభివృద్ధి నిరోధక పాలకవర్గాలతో మిలాఖత్తు పాత్రను నిర్వహిస్తున్నది. తొలిరోజుల స్వేచ్ఛా వాణిజ్య పోటీ నినాదాన్ని వదులుకుని గుత్తాధిపత్యానికి చేరింది గనుక ఆయా సమాజాల్లో దళారీలను మాత్రమే ఎదగనిచ్చింది. పోటీ రాగల స్థానిక బూర్జువా వర్గాన్ని తనకు లోబరచుకున్నది. ఆయా సమాజాల్లో భూస్వామ్యాన్నే తన సామాజిక పునాదిగా పెట్టుకుని ఆర్థిక దోపిడీ కొనసాగిస్తున్నది. అందువల్ల ఆ సామ్రాజ్యవాద–స్థానిక దళారీ బూర్జువావర్గం తొలిరోజుల్లో లాగ భూస్వామ్య వ్యతిరేక ప్రజాస్వామిక విప్లవానికి నాయకత్వం వహించలేని స్థితికి చేరింది. భారతదేశంలో ఇవాళ అది ఆ స్థితిలోనే ఉన్నది. భూస్వామ్యంతో అంటకాగుతున్న, భూస్వామ్యాన్ని రద్దు చేయడానికి కనీస ప్రయత్నం చేయని బూర్జువా, సామ్రాజ్యవాదానికి దళారీగా ఉండడమే తన పాత్రగా ఉన్న బూర్జువా ఏ స్వభావాన్ని లుప్తం కాకుండా కాపాడుకుంటున్నదని రచయిత అంటున్నారో తెలియదు. ఆ స్వభావాన్ని కాపాడుకుంటున్నట్టయితే, భారత సమాజంలో అరకొరగానైనా, అసంపూర్తిగానైనా అది తేవలసిన భూస్వామ్య వ్యతిరేక ప్రజాస్వామిక విప్లవాన్ని ఎప్పుడు ఎక్కడ తెచ్చిందో తెలియదు.

నూతన ప్రజాస్వామిక భావనను, అర్ధభూస్వామ్య భావనను చిన్నచూపు చూసే వాదనల తార్కిక ఫలితంగా అసలు 'మావో పంథా విశ్వజనీనం కాదు' అనే సూత్రీకరణ దగ్గరికి రచయిత చేరారు. "మావో రచనలను ఇవాళ క్షుణ్ణంగా చదివితే చైనా విప్లవం కోసం తాను రూపొందిస్తున్న పంథా విశ్వజనీనమనే అర్థంలో ఆయన రాయలేదని తెలుస్తుంది" (పే. 394) అనీ, "మావో చైనా వ్యవస్థను విశ్లేషించి తయారు చేసిన సూత్రీకరణలనే చారిత్రక భౌతికవాద పద్ధతి అనుకునే పరిస్థితి ఏమైనా ఉంటుందా? అని అనుమానం" (పే. 396) అనీ రచయిత చేసిన వ్యాఖ్యలు చాల వివరమైన చర్చకు అవకాశం ఇస్తాయి. ఇది సరిగ్గా చైనాలో పెట్టుబడిదారీ పునరుద్ధరణ తర్వాత ప్రకటించిన అంచనాకు, మావో ఆలోచనా విధానం విశ్వజనీనం కాదనీ, అది మార్క్సిజాన్ని చైనీకరణ చేయడం మాత్రమేనని చేసిన అంచనాకు దగ్గరిగా ఉంది. ఆ అభిప్రాయం కూడ ఎవరికైనా ఉండవచ్చు గాని, మరొకదేశంలో మావోయిస్టు ఆచరణ గురించి రాసిన పుస్తకంలో, మావో ఆలోచనలు చైనాకు మాత్రమే వర్తిస్తాయని అనడం ఆశ్చర్యకరం.

ఈ చర్చనీయాంశాలు ఉన్నప్పటికీ, ముందే చెప్పినట్టు ఈ పుస్తకం ఒక కొనసాగుతున్న వర్గపోరాటాన్ని అర్థం చేసుకోవడంలో, వివరించడంలో, దానికన్న ముఖ్యంగా ఒక బీజరూప ప్రత్యామ్నాయ ప్రజా రాజ్యాధికార వ్యవస్థ పనితీరును అర్థం చేసుకోవడంలో చాల ఉపయోగకరమైన, అత్యంత కీలకమైన పుస్తకం. భారత సమాజ పరివర్తన గురించి ఆలోచించేవారందరూ తప్పనిసరిగా చదవవలసిన, చర్చించవలసిన పుస్తకం.

*(రచయిత వీక్షణం సంపాదకులు)* వీ

# మళ్లీ అదే ప్రశ్న: పరిచయం చేసింది మార్క్సునేనా?

- ఇ.ఎస్. బ్రహ్మచారి

**"మార్క్సే** నా గురువు" అని ప్రకటించే రంగనాయకమ్మ, కీలకమైన విషయాల్లోనే మార్క్స్ తప్పులు చేశాడని అంటున్నారు. ఒకవైపు "శ్రమ విలువా, శ్రమశక్తి విలువా, అదనపువిలువా, శ్రమదోపిడీ, శ్రామికవర్గం, దోపిడీ వర్గం, స్వతంత్ర ఉత్పత్తిదారుల సంబంధాలూ, యజమానీ శ్రామిక సంబంధాలూ – ఇలా ఈ పేర్లూ, ఈ విషయాలూ అన్నిటినీ కొత్తగా చెప్పింది మార్క్సే. ఆయన వివరించి చెబితేనే, దోపిడీ రహస్యం, సమాజానికి తెలిసింది" అని అంటూనే (వీక్షణం, 2013 జూన్, పే.54), మరొకవైపు, ఊహాత్మక సంభాషణలో "మార్క్స్ శిష్యుడిని" అని చెప్పుకునే కార్మికుడు, పెట్టుబడిదారుడితో "నా శ్రమశక్తిని కొంటున్నానని విర్రవీగకు", "శ్రమశక్తి సరుకు కాదు" అంటాడు. "మార్క్స్ చెప్పింది పొరపాటు'' అంటాడు. 'మార్క్స్ చెప్పింది పెట్టుబడిదారుడికే అనుకూలంగా వున్నది' అనే అభిప్రాయానికి కూడా వచ్చి ఇలా అంటాడు: "శ్రమదోపిడీయే లేదని దోపిడీదారుడు విర్రవీగుతుంటే నోరెత్తలేని స్థితిలో శ్రామికుడు పడిపోయాడంటే, కారణం నా గురువు పొరపాటే"

యజమాని–శ్రామిక సంబంధాన్ని, మార్క్స్ చెప్పినట్టుగా అమ్మే కొనే సంబంధంగా చెప్పకూడదనేది రంగనాయకమ్మ అభిప్రాయం. మార్క్స్ పొరపాటు వల్ల ఫలితం ఏమిటో కూడా ఆమె చెప్పారు: "పెట్టుబడిదారుడు శ్రమశక్తిని కొంటాడనీ, శ్రమశక్తి ఇచ్చే ఉపయోగపువిలువ అతనిదే అనీ ఒకవైపు వాదిస్తూ; ఆ శ్రమశక్తి ద్వారా అదనపువిలువని తీసుకోవడం శ్రమదోపిడీ అవుతుందని ఇంకోవేపు వాదిస్తే, ఆ రెంటికీ ఎలా పొసగుతుంది?" అని ఆమె ప్రశ్నించారు.

ఆ ప్రశ్నకు సమాధానం కాపిటల్‌లో, మార్క్సిస్టు అర్థశాస్త్ర పరిచయాల్లో ఎందులోనయినా దొరుకుతుంది. నా వ్యాసాల్లోనూ ఉంది. కాపిటల్ 1 లో The buying and selling of labour power అనే చాప్టర్ 6 చూస్తే (పే. 164–172) తెలుస్తుంది. ఇంకొంచెం పరిశీలించాలనుకుంటే ఆ భాగం మొత్తం The transformation of money into capital (పే. 145–172) చదవవచ్చు.

పరిచయం ముందుమాటలో 'ఇది ఒరిజినల్ నించి ఎక్కడా భిన్నమైనది కాదు' అని రంగనాయకమ్మ చెప్పుకున్నారు. కాని వాస్తవమేమంటే, మార్క్స్ సిద్ధాంతపు కీలకాంశాలలో సైతం పరిచయం భిన్నంగా ఉంది:

| **మార్క్స్ చెప్పింది** | **రంగనాయకమ్మ చెప్పింది** |
|---|---|
| పెట్టుబడికీ శ్రమశక్తికీ సమాన మారకం | అసమాన మారకం |
| పెట్టుబడికీ శ్రమశక్తికీ మారకం ఉంది | మారకం లేదు |
| శ్రమశక్తి సరుకు | శ్రమశక్తి సరుకు కాదు |

మార్క్స్ ప్రకారం అమ్మేది శ్రమను కాదు, శ్రమశక్తిని. అప్పటికి అర్థశాస్త్రంలో లేని శ్రమశక్తి అనే భావనని ప్రవేశపెట్టాడు మార్క్స్. మారకంలో ఒకవైపు డబ్బుంటే, రెండోవైపున వున్నది శ్రమశక్తి. శ్రమ అని అంతకు ముందువాళ్లు అనుకున్నారు. మార్క్స్ ప్రకారం శ్రమ సరుకు కాదు. ఇది తెలియకపోతే మార్క్స్ సిద్ధాంతంలోని అతి కీలకమైన విషయం తెలియనట్లే.

The profit that the capitalist makes, the surplus-value which he realises, springs precisely from the fact that the labourer has sold to him not labour realised in a commodity, but his labour-power itself as a commodity. (*Theories of Surplus Value*, vol. 1, p. 315)

దీన్ని గురించి వీక్షణంలో వచ్చిన నా వ్యాసాల్లో మార్క్స్ మాటల్లోనే వివరంగా ఉంది. అలాగే సమాన మారకాలు జరుగుతూనే, అదనపు విలువ ఏర్పడి, పెట్టుబడిదారుడి పరమవుతుంది అనే విషయమూ ఉంది.

◆ ◆ ◆

నా వ్యాసం మీద వీక్షణం మే 2016 సంచికలో విమర్శ రాసిన ముగ్గురూ (వి. వెంకట్రావు, లెనిన్ బాబు, మంజరిలక్ష్మి) వీటిని పరిగణనలోకి తీసుకోలేదు. నేను రాసినవి ఎలా తప్పో నిరూపించడానికి ప్రయత్నించలేదు. ఏ ఒక్కరూ కాపిటల్ లో ఉన్నదే 'పరిచయం'లో ఉందని చూపలేదు. మార్క్సు చెప్పినవాటికి వ్యతిరేకమైనవి పరిచయంలో ఉన్నాయి అని నేను చేసిన వాదనను ముట్టుకోలేదు. వెంకట్రావు, లెనిన్ బాబులు రాసినవైతే నా విమర్శలకు జవాబు ఇవ్వడం మాని ఎక్కడెక్కడికో వెళ్లాయి. మంజరిలక్ష్మి నాకు జవాబు ఇస్తున్నట్టుగా కనిపించినప్పటికీ నేను రాసినవాటిలో తప్పులు చూపలేదు. వ్యాసం అర్థం కావట్లేదనీ, రంగనాయకమ్మగారి కొటేషన్లు మాత్రమే అర్థమవుతున్నాయి గాని వ్యాసంలోవి కావడంలేదనీ, ద్వేషం వల్ల రాశాననీ ఏవేవో చెప్పారు.

'రంగనాయకమ్మ పరిచయం చేసింది మార్క్సునేనా?' అనే టైటిల్ పెట్టాల్సినంత అవసరం ఏమొచ్చిందో (తన గొప్పతనాన్ని చూపించుకోవటం కోసం కాకపోతే) నాకయితే అర్థంకావడం లేదు అన్నారు మంజరి లక్ష్మి. అర్థం కావాలంటే, మార్క్స్ కాపిటల్‌నీ రంగనాయకమ్మ పరిచయాన్నీ పక్కపక్కన పెట్టుకొని రెంటినీ పోల్చిచూడాలి.

పోతే, విమర్శించేది గొప్పకోసమా? అలా అనుకుంటే, రంగనాయకమ్మ ఎందరిని విమర్శించలేదు? మార్క్సులోనే తప్పులు ఉన్నాయన్నారు గదా. అవన్నీ గొప్పకోసమే చేశారా? ఊహించుకున్న సంకుచిత ఉద్దేశాల్ని అవతలివారికి అంటగట్టటం ఆరోగ్యకరమైన చర్చా సంప్రదాయం కాదు. ఇక, విమర్శలకు పెట్టే పేర్లు – అవి వ్యాసాలయినా, పుస్తకాలైనా – కొంత ఘాటుగానే వుంటుంటాయి. ఉదాహరణలు అవసరం లేదనుకుంటాను.

◆ ◆ ◆

"ఈ వ్యాసంలో ఇ.ఎస్. బ్రహ్మచారి రాసిన ఉత్పాదక, అనుత్పాదక, స్వతంత్ర శ్రమల గురించి చెప్పినదాని వరకే నేను పరిమితమవుతున్నాను" అని ముందుగానే చెప్పారు మంజరి లక్ష్మి.

అనుత్పాదక శ్రామికుడా, స్వతంత్ర ఉత్పత్తిదారుడా అనే విషయంలో ఇదేదో ఉదాహరణల వ్యవహారం అయినట్లూ, పెద్ద విషయం కానట్లూ మంజరిలక్ష్మి చెబుతున్నారు. ఇది ఉదాహరణల వ్యవహారం కాదు, నిర్వచనాలకు సంబంధించింది. పట్టికను పరిశీలిస్తే ఈ వాస్తవం బయటపడుతుంది.

పట్టికలో ఉన్న మొదటి నాలుగు అంశాలూ నిర్వచనానికి సంబంధించిన తేడాలు. మిగిలినవి వాటిని ఉదాహరణలకు అన్వయిస్తే వచ్చే తేడాలు. తేడా నిర్వచనాల్లోనే ఉంది.

కోటు కుట్టి ఇచ్చిన దర్జీ, పియానో చేసి ఇచ్చిన శ్రామికుడూ అనుత్పాదక శ్రామికులు అన్నాడు మార్క్స్ స్పష్టంగా. కాదు, స్వతంత్ర ఉత్పత్తిదారులు అన్నారు రంగనాయకమ్మ అంతే స్పష్టంగా.

**అనుత్పాదక శ్రమ విషయంలో మార్క్సు కీ, రంగనాయకమ్మకీ తేడాలు ఇవి**

| మార్క్సు చెప్పింది | రంగనాయకమ్మ చెప్పింది |
|---|---|
| ఆదాయంతో మారే శ్రమ అనుత్పాదక శ్రమ | ఆదాయంతో మారడం చూచి అనుత్పాదకశ్రమ అనడం తప్పు |
| ఇంతకుమించి షరతులేవీ లేవు | ఒక ఇంటిలో గానీ, ఒక ఉత్పత్తి స్థలంలో గానీ, ఒక యజమాని కింద జీతానికి పనిచేసే వేతన శ్రామికుడిగా ఉండాలి. అలా కాని వ్యక్తి అనుత్పాదక శ్రామికుడు కాదు |
| స్వతంత్ర ఉత్పత్తిదారుడు సొంత శ్రమతో చేసిన సరుకులు అమ్ముతాడు. శ్రమని అమ్మడు | స్వతంత్ర ఉత్పత్తిదారుడు సరుకుల్ని గానీ, శ్రమని గానీ అమ్ముతాడు. |
| శ్రమని అమ్మేవాడు వేతన శ్రామికుడు, స్వతంత్ర ఉత్పత్తిదారుడు కాదు | శ్రమవిలువ అంతా పొందేవాడు స్వతంత్ర ఉత్పత్తిదారుడు |
| పియానో చేసిచ్చిన శ్రామికుడు అనుత్పాదక శ్రామికుడు | కాదు, స్వతంత్ర ఉత్పత్తిదారుడు |
| ఇంటికి వచ్చి కోటు కుట్టిన జాబింగ్ టైలర్ అనుత్పాదక శ్రామికుడు | కాదు, స్వతంత్ర ఉత్పత్తిదారుడు |
| జాబింగ్ టైలర్, గృహ సేవకుడు ఒకే కోవకి చెందినవారు | ఒకే కోవకి చెందినవారు కారు |

ఎవరు రైటో తేల్చాలంటే, ముందు నిర్వచనాన్ని స్థిరీకరించాలి. మార్క్సు నిర్వచనం: ఆదాయంతో మారకం జరిగే శ్రమ అనుత్పాదక శ్రమ. దాన్నిబట్టి చూస్తే వాళ్లు అనుత్పాదక శ్రామికులే. పరిచయకర్త మార్క్సు నిర్వచనాన్ని అన్వయించి వుంటే వారూ అలాగే అనుత్పాదక శ్రామికులే అని నిర్ధారించక తప్పేది కాదు.

కాని మూలంలో ఉన్న నిర్వచనాన్ని మూలకు నెట్టి, పరిచయకర్త సొంత నిర్వచనాన్ని వర్తింపచేశారు: "ఒక ఇంటిలో గానీ, ఒక ఉత్పత్తి స్థలంలో గానీ, ఒక యజమాని కింద జీతానికి పని చేసే వేతన శ్రామికుడిగా ఉండాలి. అలాకాని వ్యక్తి అనుత్పాదక శ్రామికుడు కాదు'. ఈ నిర్వచనమే సరైనదిగా భావిస్తున్నారు మంజరిలక్ష్మిగారు.

గంటకు ఇంతని తీసుకున్నా వేతన శ్రామికుడే. ఎక్కడ పనివుంటే అక్కడ చేసేవాళ్లూ వేతనశ్రామికులే. ఎన్నిచోట్ల చేశారనే దానికీ, వేతనశ్రామికుడు అవడానికీ సంబంధం లేదు. కూలి తీసుకొని పనిచేసేవాడు అని అర్థం. అలాంటివాని శ్రమ మారకం జరిగింది పెట్టుబడితో అయితే ఉత్పాదక శ్రామికుడవుతాడు. ఆదాయంతో అయితే, అనుత్పాదక శ్రామికుడవుతాడు. శ్రమశక్తిని అమ్ముకోకుండా, సొంతశ్రమతో చేసిన సరుకుల్ని అమ్మేవాడు స్వతంత్ర ఉత్పత్తిదారుడు. ఇదీ మార్క్సు చెప్పింది.

అయితే, అనుత్పాదక శ్రామికుణ్ణి స్వతంత్ర ఉత్పత్తిదారుడుగా చూపడానికి, సొంత నిర్వచనాలని అన్వయించి తాను కావాలనుకున్న ఫలితాల్ని రాబట్టారు రంగనాయకమ్మ అని నా వ్యాసంలో రాశాను. రంగనాయకమ్మ అన్వయించింది మార్క్సు నిర్వచనమే అనాలంటే, వారి నిర్వచనాన్ని మార్క్సు రచనల్లో చూపించాలి – ఇప్పుడైనా, ఎప్పుడైనా. లేదా మార్క్సు నిర్వచనం నుంచి ఈ అన్వయాన్ని రాబట్టాలి. మంజరిలక్ష్మి ఆపని చెయ్యలేదు.

1) అనుత్పాదక శ్రామికుడు అదనపు శ్రమ చేస్తాడు అని ఒకచోటా, చెయ్యడు అని మరొకచోటా చెప్పాడనీ, 2) కోటు కుట్టిన దర్జీని ఒకచోట అనుత్పాదక శ్రామికుడనీ మరొకచోట స్వతంత్ర ఉత్పత్తిదారుడనీ చెప్పాడనీ మార్క్సు చెప్పిన విషయాల్లో వైరుధ్యాలు ఉన్నట్లు చెప్పారు రంగనాయకమ్మగారు.

అలా చెప్పినట్లు మార్క్సు నుంచి ఆధారం చూపలేదు మంజరిలక్ష్మి. పరిచయకర్త చెప్పినదానినే మరొకసారి చెప్పారు, అంతే. ఎన్నిసార్లు చెప్పినా అవి మార్క్సు మాటలు అయిపోవు కదా!

◆ ◆ ◆

"పియానో చేసిన శ్రామికుడు వేతన శ్రామికుడు. చేయించుకున్నవాడు వినియోగదారుడు" అన్నాను. అందులో మంజరిలక్ష్మికి వైరుధ్యం కనపడింది. ఏమంటే, "...వాక్యంలో ఉన్న వైరుధ్యం చూడండి. ఒకరు కనక వేతన శ్రామికుడైతే ఇంకొకరు ఏమవ్వాలి? యజమాని అవ్వాలి కదా! కానీ ఈయన అతన్ని వినియోగదారుడుగానే గుర్తించారు. అంటే వేతన శ్రామికుడు ఏమయి ఉండాలి? స్వతంత్ర ఉత్పత్తిదారుడే అయి ఉండాలి కదా!"

వినియోగదారుడు అన్నాను కాబట్టి, చేసినవాడు స్వతంత్ర ఉత్పత్తిదారుడు అయితీరాలట. ఇదెక్కడి తర్కమో, ఏ గురువు నేర్పిందో!

వేతన శ్రామికుడికీ వినియోగదారుడికీ సంబంధం ఉండదు. వేతన శ్రామికుడికీ స్వతంత్ర ఉత్పత్తిదారుడికీ సంబంధం ఉంటుంది – ఇదీ వారు చెప్పేది. చెప్పడమే కాని, అలా ఎక్కడవుందో ఆధారం చూపరు.

'యజమాని అయినవాడు వినియోగదారుడు కాదు. ఒకచోట యజమాని అని, మరొకచోట వినియోగదారుడు అని అనడం వైరుధ్యం' – అని వారి వాదన. నిజానికి ఆ పదాలు రెండూ పరస్పర వ్యతిరేకాలు కావు. ఎవరైనా ఒక వస్తువుని వినియోగించుకోవాలంటే, ముందుగా దాన్ని సొంతం చేసుకోవాలి. మంచం మార్కెట్లో రెడీగా దొరుకుతుంది. వాడుకోవాలంటే ముందు కొనాలి. అంటే, మొదట కొనుగోలుద్వారా యజమాని, ఆ తర్వాత వినియోగదారుడు.

రెడీమేడ్ మంచాన్ని కొనకుండా, మెటీరియల్ కొని పనివానితో చేయించుకొని వాడుకోవచ్చు. మొదటి సందర్భంలో నేరుగా మంచాన్నే కొన్నాడు. రెండో సందర్భంలో మెటీరియల్ కొని, శ్రామికునికి కూలి ఇచ్చి చేయించుకున్నాడు. కొన్నా, తయారు చేయించుకున్నా అతనికది పడుకోవడానికే, అమ్ముకోవడానికి కాదు. కనక అక్కడ ఖర్చయ్యేది డబ్బు మాత్రమే. ఆ డబ్బును పెట్టుబడి అనడానికి వీలు లేదు. చేసినవానికి ఇంతని కూలీ ఇవ్వాల్సి ఉంటుంది. వడ్రంగి శ్రమ కొన్నవాడి ఆదాయంతో మారకం అవుతుంది. కనక అది అనుత్పాదక శ్రమ. శ్రమను వినియోగించుకున్నది పెట్టుబడి అయితే, ఆ శ్రమ ఉత్పాదక శ్రమ. ఆదాయం అయితే ఆ శ్రమ అనుత్పాదక శ్రమ.

కార్మికుడు కూడా అనుత్పాదక శ్రమ చేయించుకునే సందర్భాలు ఉంటాయి. అప్పుడతడు వినియోగదారుడు. ఆ శ్రమ చేయించుకునే టప్పుడు యజమాని. దాన్ని వాడుకునే వినియోగదారుడైనా, కూలిచ్చి పనిచేయించుకునే యజమాని – కొద్దికాలమే కావచ్చు, అయినా అతని పాత్ర అదే. కావాలనుకున్న వస్తువుని షాపులో కొనీ వినియోగించు కోవచ్చు, తయారు చేయించుకొనీ వినియోగించుకోవచ్చు. తయారు చేసినవాళ్లు, తన పనివాళ్లు కావచ్చు. బయటవాళ్లు కావచ్చు.

"… he himself wears and *consumes* a coat made by his workmen". (అ.వి.సి. 1.295)

ఇక్కడ ఆంత్రపెన్యూర్ టైలర్ తనపనివాళ్లు కుట్టిన కోటుని వేసుకొని కన్జ్యూం చేస్తాడు. అంటే వినియోగదారుడు అవుతాడు.

"The labourer allows the buyer to consume it before he receives payment of the price" (Cap.1. 170

పెట్టుబడిదారుడు కూడా ఒక వినియోగదారుడే. శ్రమశక్తి అనే ఒక విలక్షణమైన సరుకుని 'వినియోగించుకోవటం' ద్వారా అతడు అదనపు విలువ రాబడతాడు. మార్క్స్ చెప్పిన అదనపు విలువ సిద్ధాంతం అదే. పెట్టుబడిదారుడికీ కార్మికునికీ మారకమే లేదన్న 'పరిచయం' ప్రభావంలో ఉన్నంతకాలం ఈవిషయం గుర్తించటం సాధ్యపడదు.

అనుత్పాదకశ్రామికుణ్ణి స్వతంత్ర ఉత్పత్తిదారుడుగా చూపడానికి, వారు ఇలాంటి వాదనలు వినిపించారు. వాటినిప్పుడు పరిశీలించాలి.

◆ ◆ ◆

"ఉత్పత్తి సాధనాలు – శ్రమ పరికరాలూ, ముడి పదార్థాలూ – పెట్టుబడిదారులకు ఉన్నట్లే స్వతంత్ర ఉత్పత్తిదారులకు ఉంటాయి. పెట్టుబడిదారు వేతనశ్రామికుల చేత ఉత్పత్తి చేయిస్తాడు. స్వతంత్ర ఉత్పత్తిదారు తన శ్రమతో ఉత్పత్తి చేస్తాడు – ఇదీ తేడా. వేతనశ్రామికుడికి ఉత్పత్తి సాధనాలు ఉండవు. కనక శ్రమశక్తిని అమ్ముకొని వేతన శ్రామికుడిగా ఉంటాడు. పియానో చేసిన శ్రామికుడు వేతనశ్రామికుడు. చేయించుకున్న వాడు వినియోగదారుడు" అని నేను రాసిన దానిమీద మంజరిలక్ష్మి: "శ్రమ పరికరాలు పియానో తయారు చేసే వ్యక్తి దగ్గరే ఉన్నాయి కదా మరి. దానికి కావలసిన ముడిపదార్థాలు మాత్రమే వినియోగదారుడు తెచ్చుకున్నాడు. అలా కాకుండా వినియోగదారుడు ఇతన్నే స్వతంత్రంగా పియానో ఇంటి దగ్గర తయారుచేసి తెమ్మన్నాడనుకోండి. అప్పుడైతే, అతనైనా దానికి కావలసిన ముడిపదార్థాలను అప్పటికప్పుడు బయట కొని తేవలసిందే కదా. ఇతను కొనే బదులు వినియోగదారుడు కొన్నాడు" అంటున్నారు.

ఆ డబ్బెవరిది? ఎవరి ఆదాయం? ఆ పియానో ఎవరికొరకు? చేసినవాడు అమ్ముకునేదానికా? చేయించుకునేవాడు వాడుకోవడానికా? చేయించుకునేవాడి డబ్బుతో కొనేవవి. అతనే వాడుకుంటాడు, మరొకరికి అమ్మడు. పని మొదలయ్యేటప్పటికే ఆ పియానో అతనిది. మెటీరియల్స్ ఎవరు తెచ్చినా పని మొదలయ్యేటప్పటికి, అవి చేయించుకునేవాని స్వాధీనమవుతాయి. చేసే శ్రమకూడా అంతే.

పరుపులు కుట్టేవాడి దగ్గర సూదీ, దారం, కత్తెరా ఉంటాయి. దూదీ గుడ్డా వినియోగదారుడివి. కుట్టినందుకు కూలీ మాట్లాడుకుంటాడు. అంతేగాని ఆ పరుపుని అమ్మలేడు. అది అతనిది కాదు.

రవ్వల నెక్లెస్ చేసిచ్చినవాడు బంగారం ఇచ్చిన వాడికి చేసిపెడతాడేగాని, పరికరాలున్నంత మాత్రాన నెక్లెస్ అమ్మినట్లా? స్వతంత్ర ఉత్పత్తి దారుడవుతాడా?

ఉత్పత్తి సాధనాలు ఉండడం అంటే, పరికరాలూ, శ్రమ పదార్థాలూ మొత్తం ఉండడం. కొన్ని వుంటే, అతను సరుకులు ఉత్పత్తి చేసి అమ్మలేడు. సొంత శ్రమతో సరుకులు ఉత్పత్తిచేసి, అమ్ముకునేవాడు మాత్రమే స్వతంత్ర ఉత్పత్తిదారుడు.

మంజరిలక్ష్మి మరొక వాదన తెచ్చారు: "పియానోల్ని ఆ ఇంట్లో రోజూ ఒకటి చెయ్యడు. ఇది యజమాని–శ్రామిక సంబంధం కాదు. ఈ శ్రామికుడు స్వతంత్ర ఉత్పత్తిదారుడుగా లెక్కకు రావాలి" (పెట్టుబడి పరిచయం 2008 1.533) అని. ఒకటి చేశాడా, ఎక్కువ చేశాడా అనేదానికీ, చేయించుకున్న వాళ్లతో అతని సంబంధానికి ఏమిటి సంబంధం– చేయించుకున్నంతసేపూ యజమానీ, శ్రామిక సంబంధమే.

ఎన్నిచేసినా, తనకు అమ్ముకునే హక్కున్న సరుకులుగా కాదు. ఇతరుల వాడకంకోసం, వారికి తగినట్లుగా చెప్పినట్లు చేసిపెట్టే వస్తువులు, ఉపయోగపు విలువలు. అతను చెప్పిన మెటీరియల్‌తో, కొలతలతో, ఆకారంతో, అతను చెప్పినట్లు చేస్తాడు. చెప్పినట్లు లేకపోతే సరిచెయ్యమంటే కూడ చేస్తాడు. కనుక అనుత్పాదక శ్రామికుడు.

◆ ◆ ◆

**ఆంత్రపెన్యూర్ – యజమాని**

ఆంత్రపెన్యూర్ అని కాపిటల్ లో ఉంటే, ఆమాటకి యజమాని అని అనువదించారు. ఇది తప్పు అన్నాను. దాన్ని మంజరిలక్ష్మి లెక్కలోకి తీసుకోలేదు. ఆ అనువాదం సరైనదే అనలేదు. అనలేరు కూడా.

ఆ మాటకి అర్థం మార్క్సే చెప్పాడు.

"in the service of a capitalist (an entrepreneur) (అ.వి.సి. 1.147)

ఇక్కడ కాపిటిలిస్ట్ పక్కన బ్రాకెట్లో ఆంత్రపెన్యూర్ అని మార్క్సే రాశాడు.

Agricultural entrepreneurs are in the same position as these [industrial] entrepreneurs. They must similarly get all their advances replaced, along with the profit as shown above. (అ.వి.సి. 1.59)

Agricultural entrepreneur అనీ, industrial entrepreneur అనీ, అతనికి లాభం వచ్చితీరాలి అనీ రాశాడు.

రోసీ (1787–1848) అనే ఆర్థికవేత్త ఆడం స్మిత్‌ని తప్పుబడుతూ ఆ సందర్భంలో ఆంత్రపెన్యూర్ అనేమాట వాడాడు.

ఒక దర్జీ నుంచి రెడీమేడ్ దుస్తులు కొన్నా, మెటీరియల్ ఇచ్చి, వేతనం ఇచ్చి జాబింగ్ టైలర్ చేత కుట్టించుకున్నా ఫలితానికి సంబంధించినంత వరకూ రెండు చర్యలూ పూర్తిగా ఒక్కటే. కనక మొదటిది ఉత్పాదక శ్రమ అని, రెండోది అనుత్పాదక శ్రమ అని ఎవరూ అనరు. కాకపోతే, రెండో సందర్భంలో కోటు కావాలనుకున్న మనిషి తనే ఆంత్రపెన్యూర్‌గా ఉంటాడు అని రోసీ అన్నాడు. జాబింగ్ టైలర్‌ని రోసీ ఉత్పాదక శ్రామికుడన్నాడు.

ఇది తప్పు అని మార్క్స్ విమర్శించాడు: "జాబింగ్ దర్జీతో వేసుకోడానికి కోటు కుట్టించుకున్నప్పుడు, అది నన్ను ఆంత్రపెన్యూర్ చెయ్యదు." (అ.వి.సి 296)

వెంటనే ఎలాగో పోలిక చెబుతాడు:

When I have a coat made for me at home by a jobbing tailor, for me to wear, that no more makes me my own *entrepreneur* (in the sense of an economic category) than it makes the *entrepreneur tailor* an entrepreneur when he himself wears and consumes a coat made by his workmen.

**గృహసేవకుడూ, జాబింగ్ దర్జీ**

ఆంటర్ప్రెనర్ అన్నచోటే, రోసీ గృహ సేవకుడికీ, కోటుకుట్టి ఇచ్చిన జాబింగ్ దర్జీకీ తేడా ఏమీ లేదు అంటాడు.

"Well, from the standpoint of productive forces what difference is there between the jobbing tailor you have brought to your home and your domestic servant? None."

గృహసేవకుడూ, జాబింగ్ దర్జీ ఒకే నిర్ణాయక రూపం కలిగి ఉంటారు. ఇద్దరి శ్రమశక్తినీ కొనేది ఉపయోగపు విలువ కోసమే. గృహ సేవకుడి యజమాని వ్యాపారి (ఆంత్రపెన్యూర్ ) కాదు. అలాగే అతను జాబింగ్ దర్జీని పిలిచి కోటు కుట్టించుకున్నప్పుడు కూడా వ్యాపారి (ఆంత్రపెన్యూర్) కాదు.

ఆంత్రపెన్యూర్‌గా ఉండడని చెప్పాడు. యజమానిగా ఉండడని కాదు. ఆంటర్‌ప్రెనర్ కాని యజమాని ఉంటాడు. కాని యజమాని కాని ఆంటర్‌ప్రెనర్ ఉండడు. యజమాని అని అనువదిస్తే, ప్రతి యజమానీ ఆంత్రపెన్యూర్ అవుతాడు. ఆలెక్కన, గృహయజమానీ ఆంత్రపెన్యూర్ అవుతాడు.

అమ్మి లాభం చేసుకునేందుకు పనివాళ్లతో కోట్లు కుట్టించేవాడు ఆంత్రపెన్యూర్. తొడుక్కోవడానికి కుట్టించుకునే వాడు ఆంత్రపెన్యూర్ కాదు. రోసీ అతన్ని ఆంత్రపెన్యూర్ అన్నాడు. అన్నందుకు రోసీని విషయంలేని వాగుడుకాయ (విండ్ బాగ్) అని గేలి చేశాడు మార్క్స్.

దర్జీకి యజమాని లేడనీ, అందువల్ల అతను అనుత్పాదక శ్రామికుడు కాడనీ వాదన. యజమాని లేడని ఎలా తేల్చారంటే, ఆంత్రపెన్యూర్ అనే మార్క్స్ పదానికి యజమాని అని అనువదించి.

బ్రాడ్ హౌస్ గురించి ఎంగెల్స్ రాస్తూ, ఆ అనువాదకుడు మార్క్స్ చెప్పిందానికి వ్యతిరేకమైన దానిని మార్క్స్ చెప్పినట్లు చేయగల చతురుడని చెప్పాడు. అలాంటిది పరిచయం పేరుతో కూడా చెయ్యవచ్చని రంగనాయకమ్మ నిరూపించారు.

"మొత్తం కొటేషన్ ఇస్తే తెలుస్తుంది" అని మంజరి లక్ష్మి అన్నారు. పూర్తి కొటేషన్ లేకపోతే, అర్థం మారిపోతుందా? అప్పుడు ఆంత్రపెన్యూర్ అనే మాటకి యజమాని అనే అర్థం వస్తుందా? ఒక మాటకి అర్థం తెలుసుకోవటానికి మొత్తం కొటేషన్ కావాలా? ఆమాటకొస్తే, పరిచయం లో ఉన్న కొటేషన్లు ఒక్క తెలుగులోనే ఉన్నాయి. ఇంగ్లిష్‌లో ఇచ్చి, తెలుగు చెయ్యలేదు.

ఎవరైనా తమ వాదనకి అవసరమైన భాగాన్ని మాత్రమే కోట్ చేస్తారు. అలా చెయ్యటం వలన మూలరచయిత భావానికి హాని జరిగిందంటే దానిని అలా అనుకునేవాళ్లు నిరూపించాలి. అంతేగానీ మొత్తం కొటేషన్‌ని ఇంగ్లిష్‌లో ఇచ్చి, దాని అనువాదం కూడా ఇవ్వు, అప్పుడు చూద్దాం – అనటం ఏమిటి?

ఇంకా దీని గురించి రంగనాయకమ్మగారు అన్నది చూడండి: "ఒక పనివాడు అనుత్పాదక శ్రామికుడిగా లెక్కకు రావాలంటే అతను ఒక ఇంటిలోగానీ, ఒక ఉత్పత్తి స్థలంలోగానీ, ఒక యజమాని కింద జీతానికి పనిచేసే వేతన శ్రామికుడిగా ఉండాలి. అలాకాని వ్యక్తి అనుత్పాదక శ్రామికుడు కాదు." రంగనాయకమ్మ విధించిన ఈ షరతును మంజరి లక్ష్మి పరిశీలించ కుండానే అంగీకరించారు. అసలు వారి ధోరణే అది. కాపిటల్‌లో ఉన్నదే 'పరిచయం'లో ఉన్నది అనుకుంటున్నారు. ఇది మార్క్స్ నిర్వచనమా? సొంతదా? అని తేల్చకుండా అదే సరైనదన్నట్లు చెబుతున్నారు. ఇంతకీ మూలం పరిచయమా? కాపిటలా? దేన్నిబట్టి ఏది ఉండాలి? పరిచయాన్ని బట్టి కాపిటల్ ఉండాలని మంజరి లక్ష్మి అనుకుంటున్నట్లున్నారు!

పియానో శ్రామికుడు ఒక పనిస్థలంలో ఒక యజమాని కింద పనిచేయడం లేదు. అలాగే కోటు కుట్టి ఇచ్చిన దర్జీ కూడా అంతే. కనక వీరు అనుత్పాదక శ్రామికులు కారు. సరే. అసలు యజమాని లేడు అని ఎలా తేల్చారు? ఆంత్రపెన్యూర్ అనేమాటని యజమాని అని తప్పుగా అనువదించి.

యజమాని ఉంటే అనుత్పాదక శ్రామికుడు. యజమాని లేకుంటే స్వతంత్ర ఉత్పత్తిదారుడు. ఇదీ వారు చెప్పేది. మార్క్స్ అన్నది యజమాని అని కాదు ఆంత్రపెన్యూర్ అని. లాభం కోసం పనిచేయించుకునేవాడు అని ఆమాటకి అర్థం. ఆ మాటకి బ్రాకెట్లో కాపిటలిస్ట్ అనికూడా మార్క్స్ రాశాడు. కొందరు కుట్టు పనివాళ్లని పెట్టి లాభం పొందేవాడి డబ్బు పెరుగుతుంది. తనే తన పనివాళ్లు కుట్టిన కోటు వాడుకుంటే, డబ్బు పెరగగకపోగా, ఖర్చవుతుంది. కనక ఆ సందర్భంలో ఆంత్రపెన్యూర్ కాడు. తనకింద పనిచేసే వాళ్లకి యజమానిగానే ఉంటాడు. ఇదీ మార్క్స్ చెప్పింది. ఇక గృహ సేవకుడికి ఇంటి మనిషి యజమానే. కాని ఎప్పటికీ అతను (100 మంది సేవకుల్ని పెట్టుకున్నా) ఆంత్రపెన్యూర్ కాడు. ఆ హోదా అతనికి రాదు. అతని డబ్బు ఖర్చవుతుంది. అతను కేవలం యజమాని. అమ్మకానికి దుస్తులు కుట్టించేవాడు (నలుగురు వేతన కార్మికుల్ని పెట్టుకున్నా) ఆంత్రపెన్యూర్ అవుతాడు. అతని డబ్బు పెరుగుతుంది.

"సూత్రాన్ని అన్వయించేటప్పుడు రెండో వైపునుంచి కూడా చూడాలికదా! పియానో తయారు చేసిన వ్యక్తిని స్వతంత్ర ఉత్పత్తిదారుడుగా నిర్ణయించే విషయంలో రంగనాయకమ్మ చేసిన పని అదే" అని మరో సమర్థింపు. 'ఉత్పాదక శ్రమా అనుత్పాదక శ్రమా అనేది శ్రామికుడి వైపునించి చూచి తేల్చేది కాదు' అని మార్క్స్ చెప్పాడు.

రంగనాయకమ్మ చెప్పిందీ అదే: "ఉత్పాదక అనుత్పాదక తేడాలు, ఆ శ్రమల్ని ఉపయోగించుకునే యజమానికి సంబంధించినవే గానీ, ఆ శ్రమల్ని ఇచ్చే శ్రామికులకు సంబంధించినవి కావు" (రంగనాయకమ్మ 1-2010-పే.535)

రంగనాయకమ్మ పైన చెప్పిన యాజమాన్య సిద్ధాంతం కూడా మొదటి వైపు చూస్తే తెలిసేదే కానీ రెండోవైపు కాదు. కాబట్టి తెలిసేదేమిటంటే, రంగనాయకమ్మ యాజమాన్య సిద్ధాంతానికీ లక్ష్మి రెండు చూపుల సిద్ధాంతానికీ కూడా పొసగదని. ఏదో ఒకరకంగా రంగనాయకమ్మని సమర్థించాలనే ఆత్రుతలో లక్ష్మి రంగనాయకమ్మ ఎంతో కొంత స్పష్టంగా చెప్పిన వాటిని కూడా విస్మరిస్తున్నారు.

"మార్క్స్ ఇంటికి వచ్చి కోటు కుట్టి ఇచ్చే శ్రామికుణ్ణి అనుత్పాదక శ్రామికుడిగా గాక, స్వతంత్ర ఉత్పత్తిదారుగానే చెపుతున్నాడు" అనిరంగనాయకమ్మ చెప్పినదాన్ని మంజరి లక్ష్మి ఆమోదిస్తున్నారు. కాని ఆ మాట మార్క్స్ చెప్పలేదు. టైలర్ ఉదాహరణ గురించి మార్క్స్ మూడు చోట్ల చెప్పాడు. ఎక్కడా స్వతంత్ర ఉత్పత్తిదారుడు అని అనలేదు. ప్రతిచోటా అనుత్పాదక శ్రామికుడనే అన్నాడు.

మంజరి లక్ష్మి మార్క్స్ రచనల్ని పరిశీలించకుండా విమర్శ మాత్రం చేశారు. వారు ఎందుకు దీన్ని రాశారో ముందే చెప్పుకున్నారు. ఎందుకంటే "రంగనాయకమ్మ మీద ఇష్టం", "రుణపడి ఉన్న భావాల" గురించి ఆమె స్పష్టంగానే ప్రకటించారు. ఎవరి దగ్గర నుంచి నేర్చుకున్నామో వారిపట్ల ఇటువంటి భావాలు ఉండటం మంచిదే.

కానీ, ఒక విషయం. 'ప్లేటో ప్రేమ పాత్రుడే, కాని సత్యం మరింత ప్రేమ పాత్రమైనది' అని ప్లేటో శిష్యుడైన అరిస్టాటిల్ అన్నాడని ప్రతీతి. అటువంటి దృక్పథం లేనట్లయితే సిద్ధాంత చర్చలలో సత్యాన్వేషణ జరగడం అసాధ్యం. రుణ ప్రకటనలు, మొక్కుబడి చెల్లించుకోవటాలు మాత్రమే మిగులుతాయి. లక్ష్మికి సత్య నిబద్ధత ఉన్నట్లయితే ఆంత్రపెన్యూర్ అంటే అర్థం తెలుసుకునే వారు. ఆ ఒక్క మాటకు అనువాదం సరిగా చెయ్యకపోవడం ఇక్కడ చాలా గందరగోళానికి కారణమైనా, కనీసం ఆ ఒక్క మాటకి అర్థం తెలుసుకునే ప్రయత్నం చెయ్యలేదు! కాపిటల్ లో ఉన్నవే పరిచయంలో ఉన్నాయని పోల్చిచూపే పని పెట్టుకోలేదు. రంగనాయకమ్మ రుణం మాత్రం చెల్లించుకున్నారు!

కనుక, మళ్లీ అదే ప్రశ్న వెయ్యక తప్పడం లేదు: రంగనాయకమ్మ పరిచయం చేసింది మార్క్సునేనా?

*(రచయిత రిటైర్డ్ లెక్చరర్)* వీ

# వీక్షణంను విస్తరించాలన్న రచయితల సమావేశం

గత తొమ్మిది సంవత్సరాలుగా ప్రతి ఏటా జరుగుతున్న వీక్షణం రచయితల వార్షిక సమావేశం జూలై 17, 2016న హైదరాబాద్‌లో వీక్షణం కార్యాలయంలో జరిగింది. తెలంగాణలోని పది జిల్లాల నుంచి వచ్చిన ఇరవై ఐదు మంది రచయితలు వీక్షణంలో వెలువడుతున్న రచనల బాగోగుల గురించీ, రచనల్లో, ప్రజలకు అందుబాటులో వీక్షణం ఇంకా విస్తరించవలసిన అవసరం గురించీ వివరంగా చర్చించారు.

ఈ సమావేశానికి ఎ. నర్సింహారెడ్డి, బి.ఎస్. రాజు, డా. నళిని, కె. సజయ, కె. సురేష్, బి. రామకృష్ణ, కవిని, ఎం. విద్యాభూషణ్, గురిజాల రవీందర్, పిట్టల రవీందర్, ఎనిశెట్టి శంకర్, ఎ. పున్నయ్య, బి. సతీష్, సిఎచ్ శ్రీమన్నారాయణ, నారాయణరాజు, జి. వెంకటేశ్వర్లు, మచ్చ శ్రద్ధానందం, గడీల సుధాకర్ రెడ్డి, సింహాద్రి, పి. ముఖేష్, ఎ. మల్లేశ్, తదితరులు హాజరయ్యారు.

మొట్టమొదట ఆహ్వానితులకు స్వాగతం పలుకుతూ సంపాదకుడు ఎన్. వేణుగోపాల్ సమావేశం జరుగుతున్న జూలై 17 కారంచేడు మృతవీరుల సంస్మరణ దినం అని గుర్తు చేసి, మన సామాజిక చరిత్రలో మైలురాయి వంటి ఆ సంస్మరణ దినాన జరుగుతున్న ఈ సమావేశంలో దోపిడీ పీడనలు లేని సమాజం గురించి ఆలోచించేవారందరికీ ఒక కరదీపికగా వీక్షణంను తీర్చిదిద్దడానికి రచయితలందరూ తోడ్పడాలని కోరాడు. 2007లో వీక్షణం ప్రారంభించిన ఈ వార్షిక సమావేశాల ప్రక్రియలో ఇది ఎనిమిదోది. 2014లో రాష్ట్ర విభజన జరగడంతో 2015 నుంచి రెండు రాష్ట్రాల్లో విడివిడిగా సమావేశాలు నిర్వహించడం మొదలయింది. గతంలో ఈ సమావేశాలకు రచయితలు, పాఠకులు, అభిమానులు, శ్రేయోభిలాషులు అందరూ హాజరై, పత్రికకు సంబంధించిన అన్ని అంశాలు చర్చించేవాళ్లు. ఈసారి ప్రత్యేకంగా రచయితలతో, రాసే ఆసక్తి ఉన్నవారితో, రచయితలు కావాలని వీక్షణం నిర్వాహకులు కోరుకుంటున్నవారితో, పత్రికలోని రచనల గురించి చర్చించడానికి, రచనల ప్రమాణాలను మెరుగుపరచడానికి సమావేశం జరిగింది. అంటే ఇది ప్రధానంగా రచయితలతో సంభాషణ. ఇక్కడ సమాజం వీక్షణం నుంచి ఏమి ఆశిస్తున్నది, వీక్షణం రచయితల నుంచి ఏమి ఆశిస్తున్నది అనే రెండు అంశాల మీద చర్చ జరిగింది. సమాజంలో ప్రజాపక్ష పత్రికలు బలహీనంగా ఉన్న స్థితివల్ల ఎన్నో విషయాలలో గందరగోళం నెలకొని ఉందనీ, అలా పాఠకులు వీక్షణం నుంచి కోరుకుంటున్న విషయాలు పెరుగుతున్నాయనీ, అలాగే సమాజంలో ప్రచారం కావలసిన విలువల గురించి వీక్షణం నిర్వాహకులకు కొన్ని ఆలోచనలు ఉన్నాయనీ సంపాదకుడు వివరించాడు. ప్రధానస్రవంతిలో రాని, అరకొరగా వచ్చే అంశాలు, ప్రధాన స్రవంతిలో వచ్చే అంశాల వెనుక ఉన్న అంశాలు, అసలు ఏ విషయమైనా అర్థం చేసుకోవడానికి అవసరమైన దృక్పథం ఇచ్చే సైద్ధాంతిక వ్యాసాలు అనే మూడు రకాల రచనలకు వీక్షణంలో చోటు ఉంటుందని అన్నాడు.

ఆ తర్వాత దాదాపు మూడు గంటల పాటు జరిగిన చర్చలో ఇరవై రెండు మంది పాల్గొని తమ అభిప్రాయాలు, సూచనలు, సలహాలు చెప్పారు. వాటిలో ప్రధానమైనవి:

- ఎక్కడికక్కడ, కనీసం జిల్లా స్థాయిలో అయినా రచయితల బృందాలు ఏర్పడి, సమష్టి కృషి జరపాలి. స్థానిక సమస్యలను, ప్రజా ఆకాంక్షలను గుర్తించి వాటిని వ్యాసాలుగా మలచాలి.
- పాఠకుల బృందాలు ఏర్పాటు చేసి వీక్షణంను ప్రచారం చేయాలి.
- సమకాలీన విషయాల మీద వ్యాసాలు పెరగాలి.
- అనువాద వ్యాసాలు తగినన్ని ఉండాలి.
- పుస్తక సమీక్షలు, పుస్తక పరిచయాలు ఉండాలి.
- ప్రత్యామ్నాయ దృక్పథం, పత్యామ్నాయ పరిష్కారాలు సూచించే రచనలు పెరగాలి.
- కొన్ని రచనలు తమ స్థాయికి మించి ఉంటున్నాయని పాఠకులు అనుకుంటున్నారు. సులభంగా రాయాలి.
- స్త్రీల సమస్యలకు సంబంధించిన వ్యాసాలు తక్కువగా ఉంటున్నాయి. మహిళా రచయితలు తక్కువగా ఉంటున్నారు.
- పరిశోధనాత్మక, గణాంకాలతో కూడిన, క్షేత్రపరిశీలనా వ్యాసాలు ఎక్కువ రావాలి.
- ఎక్కువ మందికి చేరాలంటే గ్రంథాలయాలకు పంపించే ఏర్పాటు చేయాలి.
- చందాదారులను చేర్పించడానికి, తమ తమ ఊళ్లలో వీక్షణం అమ్మించ డానికి పాఠకులూ, రచయితలూ అందరూ వ్యక్తిగత చొరవ తీసుకోవాలి.
- వివిధ ప్రాంతాలలో స్థానిక అంశాల మీద వీక్షణం ఆధ్వర్యంలో సదస్సులు ఏర్పాటు చేయాలి.
- జిల్లాల్లోని స్థానిక ప్రజా సమస్యలు ప్రధాన స్రవంతి పత్రికల్లో రావడం లేదు. వీక్షణం వాటి మీద కేంద్రీకరించాలి.
- రాష్ట్రంలో ప్రతిపక్షం లేదు. ప్రజలకు కావలసిన సమాచారం అందడం లేదు. వీక్షణం బాధ్యత పెరుగుతున్నది. అది దృష్టిలో ఉంచుకుని రచనలో సేకరణలో, విషయాల విస్తృతిలో, నాణ్యతలో మరింత మెరుగు పరచాలి.
- అణగారినవర్గాల, ఇప్పటికే ప్రధానస్రవంతి నుంచి అవమానాలను, అవహేళనలను, అన్యాయాన్ని ఎదుర్కొంటున్న వర్గాల ఆత్మగౌరవాన్ని దెబ్బతీసే రచనలు వీక్షణంలో రాగూడదు. ట్రాన్స్‌జెండర్స్ మీద రంగనాయకమ్మ గారి వ్యాసం వారిని చాల గాయపరచింది.
- సాంస్కృతిక పరమైన అంశాలు ఉండాలి.
- ఆ నెలలో వచ్చే ముఖ్యమైన రోజుల గురించి సమాచారం ఉండాలి.
- మహిళలు, ఆదివాసులు, దళితులు, మైనారిటీల సమస్యలు వీక్షణంలో ప్రాధాన్యత వహించాలి.
- అంబేద్కర్, మావో ల రచనలు వేయాలి.
- పరిస్థితులు ఆలోచనాపరులకు కూడ అర్థం కానంత వేగంగా మారుతున్నాయి. వాటిని విప్పిచెప్పే పని వీక్షణం చేయాలి.
- ఆయా ఉద్యమాలతో సంబంధం ఉండేవాళ్లతో రచనలు చేయిస్తే, రచనల్లో లోతు, అనుభవ జ్ఞానం పాఠకులకు అందుతాయి.
- కొత్త రచయితలను తయారు చేయాలి. రచనలను మెరుగుపరచడానికి సలహాలు, సూచనలు ఇవ్వాలి.
- పత్రికను పక్ష పత్రికగానో, వారపత్రికగానో మార్చే విషయం ఆలోచించాలి.

ఈ అన్ని అభిప్రాయాలను పరిగణనలోకి తీసుకుంటామని, వాటిలో అమలు చేయగలిగిన సూచనలన్నిటినీ అమలు చేస్తామని చెపుతూ, పత్రికా నిర్వహణలోని సాధకబాధకాలను సంపాదకుడు వివరించాడు. సహాయ సంపాదకుడు వై. రామచంద్రం వందన సమర్పణతో సమావేశం ముగిసింది.

వీ

### లక్షింపేట దళితుల మహాధర్నా

లక్షింపేట దళితుల సమస్యలు పరిష్కరించాలని డిమాండ్ చేస్తూ జూన్ 30న శ్రీకాకుళంలో రాష్ట్ర కార్మికశాఖ మంత్రి కింజరాపు అచ్చెనాయుడు కార్యాలయం వద్ద లక్షింపేట దళితుల ఆత్మగౌరవ పోరాట కమిటీ ఆధ్వర్యాన మహాధర్నా చేపట్టారు. లక్ష్మింపేట దళితుల్ని చంపి నాలుగేళ్లు గడిచినా ప్రభుత్వం బాధితుల కుటుంబాలకు వాగ్దానం చేసిన భూమి ఇవ్వలేదు. దీంతో లక్షింపేట దళితులతో పాటు పలు ప్రాంతాల నుంచి దళిత సంఘాల నాయకులు, కార్యకర్తలు మంత్రి కార్యాలయానికి ర్యాలీగా వెళ్లారు. దీన్ని పోలీసులు అడ్డుకునే ప్రయత్నం చేసినా చివరికి మంత్రి కార్యాలయం వద్దకు చేరుకున్నారు. లక్షింపేట దళితులు కొంతకాలంగా తమ సమస్యను ప్రభుత్వం దృష్టికి తీసుకెళ్లినా పట్టించుకోలేదు, కాబట్టి లక్ష్మింపేట దళితులకు భూమి దక్కేవరకూ పోరాటం ఆగదని వక్తలు తెలిపారు.

### హరితహారం పేరుతో పోడుభూముల ఆక్రమణ

నిజామాబాద్ జిల్లా గాంధారిలో నలభై ఏండ్లుగా సాగుచేసుకుంటున్న భూములను హరితహారం పేరిట సర్కారు మొక్కలు నాటడంతో ఫారెస్టు అధికారులకు, రైతులకు తీవ్ర వాగ్వాదం జరిగింది. జూలై 7న జిల్లా అధికారులు గాంధారి, నేరాల్‌తండాకు మధ్యగల కంపార్ట్‌మెంట్ నెంబర్ 787 భూమిలోని 62.5 ఎకరాల్లో మొక్కలు నాటడం ప్రారంభించారు. పోడు భూముల్లో హరితహారం మొక్కలు నాటుతారని తెలిసినప్పటి నుంచి రైతులు నిరసిస్తూ ఆందోళన చేస్తున్నప్పటికీ అధికారులు పట్టించుకోలేదు. అధికారులు పోలీసులను దింపి దున్నకుండా రైతులను అడ్డుకోవడంతో సిపిఎం జిల్లా కార్యదర్శివర్గ సభ్యులు నూర్జహాన్ తదితరులు ఆందోళనకు దిగారు. ఈ భూములపై రైతులకు హక్కు కల్పించాలని డిమాండ్ చేశారు. సాగులో ఉన్న భూముల్లో మొక్కలు నాటడం రైతుల పొట్టకొట్టడమేనన్నారు

### హేతువాద సంఘం ప్రథమ మహాసభలు

ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘం ప్రథమ మహాసభలు జూలై 9, 10 తేదీల్లో గుంటూరు జిల్లా నరసరావుపేటలోని జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలలో జరిగాయి. ఈ సభలకు ఆంధ్రప్రదేశ్‌లోని వివిధ జిల్లాల నుంచి ప్రతినిధులు హాజరయ్యారు. వక్తలు పెచ్చుమీరుతున్న బాబాలూ, మతాజీలూ, హిందూ పీఠాధిపతులు భూ ఆక్రమణలు చేస్తూ ఆస్తులు కూడబెట్టుతున్నారని తెలిపారు. క్రైస్తవం మాటున జరుగుతున్న అక్రమాలను తెలిపారు. పాలకులు మూఢ నమ్మకాలతో ప్రజలను మభ్యపెడుతూ ఎలా పబ్బం గడుపుతున్నారో, విజ్ఞాన పరిశోధనలను ఎట్లా పూర్వపక్షం చేస్తున్నారో తెలిపారు.

### తెలంగాణలో విద్యాసంస్థల బంద్

తెలంగాణలోని ప్రైవేట్ విద్యాసంస్థల్లోని ఫీజులను నియంత్రించాలని, ప్రభుత్వ విద్యాసంస్థలను బలోపేతం చేయాలని విద్యార్థి సంఘాల ఐక్య కార్యాచరణ కమిటీ (ఎస్ఎఫ్ఐ, ఏఐఎస్ఎఫ్, పిడిఎస్‌యు, ఎఐడిఎస్ఓ, టివివి, పిడిఎస్‌యు (వి) ఎఐఎఫ్‌డిఎస్, ఎఐపిఎస్ఓ) జూలై 14న బంద్‌లో పాల్గొన్నాయి. విద్యా వ్యవస్థలో ఉన్న సమస్యల్ని పరిష్కరించాలని కోరుతూ తెలంగాణ వ్యాప్తంగా ర్యాలీలు, రోడ్లపై బైటాయించడాలు నిర్వహించారు. ఈ కార్యక్రమంలో పాల్గొన్న 300 మంది విద్యార్థి సంఘాల నేతలను పోలీసులు అరెస్టు చేశారు.

### ఎఎన్ఎంల సమ్మె

రాష్ట్ర వైద్య ఆరోగ్య శాఖలో కాంట్రాక్ట్ ప్రాతిపదికన పనిచేస్తున్న రెండో ఎఎన్ఎంలు పదో పిఆర్‌సి ప్రకారం వేతనాలు పెంచి, ఉద్యోగ భద్రత, రెగ్యులరైజ్ చేయాలనే డిమాండ్లతో జూలై 18న సమ్మెలో పాల్గొన్నారు. రాష్ట్రంలో పనిచేస్తున్న 4,221 మంది విధులు బహిష్కరించడంతో గ్రామాల్లో వైద్యం ఆగిపోయింది. రాష్ట్రంలోని 1700 సబ్ సెంటర్లు, 675 పిహెచ్‌సిలు, 142 కమ్యూనిటీ హెల్త్ న్యూట్రిషన్ క్లస్టర్లలో ఎఎన్ఎంల సేవలు ఆగిపోయాయి. వీరు ఆయా గ్రామాల్లో ఇంటింటికి వెళ్లి ప్రజల ఆరోగ్య పరిస్థితిని తెలుసుకొని మందులు సరఫరా చేస్తుంటారు. కేంద్ర రాష్ట్ర ప్రభుత్వ పథకాలను ప్రజలకు వివరిస్తుంటారు.

### అమరుల బంధుమిత్రుల సంఘం సభ

అమరుల బంధుమిత్రుల సంఘం ఆవిర్భావ దినం సందర్భంగా 'ప్రజా ఉద్యమాలపై రాజ్యహింస'కు వ్యతిరేకంగా జూలై 18న హైదరాబాద్‌లోని సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో బహిరంగ సభ నిర్వహించింది. ఈ సభకు రెండు తెలుగు రాష్ట్రాలలోని ఉద్యమంలో ప్రాణాలు కోల్పోయిన కుటుంబ సభ్యులు, బంధుమిత్రులు హాజరయ్యారు. ఈ సభలో వక్తలుగా ప్రొ. జి. ఎన్. సాయిబాబా, వరవరరావు, పాణి, కాకరాల, శాంత, నారాయణరావు, ఢిల్లీ జెఎన్‌యుకు చెందిన హేమ్‌మిశ్రా పాల్గొన్నారు. అమరులంటే విప్లవంలో మరణించిన వారే కాకుండా జాతుల విముక్తి కోసం, ప్రజాతంత్ర హక్కుల కోసం పోరాడిన, కుల నిర్మూలన కోసం పోరాడి చనిపోయిన వారు కూడా అమరులే నన్నారు. ఎబిఎంఎస్ అధ్యక్షురాలు అంజమ్మ అధ్యక్షతన సభ జరిగింది.

### హాస్టళ్ల మూసివేతపై విద్యార్థుల నిరసన

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం సంక్షేమ హాస్టళ్ల మూసివేత నిర్ణయాన్ని విరమించుకోవాలని, విద్యార్థులకు మెస్‌చార్జీలు, స్కాలర్‌షిప్‌లు పెంచాలని కోరుతూ ఎస్ఎఫ్ఐ విద్యార్థి సంఘం ఆధ్వర్యంలో జూలై 20న రాష్ట్ర వ్యాప్తంగా కలెక్టరేట్లను ముట్టడించారు. ఈ ఆందోళనలో పాల్గొన్న విద్యార్థులపై పోలీసులు లాఠీ చార్జీలు చేసి అరెస్టులు చేశారు. ఏలూరు కలెక్టరేట్‌ను ముట్టడించిన విద్యార్థులు లోపలికి వెళ్లేందుకు ప్రయత్నించగా పోలీసులు బారికేడ్లు, ముళ్లకంచెలు ఏర్పాటు చేసిన విద్యార్థులు వాటిని చేదించుకొని ముందుకు వెళ్లారు.

### మల్లన్నసాగర్‌ను వ్యతిరేకిస్తూ ఆందోళనలు

మల్లన్నసాగర్ ప్రాజెక్టు వల్ల ముంపుకు గురయ్యే పద్నాలుగు గ్రామాల ప్రజలు ప్రాజెక్ట్‌ను వ్యతిరేకిస్తూ గత యాభై రోజులుగా ఆందోళనలు చేస్తున్నారు. జూలై 24న ప్రాజెక్ట్‌ను వ్యతిరేకిస్తూ రైతులు, రైతు కూలీలు వందలాదిగా రాజీవ్ రహదారిపై ధర్నా చేపట్టారు. ఈ ధర్నాను విఫలం చేయాలన్న ఉద్దేశంతో పోలీసులు ధర్నాకు వస్తున్న ప్రజలను అడ్డుకునే ప్రయత్నం చేశారు. ప్రజలు తిరగబడడంతో తీవ్ర ఉద్రిక్తతకు దారితీసింది. ప్రజలను చెదరగొట్టడానికి పోలీసులు గాల్లో కాల్పులు జరిపి లాఠీచార్జ్ చేశారు. దీంతో ప్రజలు తిరగబడి పోలీసులపై రాళ్లు విసిరారు. పోలీసులు జరిపిన దాడిలో యాభై మంది వరకు గాయాల పాలయ్యారు. ముంపు గ్రామాల ప్రజలపై పోలీసులు జరిపిన దౌర్జన్యకాండను, లాఠీచార్జ్‌ను వ్యతిరేకిస్తూ ప్రతిపక్ష పార్టీలు జూలై 25న మెదక్ జిల్లా బంద్‌కు పిలుపునిచ్చాయి. వీ

### దళితులపై హిందుత్వ దాడులు

గుజరాత్‌లోని సోమనాథ్ జిల్లాలో జూలై 11న చనిపోయిన ఆవును తరలిస్తున్న నలుగురు దళితులపై శివసేనకు చెందిన సభ్యులు దాడిచేశారు. ఆ నలుగురు బీఫ్‌ను తరలిస్తున్నారని కారుకు కట్టేసి, వారి చొక్కాలను ఊడదీసి, బెల్టులతో, కర్రలతో కొడుతున్న వీడియోను కూడా యు ట్యూబ్‌లో పెట్టారు. తమ వృత్తిలో భాగంగా మృతిచెందిన పశువులను తీసుకెళుతున్న సమయంలో తమపై దాడిచేశారని బాధితులు తెలిపారు. కర్నాటకలోని చిక్‌మగుళూర్ జిల్లా కొప్పా గ్రామంలో ఇంట్లో గో మాంసం ఉందన్న అనుమానంతో జూలై 17న భజరంగ్ కార్యకర్తలు బాల్‌రాజ్ అతని కుటుంబ సభ్యులపై కర్రలతో దాడి చేశారు. ఈ దాడిలో 40 మందివరకు పాల్గొన్నారని కర్నాటక మతసామరస్య ఫోరం ప్రధాన కార్యదర్శి కెఎల్ అశోక్ తెలిపారు.

### అరుణాచల్‌లో కాంగ్రెస్ ప్రభుత్వ పునరుద్ధరణ

అరుణాచల్‌ప్రదేశ్‌లో కాంగ్రెస్ ప్రభుత్వాన్ని పునరుద్ధరిస్తూ సుప్రీంకోర్టు జూలై 13న తీర్పు వెలువరించింది. ప్రభుత్వాన్ని రద్దుచేయడానికి కారణమైన గవర్నర్ నిర్ణయాన్ని కొట్టివేసింది. జస్టిస్ జె.ఎస్. ఖేహర్ నేతృత్వంలోని ఐదుగురు సభ్యుల రాజ్యాంగ ధర్మాసనం ఈ తీర్పు వెల్లడించింది. హిమాచల్ ప్రదేశ్‌లో కాంగ్రెస్‌కు 47 మంది శాసనసభ్యులు ఉండగా అందులో 21 మంది ముఖ్యమంత్రి నబంటుకికి వ్యతిరేకంగా తిరుగుబాటు చేయడంతో సంక్షోభం ఏర్పడింది. కోర్టు తీర్పుతో అరుణాచల్‌ప్రదేశ్ ఇంచార్జ్ గవర్నర్‌గా ఉన్న థతాగథ్ రాయ్ జూలై 17న రాజ్‌భవన్‌లో పెమాఖండూ చేత 9వ ముఖ్యమంత్రిగా ప్రమాణ స్వీకారం చేయించారు.

### మాలిని సుబ్రహ్మణ్యంకు సిపిజె అవార్డు

చత్తీస్‌గఢ్‌కు చెందిన ఫ్రీలాన్స్ జర్నలిస్టు మాలినీ సుబ్రహ్మణ్యంకు 2016కు గాను 'అంతర్జాతీయ పత్రికా స్వేచ్ఛ' అవార్డు దక్కింది. చత్తీస్‌గఢ్‌లో మానవ హక్కుల ఉల్లంఘన, మావోయిస్టులకు, రాష్ట్ర బలగాలకు సంబంధించిన వార్తలను వెలుగులోకి తెచ్చారు. దీంతో ఆమెపై అనేక దాడులు జరిగాయి. విధి నిర్వాహణలో ఆమె ధైర్య సహసాలను గుర్తించిన అంతర్జాతీయ పాత్రికేయుల సంరక్షణ కమిటీ జూలై 18న ఈ అవార్డులను ప్రకటించింది. మాలినితో పాటు మహ్మద్ అబై జీద్ (ఈజిప్టు), కాన్ డ్యూందర్ (టర్కీ), అస్కార్ మార్టినెజ్ (ఎల్ సాల్వెడార్) లు కూడా ఈ అవార్డుకు ఎంపికయ్యారు.

### కశ్మీర్‌లో ఆందోళనలు

జమ్ము కశ్మీర్‌లో పని చేస్తున్న సాయుధ తిరుగుబాటు బృందం హిజ్బుల్ ముజాహిదీన్ కమాండర్ బుర్హాన్ ముజఫర్ వాణిని భారత సైనిక బలగాలు 2016 జూలై 8న చంపివేశాయి. ఆ తర్వాత, జమ్ము కశ్మీర్‌లో, ప్రత్యేకించి కశ్మీర్ లోయలో, పౌరుల మీద రాజ్య బలగాల పెద్దఎత్తున దాడికి దిగాయి. బుర్హాన్ వాణి మృతికి సంతాపం పాటిస్తున్న వారి మీద జరిగిన ఈ దాడుల్లో ఇప్పటికి 43 మంది సాధారణ పౌరులు చనిపోయారు. 1500 మందికి పైగా గాయపడ్డారు. కశ్మీర్‌లోయలో అత్యధిక భాగం చట్టవ్యతిరేకమైన కర్ఫ్యూలో ఉంది. భౌతిక స్వేచ్ఛల మీద, మొబైల్ ఫోన్లు, ఇంటర్నెట్ సహా ఎలక్ట్రానిక్ స్వేచ్ఛల మీద ఆంక్షలు విధించారు. జూలై 15 శుక్రవారం నుంచి రాజధాని శ్రీనగర్ నగరాన్నే చెరసాలగా మార్చారు. మొబైల్ నెట్‌వర్క్ లన్నిటినీ మూసేయించారు. కశ్మీర్‌లోయలోని ప్రధాన వార్తాపత్రికల కార్యాలయాలన్నిటి మీద దాడి చేసి, అచ్చయిన పత్రికలను స్వాధీనం చేసుకున్నారు.

### బీహార్‌లో ఎన్‌కౌంటర్

బీహార్‌లోని ఔరంగాబాద్ – గయా జిల్లాల సరిహద్దుల్లోని దుమారి నాలా అటవి ప్రాంతంలో జూలై 18న జరిగిన ఎన్‌కౌంటర్లో 10 మంది కోబ్రా కమెండోలు మృతిచెందారు. ముగ్గురు మావోయిస్టులు మృతిచెందారు. ఘటన స్థలంలో 17 ఐఇడిలను పోలీసులు స్వాధీనం చేసుకున్నట్లు తెలిపారు. ఆ ప్రాంతంలో సంజీవ్ జీ సారథ్యంలోని దళం సంచరిస్తుందన్న సమాచారంతో ప్రత్యేక దళాలు గాలింపు చర్యలు జరుపుతున్నాయని పోలీసులు తెలిపారు. తమకు అనుకూలంగా ఉండే ప్రాంతానికి పోలీసులు రాగానే మావోయిస్టులు ఐఇడిలను పేల్చి కాల్పులు జరిపారన్నారు. దీంతో ఇరు వర్గాల మధ్య కాల్పులు జరిగి ఈ ఘటనకు దారితీసిందన్నారు.

### జర్నలిస్టులపై పోలీసుల దాడి

మధ్యప్రదేశ్‌లో జర్నలిస్టులపై దాడిచేసిన పోలీసులపై ఎఫ్ఐఆర్ నమోదు చేయాలంటూ జూలై 7న ప్రభుత్వం అధికారులను ఆదేశించింది. హిందీ దిన పత్రికలో పనిచేసే క్రిష్ణమోహన్ తివారీ, విజయ్ ప్రభాత్ శుక్లాలు జూలై 5న విధులు ముగించుకొని ఇంటికి తిరిగివెళ్తుండగా పోలీసులు అడ్డుకుని వారిని నిషేధిత సిమీ కార్యకర్తలంటూ చితకబాదారు. తీవ్రంగా గాయపడి ఆస్పత్రిలో చికిత్స పొందుతున్నారు.

### సాయుధ దళాలకు ప్రత్యేక అధికారాలు తగవు

కల్లోల ప్రాంతాల్లో సాయుధ బలగాల ప్రత్యేక అధికారాల చట్టం కింద సైన్యం విచక్షణాధికారాలను, ప్రత్యేక అధికారాలను ప్రయోగించరాదని జూలై 8న సుప్రీం కోర్టు వెల్లడించింది. మణిపూర్‌లో సైన్యం, పోలీసుల చేతిలో బూటకపు ఎన్‌కౌంటర్లలో మరణించిన బాధితుల కుటుంబ సభ్యులు దాఖలు చేసిన పిటిషన్‌ను విచారిస్తూ జస్టిస్ మదన్ బి. లోకూర్, ఆర్.కె. అగర్వాల్‌లతో కూడిన సుప్రీం బెంచ్ ఈ వ్యాఖ్యలు చేసింది. మణిపూర్‌లో జరిగిన 62 బూటకపు ఎన్‌కౌంటర్ల కేసుల వివరాలతో కూడిన జాబితాను కోర్టు ముందుంచాలని సుప్రీం బెంచ్ పిటిషనర్లను, అమికస్ క్యూరీని ఆదేశించింది. ఆయా కేసుల్లో ఎఫ్ఐఆర్ నమోదైందా? బాధితులను గురించారా? న్యాయ విచారణ జరిగిందా? అనే సమాచారంతో నివేదిక ఉండాలని స్పష్టం చేసింది.

### అఖ్లాక్ కుటుంబ సభ్యులపై కేసు

ఉత్తరప్రదేశ్‌లో ఆవు మాంసం ఇంట్లో ఉంచుకున్నారన్న అనుమానంతో అఖ్యాక్‌ను హత్యచేశారు. ఇప్పుడు అఖ్లాక్ కుటుంబ సభ్యులపై ఎఫ్ఐఆర్ నమోదు చేయాలని స్థానిక కోర్టు జూలై 14న ఆదేశించింది. ఆ గ్రామంలోని ఎదురింటి వ్యక్తి దాఖలు చేసిన పిటిషన్ ఆధారంగా కోర్టు ఈ ఉత్తర్వులను జారీచేసింది. అఖ్లాక్ హత్య అనంతరం వారి ఇంట్లో ఉన్న మాంసాన్ని ఫోరెన్సిక్ పరీక్షకు పంపగా, అది బీఫ్ కాదు మీట్ అని తేలింది.

### ఒడిశాలో బూటకపు ఎన్‌కౌంటర్

ఒడిశాలోని కందమాల్ జిల్లా గుముడుమహా గ్రామ శివారులో జూలై 8న ఐదుగురు ఆదివాసీలను పోలీసులు కాల్చి చంపారు. గ్రామీణ ఉపాధి హామీ పథకం కింద పనిచేస్తున్న దాదాపు పన్నెండు మంది గుముడుమహా గ్రామానికి చెందిన ఆదివాసీ కూలీలు తమకు రావాల్సిన కూలీ డబ్బుల కోసం 40 కిమీ దురంలో ఉన్న బెల్లిగూడకు వెళ్లి ఆటోలో తిరిగి వస్తుండగా ఊరికి దగ్గరలో సాయంత్రం అక్కడే కాపుకాసిన పోలీసు బలగాలు ఒక్కసారిగా కాల్పులు జరపడంతో ఐదుగురు చనిపోయారు. వీరిలో ముగ్గురు మహిళలు, రెండు సంవత్సరాల బాలుడు ఉన్నారు. దీన్ని కప్పిపుచ్చడానికి పోలీసులు మావోయిస్టులతో ఎదురు కాల్పుల్లో మధ్యలో చిక్కుకొని చనిపోయినట్లుగా కట్టుకథ అల్లారు. ఈ దాడిపై న్యాయ విచారణ జరిపించాలని అక్కడ నిజనిర్ధారణ చేసిన పౌరహక్కుల సంఘం సభ్యులు డిమాండ్ చేశారు.

### హైకోర్టు విభజనకై ఢిల్లీలో మహాధర్నా

హైకోర్టు విభజన కోరుతూ తెలంగాణ పది జిల్లాల న్యాయవాదులు ఢిల్లీలోని జంతర్ మంతర్ వద్ద జూలై 25న మహాధర్నా చేశారు. సుమారు 1500 మంది లాయర్లు ఈ ఆందోళనలో పాల్గొన్నారు. హైకోర్టును విభజించి తక్షణమే రెండు రాష్ట్రాలకు వేర్వేరు హైకోర్టును ఏర్పాటు చేయాలని డిమాండ్ చేశారు. ఉమ్మడి హైకోర్టు న్యాయమూర్తి రూపొందించిన ప్రొవిజినల్ లిస్టును ఉపసంహరించుకోవాలని, జడ్జీలపై సస్పెన్షన్ ఎత్తివేయాలని ఈ మహాధర్నాలో తీర్మానాలు ఆమోదించారు. ఈ ఆందోళనకు టిఆర్ఎస్ ఎంపిలు, కాంగ్రెస్, ఆమ్ ఆద్మీ పార్టీ నేతలు సంఘీభావం తెలిపారు. వీ

### ఐస్‌ల్యాండ్ నూతన అధ్యక్షుడు జోహన్సన్

పనామా పత్రాలు బహిర్గతం అవడంతో ఐస్‌ల్యాండ్ అధ్యక్షుడు ఓల్ఫర్ రాగ్నర్ గ్రిమ్సన్ రాజీనామా చేసిన నేపథ్యంలో అధ్యక్ష పదవికి ఎన్నికలు నిర్వహించారు. జూన్ 25న జరిగిన ఈ ఎన్నికల్లో రాజకీయ వ్యాఖ్యాత, చరిత్ర ప్రొఫెసర్ గుడ్ని జోహన్సన్ విజయం సాధించారు. ఆయనకు అనుకూలంగా 39.1 శాతం ఓట్లు వచ్చాయి. ఆయన పోటీదారు మహిళా వ్యాపారవేత్త హల్లా టోమస్‌డాటిర్‌కు 27.9 శాతం ఓట్లు వచ్చాయి. ఈ ఎన్నికల్లో రెండు లక్షల నలభై ఐదు వేల మంది తమ ఓటు హక్కు వినియోగించుకున్నారు.

### ఇస్తాంబుల్ విమానాశ్రయంపై దాడి

టర్కీ రాజధాని ఇస్తాంబుల్‌లోని అటాటర్క్ అంతర్జాతీయ విమానాశ్రయంపై ఐఎస్ తీవ్రవాదులు దాడి చేశారు. జూన్ 29న జరిగిన ఈ దాడిలో 42 మంది మరణించారు. 250 మందికిపైగా గాయపడ్డారు. అంతర్జాతీయ టెర్మినల్ లక్ష్యంగా దాడులు జరిగాయి. విమానాశ్రయం లోపల మూడుచోట్ల ఆత్మాహుతి దాడులు జరిగాయి. భారీ ఆయుధాలతో అంతర్జాతీయ టెర్మినల్ వద్దకు చేరుకున్న ముగ్గురు సాయుధులు విమానాల కోసం ఎదురు చూస్తున్న వందలాది మంది ప్రయాణికులపై విచ్చలవిడిగా కాల్పులు జరిపారు. ఆ తరువాత తమను తాము పేల్చుకున్నారు.

### ఇరాక్‌లో ఐఎస్ స్థావరాలపై వైమానిక దాడులు

ఇరాక్‌లోని ఐఎస్ ఉగ్రవాద సంస్థ స్థావరాలపై అమెరికా సంకీర్ణ సేనలు జూన్ 29న వైమానిక దాడులు జరిపాయి. ఐఎస్‌కు గట్టి పట్టున్న ఫలూజా ప్రాంతంలో జరిగిన ఈ దాడిలో దాదాపు 250 మందికి పైగా ఐఎస్ సభ్యులు మరణించినట్లు అమెరికా రక్షణ అధికారులు ప్రకటించారు. మరోవైపు ఇరాక్ సైన్యం ఫలూజా ప్రాంతాన్ని స్వాధీనం చేసుకున్నట్లు ప్రకటించింది.

### కాబూల్‌లో బాంబు దాడులు

అఫ్ఘనిస్తాన్ రాజధాని కాబూల్‌లో జూన్ 30న జరిగిన బాంబు దాడుల్లో ముప్పై మంది మరణించారు. ఖలా ఈ హైదర్‌ఖాన్ గ్రామ సమీపంలో పోలీసులు శిక్షణ పూర్తిచేసుకుని తిరిగి వెళ్తుండగా తాలిబన్ దళాలు బాంబు దాడి చేయడంతో మృతుల సంఖ్య ఎక్కువగా ఉంది. మరో ఘటనలో జూలై 24న దేమజాంగ్ ప్రాంతంలో అఫ్ఘన్ మైనారిటీ షియా హజారా ముస్లింలు వేలాదిగా ఆందోళన చేస్తున్న ప్రాంతంలో ఆత్మాహుతి దాడులు జరిగాయి. ఈ దాడులో 80 మంది మృతి చెందారు. రెండు వందల మందికిపైగా గాయపడ్డారు. పవర్ ట్రాన్స్‌మిషన్ లైన్ ప్రాజెక్టు నిర్మాణ మార్గాన్ని మార్చాలని ప్రభుత్వాన్ని డిమాండ్ చేస్తూ హజారా ముస్లింలు ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఆందోళన చేస్తున్నారు.

### బంగ్లాదేశ్‌లో దారుణం

బంగ్లాదేశ్ రాజధాని ఢాకాలోని ఒక రెస్టారెంట్‌లోకి ఏడుగురు మంది సాయుధ దుండగులు చొరబడి ఇరవై రెండు మందిని చంపేశారు. జూలై 1న దుండగులు స్థానిక గుల్షన్ ప్రాంతంలో దౌత్య కార్యాలయానికి సమీపంలోని రెస్టారెంట్‌లోకి కాల్పులు జరుపుతూ అందులో ఉన్న వారిని బంధీలుగా చేసుకున్నారు. ముఖ్యంగా విదేశీయులను లక్ష్యంగా ఈ దాడులు జరిపారు. మరణించిన వారిలో ఎక్కువగా ఇటలీకి చెందిన పదిమంది ఉన్నారు. భద్రతా దళాలు దాదాపు పదకొండు గంటల పాటు ప్రత్యేక కమాండో ఆపరేషన్ నిర్వహించి 30 మందిని రక్షించారు. ఎదురు కాల్పుల్లో ఆరుగురు దుండగులు మరణించగా, ఒక్కరిని సజీవంగా పట్టుకున్నారు. ఈ దాడుల్లో ఇద్దరు పోలీసులు మరణించగా, ఇరవై మంది గాయపడ్డారు.

### బాగ్దాద్‌లో మారణకాండ

ఇరాక్ రాజధాని బాగ్దాద్‌లోని కరాదా, అల్‌షాబ్ మార్కెట్ ప్రాంతాలలో బాంబు పేలుళ్లు జరిగాయి. జూలై 3న జరిగిన ఈ దాడిలో 250 మంది మరణించారు. దాదాపు రెండు వందల మందికి పైగా గాయపడ్డారు. రంజాన్ మాసం సందర్భంగా బాగ్దాద్‌లోని రద్దీ వాణిజ్య సముదాయం, ఆదివారం కావడంతో మృతుల సంఖ్య భారీగా ఉంది. ముందుగా కరాదా వద్ద కారులో వచ్చిన వ్యక్తి తనను తాను పేల్చుకుని ఆత్మాహుతికి పాల్పడ్డాడు. మరికొద్ది సేపటికే అల్‌షాబ్ మార్కెట్‌లో మరో పేలుడు సంభవించింది. ఈ దాడికి ఐఎస్ బాధ్యత వహిస్తున్నట్లు తెలిపింది.

### అమెరికాలో నల్లజాతీయుల కాల్చివేత

అమెరికాలో మరోసారి నల్లజాతీయులపై పోలీసులు కాల్పులు జరిపి ఇద్దరిని చంపేశారు. జూలై 5న లూసియానా రాష్ట్రంలోని మిన్నెసోటా నగరంలో ఫిలాండో కాసిన్ అనే వ్యక్తి వద్ద తుపాకి ఉండడాన్ని చూసిన పోలీస్ అధికారి అతని ఛాతిపై కాల్చడంతో మరణించాడు. ఆ సమయంలో కాలిస్‌తో పాటు ఉన్న ఆయన స్నేహితురాలి వీడియోలో రికార్డయింది. మరో ఘటనలో బాటన్ రోగ్ నగరంలో ఆల్టోన్ స్టెర్లింగ్ అనే నల్లజాతి పౌరుడిని ఇద్దరు పోలీసు అధికారులు చిన్న వాగ్వాదం కారణంగా అతన్ని కిందపడేసి అతి దగ్గరి నుంచి కాల్చినట్లు వీడియోలో రికార్డు అయింది. ఈ రెండు ఉదంతాలు ఇంటర్నెట్‌లో వెలుగు చూడడంతో అమెరికా అంతటా పోలీసుల కాల్పులకు నిరసనగా పౌరులు ఆందోళనలు నిర్వహించారు. జూలై 8న డల్లాస్‌లో జరిగిన నిరసన ర్యాలీలో ఆందోళనకారులు కాల్పులు జరపడంతో ఐదుగురు పోలీసు అధికారులు మరణించారు. మరో ఏడుగురు గాయపడ్డారు.

### ఫ్రాన్స్‌లో విషాదం

ఫ్రెంచ్ జాతీయ దినోత్సవం జూలై 14న బాస్టిలీ డే సందర్భంగా నైస్ నగరంలో ప్రజలు ఉత్సవం జరుపుకుంటుండగా ఒక పెద్ద ట్రక్కు సృష్టించిన బీభత్సంలో 84 మంది మరణించారు. వంద మందికి పైగా గాయపడ్డారు. ఎంతో ఉత్సాహంగా ఉత్సవం జరుపుకుంటున్న జనంపైకి ఇరవై ఐదు టన్నుల భారీ ట్రక్కు అతి వేగంగా దూసుకుంటూ వచ్చి, డ్రైవర్ కాల్పులు జరపడంతో మృతుల సంఖ్య ఎక్కువగా ఉంది. ఈ దుర్ఘటనలో పది మంది చిన్నారులు కూడా చనిపోయారు.

### టర్కీలో సైనిక తిరుగుబాటు

టర్కీ సైన్యంలోని ఓ వర్గం తిరుగుబాటుకు ప్రయత్నించింది. జూలై 16న జరిగిన విఫల యత్నంలో రెండు వందల యాభై మందికి పైగా మరణించారు. వెయ్యి మందికి పైగా గాయపడ్డారు. ఈ తిరుగుబాటును ప్రభుత్వ అనుకూల సైన్యం, పోలీసులు తిప్పికొట్టారు. తిరుగుబాటుకు ప్రయత్నించిన మూడు వేల మంది సైనికులను అరెస్టు చేశారు. దేశ అధ్యక్షుడు తయ్యిప్ ఎర్డోగాన్ దేశంలో లేని సమయం చూసి తిరుగుబాటుకు ప్రయత్నించారు. తిరుగుబాటుదారులు రాజధాని అంకారాతో పాటు ఇస్తాంబుల్ నగరంలో యుద్ధ ట్యాంకులు, యుద్ధ విమానాలతో దాడులు చేశాయి. ఈ దాడిలో పార్లమెంట్ భవనం దెబ్బతిన్నది. కాని ప్రభుత్వ అనుకూల దళాలు ఈ దాడిని తిప్పికొట్టి ఈ తిరుగుబాటును విఫలం చేశారు. ఎర్డోగాన్ దేశంలో మార్షల్ లా ప్రకటించారు.

### చైనాలో వరదలు

చైనాలోని ఉత్తర, ఈశాన్య ప్రాంతాల్లో భారీ వర్షాల కారణంగా భారీ ఎత్తున ప్రాణ నష్టం, ఆస్తి నష్టం సంభవించింది. దాదాపు 250 మంది మరణించారు. కొండచరియలు విరిగి పడడంతో వందలాది ఇండ్లు ధ్వంసమయ్యాయి. వేలాది మందిని సురక్షిత ప్రాంతాలకు తరలించారు.

### నేపాల్‌లో రాజకీయ సంక్షోభం

నేపాల్ సంకీర్ణ ప్రభుత్వంలోని కీలక భాగస్వామి కమ్యూనిస్టు పార్టీ ఆఫ్ నేపాల్ (మావోయిస్టు సెంటర్) మద్దతు ఉపసంహరించుకుంది. రాష్ట్రీయ ప్రజాతంత్ర, మాదేశీ జనాధికార ఫోరంతో పాటు మరో రెండు చిన్న పార్టీలు తప్పుకున్నాయి. దీంతో నేపాల్ ప్రధాని కేపి శర్మ ఓలీ ప్రభుత్వం మైనారిటీలో పడింది. ఈ నేపథ్యంలో జూలై 24న ప్రధాని ఓలీ తన పదవికి రాజీనామా చేశారు. గత మేలో కుదుర్చుకున్న తొమ్మిది అంశాలతో కూడిన ఒప్పందాన్ని అమలు చేయనందుకు నిరసనగా సిపిఎన్ (ఎంసి) సర్కార్‌కు మద్దతు ఉపసంహరించుకుంది. వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం: ఎస్. వెంకటేష్

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్ధాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషుల కోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(జూన్ 1 నుండి జూన్ 30, 2016 వరకు తెలంగాణలోని 10 జిల్లాలు (1082), ఆంధ్రప్రదేశ్‌లోని 13 జిల్లాలలో (976) అసహజ మరణాల పాలైన వారి సంఖ్య 2058)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | | | | | | | | | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| | | | | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | | | | | | | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | 1 | 2 | – | 12 | 16 | 4 | 6 | 3 | 2 | 2 | 1 | 3 | – | 1 | 27 | 24 | – | – | – | 3 | 3 |
| హైదరాబాద్ | – | – | – | 7 | 15 | 3 | 2 | 3 | – | – | 5 | 4 | 1 | 4 | 16 | 19 | – | – | – | – | – |
| కరీంనగర్ | – | 5 | – | 12 | 11 | 4 | 5 | 1 | – | 1 | 1 | 5 | 1 | 10 | 22 | 16 | – | – | – | – | 12 |
| ఖమ్మం | – | – | – | 9 | 12 | – | 4 | – | – | 3 | – | 3 | – | 4 | 23 | 12 | – | – | – | – | 17 |
| మహబూబ్‌నగర్ | 2 | 8 | 6 | 14 | 8 | 2 | 1 | 2 | – | – | 4 | 6 | 8 | 8 | 47 | 8 | – | – | – | – | 3 |
| మెదక్ | 2 | 4 | 9 | 12 | 19 | 21 | 12 | 2 | 9 | 19 | 6 | 9 | 19 | 23 | 52 | 22 | – | – | – | 3 | 6 |
| నల్గొండ | – | 3 | 1 | 7 | 4 | 1 | 4 | 1 | 1 | 1 | 4 | 3 | 1 | 12 | 34 | 13 | – | – | – | – | 17 |
| నిజామాబాద్ | – | 3 | – | 8 | 6 | 1 | 3 | 1 | – | 2 | – | 1 | – | 6 | 24 | 13 | – | – | – | – | 3 |
| వరంగల్ | – | 6 | – | 9 | 11 | 2 | 4 | – | – | 1 | – | 1 | 3 | 8 | 28 | 13 | – | – | – | – | 3 |
| రంగారెడ్డి | – | – | – | 5 | 7 | 2 | – | – | – | 1 | 5 | 7 | – | 3 | 22 | 14 | – | – | – | – | – |
| **తెలంగాణ** | **5** | **31** | **16** | **86** | **109** | **40** | **41** | **13** | **12** | **30** | **26** | **42** | **33** | **79** | **295** | **154** | **-** | **-** | **-** | **6** | **64** |
| అనంతపురం | – | – | – | 18 | 20 | 4 | 3 | 2 | 3 | 1 | 1 | 3 | 10 | 8 | 34 | – | – | – | – | – | – |
| చిత్తూరు | – | – | – | 7 | 14 | 7 | 9 | – | 2 | 4 | 4 | 11 | 11 | 4 | 35 | – | – | – | – | – | – |
| కడప | – | – | – | 1 | 3 | 1 | – | – | – | 1 | – | 1 | 1 | 1 | 10 | 4 | – | – | – | – | 6 |
| గుంటూరు | – | 2 | – | 5 | 10 | 2 | 6 | – | – | 4 | 4 | 7 | – | 8 | 18 | 9 | – | – | – | – | 2 |
| కృష్ణా | – | – | – | 6 | 3 | 2 | 4 | – | – | 2 | 2 | 2 | – | 6 | 22 | 15 | – | – | – | – | 1 |
| కర్నూలు | – | 2 | – | 5 | 3 | 4 | 5 | 10 | 4 | 4 | 2 | 4 | 6 | 5 | 25 | 19 | – | – | – | – | 7 |
| తూర్పు గోదావరి | – | – | – | 3 | 6 | – | 8 | – | 2 | 1 | – | 2 | 8 | 10 | 31 | 20 | – | – | – | – | 6 |
| ప్రకాశం | – | 1 | – | 7 | 4 | 1 | 5 | – | – | 2 | 4 | 5 | 2 | 12 | 22 | 6 | – | – | – | – | – |
| శ్రీకాకుళం | – | – | – | 1 | 4 | 3 | 2 | – | 1 | 2 | 1 | 1 | 4 | 5 | 25 | 7 | – | – | – | – | 5 |
| పశ్చిమ గోదావరి | – | – | – | 2 | 4 | 4 | 5 | – | – | 1 | – | 1 | – | 2 | 23 | 8 | – | – | – | – | – |
| నెల్లూరు | – | – | – | 2 | 7 | – | 3 | 1 | 1 | 5 | 2 | 4 | – | 4 | 18 | 12 | – | – | – | – | – |
| విజయనగరం | – | – | – | 2 | 9 | 1 | 7 | – | – | – | 2 | 2 | – | 1 | 20 | 14 | – | – | – | – | 6 |
| విశాఖపట్నం | – | – | – | 5 | 12 | – | 2 | – | – | 3 | – | 1 | 2 | 2 | 18 | 18 | – | – | – | 17 | 3 |
| **ఆంధ్రప్రదేశ్** | **-** | **5** | **-** | **64** | **99** | **29** | **59** | **13** | **13** | **30** | **22** | **44** | **44** | **68** | **301** | **132** | **-** | **-** | **-** | **17** | **36** |

# వీక్షణం దగ్గర అమ్మకానికి ఉన్న పుస్తకాలు

### ఆర్థిక వ్యవస్థ - సామ్రాజ్యవాదం

| | | |
|---|---|---|
| ఒక దళారీ పశ్చాత్తాపం | జాన్ పెర్కిన్స్ | రు. 75 |
| కుట్రాజకీయం | స్టీఫెన్ కింజర్ | 40 |
| అభివృద్ధిని ఇలా చూద్దాం | ముదునూరి భారతి | 80 |
| కొత్తచూపు | ఆర్.ఎస్. రావు | 120 |
| ఊరి దారి | ఎన్. వేణుగోపాల్ | 60 |
| రాబందు వాలిన నేల | ఎన్. వేణుగోపాల్ | 180 |
| వ్యవసాయం - ప్రపంచీకరణ | కె.ఆర్. చౌదరి | 100 |
| నిత్యజీవితంలో సోషలిజం | భూసారం శివన్న | 100 |
| విధ్వంసక అభివృద్ధి | డిఎస్‌యు | 180 |
| భారతదేశంలో ఉత్పత్తి విధానం- ఉత్పత్తి సంబంధాలు | విరసం | 20 |

### తెలంగాణ

| | | |
|---|---|---|
| తెలంగాణార్థం | ఎన్. వేణుగోపాల్ | 150 |
| లేచినిలిచిన తెలంగాణ | ఎన్. వేణుగోపాల్ | 120 |
| తిరగబడ్డ తెలంగాణ | ఇనుకొండ తిరుమలి | 150 |
| తెలంగాణ రాజకీయాలు | దాగ్మార్ బెర్న్‌స్టార్ఫ్, హ్యూగ్ గ్రే | 80 |
| కొత్త వంతెన | కె. శ్రీనివాస్ | 120 |
| తెలంగాణ జైత్రయాత్ర | ఘంటా చక్రపాణి | 200 |
| సమగ్ర తెలంగాణ | వీక్షణం ప్రచురణ | 295 |

### శాస్త్రవిజ్ఞానం

| | | |
|---|---|---|
| విశ్వాంతరాళం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| మానవ పరిణామం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| జీవకణాలూ నాడీకణాలూ | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 80 |
| ప్రకృతీ - పర్యావరణం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| జీవశాస్త్ర విజ్ఞానం - సమాజం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| మనుషులు చేసిన దేవుళ్లు | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 120 |
| అణువుల శక్తి | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 150 |
| విజ్ఞాన శాస్త్రం మనిషి విస్తరణ | జెడి బెర్నాల్ | 80 |

### కులం-మతం

| | | |
|---|---|---|
| భారతదేశంలో కుల సమస్య | అనురాధ గాంధీ | 120 |
| కులం వర్గం | బొజ్జా తారకం | 60 |
| ఖైర్లాంజి | ఆనంద్ తేల్‌తుంబ్డే | 100 |
| గులాంగిరి | జోతిబా పూలే | 60 |
| కుల నిర్మూలన | అంబేద్కర్ | 60 |
| శూద్రులు - ఆర్యులు | అంబేద్కర్ | 20 |
| రాముని కృష్ణుని రహస్యాలు | అంబేద్కర్ | 30 |
| మతతత్వంపై బాలగోపాల్ | కె. బాలగోపాల్ | 150 |
| దేవుని రాజకీయతత్వం | కంచె ఐలయ్య | 120 |
| నేను హిందువునెట్లయిత? | కంచె ఐలయ్య | 100 |

### సాహిత్య విమర్శ - వ్యాసాలు

| | | |
|---|---|---|
| గురజాడ దేశభక్తి | ఎన్. వేణుగోపాల్ | 20 |
| కవిత్వంతో ములాఖాత్ | ఎన్. వేణుగోపాల్ | 120 |
| స్వేచ్ఛారావం | జి. హరగోపాల్ | 250 |
| సాహిత్యంపై బాలగోపాల్ | కె. బాలగోపాల్ | 200 |
| సాహిత్య వ్యాసాలు | చలసాని ప్రసాద్ | 100 |
| చలసాని ప్రసాద్ రచనలు | చలసాని ప్రసాద్ | 100 |
| విరసం సాహిత్య విమర్శ | విరసం ప్రచురణ | 150 |
| మహోదయం | కె.వి.ఆర్. | 200 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు-2 | కె.వి.ఆర్. | 250 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు-3 | కె.వి.ఆర్. | 250 |
| కెవిఆర్ సామాజిక వ్యాసాలు | కె.వి.ఆర్. | 300 |
| కెవిఆర్ డిటెన్యూ డైరీ | కె.వి.ఆర్. శారదాంబ కమిటీ | 170 |
| సాహిత్య సమాలోచన | కృష్ణాబాయి | 300 |
| సందిగ్ధ సందర్భం | సి.వి. సుబ్బారావు | 40 |
| సామాజికం | వి. చెంచయ్య | 30 |
| మన ప్రపంచం | దుప్పల రవికుమార్ | 75 |
| దారులేసిన అక్షరాలు | భారతీయ మహిళల రచనలు | 400 |

### తత్వశాస్త్రం

| | | |
|---|---|---|
| మార్క్సిస్ట్ సాహిత్య విమర్శ | డా. శ్రీనివాస్ | 100 |
| మార్క్సిస్ట్ తత్వశాస్త్రం | న్యూవిస్టా పబ్లికేషన్స్ | 80 |
| మార్క్సిజం-లెనినిజం-మావోయిజం | విరసం | 125 |
| లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్ ప్రచురణలు అన్నీ | | |

### చరిత్ర-జీవిత చరిత్ర

| | | |
|---|---|---|
| భారత చరిత్ర అధ్యయానికి ఒక పరిచయం | డి.డి. కోసంబి | రు. 250 |
| భారత చరిత్ర పరిచయ వ్యాసాలు | డి.డి. కొశాంబి | 70 |
| భగవద్గీత చారిత్రక పరిణామం | డి.డి. కొశాంబి | 20 |
| ప్రాచీన భారత దేశ చరిత్ర | కె. బాలగోపాల్ | 100 |
| చరిత్రలో ఏం జరిగింది? | గార్డన్ చైల్డ్ | 80 |
| తరతరాల భారతదేశ చరిత్ర | రొమిల్లా థాపర్ | 100 |
| ఆధునిక భారతదేశ చరిత్ర | బిపిన్ చంద్ర | 120 |
| ఇండియాలో దాగిన హిందుస్థాన్ | పెరి ఆండర్‌సన్ | 150 |
| 24 గంటలు | కె.జి. కన్నబిరాన్ | 200 |
| బాబాసాహెబ్ అంబేద్కర్ | బి. విజయభారతి | 120 |
| చేగువేరా | కాత్యాయని | 120 |
| నిర్జన వారధి | కొండపల్లి కోటేశ్వరమ్మ | 100 |
| ఇంట్లో ప్రేమ్‌చంద్ | శివరాణీ దేవి | 120 |
| మహాత్మా జ్యోతిరావ్ పూలే | ధనుంజయ్ కీర్ | 100 |
| ఛత్రపతి సాహూ మహరాజ్ | కాత్యాయని | 40 |
| నూరేళ్ల కాళోజీ | వరవరరావు | 60 |
| అలిశెట్టి ప్రభాకర్ కవిత | అలిశెట్టి ప్రభాకర్ | 150 |

### విప్లవోద్యమం

| | | |
|---|---|---|
| పోలీసులు అరెస్ట్ చేస్తే | బొజ్జా తారకం | 60 |
| భారత్‌పై అరుణతార | యాన్ మిర్డాల్ | 100 |
| జంగల్‌నామా | సత్నామ్ | 100 |
| ఏది నేరం?! | బి. అనూరాధ | 75 |
| మంద్రస్థాయి యుద్ధం | విరసం ప్రచురణ | 100 |
| జగిత్యాల జంగల్‌మహల్-1 | విరసం ప్రచురణ | 75 |
| జగిత్యాల జంగల్‌మహల్-2 | విరసం ప్రచురణ | 100 |
| నేటి రాయలసీమ | విరసం ప్రచురణ | 100 |
| దండకారణ్యంలో గ్రీన్‌హంట్ | విరసం ప్రచురణ | 60 |
| రివిజనిజం | విరసం ప్రచురణ | 75 |
| అంతర్యుద్ధంలో ఆదివాసులు | విరసం ప్రచురణ | 20 |
| ఆదర్శ జీవులు ఆమరులు | విరసం ప్రచురణ | 30 |
| మావో రచనలు - 1 | విరసం ప్రచురణ | 170 |
| మావో రచనలు - 2 | విరసం ప్రచురణ | 220 |
| సంకెళ్ల సవ్వడి | అరుణ్ ఫరేరా | 150 |
| వామపక్ష కమ్యూనిజం - ఒక బాలరిష్టం | లెనిన్ ప్రసిద్ధ రచన | 30 |

### కథ - నవల

| | | |
|---|---|---|
| దండకారణ్య కథలు(2005-2012) | విరసం ప్రచురణ | 100 |
| వసంతగీతం | అల్లం రాజయ్య | 250 |
| రేపు కథ | వెర్నన్ గొంజాల్విస్ | 20 |
| మిగిలేటోళ్లు | బాసిత్ | 50 |
| కాంత పున్నం వెన్నెల | పద్మకుమారి | 20 |
| ఏడుతరాలు | అలెక్స్ హేలీ | 120 |
| కథలగూడు | దేవులపల్లి కృష్ణమూర్తి | 60 |
| పథేర్ పాంచాలి | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| అపరాజితుడు | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| వనవాసి | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 120 |
| నేల నాగలి - మూడెద్దులు | బొజ్జా తారకం | 25 |
| పంచతంత్రం | బొజ్జాతారకం | 100 |
| ఇస్మత్ చుగ్తాయి కథలు | ఇస్మత్ చుగ్తాయి | 100 |
| స్పార్టకస్ | హోవార్డ్ ఫాస్ట్ | 100 |
| రేపటి కల | రిచర్డ్ రైట్ | 50 |
| పంచమం | చిలుకూరి దేవపుత్ర | 100 |
| బీజభూమి | వరవరరావు | 100 |
| మరల సేద్యానికి | శివరామ కారంత్ | 150 |
| హింసపాదు | బమ్మిడి జగదీశ్వరరావు | 180 |

### డివిడి

| | |
|---|---|
| వీక్షణం (2003 - 2012) | 200 |
| సృజన (1966-1992) | 240 |
| అరుణతార (1970-2013) | 125 |
| 'ఓయు'ద్ధకాండ | 100 |

**వీక్షణం,** మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3,
హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029.
ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com, www.veekshanam.wordpress.com